# శాంతినికేతనము

(ధర్మోపదేశములు)



డాక్టరు శ్రీరవీంద్రనాథఠాకూరుగారి

వంగభాషామాతృకకు అనువాదము.

అనువాదకులు

ఆకురాతి శ్రీకృష్ణమూర్తి

చలమయ్య

ప్రకాశకుఁడు

ఆకురాతి చలమయ్య

శాంతికుటీరము

పిఠాపురము.

ప్రథమముద్రణము

వెల — రేపరుబైండు రు 1-8-0 లు.

క్యాలికోబైండు రు 2-0-0 లు.

శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాల
పిఠాపురము

బహుధాన్యవైశాఖము

1938.

# A FOREWORD

(Brahmarshi

**Dr. Sir R. Venkata Ratnam Naidu Gar**

**Kt., M. A., L. T., D. Litt., LL. D.)**



The heaven-illumined Seer of Santinil
a world-honored Teacher of sanctifying T
s sublime discourses, gathered into se
umes, with the happy title of SANTINIKE
an inexhaustible mine of spiritual we
is choice selection of *thirty two* of
e gems constitutes a priceless casket. G
ch sustained zeal for selfless work in the
tion of true culture, my good friend, M
alamayya, has, through this well-exe
rsion into Telugu of those soul illumin
courses, rendered praiseworthy service t
cere seekers after God in the Andhradesa.
eminently qualified for the responsible
lertaken. The formative period of his life
nt at that sanctuary of the Holy Spirit,
epur Ashram; where his soul was nurt
h wisdom and devotion. He possesse
rough command over Bengali languag

produced several useful—instructive and popular—works in Telugu. His daily occupation is to mould youthful lives to noble ends. Hence, it my be confidently, expected, under Providence, that this publication will prove a distinctly valuable addition to the section of Telugu Literature devoted to the quest of the eternal verities.

Selected and arranged with great care, these highly thoughtful discoures open with an exposition of the profoundly mystic *Pranavam* and lead up to the sublime serenity of *Tapovanam*, comprising a wide range of topics of abiding interest as powerful aids to deep contemplation and devout worship. Their perusal impresses even a very casual reader with the charm of rich imagery and poetic grace, all inducing prayerful meditation and soul-deep devotion. The significance of *Brahmotsavamu*; the exposition of *Santam*, *Sivam and Adwaitam* in an interrelated sequence; the reality of *Prarthana* and its necessity, reveal the master's power to stir the soul to its depths. *Satyàm Gnana Manantam Brahma*, is a sacred chant of the Rishi as he visions the all-sustaining, the all-penetrating and the allembracing Reality as the Eternal One. Lastly, there is *Tapovanamu*, the sylvan shrine of the Rishis and the cradle of the age-long and ever-expanding culture of Bharatavarsha. Here is brought out the striking contrast between the nature evolved civilisation of the Orient with its

contemplative serenity and the desire-urged civilisation of the Occident with its restless activity. Here is set forth the theme that India's culture has sprung out of the seer's meditations amidst forest cloisters and the poet's raptures under nature's impulses. It is also brought out vividly that life is here actuated by a spirit of surrender and sacrifice, unmindful of acquisitions and enjoyments.

Choice is difficult where every object is a jewel; but to the devout spirit it will be a most profitable occupation to read and revolve over the discourses titled *Rasadharmamu*, *Purnatvamu*, *Niyamamu and Mukti*, *Mukti margamu*, *Anantuni-Ichcha*, Etc.

In rendering these discourses from Bengali into Telugu, the learned translator has evidently endeavoured to keep as close to the original as the two idioms permit. Hence, a certain Bengali tinge is unavoidable; however, the language throughout is chaste and the exposition clear. It is, therefore, hoped that the book, perused with discernment of mind and kinship of spirit, will amply fulfil its purpose of commending serious thoughts, lofty sentiments, exalted ideals and holy endeavours. With that hope, this humble offering is rendered at the Seat of Grace.

R. Venkata Ratnam.

ఓమ్ !

# తొలిపలుకు.

(డాక్టరు సర్. ఆర్. వేంకటరత్నము నాయఁడుగారు,
కెటి. యం. ఏ. యల్. టి. డి. లిట్. యల్. యల్. డి.)



దివ్యప్రబోధవిలసితాత్ముఁడగు శాంతినికేతనఋషి మోక్షప్రదధర్మోపదేశికులలో జగత్సంభావ్యుఁడు. ఆయన పరమోత్కృష్టప్రసంగములు "శాంతినికేతన" మను చక్కని పేరుతో ననేకసంపుటములుగాఁ బ్రకటితములై ఆధ్యాత్మికసంపద కంతులేని మహాఖనిగా నున్నవి. అందుండి సంగ్రహింపఁబడిన ఈముప్పదిరెండు రత్నములు నీయమూల్యరత్నపేటిలోఁ బొందుపఱుపఁబడినవి. మిత్రులు శ్రీ ఆకురాతి చలమయ్యగారు సత్యవిజ్ఞానాభివృద్ధి యను స్వార్థవిరహితవృత్తితో స్థిరోత్సాహాపూరితులై పనిచేయువారు. ఆత్మవికాసకరము లగు నీప్రసంగముల నాంధ్రములోనికిఁ జక్కగా ననువదించి ఆంధ్రదేశములోని భగవద్జ్ఞానపిపాసువుల కెల్ల వినుతిపాత్ర మగు సేవ చేయుచున్నారు. వారీమహాకార్యమును బూనుకొనుటకుఁ దగు సమర్థులు. పవిత్రశిక్షాలయ మనఁదగిన బోల్పూర్ ఆశ్రమములో వారు తమవిద్యార్థిదశఁ గడపిరి. అచ్చటనే వారి ఆత్మ భక్తివివేకములతోఁ బెరిగినది. వంగభాషలో వారికి

మంచి వైదుష్యము కలిగినది; ముఖ్యముగా గురుదేవుని భాష నుడికారము బాగుగా పరిచిత మైనది. ఇదివరలోనే వారు తెలుఁగులో నుపయోగకరములు ఉపదేశకములు, జనరంజకములు నగుననేకగ్రంథములు వ్రాసియున్నారు. మఱియు యువజీవితముల నున్నతాశయములతో దిద్ది తీర్చుట వారి నిత్యవృత్తి. శాశ్వతసత్యాన్వేషణపర మగు తెలుఁగువాఙ్మయమునకు నీగ్రంథము భగవత్కృపవలన నూతనాధిక్యము చేకూర్పఁగల దని యాశింపవచ్చును.

మహోన్నతభావపూరితము లగునీప్రసంగములను గంభీరభావభరిత మగు 'ప్రణవము'ను వివరించుట ప్రారంభముగా 'తపోవనము'లోని గంభీరప్రశాంతమువఱకు జాగరూకతతో నేర్చి కూర్చిరి. దీర్ఘచింతనమునకును భక్తిపూర్వక ప్రార్థనమునకు నెక్కువగా నుపకరించు ననేకవిషయము లిందుఁ జేర్పఁబడినవి. ఒకసారి వానిపై దృష్టి ప్రసరించినచో సామాన్యపాఠకునకుఁగూడ ప్రార్థనతోఁగూడిన ధ్యానమును హృదయాంతరమునుండి యుద్భవించు భక్తిని కలిగించు కవితామనోహరతయు భావనాసంపదయు స్పష్టముగా గోచరించును. 'బ్రహ్మోత్సవము' యొక్కప్రాముఖ్యమును, 'శాన్తం శివ మద్వైతమ్'అనువాక్యములోని పరస్పరసంబంధము వివరణమును, ప్రార్థనలోని సత్యము, ప్రార్థనావశ్యకతయు, గురుదేవునిశక్తి ఆత్మనెంత గభీరధ్యానములో ముంచివేయఁ గలదో స్పష్టముగాఁ

దెలుపఁగలవు. సర్వపోషకమై, సర్వనిమగ్నమై, సర్వమయమైన సత్యమును శాశ్వతమూర్తిగ దర్శించుటకు "సత్యజ్ఞాన మనంతమ్ బ్రహ్మ" అనువాక్యము ఋషుల దివ్యగానమగుచున్నది. సనాతనమును నిరంతరవర్ధితమునగు భారతవర్ష విజ్ఞానమునకుఁ బుట్టినిల్లును ఋషుల దివ్యనిలయము నగు "తపోవనము" తుది ప్రసంగము. ప్రకృతిసిద్ధమై యేకాగ్ర ప్రశాంతతతోఁ గూడిన ప్రాచ్యనాగరకతకును ఆశాంతనితమై తెరపి లేని సంచలనముతో మునిఁగియున్న పాశ్చాత్యనాగరకతకును గల తారతమ్య మిందు స్పష్టము చేయఁబడినది. ప్రకృతిపుల కితులగు నగరముల పారవశ్యములనుండియు అరణ్యములోని ఏకాంతస్థితిలో నున్న ఋషులధ్యానములనుండియు భారతీయవిజ్ఞానము ఉద్భవించిన దను నభిప్రాయ మిందు నిర్దేశింపఁబడినది. భోగభాగ్యములు కావు వైరాగ్యత్యాగములే మానవజీవితమునకు మూలధర్మము లనియుఁగూడ స్పష్టము చేయఁబడినది.

అన్నియు నందమైనభాషణములే యైనప్పుడు ఏరికొనుట కష్టమగును. అయినను భక్తిపరులకు 'రసధర్మము, పూర్ణత్వము, నియమము—ముక్తి, ముక్తిమార్గము, అనంతుని యిచ్ఛ, మొదలగునవి చదివి మననము చేసికొనుటకుఁ జాల ఉపయోగకరములుగా నుండవచ్చును.

వంగభాషలోనుండి వీనిని తెనిఁగించుటలో, భాషాంతరీకరణకారులు అవకాశ మున్నంతవఱకు యథామాతృకలుగ

నుంచుటకుఁ బ్రయత్నించినట్లు కనఁబడుచున్నది. కాఁబట్టి కొంత వఱకు వంగభాషనుడికారము తప్పినది కాదు. అయినను గ్రంథమంతటను కూడ భాష సలక్షణముగను భావములు స్పష్టముగనున్నవి. నిర్మలమనస్సుతోడను, స్నేహభావముతోడను చదువుదో నీగ్రంథము గంభీరాలోచనలు ఉదారభావములు, ఉన్నతాశయములు, పవిత్రోద్యమములు ప్రోత్సహింపను సంకల్పము చాలవఱకు నెఱవేఱవచ్చు నని యూహించుచున్నాను. అట్టి యాశతో నీచిన్నికృతి ప్రేమనిలయుని కర్పిత మైనది.

ఆర్. వేంకటరత్నము.

# స మ ర్ప ణ ము.

ఆశ్రితులకు ఆర్తులకు అనాథలకు అస్పృశ్యులకు, సకల ప్రజలకు కల్పతరువైయుండి బుద్ధదేవుని విశ్వమైత్రీవ్యాప్తికై యశోకచక్రవర్తి బద్ధ కంకణుఁడై ప్రచారము కావించినటుల రామ మోహనుని విశ్వజనీన మతవ్యాప్తికై వివిధవిధముల కారకులై ఈశ్వర పితృత్వమునందు, సర్వమానవసౌభ్రాత్రమునందును, దృఢవిశ్వాసము కలిగి వివిధమత సమ్మేళన వ్రతదీక్షను బూని యున్న శ్రీ శ్రీ శ్రీ మహారాజా రావు వేంకట కుమార మహీపతి సూర్యారావు బహద్దరు సి. బి. ఇ. వారికి ఈ యాంధ్రీకృత " శాంతినికేతన " మనుగ్రంథము శ్రద్ధాభక్తి పూర్వకముగా సమర్పింపఁబడినది.

విధేయుఁడు,

చ ల మ య్య.

# విన్నపము.



విశ్వవిఖ్యాతులును కవిసార్వభౌములును అగు శ్రీరవీంద్రనాథఠాకూరుగారు, వారి "శాంతినికేత" నాశ్రమములోఁ బ్రతి బుధవారమునఁ బ్రార్థనామందిరమందుఁ గావించిన ధర్మప్రసంగము లన్నియు "శాంతినికేతన" మను నామముతోఁ గొన్ని సంపుటములుగాఁ బ్రచురింపఁబడి యున్నవి.

వానిలోఁ గొన్నిటిని నా తృతీయసోదరుఁడు శ్రీకృష్ణమూర్తి చాలకాలముక్రిందట నాంధ్రీకరించి 'ధర్మసాధని' అను పత్రికలోఁ బ్రచురించి యుండెను. మఱికొన్నిటిని నే నాంధ్రీకరించి ఈ "శాంతినికేతనము" ప్రథమభాగమును ప్రకటితము గావించితిని.

ఆంధ్రానువాదముఁ గావించునప్పుడు భావము చెడకుండఁ జూచుటలోఁ గొంతభాషాసౌష్ఠవమున కభావము కలిగి యుండవచ్చును. ఎట్టిలోపముల నైనను మాపిగా నెంచి ఈ భక్తాగ్రేసరునియొక్కయు, కవిసార్వభౌమునియొక్కయు సువిశాలభావములనే పాఠకులు గ్రహింతురుగాక !

ఇమ్మహనీయుని ఈ యుపదేశము లెట్టిమహోన్నత జ్ఞానముతోను, ఆధ్యాత్మికభావములతోను నిండి యున్నవో పాఠకులు చదివినకొలఁది వీనియుత్కృష్టతను గొనియాడఁగలరు.

ఆంధ్రదేశభక్తాగ్రేసరులును పరమపూజనీయులును అగు బ్రహ్మర్షి శ్రీ వేంకటరత్నమునాయఁడుగారి ఆఱుభాగముల సదుపదేశము లమృతమయవాక్కులతో నిండియుండి కేవల మాంధ్రులకే కాక, వివిధదేశముల విద్వద్వరేణ్యుల కందఱికి "రత్నఖని" యై యున్నటుల నీయుపదేశములును సర్వమానవుల కాదరణీయములై యమూల్యమైన 'రత్నఖని' వలెఁ దనరారు చున్నవి.

ఇట్టి యమూల్యోపదేశముల నాంధ్రీకరించి ప్రచురింపవలె నని చాలకాలమునుండి నాకుఁ గోరిక యున్నను ధనాభావముచే నే నీకార్యము నిన్నినాళ్లవఱకు నెఱవేర్పలేకపోయితిని. నా యల్పశక్తితో నేఁటికి ప్రథమభాగమునుమాత్రమే ప్రకటింపఁ గలిగితిని.

పాఠకు లీగ్రంథముపై నాదరాభిమానములఁ జూపి ప్రోత్సహించినచో నల్పకాలములోనే ద్వితీయభాగము ప్రకటింపఁబడును. అదియును మూఁడువందల పుట లగును.

నే నీగ్రంథమును అంకితము గావించి నాశ్రద్ధాభక్తులను నివేదించుకొనుటకు శ్రీ శ్రీ శ్రీ పీఠికాపుర మహారాజావారు

నా కత్యంతదయతో నసుమతి నొసంగినందులకు వారికి నా హృదయపూర్వకవందనము లర్పించుచున్నాను.

ఈ గ్రంథమున కమూల్యమగు "తొలిపలుకు" ను అత్యంతదయతో ప్రేమతో వ్రాసి యిచ్చి, ఈగ్రంథప్రాశస్త్య మునింకను అధికము కావించిన పరమపూజనీయు లగు బ్రహ్మర్షి శ్రీ వేంకటరత్నమునాయఁడుగారికి నాభక్తిపూర్వకప్రణామము లర్పించుచున్నాను.

ఈ గ్రంథ ముద్రణారంభమునుండియు శ్రమ మనక వ్రాఁతప్రతియం దున్నలోటులను సవరించి, సరిచూచి యిచ్చిన శ్రీపీఠికాపురాస్థానకవీశ్వరులు బ్రహ్మశ్రీ ఓలేటి వేంకటరామ శాస్త్రిగారికిని, వ్రాఁతప్రతి వ్రాయుటయందును, ప్రూఫులు సరిచూచుటయందును నా కెక్కువ ప్రేమతో తోడ్పడిన బ్రహ్మశ్రీ దర్భా సర్వేశ్వరశాస్త్రిగారికిని, ఇతర మిత్రులకును, ఈయుపదేశము లాంధ్రమునఁ బ్రచురించుటకు మిక్కిలి దయతో నసుమతి నొసఁగిన(Visvabharati Publishing Board) "విశ్వభారతి పబ్లిషింగు బోర్డు" వారికిని నాకృతజ్ఞతాపూర్వక వందనము లాచరించుచున్నాను.

ఇట్లు విన్నవించు
ఆకురాతి చలమయ్య.

# వి ష య సూ చి క.



# శాంతినికేతనము

## ఓంకారము. 1

ఓం శబ్దమునకు సత్యము, ఉన్నది, పొందఁబడినది, అని యర్థము. మనము ఛాందోగ్యోపనిషత్తునుగుఱించి యాలోచించుచు ఓం శబ్దమునకుఁ దాత్పర్య మి ట్లని గ్రహించితిమి.

ఎచ్చటెచ్చట మనము సత్యమును గ్రహింతుమో, దానినే "ఓమ్" అని చెప్పుదుము.

దేవత లీ సత్యము నన్వేషించుటకు బయలుదేఱినప్పుడు దానిని వారు తుద కెక్కడ గ్రహింపఁగలిగిరి ? ప్రథమమున వారింద్రియములతోడ ద్వారమును దట్టిరి; కనులతోఁ జూచునప్పు డీ సత్యమును గ్రహింపవచ్చు నని నడిచిరి; కాని కనులతోఁ జూచుట యందుఁ బరిపూర్ణత లే దనియు, నది "అవును, కాదు" అను వానిచే ఖడింపఁబడుచుండు ననియుఁ గనుఁగొనిరి; దానియందుఁ బరిపూర్ణవిశుద్ధత లేదు. అది మంచిదానిని జూచును, చెడుదానిని జూచును. అది కొంత చూచును, కొంత చూడదు. అది చూచును గాని విననేరదు.

ఇట్లు కరము, నాసిక, వాక్కు, మనస్సు ననువానితోడ సర్వత్ర అన్వేషించి, దేవతలు ఖండత్వమును, ద్వంద్వతయు నున్నవని కనుఁగొనిరి.

తుదకు వారు ప్రాణమునకుఁ బాత్రమై యున్నదానియం దుఁ బ్రవేశించిరి. అప్పు డీ శరీరములోపల నొకసత్యమును గ్రహింపఁగలిగిరి. ఆ ప్రాణమే శరీరమందలి సకలప్రాణములపై నధికారము చేయుచున్నది. ఆ ప్రాణములోపలనే సకలేంద్రియములును సకలశక్తులును ఐక్యతఁ జెందియున్నవి. ఈమహాప్రాణమున్నంతవఱకుఁ గనులు చూచును; కర్ణములు వినును, నాసిక యాఘ్రాణించును; దీనియం దొకటి "అవును" అనునదియు మఱియొకటి "కాదు" అనునదియు లేదు. దీనిలో దృష్టి, శ్రుతి, ఘ్రాణము నన్నియు నొక్కప్రదేశమున సత్యము లై యున్నవి. కావున శరీరములోపల నచ్చటనే "ఓమ్"కారమును గ్రహించితిమి.

మిళనమధ్యమున ననఁగా రెండును మిళిత మైనచోట నీ "ఓమ్" ఉన్న దని ఛాందోగ్యోపనిషత్తు చెప్పుచున్నది. ఒకవైపున ఋక్కు, నొకవైపున సామము, ఒకవైపున వాక్యము, నొకవైపున స్వరము, ఒకవైపున సత్త్వము, నొకవైపున ప్రాణము విభిన్నముగ నుండు నీ ద్వంద్వము లైక్యతను జెందియున్నచోటనే "ఓమ్" అను పరిపూర్ణగానము గలదు.

ఎవనియందు లోప మేమియు లేదో, యెవనిలో సమస్తఖండములు నఖండితము లై యేకమైనవో, సమస్తవిరోధములు నశించుచున్నవో, అట్టియాత్మ వానినే కృతాంజలితో సత్య మని స్వీకరించుచున్నది. అంతకుఁ బూర్వ మాత్మ పరితృప్తిని బొందఁజాలకుండెను; అది యటునిటుఁ ద్రోయఁబడుచు నింద్రియములే సత్యమనియు, ధనమే సత్య మనియు, మానమే సత్య మనియుఁ దలం

చుచుఁ దుదకు నీయన్నిటియందును దాప మున్న దనియు ద్వంద్వ మున్న దనియు "కాదు" అనునది వీనితో మిశ్రిత మై యున్న దని యుఁ గనుఁగొనెను.

సకలద్వంద్వములకు సమాధాన మైనచోట నుపనిష త్తా పరిపూర్ణునిఁ జూచుటవలననే సత్యము గలయొకదిక్కునే చూచి సకలవిధముల సంతసించి యన్యదిక్కులఁ బూర్తిగ నిర్మూలనము గావింపఁ బ్రయత్నింప లేదు. అందుచేతనే యుపనిషత్తు,

"ఏతద్ జ్ఞేయం నిత్య మే వాత్మసంస్థం
నాతః పరం వేదితవ్యం వా కించిత్."

అనఁగా ఆత్మయం దెవ్వఁడు నిత్యము నివసించుచున్నాఁడో, అతఁడే తెలిసికొనఁ దగినవాఁడు. అతనికంటెఁ దెలిసికొనఁ దగిన దిం కొకటి లేదు—అని చెప్పుచు,

"తే సర్వగం సర్వతః ప్రాప్య ధీరా
యుక్తాత్మానః సర్వ మే వావిశంతి."

అనఁగా ఆ ధీరులే యుక్తాత్ము లై సర్వవ్యాపిని సకల దిక్కులనుండియుఁ బొంది సర్వత్ర ప్రవేశించెద రనియు,

"ఆత్మన్యే వాత్మానం పశ్యతి"

కేవల మాత్మలోపలనే యాత్మను జూచుట కాదు. సర్వత్ర చూడ వలయు ననియుఁ జెప్పినది.

మన ధ్యానమంత్రమున నొకభాగమున "భూర్భువస్సువః" మఱియొకభాగమున మనధీశక్తి, మన చైతన్యము . చెప్పఁబడియు

స్నవి. మధ్యస్థలమున నీరెంటిని నొక్కటిగ బంధించుచు నొకవై పున "భూర్భువస్సువః" అను దానిని సృష్టించి మఱియొకవైపున మనఃధీశక్తిని ప్రేరణచేసి సర్వము నావరించిన భగవానుఁడు గలఁడు. దేనినిగూడ నాతఁడు లోపింపఁజేయుట లేదు. కావుననే యతఁడు "ఓమ్."

ఎవ్వరవిద్యనుమాత్రమె, సంసారమునుమాత్రమె తెలిసికొనెదరో వా రంధకారమునఁ బడుదు రనియు, మఱియు నెవ్వరు విద్యనుమాత్రమె, బ్రహ్మజ్ఞానమునుమాత్రమె విభజించి తెలిసికొనెదరో వారు గభీరతరాంధకారమునఁ బడుదు రనియు నుపనిషత్తు చెప్పుచున్నది. ఒకవైపున విద్య, మఱియొకవైపున నవిద్య, యొకవైపున బ్రహ్మజ్ఞానము, మఱియొకవైపున సంసారము. ఈరెండు దిక్కుల కెచ్చట సమాధానమై యవి కలియునో యచ్చటనే యాత్మకు నివాసము.

దూరమున నుండు వస్తు వాసమయముననె సమీపమున నుండదు. సమీపమున నుండునది దూరము గాదు. పోవునది పోవునప్పుడు నిలువదు. నిలుచునది నిలుచునప్పుడు పోదు. బాహ్యమున నుండునది యంతరమున నుండదు. అంతరమందలిది బాహ్యమున నుండదు. కాని,

"త దేజతి తన్నైజతి తద్దూరే తద్వంతికే
త దంతరస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః"

అతఁడు చలించును; చలింపఁడు. అతఁడు దూరమున నున్నాఁడు; సమీపమున నున్నాఁడు. అతఁ డన్నిటిలోన నున్నాఁడు;

అన్నిటి వెలుపల నున్నాఁడు. అనఁగాఁ జలించుచుఁ జలింపకయు దూరముననుు, సమీపమునను, లోపలను, వెలుపలను, నంతట నన్నిటి నవలంబించి యాతఁ డున్నాఁడు. ఆతఁడు దేనిని త్యజిం చుట లేదు. కావున నాతఁడు "ఓమ్."

ఆతఁడు ప్రకాశమునందును, అప్రకాశమునందును నున్నాఁడు. ఒకవైపున సమస్తము నతఁడు ప్రకాశింపఁజేయుచున్నాఁడు. మఱియొకవైపున నేదియు నతనిని ప్రకాశింపఁజేయఁజాల కున్నది. అందుచే నుపనిషత్తు ఇట్లు చెప్పుచున్నది—

"న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం
నేమా విద్యుతో భాంతి కుతోయ మగ్నిః
త మేవ భాంత మనుభాతి సర్వం
తస్య భాసా సర్వ మిదం విభాతి."

అచ్చట సూర్యుఁడు వెలుఁగు నిచ్చుట లేదు. చంద్రతారలును, విద్యుత్తును, సకలమును దీప్తి నియ్యఁజాల కున్నవి. ఈ యగ్నిమాత్ర మెక్కడ వెలుంగఁగలదు? అతఁడు ప్రకాశింపఁజేయుటచే సమస్తమును ప్రకాశమానము లగుచున్నవి. అతని దీప్తివలననే సమస్తమును దీప్తిమంతము లగుచున్నవి.

అతఁడు శాంతం, శివం, అద్వైతమ్. సకలగతులయొక్క సంపర్కము లేనిదానిని శాంత మని చెప్పఁదగదు. సకలవిరుద్ధగతులును శాంతమునం దైక్యముఁ జెందును. కేంద్రము నతిక్రమించి నడచుట, కేంద్రము ననుసరించి నడచుట, యాకర్షణతోఁ గూడి నడచుట, వికర్షణతోఁ గూడి నడచుట, ఇవి యొకదాని నొకటి

ఖండింపఁ జూచును. కాని యీవిరుద్ధగతిద్వయము పరమేశ్వరునిలో నవిరుద్ధములగుటవలననే యతఁడు శాంతం. నాస్వార్థము నీస్వార్థమును మన్నింపఁదలంపదు. నీస్వార్థము నాస్వార్థమును మన్నింపఁదలంపదు. కాని ముఖ్యప్రదేశమున నెచ్చట మంగళ మున్నదో యచ్చట నీస్వార్థమే నాస్వార్థము; నాస్వార్థమే నీస్వార్థము. అతఁడు శివుఁడు. అనఁగా మంగళస్వరూపుఁడు. అతనిలో నందఱియొక్క స్వార్థములును మంగళమునందు నిహితములై యున్నవి. అతఁ డద్వితీయుఁడు. అతఁ డొక్కఁడు. శేషసమస్త మతనియందేకమై యున్నది. "నేను నీవు గా"దని నే ననుచున్నాను. "నీవు నేను గా"దని నీ వనుచున్నావు. ఇట్టివిరుద్ధమైన నన్ను, నిన్ను నొక్కటిగఁ జేసియున్నవాఁ డా యద్వితీయపరబ్రహ్మమే.

మిళన మెచ్చటఁ గలదో, అచటనే యతఁ డున్నాఁడు. ఏదో యొకఖండము నాశ్రయింపక సమస్తము నవలంబించియున్నదియే పరిపూర్ణత్వము. ఏది చంద్రునియందే గాక, సూర్యునియందే గాక, మానవునియందే గాక, సమస్తచంద్ర సూర్య మానవులయందును, ఏది కర్ణమునందే గాక, నేత్రమునందే గాక, వాక్యమునందే గాక, మనస్సునందే గాక, సమస్తకర్ణనేత్రవాక్యమనస్సులయందును నున్న యా యొక్కనినే, ఆ "అవును" అను దానినే సమస్త మనఃప్రాణములతో నా పరిపూర్ణత్వమునే స్వీకరించుటయే ఓంకారము.

# నమస్తేస్తు. 2

కొన్ని తీఁగెలు సుందరనిజాంపములుగఁ దమయాశ్రయము ను జుట్టుకొనును. కొన్ని దృఢము లగువ్రేళ్లతో మెలివేసి తమ యాశ్రయమును బంధించును. కొన్ని తమదేహములఁ బూర్ణము గఁ దమయాధారములకుఁ బెనవేసి చుట్టపెట్టును.

మనము గూడ నేయేసంబంధములద్వారమున నీశ్వరునిఁ బట్టుకొనెదమో, యాసంబంధము లెల్ల నొక్కరీతిగా నుండునవి కావు. మనము పరమేశ్వరునిఁ బితృభావముతోను, ప్రభుభావము తోను, స్నేహభావముతోను నాశ్రయింపఁగలుగుదుము. ప్రపంచ మునం దెన్నివిధము లగుసంబంధసూత్రములతో మనము మనలను బంధించుకొనెదమో, ఆ సమస్తసంబంధములకును మూలమున న తఁడే యున్నాఁడు. ఏ రసముచే నాయాసంబంధము లెల్లఁ బుష్టి నొందునో, ఆ రసము వానిదే. అందువలన సకలసంబంధములును వానికే చెల్లును. సకలవిధభావములద్వారమునను మనుజుఁడు పర మేశ్వరుని బొందఁగలఁడు.

అన్నిసంబంధములలోఁ బ్రథమసంబంధము పితాపుత్రుల సంబంధము.

తండ్రి యెంతగొప్పవాఁడైనను, పుత్రుఁ డెంతచిన్నవాఁ డైనను, ఉభయులమధ్య శక్తివ్యత్యాస మెంతయున్నను నుభయు

లకును గభీరతరైక్యత యున్నది. ఆ యైక్యసంబంధమువలననే
యింతచిన్నబిడ్డఁడు అంతగొప్పతండ్రిని బొందఁగలుగుచున్నాఁడు.

ఈశ్వరుని బొందఁగోరినయెడల నేదో యొకసంబంధము
ద్వారమునఁ బొందవలయును. అటుకానియెడల నాతఁడు కేవల
మొకదర్శనశాస్త్రమునందలి తత్త్వమువలెను న్యాయశాస్త్రమునందలి
యొకసిద్ధాంతమువలెను మనకుఁ గాన్పించును. మనవాఁడై యుండ
నేరఁడు.

అతఁడు కేవలము మనబుద్ధికి విషయము కాఁడు. అంత
కంటె గొప్పవాఁడు. అతఁడు మనవాఁడు. అతఁడు మనవాఁడు
కానియెడల లోకమునం దెవ్వరును మనవారు కానేరరు; "నాది"
యని గౌరవింపఁదగిన దెద్దియు నుండదు. అతఁ డెటుల సూర్యు
నీ చిన్నపృథివికి వశముచేసి యిన్నిలక్షలయోజనముల దూరమును
తగ్గించి మధ్యప్రదేశమునఁ దాను వెలుఁగుచున్నాఁడో, అటులనే
యతఁడే స్వయముగా నొకమనుజునకును మఱియొకమనుజునకును
సంబంధరూపముతో విరాజిల్లుచున్నాఁడు. అట్లుకానియెడల నొకని
కిని, మఱియొకనికిని వ్యవధాన మనంతము. మధ్యప్రదేశమున
నాయుభయులను గలుపుసేతువు లేనియెడల నీ యనంతవ్యవధాన
మును దాఁటు టెట్లు ?

కావున నతఁడు దురూహతత్త్వవిషయము కాఁడు. అతఁడు
మన కత్యంతబంధువు. అన్నింటిలోపల నతఁడొక్కఁడే శాశ్వతుఁ
డై, యఖండుఁడై వెలుఁగుచున్నాఁడు. అతఁడే మనవాఁడు. ఫల
ముల కతఁ డాకారముల నేర్పఱచి వానిని వృక్షములకు వ్రేలాడఁ

జేయుటయే కాక రుచులతోను, సువాసనలతోను, శోభలతోడను దనను నావానినిగఁ జేయుచున్నాఁడు. అతఁడు నావాఁ డగుటవలన ఫలములను నానారసములతో నాకు స్వాధీనపఱచుచున్నాఁడు. అట్లు కానియెడల ఫలములయొక్క నామములను గాని, యాకారములను గాని నే నెవ్విధమునను గుర్తింపనేరను.

"నాది"యనువిషయ మెంతదూరము పోవునో,యెంతగంభీరతను గాంచునో,యతఁడు మానవులసంబంధములందుఁ గనఁబఱచును. శరీరము, మనస్సు, హృదయము సర్వత్ర యది వ్యాపించును. ఎచ్చటను దానికి విచ్ఛేదము లేదు; విరహము, మృత్యువు కూడ దానిని విచ్ఛిన్నము చేయనేరవు.

అందుచే మనుజులయొక్క యీ సంబంధములనుండియే మనము కొంత గ్రహింపఁగలుగుదము. నిఖిలబ్రహ్మాండమునందు నెవ్వఁడు శాశ్వతుఁ డగుమనవాఁదో యతఁడు మనయెడల నెట్లు వర్తించును? "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" యని చెప్పి మన మతని పూర్ణత్వమును బూర్తి చేయనేరము. అంతకంటె నత్యంతము చరమతరములు, నంతరతరములు నైనమాట లున్నవి. నీవు నావాఁడవు; నీవు నాతల్లివి; నాతండ్రివి; నాబంధువుఁడవు; నాప్రభుఁడవు;నావిద్యవు;నాధనమవు."త్వమేవ సర్వం మమ దేవదేవ." నీవు నావాఁడవు, నేను నీవాఁడను. నీకును నాకును నిదియే సంబంధము. ఈసంబంధమే నా కన్నిటికంటె గొప్పసత్యము; నాకన్నిటికంటె గొప్పసంపద. నీవు నాకు మహత్తమమైనవాఁడవును సత్యతమమైనవాఁడవును,

ఈశ్వరునితోడి యీ సంబంధమును గ్రహించుట కొకమంత్ర మున్నది. "పితా నోసి" నీవు మాకుఁ దండ్రివి. ఎవ్వఁ డనంత సత్యమో, వానిని మనసత్యముగాఁ జేకొనుట కిది యొకమంత్రము— "నీవు మాకు తండ్రివి."

నే నల్పుఁడను. నీవు బ్రహ్మవు. అయినను నీకును నాకును మిలన మున్నది. నీవు నా తండ్రివి. నే నజ్ఞానిని. నీ వనంతజ్ఞానివి. అయినను నీకును నాకును మిలన మున్నది; నీవు నాతండ్రివి.

ఇదియే సంబంధము. ఈసంబంధమువలన నీకును నాకును విశేషముగ రాకపోకలును, నీకును నాకును విశేషముగ నిచ్చిపుచ్చుకొనుటలును జరుగుచున్నవి. ఈసంబంధమును నేను సంపూర్ణ జ్ఞానముతోను, సంపూర్ణబలముతోను నవలంబింతునుగాక! అందు చేత నా ప్రార్థన యిది—"పితా నోబోధి" నీవు తండ్రి వని నాకు బోధింపుము. నీవు "పితా నోసి" తండ్రివై యున్నావు. నీవు తండ్రివై యుండుటయేగాక, "పితా నోబోధి" నీవు నాతండ్రివై యున్నా వనువిషయమును బోధింపుము.

నా చైతన్యమువలనను, బుద్ధివలనను, నెంతజ్ఞానమును నేను బొందుచుంటినో, యా సమస్తము వానినుండియే పొందుచున్నానుఁ "ధియో యో నః ప్రచోదయాత్" అతఁడే మనధీశక్తులను బ్రేరేపించుచున్నాఁడు. ఎవ్వఁడు విశ్వమును నఖండముగను, నేకముగను, జేసి యున్నాఁడో, వానినుండిగాక, యేజ్ఞానమునైన మఱి యెక్కడనుండి పొందఁగలము? ఆ జ్ఞానముతోఁబాటు దాని నతఁడే యిచ్చుచున్నాఁ డనుసంగతిని గూడ గ్రహించుచున్నాము.

"అతఁడే తండ్రిరూపమున నాకు జ్ఞానము నిచ్చుచున్నాఁడు." అనుస్పృహ నాయంతరముననుండినపుడే వానికి నేను యథార్థభావముతో నమస్కారింపఁగలుగుదును. నేను సమస్తమును వాని నుండి తీసికొనుచున్నాను, పొందుచున్నాను. వానికి నమస్కారములు చేయఁజాలకున్నాఁడను. నా మనస్సు కాఠిన్యమును గలిగి యున్నది. శిరము గర్వించియున్నది. ఏల యన వానితో నాకుఁ గలసంబంధమును నా జ్ఞానముచే నన్వేషింపఁజాలకున్నాను.

అందుచే నా ప్రార్థన యిది -'నమస్తేస్తు' నీకు మా నమస్కారము లర్పితము లగుఁగాక ! ఆ నమస్కారములు నమ్రతతోను, ఆత్మసమర్పణముతోను, బరిపూర్ణములై నీపాదములకడకు వచ్చి చేరునుగాక ! నా యావజ్జీవము నీకు నమస్కారరూపముగఁ బరిణమించునుగాక !

నీవు కావలసినది యిచ్చెదవు; నేను నమస్కారములఁ జేయుచు నమ్రుఁడనై దానిని గ్రహించెదను. నీకును నాకును గలసంబంధ మిదియే. ఈనమస్కార మతిమధురము; ఇది జలభారనతమేఘమువలెను, ఫలభారనతశాఖవలెను, రసముచేతను, మంగళముచేతను బరిపూర్ణమై యుండును, ఈనమస్కారము చేత జీవనము కల్యాణముతో నిండి వెలుంగును; సౌందర్యముతో నుప్పొంగును. ఈనమస్కారము కేవలము నిబిడమాధుర్యకమే గాక ప్రబలశక్తివంతము. ఇట్టికృతజ్ఞతాభరితజీవన మెటు లనాయాసముగా వందనముల నర్పించునో, యుద్ధతాహంకార మట్లర్పింపనేరదు. ఈవినమ్రభావము నెవ్వరును లోఁబఱచుకొనఁజాలరు,

జీవన మీనమస్కారమువలన సమస్తఘాతములను, నష్టములను, విపత్తులను, మృత్యువును మిగుల సులభముగ జయించును. ఈ నమస్కారమువలన జీవనమునందలిసమస్త భారములు నొక్క ముహూర్తములో లఘుత్వమును గాంచును. పాపము దానిపై నుండి క్షణకాలమున జలప్రవాహమువలె వెడలిపోవును; దాని నెంతమాత్రమును గదలింపనేరదు. అందుచేఁ బ్రతిదినమునుఁ బ్రార్థన చేయుదును—"నమస్తేస్తు" నీకు నానమస్కారము లగుఁగాక! సుఖము రానిమ్ము, దుఃఖము రానిమ్ము, నీకు నానమస్కారములు. నీవు జ్ఞానము నిచ్చుచున్నా వని యెఱింగి నమస్కరించుచున్నాను. నీవు రక్షించుచున్నా వని తెలిసికొని నమస్కరించుచున్నాను. నీవు నిత్యము నియతముగ నాసమీపమున నున్నా వని గ్రహించి నమస్కరించుచున్నాను. నిన్ను గౌరవించుటయే నాకు గౌరవ మని తెలిసికొని నీకు నమస్కరించుచున్నాను. అఖండబ్రహ్మాండమునకు ననంతకాలమునకు నధీశ్వరుఁడ వైననీవే మాకుఁ దండ్రి వని తెలిసికొని నమస్కరించుచున్నాను. విషయములనె యాశ్రయము లని తెలిసికొనుట తగ్గింపు మని నమస్కరించుచున్నాను. నేనే గొప్పవాఁడ నని తెలిసికొనుట తగ్గింపు మని నమస్కరించుచున్నాను. నిన్నే యథార్థరూపముగ నమస్కరించి శాశ్వతమోక్షమును బొందుదునుగాక!

---

# మనుష్యత్వము. 3

"లెమ్ము! మేల్కొమ్ము!" అనువాణి యెన్నియోసారు లుద్ఘోషిత మయినది. మనలో వాణిని విన్నవా రెవరో తెలియదు కాని "ఉత్తిష్ఠత! జాగ్రత!" అనుధ్వని మనహృదయద్వారముల కడ నెన్నియో సారులు ధ్వనించినది. సంసారమునందుఁ గల బాధలు విఘ్నములు, దుఃఖశోకములు విచ్ఛేదవిరహములు నెన్నియో సారు లంతరాత్మయొక్క తంతులను మీటి "లెమ్ము! మేల్కొమ్ము" అను నీవాణినే ధ్వనింపఁజేసినవి. అశ్రుధారాధౌత మగుమననవజాగరణముకొఱకై నిఖిల మనిమేషనేత్రములతో నిరీక్షించుచున్నది. ప్రభాత మేతెంచున దెపుడు? రాత్రి నావరించు నంధకార మంతయుఁ బోయి నవవికాసమును నిర్మలనవోదితారుణతేజమునం దుద్ఘాటితము చేయున దెపుడు? మనబహుదినసంచిత వేదన సఫలమగు టెపుడు? మనయశ్రుధారలు సార్థక మగుటెపుడు?

ప్రభాత మయినది. నేఁడు నీవు వికసింపుము, అని ప్రాతఃకాలమునఁ బుష్పమునకుఁ జెప్పవలసినపని లేదు. వనములలోఁ జిత్రవిచిత్రపుష్పము లన్నియు నేఁ డనాయాసముగా విశ్వగర్భాంతరమున గూఢమై యున్నయానందమును దమ రంగులతో, సువాసనలతో శోభలతో వెలువడఁజేసి కమనీయ మగుమాధుర్యమును జవిఁ జూపి నిఖిలముతోడను సంబంధమును స్థాపనఁజేసికొనినవి.

పుష్పము తనను గష్టపెట్టుకొనలేదు. ఇతరులకుఁ గష్టము కలుగఁ జేయలేదు. ఏస్థితియందును విభిన్నలక్షణములు చూపింపలేదు. సహజసార్థకతచే నాద్యోపాంతము ప్రస్ఫుటితమై నిలిచెను !

ఈవైచిత్ర్యమును జూచినప్పటినుండియు నాజీవితము విశ్వవ్యాప్తము లగునానందకిరణములచే నింతసహజముగా నింత సంపూర్ణముగా నేల వికసితమై ప్రకాశింప దనువిచారమే నా కావే దనను గలుగఁజేయుచున్నది. అది తన సకలదళములను సంకుచి తము గావించుకొని తనమధ్య నింతగట్టిగా నేమి దాఁచుకొనుచు న్నది ? ప్రభాతకాలమునందుఁ దరుణసూర్యుఁ డేతెంచి యరుణ కిరణములచే దానిద్వారమును దట్టి యి ట్లనుచుండును. నే నేవిధ మున నాచండకిరణరాజిని సమస్తాకాశముపై వెదచల్లితినో యట్లే నీవును సహజానందముతో విశ్వమున నిన్ను నిరాటంకముగా వ్యాపింపఁజేసికొనుము. రజని నిశ్శబ్దముగ నేతెంచి స్నిగ్ధహస్త ముతో దానిని స్పృశించి యిట్లు నుడువుచున్నది. 'నే నెట్లు నానిబి డాంధకారమునుండి నాసమస్తజ్యోతిస్సంపద నున్ముక్తము గావించి తినో యట్లే నీవొకసారి గభీరహృదయాంతరాళద్వారమును నిశ్శ బ్దముగ నుద్ఘాటితము చేయుము. ఆత్మయొక్క ప్రచ్ఛన్నరాజభాం డారము నొక్కముహూర్తములో విస్మితవిశ్వమునకుఁ బ్రత్యక్ష మొనర్పుము. నిఖిలజగత్తును ప్రతిక్షణమునందును దనవిచిత్రస్పర్శ ముచేత మన కిటుల నుపదేశించుచున్నది. 'నిన్ను వికసితముఁ జేసికొనుము, నిన్ను సంపూర్ణముగా సమర్పించుకొనుము. నీవైపు నుండి యందఱివైపున కొకసారి తిరుగుము, ఈజలస్థలాకాశము

నందు ఈ సుఖదుఃఖమయవిచిత్రసంసారమునం దనిర్వచనీయ మయినబ్రహ్మ వైపునకు ని న్నొక్కసారి సంపూర్ణముగాఁ ద్రిప్పు కొనుము. కాని ఆటంకము లనేకములు. ప్రభాతపుష్పమువలె నింత సహజముగా నింత సంపూర్ణముగా నాత్మార్పణముఁ జేయఁ జాలము, మనలను మనలోనే యడంచుకొనుచుందుము. నలువై పుల నిఖిలముయొక్క యానందాభ్యుదయ మంతయు వ్యర్థ మగు చుండును. ప్రతిమనుజునియందు నున్న యనంతజీవిత సాఫల్యత యొక్క పరిమాణమును స్థిరము చేయఁగలవా రెవరు ? పుష్పము వలె మనజీవితము క్షణవికాసమును బొంది పోవునది కాదు. నది తనబహుదీర్ఘ తటద్వయమధ్యమున ధారావహనవైచిత్ర్యమును జూ పుచునె యెన్నెన్నియో పర్వతప్రాంతమరుకాననగరగ్రామములను దరంగాభిహతము గావించి తాను దనదీర్ఘయాత్రాకాలమునం దా ర్జించిన విపులసంపత్సంచయమును, బ్రతిముహూర్తమునందును, మహాసముద్రమునందు నిశ్శేషముగా సమర్పించుకొనుచుండును. ఎప్పుడును దానికంత ముండదు. దానియవిశ్రామప్రవాహధారకును నంతముండదు. దాని తుది విరామమున కైనను హ ద్దుండదు. మను ష్యత్వముకూడ నట్లే గతివైచిత్ర్యములవలన విపులముగా మహా సార్థకత నార్జింపవలసియున్నది.మానవత్వముయొక్కసాఫల్యమును బొందుట సులభ మైనవిషయము కాదు. నది ప్రతిముహూర్తము నందును దనమార్గమును దన స్వశక్తిచేతఁ దన్నైపుణిచేత సృజిం చుకొని నడచుచుండును. ఒకతీరమును నిర్మించి యింకొకతీరము నుల్లంఘించి యొకచోట విభక్తమై, యింకొకచోట సంయుక్తమై,

నవనవావరోధములచేత సుడిగుండమువలెఁ ద్రిప్పఁబడి తనను తానే బృహత్తమముగా సృజించుకొనుచుండును; తుదకుఁ దనసీమావిహీనపరిమాణమును బొందినపుడు వైచిత్ర్యము నతిక్రమించి వచ్చిన దగుటచేత మహాంతమగు నేకస్వరూపముగలవానితో సమ్మేళనము సంపూర్ణ మగుచున్నయది. ఆటంకములే లేకుండిన నది బృహత్తమము గానేరదు. బృహత్తమము గా కానిది విరాట్స్వరూపునియందుఁ దనవితానపూర్ణతను దాల్చెడిదే కాదు.

దుఃఖ మున్నది. సంసారమునందు దుఃఖమున కంతము లేదు. ఆదుఃఖాఘాతముచేత నాదుఃఖావేగముచేత సంసారమునందనంతనిర్మాణము నిర్మూలన మగుచున్నది. దీనియం దుద్భవించుచున్నతరంగముల కెన్నియో ధ్వనులు, ఎన్నియో రంగులు, ఎన్నియో చిత్రములు; మనుజుఁడు క్షుద్రుఁడై క్షుద్రత్వమునందే తనసర్వస్వమిమిడి యున్న దని గ్రహించినచో దుఃఖమువంటి యసంగత మైనది ఇం కేదియు లేదు. ఇంత దుఃఖము క్షుద్రునిది కాదు. మహాత్మునకుఁ గలగౌరవము దుఃఖమే. విశ్వమునందలి మనుష్యత్వమాదుఃఖమహిమచేత మహిమాన్విత మైనది. అశ్రుజలముచేతనే దానికి రాజ్యాభిషేకము గావింపఁబడినది. పుష్పమునకు దుఃఖము లేదు. పశువుల దుఃఖము సీమాబద్ధ మయినది. సంకీర్ణ మైనది. మనుజునిదుఃఖము విచిత్ర మైనది. గభీర మైనది. అనిర్వచనీయమైనది. ఈప్రపంచమునందు మానవునిదుఃఖావేదనకు సీమను గ్రహించుట దుర్లభము.

ఈదుఃఖమే మనుజుని గొప్పవానినిగాఁ జేయును. మను

జుని బృహత్త్వమును గొప్పతనమునుగుఱించి సచేతనునిగాఁ జే యును. ఈబృహత్త్వమువలననే మనుజుఁ డానందమున కధికారి యగుచున్నాఁడు. కారణ మేమన "భూమైవ సుఖం నాల్పేసుఖ మస్తి" అల్పమునందు మన కానందము లేదు. మనక్షుద్రత్వము, మనయల్పత్వము, మన కారాటము కలుగఁజేయునది కావచ్చు ను; కాని మన కానందమును గలుగఁజేయునది కాఁజాలదు. దేనిని మనము తేజమువలనఁ బొందమో, అశ్రువులు రాల్చియుఁ బొం దమో, యేది అనాయాసముగాఁ బొంద నగునో దానిని మనము సంపూర్ణముగా ననుభవింపఁజాలము. దేనిని మనము దుఃఖము వలనఁ గష్టపడి పొందుదుమో హృదయము దానినే లెస్సగ సమగ్ర ముగా ననుభవించును. మనుష్యత్వము మనపరమదుఃఖధనము; అది తేజమువలన లభ్య మగునది. ప్రత్యహము మాటిమాటికి బాధల నతిక్రమించి దానిని బొందనియెడల దానిని బొందియుఁ బొందనివారమే యగుచున్నారము, అది సులభమే యయినయెడల మనహృదయము దానిని సంపూర్ణముగ స్వీకరించెడిదికాదు. అది దుఃఖమువలన లభింపనిది. మృత్యుభయమున లభింపనిది. భయ విపత్తుల నానావిధము లయిన ప్రవృత్తుల సంక్షోభమువలనను లభింపనిది. ఈదుర్లభమనుష్యత్వము నార్జించుటకుఁ జేయుప్రయ త్నములయందే యాత్మ తనసకలశక్తులను గ్రహించుచున్నది. ఆ యనుభూతియందె దానికిఁ బ్రకృతానందము. దీనియందే దానియొ క్క యథార్థాత్మపరిచయము. దీనివలననే యది దుఃఖముపై తనమస్తక మున్నటులు మృత్యువుపై తనప్రతిష్ఠ యున్నటులును

గ్రహించును. ఈవిధముగా సంసారముయొక్క విచిత్రాభిఘాత ములవలనను, దుఃఖబాధలతోడి నిరంతరసంగ్రామమువలనను ఏ యాత్మయొక్క సకలశక్తులు జాగరితము లగునో, తేజ మంతయు నుద్దీప్త మగునో, ఆయాత్మయే బ్రహ్మను యథార్థముగాఁ బొందఁ గలుగును. క్షుద్ర వినోదములందును భోగవిలాసములందును దేనిని యే యాత్మ జడత్వము నంది యుండునో అట్టి యాత్మ బ్రహ్మ నందము నొందనేరదు. కావుననే యుపనిషత్తు లుపదేశించిన దేమనఁగా "నాయ మాత్మా బలహీనేన లభ్యః" ఈయాత్మ— జీవాత్మ గాని, పరమాత్మగాని, బలహీనునకు లభించునది కానేరదు.

అందుచేతఁ బుష్పమునకుఁ బుష్పత్వ మెంతసహజ మైనదో మనుజునికి మనుష్యత్వ మంత సహజమైనది గాదు. మనుష్యత్వ మువలన మనుజుఁడు పొందవలసినదానిని నిద్రావస్థయందుఁ బొం దనేరఁడు. కావుననే సంసారమునందలిసకలకఠినాఘాతములును మన కీమాటనే చెప్పుచున్నవి. "ఉత్తిష్ఠత ! జాగ్రత ! ప్రాప్యవ రాన్ నిబోధత ! క్షురస్యధారా నిశితా దురత్యయా, దుర్గం పథ స్తత్ కవయో వదన్తి" లెమ్ము, మేల్కొనుమ్ము, యథార్థగురుసమీపమున కేతెంచి జ్ఞానమును బొందుము. ఆమార్గము సానఁబట్టిన మంగలి కత్తివాయివలె దుర్గమ మైన దని కవులు నుడువుచున్నారు.

కావునఁ బ్రభాతమునందు వనోపవనములలోఁ బుష్పపల్లవము లలో వానిక్షుద్రసంపూర్ణత వానిసహజసౌందర్యము పరిపూర్ణము గా వికసితమై ప్రకాశించునపుడు మనుజుఁడు తనదుర్గమమార్గము ను దుస్సహదుఃఖమును దనబృహత్తమమైన యసంపూర్ణతయొక్క

గౌరవముచే మహత్తరుఁడై విచిత్రతరానందగీతమును పాడఁడా ! ఏప్రభాతమునందుఁ దరులతలలోఁ గేవలము పుష్పములవికాసము పల్లవములచలనములు పక్షులపాటలు ఛాయాలోకములస్పందనము గాన్పించుచుండునో యాశిశిరధౌతజ్యోతిర్మయప్రభాతమునందు మనుజునిసమక్షమున సంసారము సంగ్రామక్షేత్రముగఁ గాన్పించుచున్నది. ఆరమణీయ ప్రభాతమునందు మనుజుఁడు బద్ధపరికరుఁడై దుర్గమమార్గమునందు నడువవలసియున్నాఁడు. క్లేశమును వరించి స్వీకరింపవలసియున్నది. సుఖదుఃఖములయుత్తాలతరంగములపైఁ దననౌకను నడుపవలసియున్నది. కారణ మేమన మనుజుఁడు మహత్తరుఁడు. మనుష్యత్వము కఠినమైనది. మనుజునిమార్గము "దుర్గం పథ స్తత్ కవయో వదన్తి."

కాని సంసారమునందే సంసారముయొక్క యంతమును జూచినచో దుఃఖకష్టముల పరిమాణ మత్యంతభీకరాకారము దాల్చును. అప్పుడు సామంజస్య ముండనేరదు. నది కేవిధమున నొకవైపునఁ బరమవిరామసముద్రమును, నింకొకవైపున సుదీర్ఘతట నిరుద్ధావిరామ యుద్ధముసల్పుజలధారయును గలవో యట్లే మనకును నొకవైపున బ్రహ్మయందు విశ్రామమును నింకొకవైపున సంసారమునం దవిశ్రామగతివేగము నుండనిచో నిట్టిస్థితి కెట్టితాత్పర్య ముండనేరదు. మనప్రయత్నము లన్నియు నద్భుతములగునున్మత్తతలవలెఁ బరిణమించును. బ్రహ్మయందే మనసంసార పరిణామము, మనకర్మములగతి, శాస్త్రము నుడివిన దేమనఁగా బ్రహ్మనిష్ఠుఁ డగుగృహస్థు "యద్యత్కర్మ ప్రకుర్వీత తద్బ్రహ్మణి

సమర్పయేత్'' ఏయేకర్మ లాచరించునో వానినన్నిటిని బ్రహ్మ యందే సమర్పించుకొనును. దీనివలన నేకకాలమునఁ గర్మవిరామము, చేష్టాశాంతి, దుఃఖము, ఆనందము సంఘటిల్లుచున్నయవి. దీనివలన మనయాత్మ కొకవైపునఁ గర్తృత్వ ముండును. ఇంకొకవైపున నీకర్తృత్వ మెచ్చట నిశ్శేషముగా లయ మైపోవునో యచ్చట నాకర్తృత్వమును బ్రతిక్షణమునందును విసర్జించి మనము ప్రేమానందముల నొందుచుందుము.

ప్రేమ త్యాగములేక బ్రతుకనేరదు. మనకర్మలు మనకర్తృత్వము మనవి కానిచో బ్రహ్మ కేమి యర్పింపఁగలము.? భక్తిసాఫల్యము నెట్లు పొందఁగలదు? మనకర్మలు మనకర్తృత్వము. ఇవియే మన మీయఁగలవస్తువులు. మనకర్మలను మనకర్తృత్వములను నానందముతో బ్రహ్మకు సమర్పింపఁ గలిగినపుడే మనప్రేమ చరమసార్ధకతను బొందఁగలదు. లేనిచో కర్మములు మనకు నిరర్థకభారములుగాను గర్తృత్వములు సంసారమునకు దాస్యత్వముగాను బరిణమించును. పతివ్రత యగుస్త్రీకిఁ దనపతి గృహముయొక్క కర్మములే గౌరవమును నానందమును చేకూర్చునవి. ఆకర్మ లామెకు బంధనములు కావు. పతిప్రేమయందే యాకర్మములు ముక్తిపొందుచుండును. పతిప్రేమయందే విచిత్రకర్మముల యఖండైక్యము ననుభవించుచుండును. నానాదుఃఖములును నానందమునం దవసానమొందుచుండును. బ్రహ్మయొక్క సంసారమునందు మనము బ్రహ్మయొక్క కర్మలు చేసి బ్రహ్మకే సమర్పించునపుడు కర్మములు, ముక్తి యేకభావము దాల్చుచుండును. ఏకబ్రహ్మయందే మన

సమస్తకర్మముల వైచిత్ర్యము విలీన మగుచుండును. సకలదుఃఖ ముల ఝుంకారమును నానందసంగీతములోఁ బరిపూర్ణ మైపోవును.

ప్రేమ చేయుదాన మెంతకఠిన మైన దగునో దాని సార్థక తయు నంత నిబిడమై యుండును. సంతానముపైఁ దల్లికిఁ గల స్నేహము దుఃఖముననే పరిపూర్ణ మగుచున్నది. ప్రేమ కష్టము వలనఁ దనను సమగ్రముగా సప్రమాణము గావించుకొని కృతార్థమగును. బ్రహ్మపై మనకుఁ బ్రీతి గలిగినపుడు మనసంసార ధర్మము దుఃఖక్లేశములవలన సార్థక మగును. అవి మనప్రేమనే ప్రతిదినమును జ్వలింపఁజేయును, అలంకృతమొనర్చును. బ్రహ్మ కు మనము గావించునాత్మార్పణము దుఃఖముయొక్క మూల్య ముగా నొనర్పఁబడుచున్నది.

ఓ ప్రాణమునకుఁ బ్రాణమా; చక్షువునకుఁ జక్షువా; శ్రోత్ర మునకు శ్రోత్రమా; మనస్సునకు మనస్సా; నాదృష్టి, శ్రవణము, చింత, నాసకలకర్మములు,నీసముఖముననే యహరహమును బరుగి డుచున్నయవి. నే నిది గ్రహింపకపోవుటచేతనే దుఃఖము నొందు చున్నాను. నేను సమస్తమును నంధభావముతో బలవంతముగా నా వని చెప్పుచున్నాను. బలము రక్షింపఁబడుటలేదు. నా కేమియు నుండుట లేదు. నిఖిలమునుండియు నీనుండియు సమస్తమును నావైపునకే లాగుకొనునిష్ఫలయత్నముచేతఁ బ్రతిదినము పీడిం పఁబడుచున్నాను. నేఁడు నాకేమియు నవసరము లేదు, పొందుటకై ప్రార్థింపను. నేఁడీయఁగోరుచున్నాను. ఇచ్చుటకు శక్తి గావల యును. నీయొద్ద నేను నన్నుఁ బరిపూర్ణరిక్తునిగాఁ జేసికొనుచు

న్నాను. రిక్తుఁడనై పూర్ణుఁడ నయ్యేదను. నీసంసారమునందుఁ గర్మములరూపమున నేఁ గావించుసేవ నిరంతరము నాప్రేమ నెల కొల్పి నిష్ఠతో నింపుఁగాక ! నీయమృతసముద్రాంతరస్థితవిశ్రాంతి నాకనంతశాంతి నొసంగుఁగాక ! నీవు దినదినము నన్ను శతదళ పద్మముపలె విశ్వమునందు విలసితునిఁగాఁజేసి నీపూజ కర్హ్యముగా స్వీకరింపుము.

---

# త్యాగము. 4

ప్రతిదినప్రాతఃకాలమునందును మనము చేయు నీశ్వరోపా సనలు సత్యములైనయెడలఁ బ్రతిదినమును గొంచెముకొంచెము గాఁ ద్యాగముచేయుటకు మనము సంసిద్ధుల మగుచుండవలయును. తప్పక త్యాగశీలురము కావలసియుండును. ఏల యనగాఁ బ్రపం చమునందు 'త్యాగ' మను మహాధర్మ మొక్కటి గలదు. దాని విధాన మమోఘము. అది మనల నెచ్చటను నిలువనీయదు. త్య జింపుము, త్యజింపు మని ముందునకు నడువు మని యది సదా మనకు బోధించుచుండును. మనము చేయువలసిన దంతయుఁ జేసి తి మనియు సంపూర్ణముగ నెఱవేర్చితి మనియుఁ దలంచునట్టి స్థితి యును బోవలసినప్రదేశమునకుఁ బోయి చేరితిమి, కాన నింక నిచ్చటనుండి మఱి యెచ్చటికిని బో నావశ్యకము లే దనెడుస్థల మును మనకుఁ గానరాకున్నది.

త్యాగము చేయుట ప్రకృతిధర్మము. దానితో మనయిచ్ఛ యేకీభవింపక విరుద్ధముగఁ జరించెనేని దానికిని మనయిచ్ఛకును బోరాటము కలుగుచుండును. ఏదేని యొకవిషయమునుగూర్చి "ఉంచెదము, ఉండెదము" అని మనయిచ్ఛయు "త్యజింపుము, నడువుము" అని ప్రపంచేచ్ఛయు నయ్యేనేని, అప్పుడు మనయిచ్ఛకును బ్రపంచేచ్ఛకును మహాయుద్ధము జరుగఁగలదు. ఆపోరాటమున మనయిచ్ఛయే యోడిపోఁగలదు. మనము త్యజింపఁజాలనిదానిని బ్రపంచము మనయొద్దనుండి లాగి తీసికొనఁగలదు. కావున మన యిచ్ఛను బ్రపంచేచ్ఛతో నేకము చేసియే తీరవలయును.

ప్రకృతియొక్క యిచ్ఛతో మనయిచ్ఛ నేకముచేయఁ గలిగినప్పుడు మనము యథార్థస్వాధీనుల మయ్యెదము. అదియే స్వాధీనతయొక్క నియమము. మనము స్వేచ్ఛావిహారుల మయి విశ్వమునకు విరుద్ధముగఁ జరించునప్పుడు విశ్వము మనపై నధికారము సలిపి మనలను దన కనుగతులనుగాఁ జేసికొనఁగలదు. అప్పుడు మన కొంసద ముండదు; దానికి దాసులమై మనము నడువవలసియుండును.

కావున 'మీయొద్దనుండి లాగి తీసికొందును సుఁడీ' యని ప్రపంచము మనలను బెదరింపక పూర్వమే, మనమే ముందుగాఁ ద్యాగము చేయుటకు సంసిద్ధుల మై 'ఇదిగో తీసికొను' మని మన యిచ్ఛను యదృచ్ఛగా విశ్వమున కర్పింతుముగాక! ప్రతిదినమును మనయిచ్ఛను ద్యాగముకొఱకు సిద్ధము చేయ కున్న మృత్యు వాక్కనాఁ డస్త్రధారిణియై మనయెదుట నిలువఁబడి మనలను భయ

పెట్టఁగలఁడు. అప్పుడు దాని నెట్టులైనను మోసపుచ్చవలయు నని మన కిచ్ఛ కలిగినను, మృత్యువును మోసపుచ్చుట మనకు సాధ్యమగునా? కానేరదు. ఆదినము మహాశుభదినము.

త్యాగముచేయుటవలన దారిద్ర్యము ననుభవింపవలసివచ్చు నని మన మెంతమాత్రమును దలంపరాదు. పూర్ణతమరూపమును బొందుటకొఱకే మనము త్యాగముచేయుట.

మనము దేనినుండి బయటికి రాఁజాలమో దానిని మనము పొందఁజాలము. గర్భమున నావృతమైయున్నశిశువు తనతల్లిని జూడఁజాలదు. శిశువు తల్లిగర్భమునుండి బంధమును ద్రెంచుకొని భూమిష్ఠ మైనాఁడె స్వాధీనతను జెందుచున్నది. అప్పు డాశిశువు తనతల్లిని బూర్ణవిమలభావముతోఁ జూచుచున్నది.

ఈప్రపంచగర్భావరణములోనుండి మన మావిధముగా ముక్తులము గావలయును. అట్లయినచో మనము యథార్థముగ జగత్తును జూడఁగలుగుదుము. మనము జగత్తులోపల బద్ధులమై యున్నంతవఱకు భ్రూణమువలె జగత్తును జూడఁజాలకుందుము. ముక్తుఁ డైనవాఁడే జగత్తు నెఱుఁగఁగలఁడు; జగత్తును బొందఁగలఁడు.

ఎవ్వఁడు సంసారములోపల బంధింపఁబడి యుండునో వాఁడు నిజమైనసంసారికాఁడు. ఎవ్వఁడు సంసారమునుండి ముక్తుఁడగునో యతఁడే యథార్థసంసారి. ఏల యనఁగా నతఁడు సంసారమునకు లోఁబడక సంసార మతనికి లోఁబడి యుండును. అందుచేత నితఁడు సంసారము నాది గాని, నేను సంసారము వాఁడను గానని విస్పష్టముగఁ జెప్పఁగలుగుచున్నాఁడు.

గుఱ్ఱము బండికి బంధింపఁబడి బండిని లాగును; కానిబండిని నాబండి యని గుఱ్ఱము చెప్పనేర్చునా? బండిని నడుపువానికిని గుఱ్ఱమునకును భేద మెక్కడ? గుఱ్ఱము బండికి బంధింపఁబడియుండును. బండిని నడుపువాఁడు ముక్తుఁడైయుండి బండిపై నెక్కి బండిని తోలును. కనుక బండిని తోలువాఁడు బండినిగూర్చి నాబండి యని చెప్పనేర్చును.

కర్త్తవు రాఁగోరుమువేని ముక్తుఁడవు కమ్ము. ముక్తిఁ జెంది కర్మములు చేయుటయే కర్మయోగ మని భగవద్గీత నుడువుచున్నది, అనాసక్తులమై మనము కర్మముల నాచరింపవలయును. అట్లు చేసినప్పుడే కర్మములపై మనకుఁ బూర్ణాధికార ముండఁగలదు. లేనిచో మనము కర్మములతో బంధింపఁబడి కర్మములతో సంగీభూతులమై "కర్మి" యని పిలువఁబడనేరము. కావున సంసారమును బొందవలయు నన్న మనము సంసారమునకు బయట నుండవలయును. కర్మములను సాధింపవలయు నన్నయాసక్తినిఁ బరిహరించి మనము కర్మములఁ జేయవలయును.

సంసారమును బరిగ్రహించుటయుఁ ద్యజించుటయు నీరెండును విపరీతధర్మములై కాన్పించుచున్నవి. ఈవిపరీతధర్మద్వయమును సామంజస్యము గావింపవలయును, వీనిలో నేదేని యొకదానినిమాత్రమే మనము స్వీకరింతు మేని, తప్పకయశుభము ఘటింపఁగలదు. సంసారమును బరిగ్రహించుస్వభావముమాత్రమే మనకున్నయెడల మనము బంధింపఁబడుదుము.అట్లుగాక పరిత్యజించుస్వభావముమాత్రమే మన కున్నయెడల మనము వంచింపఁబడుదుము

ము. ముక్తివిహీనమైనకర్మములు మనలను దాసులనుగాఁ జేయును. కర్మవిహీన మైనముక్తి మనలను నాశముఁ జెందించును,

యథార్థత్యాగ మనఁగా శూన్యత్వము కాదు. అధికారము యొక్క పూర్ణత్వము. దత్తపుత్రుఁ డాస్తికి పూర్ణాధికారి కానప్పుడు దానవిక్రయములఁ జేయునధికార మతని కుండనేరదు. ఆస్తి నను భవించుస్వల్పాధికారముమాత్రమే యతని కుండును గాని దానిని తనయిచ్ఛవచ్చినటులఁ జేయుపూర్ణాధికార మతని కుండనేరదు. అట్లే మనమును గేవలము కూర్చిపెట్టుచు హృదయపూర్వకముగాఁ ద్యజించుట కిష్టపడ కుండినయెడల మనసంచితసామగ్రిపై మనకు స్వాతంత్ర్య ముండనేరదు.

కావుననే ధనికుఁడు ముక్తిని బొందుట మహాకష్ట మని మహాత్ముఁడగుయేసుక్రీస్తు నుడివియున్నాఁడు. ఏల యనఁగా నతఁడు విడువఁ జాలనిధనమే యతనిని బధించుచున్నది. ఈబంధనమును నెవ్వఁ డెంతపెంపొందించుకొనునో వాఁ డంతవిపత్తులోఁ దగు ల్కొనుచున్నాఁడు.

ఈబంధము లన్నియుఁ దొలఁగునట్లును త్యాగముమనకు సహజమగునట్లును ప్రతిదినమును మనము చేసెడియుపాసనలవలన మనము ఫలమును బొందవలయును. నానావిధాసక్తులయొక్క ప్రబ లాకర్షణములచే మనస్వభావము పెద్దబాతివలె మొద్దుపడి యున్నది. ఉపాసనాసమయమున నమృతప్రవాహము ప్రవహింపవలయును. ఆమధురప్రవాహము మనలోపల నుండుప్రత్యణుపరమాణురంధ్రము లోనికిని బ్రవేశింపవలయును. పాషాణముతో సమమై యున్న

మనహృదయము ప్రతిదినోపాసనలవలనఁ గరఁగి మృదుత్వమును ధరింపవలయును. క్రమక్రమముగా జీవనమధ్యమున నొక్క విశాలప్రదేశము నిర్మింపఁబడి దానియం దానందము. పూర్ణమై యొప్పుచుండవలయును. చూడుఁడు! ఒక్కపర్యాయము లోపలివైపు నకుఁ జూడుఁడు! అంతరమునందలి సంకోచము లన్నియుఁ బ్రతిది నభగవన్నామాఘాతములచేఁ బ్రసారితము లగుచున్నవి; విచ్ఛిన్న ములగుచున్నవి; ప్రశాంతము లగుచున్నవి; కర్మములు సహజము లగుచున్నవి. అందఱితోడిసంబంధము సత్యముగను సరళముగను నగుచున్నది. ఈశ్వరమహిమయు నీమానవజీవనమున ~~[illegible]~~ గాంచుచున్నయది.

---

## త్యాగఫలము. 5

త్యాగ మేల చేయవలయును? అనుప్రశ్నమునకుఁ జిట్టచివర జవా బేదో నామది కింకను దోఁచ కున్నయది. ఈప్రశ్నకు శాస్త్ర ము లిట్లు చెప్పుచున్నవి. "త్యాగము చేయనియెడల మనము స్వా ధీనులము కాఁజాలము. దేనిని మనము త్యజింపఁజాలమొ యదియే మనల బంధించును. త్యాగద్వారమున మనము ముక్తుల మయ్యెద ము."

ముక్తి హొందెదముగదా యనునుత్సాహ మావంతయైనను మనయందుఁ గానరా కున్నయది. నిజముగా మనము ముక్తిని

గోరుటయే లేదు. మనలోపల నీచభావ మొక్కటి యున్నది. అది యే యధీనత. దానిని గలిగియుండుటవలననే మనము సంతోష పూర్వకముగా సంసారమున కధీనుల మైనారము; సంసారమునం దలిసకలపదార్థముల కధీనులమైనారము. ఇల్లు వాకిలి చెంబు గిన్నె దొడ్డి త్రోవ మొదలగువాని కధీనులమైనారము. భృత్యులకును ప్రసంగములకును బేరునకును బ్రతిష్ఠకును నసంఖ్యాకము లగు ప్రవృత్తులకు నధీనుల మైనారము. ఇట్టిజన్మాధీను లయినదాసాను దాసులకు ముక్తిపలన సార్థకత యున్న దని చెప్పినయెడల వారు దాని నసత్యముగఁ దలంచెదరు. స్వాభావికముగను స్వేచ్ఛానుసార ముగను బద్ధు లయినవారిని ముక్తి యాకర్షించుట కల్ల.

అట్టివారికి ముక్తి యనఁగా శూన్యత్వముగను నిర్వాణము గను మరుభూమిగను గాన్పించును. ఏముక్తిలోపల వారి కిల్లు వాకిలి చెంబు గిన్నె డబ్బు దుగ్గాని యేవియుఁ గాన్పింపవో, దేని నొక్కదానినిమాత్రమే నమ్మి తక్కినసమస్తమును విడువ వలయునో యట్టిముక్తి వారికి భయంకరముగను వినాశకరముగను గాన్పించును.

మనము చేయుత్యాగము శూన్యత యైనచో నాత్యాగము పూర్ణముగ నిష్ఫలమే. ఒకదమ్మిడి నైనను నావిధముగా శూన్యత్వము లోఁ బాఱవేయుటకు మనము సమ్మతింపనేరము.

కావున మనము శూన్యత్వమున కర్పించుట లేదు. "యద్య త్కర్మ ప్రకుర్వీత తద్బ్రహ్మణి సమర్పయేత్" అనఁగా నీ వేయే కర్మముల నాచరింతువో వాని నెల్లఁ బరబ్రహ్మమున కర్పింపుము.

నీసంసారమును నీప్రియజనమును నీసమస్తమును భగవంతుని కర్పింపుము. అదియే త్యాగము. అదియే పరిపూర్ణస్వరూపుఁ డగు పరమేశ్వరుని కర్పించుట.

పూర్ణుఁడై వెలుంగుపరబ్రహ్మమునకు దేని నర్పింతుమో దానిని దిరిగి తప్పక పరిపూర్ణముగఁ బొందుదుము. కాని యంతటితో నీవిషయము పూర్తి కాలేదు. పొందుద మన్నంతమాత్రమున నేవిషయమును సమాప్తము కానేరదు. పొందినతరువాత నేమగును ? అనుప్రశ్నము నిలిచియుండును. స్వాధీనతను సంపాదించుటవలనఁగాని పూర్ణత్వమును బొందుటవలనఁగాని నేమిఫలము?

ఒకపిల్లవాని కొకపైస యిచ్చినయెడల దాని నేమిచేయవలయు నని యాబాలుఁ డడుగఁగలఁడు. బజారునకుఁ బొమ్మని బదులు చెప్పినయెడల నక్కడికిఁ బోయి యేమి చేయవలయు నని యతఁడు మరలఁ బ్రశ్నించును. బొమ్మను కొనుక్కొను మని మనము చెప్పెదమేని దానిని కొని యేమిచేయవలయు నని యాబాలుఁ డింకొకసారి ప్రశ్నించును, ఆడుకొను మని మనము చెప్పెద మేని యాడుకొనుటవలన నేమిఫల మని యాపిల్లవాఁ డడుగక మానఁడు. అప్పు డొకయుత్తరముతోఁ బ్రశ్నము లన్నియుఁ బూర్తికాఁగలవు,—" సంతోషించెదవు" సంతోషించిన నేమిఫల మని యెవ్వరును హృదయపూర్వకముగాఁ బ్రశ్నింపనేరరు. అభీష్ట మీడేరుటవలన నెట్టియానందము కలుగుచున్నదో యా యానందముతో సమస్తప్రశ్నములు సమాప్తము లగుచున్నవి.

మనము త్యాగశక్తి నెట్లు సంపాదింపఁగలము ? దేనిద్వార

మును మన కాశక్తి జన్మింపఁగలదు ? మనము చేయుచున్న ప్రతి దినోపాసననుండి మనకుఁ ద్యాగశక్తి కొంతకొంత లభించుచున్నది. ఈప్రాతఃకాలమునందుఁ జైతన్యస్వరూపునితో మనచైతన్యమును నిబిడభావమునఁ బరివేష్టితముచేయుటకొఱకు క్షణకాలము మనసమస్తావరణములను త్యజించుచున్నాము. అనావృతులమై సద్యోజాత శిశువుచందమున భగవంతునిసన్నిధానమున మనయాత్మసమర్పణముఁ గావించుచున్నాము. అందువలననే మనకు దినదినమును గొంతత్యాగశక్తి పెంపొందుచున్నది. ఆనందస్వరూపునితోడను, ప్రేమస్వరూపునితోడను గ్రమక్రమముగా మనకు మేళన మేర్పడుచున్నది.

త్యాగమును జేయువిధ మెద్ది ? ప్రతిదినమును సంసారమధ్యమునుండి దీనులకు దానము చేయుమహాకార్యము నొకదాని నారంభింపుము. ఆకార్యము నొకమంగళయజ్ఞముగఁ దలంపుము. ఆమంగళయజ్ఞముకొఱకు నీభాండాగారమునందలి యొక మిక్కిలి చిన్నద్వారము నైనను దెఱచి యుంచెద వేని అదివఱ కెన్నడును రాకపోయినను నేఁడు నీద్వారముకడ కెందఱో దీనులు తమదీనాలాపములఁ దెలుపుచు వచ్చుచుందురు. ఈవిధముగా దినదినమును నీత్యాగశక్తి పెంపొందుచుండును. మొట్టమొదటఁ దాళముచెవిని దాళమునందుఁ బెట్టి త్రిప్పఁగా నెంతమాత్రము తిరుగకున్నను త్రిప్పఁగాఁ ద్రిప్పఁగాఁ గ్రమముగా నదియే మిక్కిలి సులభసాధ్య మగుచున్నది. అట్లే యొకశుభసందర్భమునఁ ద్యాగము చేయుట కారంభించెద మేని యాత్యాగము క్రమక్రమముగా విస్తృత మగుచుం

డును. సంసారమునకు మన మహోరాత్రములు సమస్తము నిచ్చు చున్నాము. భగవానునకును గొంచెము నిమ్ము. ప్రతిదినమునఁ దుద కొక్కమాఱైనను భగవంతునకు ముష్టిభిక్ష నిమ్ము. నిష్పృహాభిక్షుకుఁ డగుభగవానుఁడు తనభిక్షాపాత్రమును హస్తమున నిడుకొని నవ్వుమొగముతోఁ బ్రతిదినమును మనద్వారముకడకు వచ్చుచున్నాఁడు. ప్రతిదినము దిరిగిదిరిగి పోవుచున్నాఁడు. వాని కొక పిడికెఁడుదానము చేయుటకు మన మభ్యసించెదమేని యా దానమే మనకన్నిటికంటె గొప్పది కాఁగలదు. క్రమముగా మనము చేసెడి దాన మింక మనఁపిడికిలియందుఁ బట్టుకొని మనముకూడ నిఁక హస్తముతోఁ జేయుచు వచ్చినయాస్వల్పదానమునే చేయనేరము. కాని భగవంతునిపేరుతోఁ జేసెడు యేకొంచము దానమునయినను గోప్యముగఁ జేయవలయును. దానికొఱకు మానవులయొద్ద ఖ్యాతి నేమాత్రము గోరరాదు. ఏల యనఁగా లోకులను జూచి యిచ్చుట కారంభించిన దేదియైనను సరియే యొకవైపునుండి యిచ్చుచుండిన మఱియొకప్రక్కనుండి యది హరించి పోవుచుండును. అనఁగా నిష్ఫల మగుచుండును. ఆమహాభిక్షుకునకు దేని నిచ్చెదమో యది కొంచెమైనను నిశ్శేషముగ నీయవలయును. భగవంతుని కిచ్చెడు దానికిఁ బద్దు వ్రాయవలదు. దానికి రసీదు కోరవలదు. దినము లోపల మన మేదో యొకదానము నారీతిగాఁ బరిపూర్ణముగఁ జేయుదుముగాక! పరిపూర్ణస్వరూపుఁ డగుపరమేశ్వరునియొద్ద మనము చేయుత్యాగము పరిపూర్ణత్యాగ మగునుగాక! సంసారమునందలి సకల స్వల్పవ్యాపారములయందును భగవంతునితో నేకాకిగా నేను

ప్రత్యహమును గోపనసాక్షాత్కారమును బడయుటకొఱ కవకాశ
మును బొందుదుముగాక :

---

## బ్రహ్మాత్మభావము . 6

మన యసంపూర్ణతయందు సంపూర్ణసత్యమును గనుఁగొను
టకుఁ గొంతికాలము పట్టును. మనము నిజముగా నేమయి యు
న్నారమో మన మేమి చేయుచున్నారమో దానిపరిణామ మేమి
యో దాని తాత్పర్య మేమియో యావిషయములు స్పష్టముగా
గ్రహించుట సులభము గాదు.

బాలకుఁడు తాను తనయింటిపిల్లవాఁడ ననియే తలంచును.
తనగృహసంబంధమె కడపటిసంబంధ మని యతఁ డనుకొనును.
మానవజీవితమునం దన్నిటికంటె గొప్పసంబంధము తనగృహము
వెలుపలనే యని యాతఁ డెఱుఁగఁడు.

అతఁడు మానవుఁడు కనుక సకల మానవులకుఁ జెందిన
వాఁడు. ఆతఁడు ఫల మయినయెడల నాతని తలిదండ్రులు కొమ్మ
మాత్రమే; సమస్తమానవవృక్షముతో ననఁగా వేరునుండి కొమ్మ
చివరవఱకు నాతనికి ముట్టాగలయోగము గలదు.

కాని యాతఁడు కేవలము తనయింటికిఁ జెందినవాఁడు
గాక ఆతఁడు మానవుఁ డనువిషయము శిశువు చాలకాలమువఱకు
గ్రహింపనేరఁడు. అయినప్పటికి నిల్లాతని నింటియందే బంధించి
యుంచుటకుఁ బాలించుట లేదనియు నాతఁడు మానవసంఘము

కొఱకే పెరుఁగుచున్నాఁ డనియు నతఁ డొకదినమున గ్రహింప వలసియే యుండును.

మన మనేకసంవత్సరములనుండి యీబ్రహ్మోత్సవమును జేయుచున్నారము. మన మేమి చేయుచున్నామో మన మెందుల కీయుత్సవమును జేయుచున్నామో యను విషయములు గ్రహించు సమయ మేతెంచినది.

ఈయుత్సవము బ్రాహ్మసమాజోత్సవ మని మన మను కొనుచున్నాము. ఈయుత్సవమునందు బ్రాహ్మలు వారిసాంవత్స రికక్లాంతిని దుఃఖమును నుత్సవానందమున విసర్జింతురు. వారి యవసన్నజీవితమునకుఁ బ్రాణమును బూరింతురు. ప్రతిదినసంచిత మాలిన్యమును ధౌతముఁ జేసికొందురు. మహోత్సవక్షేత్రమునం దున్నచిరనవీనత్వముయొక్క యమృతఝరమునుండి నీరమును బానము చేయుదురు. దానియందు స్నాన మొనరించి సద్యోజాత శిశువువలె నవజీవితముతోఁ బ్రఫుల్లవదనులై యుందురు.

ఈలాభము నీయానందమును బ్రాహ్మసమాజోత్సవము నుండి పొందఁగలిగినయెడల బ్రాహ్మసంఘము ధన్యము కాఁగల దు. కాని దీనియందే యుత్సవముయొక్క చరమపరిచయమును మనము పొందఁజాలము. మనయీయుత్సవము బ్రాహ్మసమాజ మునకంటెఁ జాల గొప్పది. దీనిని భారతవర్షోత్సవ మన్నను దీనిని జిన్నదిగాఁ దలంచుట యగును.

మనయీయుత్సవము మానవసమాజోత్సవ మని నే నను చున్నాను. ఈమాట సంపూర్ణవిశ్వాసముతో నేఁ డనకున్నయెడల

మనచిత్తసంకోచము మూరము రాదు. ఈయుత్సవైశ్వర్యభాండారము మనకు సంపూర్ణముగాఁ దెలియఁబడదు. మన మెందులకిచట రాహ్వానింపఁబడితిమో సరిగా గ్రహింపనేరము.

మనయుత్సవమును బ్రహ్మోత్సవ మందుము. బ్రాహ్మోత్సవమనము. ఈసంకల్పముతోనే మన మిచటికి వచ్చితిమి. సత్యస్వరూపునిప్రకాశముచే నుత్సవము సమస్తలోకములందు వ్యాపింపఁజేసి చూతుము. నేఁడు మనయీప్రాంగణము సమస్తలోకమునకుఁ జెందినమహాప్రాంగణము. దీనికి క్షుద్రత్వము లేదు.

దీపము తనవెలుఁగును దనలో దాఁచుకొని యుండఁజాలదు—మహాన్తం పురుషం— మహాపురుషుని మహత్త్వమును బొందినవా రింకఁ గవాటమును బంధించుకొని యుండఁజాలరు; వా రొక్కసారిగా లోకమునకు మధ్యమున నిలిచియుందురు. వారలు కంఠము నాశ్రయించి యున్నమహావాణి నెల్లపుడు ఘోషించుచుందురు. దివ్యధామము వారి నలువైపుల నావరించియున్నటులఁ గాంతురు. ఇంక నేమానవునివైపునకు దృష్టి మరల్చిన నాతఁడు మూర్ఖుఁడు గాని పండితుఁడు గాని చక్రవర్తి గాని దీనదరిద్రుఁడు గాని యమృతునిపుత్రుఁ డనియే గ్రహింతురు.

ఏదినమున భారతవర్షతపోవనమునం దాయనంతునివార్త ప్రతిధ్వనించెనో యాదినమున భారతవర్షము తను నమృతధామముగా గ్రహించెను. ఆదిన మామె యమర సంతానసభయం దమృతమంత్రము నుచ్చరించెను. ఆదిన మామె యిట్లు చెప్పియుండెను.

" యస్తు సర్వాణి భూతాని ఆత్మన్యే వానుపశ్యతి
సర్వభూతేషు చాత్మానం తతో న విజుగుప్సతే."

ఎవరు సర్వభూతములను బరమాత్మయందును బరమాత్మను సర్వభూతములయందును గాంతురో యట్టివా రింకెవ్వరిని నసహ్యించుకొనరు.

భారతవర్ష మిట్లు చెప్పినది:—

" తే సర్వగం సర్వతః ప్రాప్య ధీరా
యుక్తాత్మానః సర్వమేవావిశన్తి."

సర్వవ్యాపి యగువానిని సర్వత్ర పొంది యాయనతో యోగయుక్తులయినధీరులు సర్వమునందును బ్రవేశింతురు.

ఆదినము భారతవర్షము నిఖిలలోకములమధ్యమున నిలఁబడియుండెను. జలస్థలాకాశములను బరిపూర్ణములై యున్నట్లు గాంచెను. ఊర్ధ్వపూర్ణ మధఃపూర్ణముగాఁ జూడఁగలిగెను. ఆదినము సమస్తాంధకారము నామెయొద్ద నుద్ఘాటిత మాయెను. "వేదాహమేతమ్" నేను తెలిసికొంటిని; నేను పొందితి నని యామె చెప్పియుండెను.

ఆదినమే భారతవర్షమున కుత్సవదినమై యుండెను. ఏల యనఁగా నాదినమే భారతవర్షము తనయమృతయజ్ఞమునందు సకలమానవుల నమృతపుత్రు లని యాహ్వానించియుండెను. ఆమె కసహ్యము లేదు. అహంకారమును లేదు. ఆమె పరమాత్మయోగమున నందఱియందును నన్నిటను బ్రవేశించి యుండెను. ఆదినమామె యాహ్వానమంత్రము లోకమునం దెచ్చటను సంకుచితమై

యుండలేదు. ఆమె బ్రహ్మమంత్రము విశ్వసంగీతముతో నేకతాళమున మేళవించుకొని యనంతకాలములోనఁ బ్రతిధ్వనించుచుండెను. అదియే యామె కుత్సవదినమై యుండెను.

అనంతర మపరాధ మెచ్చటినుండి ప్రవేశించెనో విధాతకే యెఱుక. విశ్వద్వారములు నలువైపులనుండి బంధింపఁబడఁజొచ్చెను. ఆఱిపోయినదీపమువలె భారతవర్షము తనయందే తా నవరుద్ధమై యుండెను. ప్రబలస్రోతస్విని క్షీణించుచున్నపుడు చూచుచుండఁగనే మాటిమాటికి నిసుకతిన్నెలు బయటఁ బడుచుండును. సముద్రగామిని యగుప్రవాహమున కాటంకములు కలిగించుచుండును. దానిని జిన్నచిన్న జలాశయములుగా విభజించుచుండును. ఏప్రవాహము దూరదూరదేశములకు నైతము ప్రాణదాయినియై యుండెనో దేశదేశాంతరములకు సంపదలను గొనివచ్చెడిదో. యేవిరామవిహీనప్రవాహముయొక్క కలకలధ్వని జగత్సంగీతముయొక్క తంబూరవలెఁ బర్వతశిఖరములనుండి మహాసముద్రమువఱకు నిరంతరము మ్రోఁగెడిదో యావిశ్వకల్యాణప్రవాహమును ఖండఖండములుగఁ జేసి యొక్కొకక్షుద్రగ్రామమునకుఁ జెందిన వస్తువుగాఁ జేయును! ఆఖండములు తమపూర్వపు నైక్యతను మఱచి విశ్వనృత్యము నం దింకఁ బాల్గొనవు. విశ్వగానసభయందింక స్థానమును బొందవు. అట్లే నిఖిలమానవులకుఁ గల భారతవర్షసంబంధముయొక్క పుణ్యప్రవాహములు సహస్రసాంప్రదాయికనైకతములుగా ఖండితమయి ధారాహీనమై పోయెను.

ఇంక నావిశ్వవాణి యేది ? అవిశ్వవాహిని యేది ? ఆవిశ్వ

ప్రాణతరంగడోలిక లేవి? నిలకడఁ జెందిననీళ్ళు స్వల్ప మగునఖ చిచేఁ గలుషిత మగు నని భయపడుచుండును. స్నానపానముల నిషేధములచేతఁ దనకు నలు వైపుల నావరణముల నేర్పఱచుకొనును. అట్లే నేఁడు భారతవర్షము కాలుష్యశంకచే బాహ్యామం దున్న బృహత్సంబంధమును సర్వవిధముల దూరముగ నుంచుటకు నిషేధము లనుగోడల నెత్తి సూర్యాలోకమును గాలినిఁ దిరస్కరించుచున్నవి. కేవలాటంకములు, భాగవిభాగములు; విశ్వవాసులు గురువుకడఁ గూర్చొని దీక్ష స్వీకరించుటకుఁ దగినమంత్ర మేది? ఆయవారితమందిర మేది? ఒకప్పుడు నలు వైపులఁ బ్రతిధ్వనించిన యాయాహ్వానవాణి యేది?

"యథాపః ప్రవతాయన్తి, యథా మాసా అహర్జరమ్,
ఏవం మాం బ్రహ్మచారిణో ధాతరాయన్తు సర్వతః స్వాహా"

నీ రేవిధమున స్వాభావికముగా నిమ్నదేశమునకే ప్రవహించునో మాసము లెట్లు సంవత్సరముల వైపునకుఁ బరుగిడునో యట్లే సకలదిక్కులనుండియు బ్రహ్మచారు లందఱును నాయొద్దకే వత్తురుగాక! స్వాహా! కాని నేఁ డాస్వాభావికమార్గము బంధింపఁ బడినది. ధర్మము జ్ఞానము సంఘము వానిసింహద్వారమును బంధించివేసినవి. కేవల మంతఃపురమునకు రాకపోకలకై దొడ్డిగుమ్మము వాడఁబడుచున్నది!

సత్యసంపదకు దారిద్ర్య మాపాదించినది. ఇట్టి దుఃస్థితి సంభవించెడిది గాదు. "వేదాహ మేతం" నేను తెలిసికొంటి నని చెప్పఁగలిగినవారు బయటికి రావలసినదే. "శృణ్వన్తు విశ్వే అమృతస్య పుత్రాః" యని చెప్పవలసినదే.

ఈవిధముగా దైన్యావస్థయొక్క నిబిడాంధకారమునందు సకలద్వారవాతాయనములను బంధించుకొని నిద్రించుచున్నపు డొకప్రాభాతికవిహంగకంఠమునుండి మనబద్ధగృహమున కొకవిశ్వ నిత్యసంగీతస్వర మేతెంచినది.

ఆస్వరముతో లోకలోకాంతరములయు, యుగయుగాంతర ములయు, స్వరములను మేళవించినవి. ఏస్వరమువలన నీలోకము నందలి సమ్మిరోను ధూళితోను సూర్యతారకలాత్మీ యానందము తో ఝంకృతమాయెనో యాస్వర మొకపుడు వినఁబడినది.

"వేదాహ మేతం"—నే నాయనను దెలిసికొంటి నని మరల నెవరో యన్నటు లున్నది! ఎవరిని దెలిసికొంటిని? 'ఆదిత్యవర్ణం' జ్యోతిర్మయుని దెలిసికొంటిని—ఆతని నెవరు దాఁచియుంచలేరు. జ్యోతిర్మయుఁడా? ఏఁడి? ఆతఁడు నాగృహోపకరణములలోఁ గాన్పించుట లేదే! లేదు—నీయంధకారముచే నాతనిని నీయింటి యందు దాఁచి యుంచలేదు—తమసః పరస్తాత్—నీసమస్తబ ద్ధాంధకారమున కావలిగట్టునుండి యాయనను జూచుచున్నాను.

నీవు దేనిని నీసంప్రదాయమునందు బంధించి యుంచితివో, యచ్చట నెవ్వరైనఁ బ్రవేశింతురేమో యని మందిరద్వారమును బంధించి యుంచితివో యది యంధకారము— మానవు లందఱు నచ్చటినుండి తిరిగిపోవుచున్నారు. సూర్యచంద్రు లచ్చటఁ దొంగి యైనఁ జూడరు. అచ్చట జ్ఞానమునకు బదులు శాస్త్రవాక్కులు, భక్తికి బదులు పూజాపద్ధతి కర్మములకు బదు లభ్యస్తాచారములు, నచ్చటిద్వారమునం దొకభయంకర మగు "లేదు" కూర్చొనియున్న

ది. అది నుడువుచున్నది. కాదు, కాదు ఇచ్చట కాదు. దూరముగ వెళ్ళు. దూరముగ పో! అని పలుకుచున్నది. మంత్రములు లోప లికిఁ జొరకుండఁ జెవులు మూసికొమ్ము. స్పర్శము తగులకుండ దూరముగఁ గూర్చొనుము. నీదృష్టిపడకుండ ద్వారమును మూయు ము. ఇన్ని "కాదు, లేదు"లచేత దేనిని నీవు దాఁచియుంచితివో నే నాయంధకారవిషయమై చెప్పుటలేదు. కాని—వేదాహ మేతం—నిఖిలమునకుఁ జెందినవానిని నేను తెలిసికొనియుంటిని. ఆతనిని తెలిసికొన్నయెడల నింక నెవ్వరిని నాటంకపఱుపలేము. ఎవ్వరిని నసహ్యించుకొనఁజాలము. ఎవ్వనిని దెలిసికొన్నయెడల నిమ్నస్థా నము నీటిని స్వాభావికముగా నాహ్వానించునటుల సంవత్సరము మాసముల నన్నిటిని స్వాభావికముగ నాహ్వానించునటుల స్వాభా వికముగ నందఱ నాహ్వానించుట కధికారము గలుగునో అట్టివానిని దెలిసికొంటిని.

ఇంటివారంద ఱాగ్రహపడి గర్జించి యిట్లు చెప్పిరి:—తరిమివేయుము; తరిమివేయుము. యీతనిని బయటికిఁ దరిమివే యుము—ఇది నాయింటిసామగ్రి కాదే! ఇది నాపద్ధతి ననుసరిం చుట లేదే!

కాదు; ఇది నీయింటిసామగ్రి కాదు. ఇది నీపద్ధతుల నొప్పు కొనునది కాదు. కాని నీవు చేయఁజాలవు—ఆకాశముయొక్క—యాలోకమును నీదేహబలములతో నెట్టివేయఁజాలవు—దానితో విరోధపడెద మన్నను దానిని మన్నింపవలసినదే. ప్రభాత మేతెం చినది.

ప్రభాత మేతెంచినది. మనయుత్సవ మీమాటనే చెప్పుచు న్నది. మన యీయుత్సవము గృహమునకుఁ జెందినయుత్సవము గాదు. బాహ్యసమాజోత్సవము గాదు. మానవునిచిత్తగగనము నం దేప్రభాతోదయ మగుచున్నదో యాసుమహత్ప్రభాతోత్సవమే యిది.

బహుయుగములకుఁ బూర్వమే యీప్రభాతోత్సవముయొ క్క పవిత్రగంభీరమంత్ర మీభారతవర్షతపోవనమునుండి ప్రతిధ్వ నించినది. "ఏకమేవా ద్వితీయమ్" అద్వితీయుఁ డొక్కఁడే! జగత్తునందీ పూర్వదిగంతమున మరల నేజాగ్రన్మహాపురుషుఁడో యంధకారరాత్రి కావలిగట్టునుండి యామంత్రమును మోసికొని వచ్చి స్తబ్ధాకాశమునం దొకస్పందనము సంచరింపఁజేసెను. "ఏక మే వాద్వితీయం!" అద్వితీయుఁ డొక్కఁడే!

ఈప్రాభాతికమంత్ర ముదయశిఖరమున నిలఁబడి "ఒక్కఁ డే యయినసూర్యుఁ డుదయించుచున్నాఁడు. ఈసారి చిన్నచిన్న వగునసంఖ్యదీపముల నార్పివేయు"మని మనకుఁ దెలియఁజేసెను. ఈమంత్ర మొక్కగృహమునకుఁ జెందినమంత్రము కాదు. ఈప్ర భాత మొక్కదేశమునకుఁ జెందినప్రభాతము కాదు. ఓ పాశ్చాత్య దేశమా! నీవును వినుము— నీవును మేల్కొమ్ము. శృణ్వన్తు విశ్వే— ఓ విశ్వవాసులారా! యందఱును వినుఁడు; ప్రాచ్యగ గనప్రాంతమునం దొకసందేశము చాటఁబడినది — వేదాహ మేతం— నేను తెలిసికొన్నాను—తమసః పరస్తాత్—అంధకార మున కావలిపారమునం దున్నదానిని నేను గ్రహించితిని. నిశావ

సానపుటాకాశ ముచయోఃమ్మధాదిత్యునియానస్నావిర్భావమును గ్ర హించినటుల "వేదాహమేతం పురుషం మహాన్తం ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్." అని గ్రహించితిని.

ఈనూతనయుగమునందు విశ్వమానవులచిత్తమునం దుద యించుచున్ననవప్రభాతసందేశము నేఁటికి నూటనాల్గువత్సరములకు పూర్వము వంగదేశమునం దావిర్భవించెను. అప్పుడు లోకములో దేశమునకు దేశమునకు విరోధములు, ధర్మమునకు ధర్మమునకు సంగ్రామములు; అపుడు శాస్త్రవాక్యములయొక్కయు, బాహ్యా చారములయొక్కయు రాజు లోహసింహాసనముపై విభక్తుఁడై యుండెను. అభేదబుద్ధి యొక్క ప్రాచీరపద్ధాంధకారమునందు రామమోహనరాయ లద్వితీయబ్రహ్మయొక్క యాదివ్యతేజమును బట్టుకొనెను. హిందువులును మహమ్మదీయులును క్రైస్తవులు నొకటిగా సమావేశమయిన యీభారతదేశమునందే చాల యుగ ములకుఁ బూర్వమే యీవివిధాతిథులు నొక్కచోటఁ గూర్చొనుట కేర్పాటులు గావింపఁబడినటు లాయన యపుడు గ్రహించెను. మానవసభ్యత దేశదేశములకు నవనవశాఖోపశాఖలఁ బ్రసరింపఁ జేయుచున్నపు డీభారతవర్షము ఒక్కఁడు, ఒక్కఁడు, ఒక్కఁడు అనుమంత్రమును జపించుచుండెను. "ఇహచేత్ అవేదీత్ అథసత్య మస్తి" ఈఒక్కనినే మానవుఁడుగ్రహించినయెడల నతఁడు సత్యమ గును—నచేత్ ఇహఅవేదీత్‌మహతీ వినష్టిః—ఈఒక్కనినే గ్రహింప కున్నచో మహావినాశము సంభవించును. ఇంతవఱకు లోకమునం దావిర్భవించినయసత్య మంతయు నీయొక్కనిని గ్రహింపకపోవు

టచేతనే కలిగియుండెను. మానవులకు సంభవించిన క్షుద్రత్వము, నిష్ఫలత్వము, దుర్బలత్వము లన్నియు నీయొక్కనినుండి విచ్యుతము లగుటవలననే, మహాపురుషు లందఱు నీయొక్కనిని ప్రచారము చేయుటకే యావిర్భవించిరి. మహావిప్లవము లన్నియు నాయొక్కనిని సముద్ధరించుటకే సంఘటిల్లినవి.

ఘోరతరవిభాగవిరోధసంక్షోభములు జరుగుదుర్దినములలో నీదేశమునం దప్రత్యాశితముగా నభావనీయరూపముగా విశ్వవ్యాప్తమగు "ఏకమేవాద్వితీయమ్" అను నీయొక్కనిమంత్రము ద్విధావిహీనముగా సుస్పష్టస్వరముతో నుచ్చారిత మాయెను. అపుడు సమస్త మానవచిత్తమునందును నొకనిగూఢమగు మేల్కొల్పు యొక్క యాందోళనము సంచారిత మాయెను.

మనదేశమునందు నేఁడు విరాణ్మానవుని యాగమనము జరిగినది, ఇచ్చట మనకు రాజ్యము లేదు, వాణిజ్యము లేదు, గౌరవము లేదు, లోకములో నందఱియెదుటను మనము తలవంచుకొనియున్నాము. మన యీదరిద్రగృహమందలియవమానితశూన్యత్వమునుండి విరాణ్మానవుని యభ్యుదయ మయినది. ఆయన నేఁడు మనయొద్ద పన్ను వసూలు చేయుట కేతెంచినాఁడు. సకల మానవులశాశ్వత మగుపశ్చైరములో నలంకరించుటకు మన కిచ్చట రాజదుర్లభ మగునర్ఘ్యము దొరకినది, లేనిచో మనముకూడ నిర్భాగ్యులమే యై యుండెడివారము. మనయీనైవేద్యసమర్పణ ఘటమునందుఁ గాదు, ఇంటిప్రాంగణమందుఁ గాదు, గ్రామమంటపమందుఁ గాదు, ఈసమర్పణ విశ్వప్రాంగణమం దిచ్చటనే యా

యన పొందవలసియున్నది. స్వీకరించుమని విశ్వమానవుఁడు తన దూతను బంపియున్నాఁడు; ఆతఁడు మనకు "ఏకమేవా ద్వితీయమ్" అను మంత్రమును బ్రసాదించి వెళ్లెను. సకల వైచిత్ర్యములలో సకల విరోధములలో నాయొక్కనినే స్మరించుకొను మని మనకు బోధించెను.

ఆమంత్ర ముపదేశింపఁబడిననాఁటినుండియు మన కింక నిద్రలేదు. "ఒక్కఁడు" మనలను స్పృశించినాఁడు. మన మింక స్థిరముగా నుండలేకున్నారము. నేఁడు మనము గృహము వీడి గ్రామమును వీడి విశ్వపథమునఁ బధికుల మగుట కాతురతఁ జెందుచున్నారము. ఈపథమునకుఁ బాథేయ మున్న దని తెలియ లేదు. ఇపు డేలోటు లేనటులు తోఁచుచున్నది. గృహమం దేమి బాహ్యప్రపంచమం దేమి యనైక్యతతో భిన్నవిభిన్ను లైనవారే యందఱికన్న ముందుగా "ఒక్కని"ని బ్రచారము చేయుట కాజ్ఞ నొందినారు, ఒకచో టాధార మున్న దని గ్రహించుటచేతనే యిట్టియాజ్ఞ వచ్చినది.

అప్పటినుండియు రాకపోకలు జరుగుచున్నవి; ఒకరితరు వాత నొకరు దూతలు వచ్చుచున్నారు. ఈదేశమునం దొకమహా సందేశము తయారగుచున్నది. అది ప్రాచ్యప్రతీచ్యముల నొక్క దివ్యధామమున కాహ్వానము చేయును, అది యొక్కని యాలోక ముచే నమృతపుత్రుల నందఱ నమృతస్వరూపునిపరిచయముతో నింపివేయును. రామమోహనరాయ లుద్భవించినతర్వాత మన మెఱుఁగకయే మనయాలోచనములు కర్మములు నొకచిరంతనుని

సమ్ముఖమున కరుదెంచుచున్నవి. మన మొకస్థానమున నిత్య స్వరూపుని బొందుదుము, ప్రకటింతుము, అను నీగభీరప్రేరణ మనయంతరమునందుఁ దరంగములపోటువలెఁ బొంగి పొరలు చున్నది. సమాజముతోసమాజము, విజ్ఞానముతో విజ్ఞానము, ధర్మ ముతో ధర్మము నొక్క మహాతీర్థక్షేత్రమున నొక్కసాగరసంగ మమునఁ బుణ్యస్నానము చేయఁగల వసురహస్యమును మనము కనుగొనవచ్చు నని యనుభవపూర్వకముగా గ్రహించుచున్నాము. ఆపని లోలోపల నారంభ మయినది; మనదేశమునందు లోకమున కంతట కనుకూల మయినప్రాచీనగురుకుల ముండెను. ఆగురు కులద్వారము మరల నిపుడే తెరువఁబడునని తోఁచుచున్నది. కారణ మేమనఁగా నిదివఱకు సంపూర్ణముగా నిస్తబ్ధతను దాల్చి యున్న స్థానమునుండి మరలఁ గంఠధ్వని ప్రతిధ్వనించుచున్నది. కిటికీ యొద్ద కపుడపు డొక్కొకరు వచ్చి నిలఁబడుచున్నటులఁ జూచు చున్నాము. వారల ముఖకమలములఁ జూచినంతనే వారలు ముక్త లోకమునకుఁ జెందినమానవు లనియు వారలు నిఖిలమానవుల కాత్మీయు లనియుఁ దెలియవచ్చుచున్నది; లోకమునం దేయేకాల ములలో నేయేమహాపురుషులు భిన్నభిన్నదేశములందు జన్మిం చిరో యట్టియాజ్ఞవల్క్యుఁ డేమి విశ్వామిత్రుఁ డేమి బుద్ధుఁ డేమి యేసుక్రీస్తేమి మహమ్మ దేమి యందఱును బ్రహ్మకుఁ జెందినవారే యని వారు గ్రహించిరి; వారు మృతవాక్యముల మృ తాచారముల గోరీలకుఁ బ్రాచీరముల నెత్తి వసింపఁజాలరు. వారల వాక్యములు ప్రతిధ్వనులు కావు; కార్యము లనుకరణములు గావు;

వారలగతు లనువృత్తములు గావు; వారలు మానవాత్మలమాహా త్మ్యసంగీతము నిపుడే విశ్వజనుల రాజమార్గమున ధ్వనింపఁ జేయుదురు. ఆమహాసంగీతముయొక్క మూలసూత్రమును మనగు రువుగారు మన కందియిచ్చిరి—"ఏకమేవాద్వియమ్" సకల విచి త్రలయతాళములు "ఏకమేవాద్వితయమ్" అనుమంత్రస్వరమునందే తిరిగి తిరిగి కలియుచుండును.

మన మింక దాఁగియుండుట కవకాశము లేదు, మన మీ సారి బయలుపడవలయును. విశ్వవిధాతనుండి పరిచయపత్రమును బొంది సకల మానవులయొద్దకుఁ జని నిలఁబడవలయును. ఆపరి చయపత్రము నాయన తనదూతద్వారా మన కంపియుండెను. మన పరిచయ మెట్టిది ? ఈశ్వరుఁడు విశేషస్థానమునందు విశేషస్వర్గ మునందుఁ బ్రతిష్ఠితుఁడై యున్నాఁ డని చెప్పనట్టివారలదే మన పరిచయము, "ఏకో వశీ సర్వభూతాంతరాత్మా" ఆయొక్కప్రభువే సర్వభూతాంతరాత్మ యనువారలమే మనము; బాహ్యప్రక్రియలచే నీశ్వరునిఁ దెలియనగు నని గాని లేక నేదో యొకవిశేషశాస్త్రమం దీశ్వరజ్ఞానము విశేషవ్యక్తులకై స్థాపిత మయి యున్న దని నుడు వువారలము మనము గాము; "హృదా మనీషా మనసాభిక్లుప్తః" హృదయస్థసంశయరహితజ్ఞానమువలననే యాయనను గ్రహింప నగు నని మన మందుము. ఈశ్వరుఁ డేదో యొకవిశేషజాతికి విశేషముగ లభ్య మగువాఁ డని మనము నుడువనివారము; ఆయన యవర్ణుఁ డనియు "వర్ణానసేకాన్నిహితార్థోదధాతి" సర్వవర్ణముల వారికి వలయువస్తువుల నొసంగుచుండు ననియు నేవర్ణమువారిని

పంచితులనుగాఁ జేయఁడనియు మనము నుడువుదుము. ఒక్కఁడు ఒక్కఁడు అద్వితీయుఁడు ఒక్కఁడు అను నీవాణి నుద్ఘోషింప భారము వహించినవారము మనము. అట్లయిన మన మిఁక స్థానిక ధర్మములకుఁ దల లొగ్గి తాత్కాలికలోకాచారములచేఁ జుట్టఁబడి యెట్లుండఁగలము ? మన మాయేకేశ్వరునితేజస్సు నూతగాఁ గొని దానితో నేక మయి ప్రకాశింతము. మనయుత్సవ మాప్రకాశము నకుఁ జెందినయుత్సవము. యనంతవిశ్వమునందుఁ బ్రకాశించు నుత్సవము అను నీవిషయమును మనమునం దుంచుకొనవల యును. ఈయుత్సవమునం దొకమహాసుదినాభ్యుదయపుసూచనను బ్రభాతపుఁబ్రథమరశ్మి ప్రకటితము చేసినది,

ఆమహాదినము వచ్చినది, కాని ఆయన యింకను రాలేదు. భవిష్యత్తునం దాయనమూర్తినిఁ జూచుచున్నాము. ఆయనయందు విరాజిల్లుసత్యము మనమే సంపూర్ణముగాఁ బొంది మనసంఘము యొక్క యినుపపెట్టెలో దాచి యుంచునట్టిసత్యము గాదు, మన మెంపిల కీయుత్సవము నేఁటి జేయుచున్నారమో యింకను సం పూర్ణముగా గ్రహింపలేకున్నారము, మన మొకప్పుడు బ్రాహ్మ సమాజమును స్థాపించియుండుటచే బ్రాహ్మలమైనమన మీయుత్స వమును జరుపుచున్నార మని తలంచుచున్నారము. కాని యీవి షయ మంత క్షుద్ర మయినది గాదు. "ఏష దేవో విశ్వకర్మా మ హాత్మా జనానాం హృదయే సన్నివిష్టః" ఈమహాత్మ యీవిశ్వ కర్మ యను దేవత సర్వదా సకలజనహృదయాంతరాళవర్తియై యు న్నాఁడు, ఆయనయే యీనవయుగమున లోకమున ధర్మసమన్వ

యముయొక్కయు జాతిసమన్వయముయొక్కయు నాహ్వానము నీభారతదేశమునకుఁ బంపుచున్నాఁడు;అందుచేతనే మనముధన్యుల మని తలంచుచున్నాము. ఈయాశ్చర్యైతిహాసికానందమును మన మీమహోత్సవమునందు మేల్కొల్పుచున్నాము. ఈమహాసత్యమువలననేమనమీనాఁ డుద్బోధితులముగావలయును. విధాతయొక్కయీమహత్కృపయందుఁ గలగంభీరబాధ్యతను మన మీనాఁడు స్వీకరింపవలయును. బుద్ధినిప్రశస్తము గావింపుఁడి.హృదయమును బ్రసారిత మొనర్పుఁడి, మిమ్ము దరిద్రులనుగ నెంచకుఁడి, మీరు దుర్బలులని నమ్మకుఁడి—తపస్సునందుఁ బ్రవృత్తులు గండు, దుఃఖమును వరింపుఁడి, క్షుద్రసంఘమున సంతసము ననుభవించుటకు జ్ఞానమును మృతప్రాయముగను గర్మములను యంత్రములవలెను నొనర్పకుఁడి—సత్యము నున్నతపఱుపుఁడి, బ్రహ్మానందముతోఁ జీవితమును బరిపూర్ణము గావించి యభయప్రతిష్ఠ నందుకొనుఁడి.

ఓ జనగణహృదయాసనసన్నివిష్టవిశ్వకర్మా! ఆత్మావిశ్వాసపుటాశాహీనాంధకారమునుండియు జీవనయాత్రయందు నాస్తికత్వముయొక్క దారుణకర్తృత్వమునుండియు మమ్ముల నుద్ధరింపుము; మమ్ములను సచేతనులనుగాఁ జేయుము, నీయభిప్రాయానుసారముగా మేము నడచుకొనుచున్నార మనుమహత్త్వమును గ్రహింపఁజేయుము; జగత్తునందు నవయుగసింహద్వారము నుద్ఘాటన మొనర్చుటకే మేము యాత్ర సల్పుచున్నారము, ఆమార్గపు లక్ష్యమును మూఢత్వముచే మఱచి మార్గమందే మేమాఁగిపోవకుందుముగాక! లోకమునందు నీవిచిత్రానందరూపములో నొకయుప

రూపరూపమునకు నమస్కరించుచున్నారము. నానాదేశములలో నానాకాలములలో నీనానావిధానములలో నీలోకశాశ్వతవిధానమును మేము శిరసావహించి స్వీకరింతుముగాక, భయము దూర మగుఁగాక, అశ్రద్ధ దూర మగుఁగాక, అహంకారము దూరమగుఁగాక, నీవలననుండి యేదియు విచ్ఛిన్నము కాలేదు. సమస్తము నీయమోఘశక్తివలననే విధృత మయి యున్నది. ఏకమంగళసంకల్పముల విశ్వవ్యాప్తాకర్షణవలన నడుపఁబడుచున్నది, యను నీవిషయము నిస్సందేహముగా గ్రహించి సర్వత్ర భక్తినే ప్రసరింపఁజేసి నతమస్తకములతో యుక్తహస్తములతో నీయానిగూఢసంకల్పమును జూతుముగాక ! నీయాసంకల్ప మొకదేశమందు బంధింపఁబడినది గాదు, ఒకదేశముచేత ఖండింపఁబడినది కాదు. పండితులు దానిని తమయింటియందు నిర్మింపఁజాలరు.ఏమానవుఁడును దానిని కృత్రిమనియమములచే బంధించియుంపఁజాలఁడు, ఈవిషయము స్థిరముగా గ్రహించి ఆమహాసంకల్పముతో మన సకల సంకల్పములను స్వేచ్ఛతో సమ్మిశితము గావించి నీరాజధానీరాజమార్గమందు యాత్ర సల్పుదుముగాక ! ఆశాలోకముచే మాహృదయాకాశము ప్లావన మగుఁగాక! ఆనందంపరమానందం అని హృదయము నుడువుఁగాక! మనయీదేశము తనవేదికపై మఱొకసారి నిలఁబడి మానవసమాజముయొక్క భేదవిభేదములను దాఁటి యీవాణినే ప్రచారిత మొనర్చుఁగాక !

శృణ్వన్తు విశ్వే అమృతస్యపుత్రా
ఆయే దివ్యధామాని తస్థుః।

వేదాహ మేతం పురుషం మహాన్తమ్
ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్
ఓమ్ ఏక మే వాద్వితీయమ్.

---

# విశ్వబోధము. 7

ప్రతిజాతియుఁ దనసభ్యతాద్వారమునఁ దనశ్రేష్ఠమానవుని బొందఁగోరుచున్నది. చెట్లు తమయొక్క వ్రేళ్ళనుండి కొమ్మల వఱకు నుత్కృష్ట మగుబీజముల నుత్పన్నము చేయుటకే సర్వ ప్రయత్నములు గావించుచుండును. అనఁగాఁ దనశక్తి కెంతపరిణతి కలుగఁగలదో దానిబీజమం దది యావిర్భవించుఁగాక యని కోరుచుండును. అట్లే మానవసంఘముగూడఁ దనమానవునిశక్తి యొక్క సంపూర్ణపరిణతిని బ్రత్యక్షముగా నెవనియందుఁ గాంచఁ గలదో యట్టి మానవునే గోరుచుండును.

ఈశక్తియొక్క చరమపరిణతి యెట్టిదో సర్వశ్రేష్ఠమానవుఁ డనఁగా నెట్టివాఁడో యనువిషయమును గుఱించినకల్పనలు ప్రతి జాతియొక్క విశేషసామర్థ్యము ననుసరించి యుజ్జ్వలముగను లేక అపరిస్ఫుటముగను నుండును. కొందఱు బాహుబలమును గొందఱు బుద్ధిచాతుర్యమును మఱికొందఱు చరిత్రనీతిని మానవునిశ్రేష్ఠత్వమునకు ముఖ్యోపాదానములుగా లెక్కించిరి. ఆధిక్యున కగ్రి

సరులగుటకే తమసమస్తశిక్షాదీక్షలను శాస్త్రశాసనములను వినియోగించిరి.

భారతవర్షముగూడ నొకప్పుడు మానవునిపూర్ణశక్తిని గ్రహించుటకే సాధనఁ జేసియుండెను. భారతదేశము తనయందుఁ దనశ్రేష్ఠమానవుని ప్రతిబింబము గాంచఁ గలిగెను. అది కేవలము తన మనస్సునందేనా? బయటికి మానవుని యాదర్శములు గాన్పించకున్నచో మనస్సునం దది ప్రతిష్ఠిత మయి యుండఁజాలదు.

భారతదేశము తనసుగుణులు జ్ఞానులు శూరులు వీరులు రాజులు మహారాజులు మున్నగువారిలో నరశ్రేష్ఠులనుగా నెవరిని వరించెను ?

సంప్రాప్యైనం ఋషయో జ్ఞానతృప్తాః
కృతాత్మానో వీతరాగాః ప్రశాన్తాః
తే సర్వగం సర్వతః ప్రాప్య ధీరా
యుక్తాత్మానః సర్వమేవావిశన్తి.

వారు ఋషులు. ఆఋషు లెట్టివారు ? పరమాత్మను జ్ఞానము నందుఁబొంది తృప్తులయినవారు, ఆత్మలంపు మిళిత మయియున్న వానినిగాఁ గాంచి కృతాత్ము లయినవారు. హృదయమునం దుపలబ్ధిని బొంది వీతరాగు లయినవారు. సంసారకర్మక్షేత్రములందు దర్శనముఁ బొంది ప్రశాంతు లయినవారు. పరమాత్మను సర్వత్ర బొంది యంచటితో యుక్త మయి, యంచటిలోఁ బ్రవేశించినధీరులే యట్టి ఋషీశ్వరులు.

భారతదేశము తనసమస్తసాధనవలన నిట్టి ఋషులనే గౌర

యుండెను. ఈఋషులు ధనికులు గాక ధీరులును యుక్తాత్ములు నయి యున్నారు.

పరమాత్మయోగమున నందఱితో యోగము నుపలబ్ధిఁజేసి యందఱియందును బ్రవేశించుటయే భారతదేశము మనుష్యత్వము యొక్క చరమసార్థకతగా నెంచినటుల దీనివలన గ్రహింపనగును. ధనికులయి ప్రబలులయి తమస్వాతంత్ర్యమునే నలువైపుల నన్నిటికంటె నున్నతస్థానమందు నిలువఁబెట్టుటయే భారతదేశ మన్నిటికంటె గౌరవమయినవిషయముగాఁ దలఁచియుండలేదు.

మానవుఁడు వినాశము చేయఁగలఁడు, లాగి తీసికొనఁగలఁడు, ఆర్జింపఁ గలఁడు, కూడఁబెట్టఁ గలఁడు, క్రొత్తవిషయములను గనిపట్టఁ గలఁడు, కాని మానవుఁ డందుచే గొప్పవాఁడు కాఁజాలఁడు. ఆతఁ డందఱిని దనవారినిగాఁ జేసికొనఁగలుగుట యందే మానవునిమహత్త్వ మిమిడియున్నది; మానవుని జ్ఞానమన్ని స్థానములకుఁ బ్రసరింపఁజాలదు. ఆతనిశక్తి యన్నిచోట్లకుఁ బ్రాఁకఁజాలదు, కేవలము తనయాత్మాధికారమునకు హద్దు లేదు. మానవులలో శ్రేష్ఠు లయినవారు తమపరిపూర్ణజ్ఞానశక్తివలన నిట్లు నుడువఁగలిగిరి—చిన్నవారయినను బెద్దవారయినను నుచ్చస్థితియం దున్నవారును, శత్రువులయినవారును మిత్రులయినవారును నందఱును నావారు.

మానవశ్రేష్ఠులు సర్వవ్యాపి యగుపరమాత్మకును దమయాత్మకును యోగము గుదిరినపు డందఱితో నేకమయి సమానముగా నొక్కచో నిలిచి యుందురు. మానవుఁ డితరుల నందఱిని ద్రోఁ

చిపై చి తా నొక్కఁడే పెద్దవాఁ డగుటకుఁ బ్రయత్నము జేసినపు డే పరమాత్మతో విచ్ఛేదము గలుగుచున్నది.

అందుచే జన్మసాఫల్యమును బొందినవారిని ధీరు లనియు యుక్తాత్మ లనియు నుపనిషత్తులు నుడివియున్నవి. అనఁగా నందఱితో నేకమయి యుండుటచేతనే శాంతస్వభావులు, నందఱితో నేకమయి యుండుటచేతనే యాపరమేశ్వరునితో వారి కెట్టి విచ్ఛేదమును లేదు. అట్టి వారే యుక్తాత్మలు,

క్రీస్తుయొక్క యుపదేశములందుఁగూడ నీవిషయమే యంతర్నిహితమయి యున్నది. సూదిబెజ్జమునుండి యొంటె ప్రవేశింపఁజాలనటుల ధనికునిపక్షమున ముక్తిని బొందుటకూడ నశ్లే దుస్సాధమయినది,

అనఁగా మనలోఁ గూడఁబెట్టుధనమువలనఁగాని యశస్సువలనఁ గాని మనము స్వతంత్రులము గావచ్చును. దానివలన మనకందఱితోఁ గలయోగము భ్రష్ట మగును. దాని నెక్కువగా నాశ్రయింపఁబోయి యందఱిని దూరము చేయుదుము. సంచయము పెరిఁగినకొలఁది యందఱికంటె మనము స్వతంత్రుల మని గర్వింపవచ్చును. ఆగర్వముచే నీస్వాతంత్ర్యము నభివృద్ధిజేసికొని నడువ నిచ్ఛ గలుగును, దీని కింక నంతముండదు, ఇంకను గొప్పగా, నింకను నధికముగా, నింకను నెక్కువగాఁ గావలయునని కోరిక యుండును. ఈవిధముగ మానవుఁ డందఱితో యోగమును బోఁగొట్టుకొనుచుండును. తా నన్నిచోట్లఁ బ్రవేశించు నధికారము వినష్ట మగును. ఒంటె సూదిబెజ్జమునుండి దూఱిపోఁజాలనటు

లాతఁడుకూడఁ గేవలము స్థాయిఁడయి నిఖిలమునం దేమార్గమునం దును బట్టఁజాలనివాఁడయి తనగొప్పతనమునందే బంధింపఁబడి యుండును. ప్రశస్తతమస్థానమందుండి జగత్తునందుఁ జిన్నపెద్ద లందఱికిని సమానుఁడయి యుండునట్టి యాముక్తస్వరూపు నాతఁ డెట్లు బొందఁగలఁడు.

అందుచేతనే యాతనిని బొందవలయు నన్నచో నందఱినిఁ దనవారినిగఁ బొందినపుడే సాధ్య మగు నని మనదేశమం దీగొప్ప విషయము చెప్పఁబడినది. సమస్తమును త్యజించుటయే యాతనిని బొందుమార్గము కాదు.

బ్రహ్మభావమునందుఁ బ్రవేశించుటయే బ్రహ్మవిహారము. బ్రహ్మయొక్క యాభావ మెట్టిది ? యశ్చాయమస్మిన్నాకాశే తేజో మయోఽమృతమయః పురుషః సర్వానుభూః— ఏతేజోమయుఁడు నమృతమయుఁడు నగుపురుషుఁడు సర్వానుభూతుఁడై యున్నాఁ డో యాతఁడే బ్రహ్మ. సర్వానుభూతి యనఁగా సమస్తము నాతఁ డనుభవించుచున్నాఁ డనునదియే దానిభావము. ఆయన కేవలము సమస్తమునందు వ్యాప్తమై యుండుటయే గాక సమస్తము నాతని యనుభూతియం దున్నది. శిశువును దల్లి కౌఁగిలించుకొనునది తన శరీరముచేతను బాహువులచేతను గాక తనయనుభూతిచేతనై యు న్నది. సమస్తశరీరముచేతను మనస్సుచేతను మన మాయన యను భూతియందు మగ్నమైయున్నాము. ఆయన యనుభూతివలననే బహుయోజనదూరమునుండి సూర్యుఁ డీపృథివి నాకర్షించుచున్నాఁ డు. ఆయన యనుభూతిద్వారముననే ఆలోకతరంగములు లోకలో

రాంతరములకుఁ బొంగిపొరలుచున్నవి. ఆకాశమునం దెచ్చట నాయనకు విచ్ఛేదము లేదు. కాలమునం దెచ్చటను దానికి విరామము లేదు.

కేవల మాకాశమందే కాదు - యశ్చాయమస్మిన్నాత్మని తేజోమయోఽమృతమయః పురుషః సర్వానుభూః. ఈయాత్మయందును నాతఁడు సర్వానుభూతుఁడు. ఆకాశవ్యాప్త మగురాజ్యమం దాతఁడు సర్వానుభూతుఁడు. ఆత్మసమాప్తిరాజ్యమం దాతఁడు సర్వానుభూతుఁడు.

ఆసర్వానుభూతుని బొందఁగోరితి మేని యనుభూతితో ననుభూతిని మిళితము చేయవలెను. నిజమగు మానవునికిఁ గలిగిన యున్నతియంతయు నాఅనుభూతి విస్తరించుటవలననే మానవుని కావ్యములు దర్శనము విజ్ఞానము కళలు ధర్మము మొదలగున వన్నియు మానవుని యనుభూతిని బృహత్తరముగఁ జేయుచున్నవి. ఇట్లనుభూతుఁ డయ్యే మానవుఁడు గొప్పవాఁ డగుచున్నాఁడు. ప్రభువైగాదు. మానవుఁ డనుభూతుఁ డైనకొలఁది ప్రభుత్వము చేయునిచ్ఛ క్రమముగ నంతరించును. స్థానము నాక్రమించుకొనుటచే మానవుఁ డధికారమును బొందుట లేదు. బాహ్యావ్యవహారములందును మానవున కధికారము లేదు. మానవున కనుభూతి గలిగినంతవఱకే అంతవఱకే యాతని కధికారము గలుగుచున్నది.

ఈసమస్తమును బొందుటకును సమస్తమును ననుభవించుటకును గొంతమూల్యము నివ్వవలసియున్నది. మూల్యము నీయక

పొందలేము. అన్నిటికంటె గొప్పదానినిఁ బొందుటకు నీయవల సినమూల్య మేది ? తననే యివ్వవలసియుండును. తన నీయఁగ లిగినయెడల సమస్తమును బొందవనగును. తన కదియే గౌరవము. తనను ద్యాగము చేయఁగలిగినయెడల సమస్తమును బొందవనగును. ఇదియే దానిమూల్యము. అందుచే నుపనిషత్తులయం దిట్లు నుడువఁ బడి యున్నది—త్యక్తేన భుంజీథాః—త్యాగమువలననే పొందుము. అనుభవింపుము — మాగృధః—లోభింపకుము. బుద్ధదేవుఁ డుపదేశించినయుపదేశముకూడఁ గోరికను విసర్జింపుమనియే. ఫలాకాంక్షను వీడి నిరాసక్తుఁడవై పనిచేయు మని గీతయందుఁగూడఁ జెప్పఁబడియున్నది. ఈసకలోపదేశముల వలన యాతఁడు సత్యమగుచున్నాఁడు, భారతవర్షము జగత్తును మిథ్యయను కల్పనను గావించుకొనుచుండుటచే నిట్టియౌదాసీన్యభావము ప్రచారము చేయుచుండు నని యనేకు లనుకొనుచుందురు, కాని నిజ మది కాదు. ఎవరు తమను గొప్పగాఁ జేయనెంతురో ఆతఁ డందఱిని హీనముగఁ జేయును. ఎవనియందుఁ గోరిక యున్నదో యాతఁ డాకోరిక యందే బంధింపఁబడును, మిగిలినవారిపై నుదాసీనుఁ డగును. ఉదాసీనుఁ డగుటయే గాక నిర్దయుఁడుగూడ నగును. దీనికిఁ గారణ మేమనఁగా నేవ్యక్తి యన్నిటికంటెఁ దననే సత్యతమునిగా నెంచునోయట్టివానికిఁ బ్రభుత్వమునందు రుచియుండును. తనకున్న కోరికనే సత్యముగ నెంచి మిగిలినవిషయములను మాయగఁ దలంచువానికిఁ గోరికయం దెక్కువ రుచి యుండును. ఇట్టివారే యథార్థ మగుమాయావాదులు.

మానవుఁడు తన నెంత వ్యాపింపఁజేసికొనుచుండునో యా తనియహంకారము వాసనాబంధనము లంత తెగిపోవుచుండును. మానవుఁడు తన్నొంటరిగాఁ దలంపక తనతలిదండ్రులతో సోద రసోదరీమణులతో బాంధవులతో నేక మని గ్రహించునో యపు డాతఁడు సభ్యతయొక్క ప్రథమసోపానమున నడుగు వెట్టును. అపుడే యాతఁడు పెద్దవాఁడగుట కారంభించును. కాని యట్లు పెద్దవాఁడగుటవలన లాభ మేమి ? తనప్రవృత్తులను వాసనలను నహంకారము నణఁచుకొనఁగలుగుట. ఇట్లు జరుగకుండినయెడల కుటుంబమునం దాతని కాత్మోపలబ్ధి గలుగనేరదు. గృహమునం దందఱికొఱకు దనను త్యాగము చేయఁగలిగినపుడే యథార్థ మగు గృహస్థుఁ డగుచున్నాఁడు.

ఈవిధముగ గృహస్థుఁ డగుటకు సామాజికుఁ డగుటకు స్వదేశికుఁ డగుటకు మానవుఁడు బాల్యమునుండి యెంతయో సాధన చేయవలసి యున్నది. మానవునియేప్రవృత్తు లాతనిని గొప్పవా నినిగఁ జేసి యితరులను దృణీకరించునో వాని నణఁచి వేయవల యును. ఆతని యేహృదయవృత్తు లాతనిని అందఱితో మేళవిం పఁగోరుచుండునోవానినే యుత్సాహముచేతను జర్చచేతను బెంపొం దింపవలెను. కుటుంబజ్ఞానముకంటె, సమాజజ్ఞానమునందును స్వదేశజ్ఞానమునందును మానవుఁ డభివృద్ధిఁ జెందినకొలఁది యాతఁ డాత్మవిలోపమును గుఱించి సాధన చేయవలెను. అపు డా తనివిద్య కఠిన మగును. ఆతఁడు గొప్పత్యాగమునకు సిద్ధపడవలసి యుండును. దీనినే వీరరాగు లగుట యందురు, ఇందుచేతనే మ

హత్వముయొక్క సాధన మానవున కిట్లు బోధించుచున్నది—త్య
క్తేన భుంజీథాః మాగృధః. ఈవిధముగఁ దన యేకత్వజ్ఞానక్షేత్ర
మునుగ్రమముగ నభివృద్ధి చేయుప్రయత్నమే మనుష్యత్వప్రయత్న
ము. మనము పాశ్చాత్యదేశమందు నీప్రయత్నము సామ్రాజ్యైకతా
జ్ఞానముగఁ బరిగణించినటులఁ గాంచుచున్నారము. ఒకజాతిసం
బంధమువలన భిన్నభిన్న దేశములందున్నరాజ్యము లన్నిటిని ఒక
సామ్రాజ్యసూత్రముతో బంధించి బృహత్తరముగ నగుటకు నొక
ప్రబలాకాంక్ష యచ్చట కలిగినది. ఈజ్ఞానము సాధారణప్రజలలో
నుజ్జ్వలముగఁ జేయుటకై బహువిధానుష్ఠానప్రతిష్ఠానములు స్థాపిం
పఁబడుచున్నవి. విద్యాలయమందు నాట్యశాలయందు గీతములందు
కావ్యములందు నవలలందు భూగోళమందు ఇతిహాసమందు అన్ని
టియందును నీసాధన వికసించుచున్నది. సామ్రాజ్యైకతాబోధమును
యూరపు పరమమంగళమైనదిగఁ దలంచి వివిధరీతులతో మేల్కొ
నుచున్నది. అట్లే విశ్వబోధమును భారతదేశము మానవాత్మకుఁ
జరమపదార్థ మని గ్రహించి దీనిని ప్రేరేపించుటకు నానాదిక్కు
లకుఁ దనప్రయత్నములను సాగించుచున్నది. విద్యయందు నాహార
విహారములందు నన్నివైపుల నది తన యభిప్రాయములను వెలి
బుచ్చుచున్నది. ఇదియే సాత్త్వికత్వముయొక్క అనఁగాఁ జైతన్య
మయత్వముయొక్క సాధన. చిన్నవైనట్టియుఁ బెద్దవైనట్టియు
నన్నివిషయములలోఁ బ్రవృత్తుల నణఁచి నిగ్రహముచేఁ జైతన్య
మును నిర్మలముగఁ జేసి యుంచుసాధన. కేవలము జీవులయెడ
నహింసను జూపుటయేగాక వివిధసందర్భములలోఁ బశుపక్షులయెడ

లను, జెట్లచేమలయెడలను సేవాధర్మము నాచరించుట; అన్నము, జలము, నది పర్వతములయెడలఁగూడ హృదయముయొక్క సం బంధసూత్రమును విస్తరింపఁజేయుట; ధర్మయోగ మందటితోఁ గలదను నీసత్యమును నానాధ్యానములచేత స్మరణములచేత కర్మల చేత మనస్సునందు బంధించి యుంచుట. విశ్వబోధ మెంతవిశాల ముగనుండునో చైతన్యముగూడ నంతవిశాలమై యుండవలెను. అం దుచే గృహస్థునిభోగమునందును, యోగియొక్క త్యాగమునందును సర్వత్ర యిట్టి సాత్వికసాధనను గాంచుచున్నారము.

భరతవర్షపుమహత్తరసాధనయొక్క యుత్తరాధికారమును మనము పొంది దాని నన్యదేశీయుల విద్యతోను దృష్టాంతముల తోను సరిపోల్చి క్షుద్రవముగఁ జేయ సాహిసింపలేము. ఈమహత్ సత్యమునే నానావిధముల నుజ్జ్వలపఱచుభారము మనదేశముపైఁ గలదు. మనదేశపు ఈతపస్సును పెద్దదిగఁ జేసి సార్థకపఱ్చుటకు నేఁడు సమయ మేతెంచినది—జిగీష గాదు, జిఘాంస గాదు, ప్రభు త్వము గాదు, ప్రబలత్వముగాదు, వర్ణముతో వర్ణమునకు ధర్మ ముతో ధర్మమునకు, సంఘముతో సంఘమునకు, స్వదేశముతో విదేశమునకు భేదవిరోధవిచ్ఛేదముబను గావు. చిన్న పెద్ద ఆత్మ పర యనుభేదములు లేక యందటియందు నుదారభావముగఁ బ్రవే శించు సాధననే మన మానందముతో వరింతము. మనదేశమునం దిపు డెన్నియో భిన్నజాతులు, భిన్నధర్మములు, భిన్నసంప్రదాయ ములు నున్నవి. వాని నెవరు లెక్కింపఁగలరు ? ఇచ్చట మానవు నితో మానవునకు మాటిమాటికి నడుగడుగునకును భేదము గల్ల

దు. ఆహారవిహారములు మొదలగు సర్వవిషయములందును మానవునిపై మానవునిప్రవర్తనయందు నిర్దయమగునవజ్ఞానసహ్యాములు ప్రకాశించుచున్నవి. జగత్తునం దెచ్చట నిట్టివి గాన్పింపవు. ఇందుచే మన మందఱితో నేకమైయున్న ఒక్కనినే బోఁగొట్టుకొనుచున్నారము. ఆయొక్కఁడు నాతనిప్రకాశమును విచిత్రముగఁ జేసియున్నాఁడు గాని, విరుద్ధముగఁ జేసియుండలేదు. ఆతనిని బోఁగొట్టుకొనుట యనఁగ మంగళమును బోఁగొట్టుకొనుట; శక్తిని బోఁగొట్టుకొనుట; సామంజస్యమును బోఁగొట్టుకొనుట; సత్యమును బోఁగొట్టుకొనుట యైయున్నది. అందుచే మనకు సంభవించిన దుర్గతి కంతము లేకున్నది. మంగళమునకు బాధ లేర్పడుచున్నవి, అడుగడుగునకు ఖండింపఁబడుచున్నది. దానిక్రియ లంతటను వ్యాపించుట లేదు. సదనుష్ఠానము లొక్కమానవుని యాశ్రయమువల్లనే తలలెత్తి యాతనితోనే విలుప్తములగుచున్నవి. కాలక్రమముగఁ బురుషానుక్రమముగ నది యనువృత్తి చెందుటలేదు: దేశమునం దుద్భవించు కల్యాణము కేవలము పద్మపత్రముపై శిశిరబిందువువలెఁ దొఱఁకుచుండును. దానికిఁ గారణ మేమనఁగా, మన భోజనాదులయందును శయనాదులయందును స్థితిగతులయందును ఏసాత్వికత్వముయొక్క సాధనను విస్తరింపఁజేసియుంటిమో నేఁడది లక్ష్యహీనమై ప్రాణహీనమై వికృతాకారము దాల్చియున్నది. దానియుద్దేశమునకు విపరీతమగు పని నొనర్చుచున్నది.ఏవిశ్వబోధము నది యవారితముఁ జేయఁగోరుచుండెనో దానినే యది యన్నిటికంటె నావృతముఁ జేయుచున్నది. రెండడుగుల దూరమున కొక

ప్రక్షేపము నది సృష్టించుచున్నది. మానవద్వేషమను ముండ్లకం చెలచే నతినిబిడముగ దాని కావరణముల నిర్మించుచున్నది. ఇట్లే మనము పరమాత్మను బోఁగొట్టుకొంటిమి. మనుష్యత్వమును దాని బృహత్తరక్షేత్రమందు నిలుపలేకపోతిమి. నిరర్థకమగు కొన్ని యాచారములను శిరసావహించి నడచుటయే మన పని యైనది, శక్తిని విచిత్రమార్గములలో సుదారముగఁ బ్రసారితము చేయలేక పోతిమి. చిత్తముయొక్క గతివిఘలమార్గము లతిసంకీర్ణము లయ్యెను. మనయాశలు క్షుద్రము లయ్యెను. ఆశ్రయము లంతరించెను. పరస్పరులప్రక్కను నిలువఁబడుట కెట్టి యాకర్షణయు లేకుండెను. కేవలము దూరదూరముగ నుండుటకే తరుమఁబడుచున్నారము. కేవలము ముక్కలు ముక్కలుగ విఱిగివిఱిగి పడుచున్నారము, నొకరిపై ఒకరికి శ్రద్ధ లేదు, సాధన లేదు, శక్తి లేదు, ఆనందము లేదు. సముద్రమునందున్న మత్స్య మంధకారగృహాభ్యంతరమం దొకక్షుద్రజలాశయమందుఁ బడినపు డది క్రమముగ నంధమై క్షీణించి పోవును. అట్లే మనయాత్మకు సహజవిహారక్షేత్రము విశ్వము; ఆనందలోకము భూమా; అట్టి దానిని శతచ్ఛిన్నములగు నాహారవ్యవహారముల క్షుద్రక్షుద్రావరణములలో బంధించి ప్రతిదినము దానిబుద్ధి నంధముగను, హృదయమును బద్ధముగను శక్తిని వికలముగను నొనర్చుచున్నారము. మిక్కిలి ప్రత్యక్షమగు నీమహావినాశమునుండి మనల నెవ రుద్ధరింపఁగలరు ? మనలను సత్యముగ నెవ రొనర్పఁగలరు ? దీనికి యథార్థమగు జవాబు మనదేశమందే యున్నది, ఇహచేత్, అవే

దీత్ అథ, సత్యమస్తి, నచేత్ ఇహ అవేదీత్ మహతీ వినష్టిః— దీనిని దెలిసికొనఁగలిగినచో మనము సత్యమైతిమి. దీనిని దెలిసి కొనలేనిచో మహావినాశము. దీని నెట్లు తెలిసికొనఁగలము? భూతేషుభూతేషు విచింత్య—ప్రతివానియందును నన్నిటియందును నాయనను చింతించి యాయనను దర్శించి పొందఁగలము. గృహ మం దేమి సంఘమం దేమి రాష్ట్రమం దేమి, యెంతవఱకు సందఱి యందు మన మాసర్వానుభూతి నుపలబ్ధి చేయఁగలమో యంత వఱకు మనము సత్య మగుదుము. మన మది చేయఁజాలనంత వఱకు వినాశమే వాటిల్లును. అందుచే సకలదేశములందును, సర్వ స్థానములందును మానవుఁడు తెలిసియుఁ దెలికయు నీసాధననే చేయుచున్నాఁడు. ఆవిశ్వానుభూతియందే యాత్మయొక్క సత్యోప లబ్ధిని వెదకుచున్నాఁడు. అందఱియందు నాయొక్కనినే కోరుచు న్నాఁడు. ఆయొక్కఁడే యమృతుఁడు. ఆయొక్కనినుండి విడివడు టయే మృత్యువు. కాని నామనసునం దెట్టి నిరాశయు లేదు.

అభావము ప్రబలాకారము దాల్చినపుడు దాని ప్రతీకారము నకు తగుశక్తి సంపూర్ణాకారము దాల్చి మూర్తీభవించునని నే నెఱుఁ గుదును. నేఁ డేదేశములవారు స్వజాతిస్వరాజ్యసామ్రాజ్యములనువి షయములలో మునిఁగియున్నారో వారును విశ్వముద్వారమున నాప రమేశ్వరునిసంధానమున సజ్ఞానముతోఁ బ్రవృత్తులు కాలేదో వారును ఆయొక్కనిజ్ఞానముపై నొకచోట దెబ్బలు వేయుచున్నవారు. కాని వారాభూమా వైపునకే యభిముఖులై యున్నారు. ఒకవిశేషమగు హద్దునం దేకత్వజ్ఞానమును వారు ప్రశస్తముగఁ జేసియున్నారు.

అందుచే వా రింక జ్ఞానమునందు, భావమునందు, కర్మల యందు వ్యాప్తిని బొందుచున్నారు. వారలశక్తి యింక నెచ్చట నష్టపడి యుండలేదు. వారలు నడచుచున్నారు. బంధింపఁబడి యుండలేదు. కాని వారల కాశ్రేష్ఠమైన వస్తువును బొందుట యన నెట్టిదో గ్రహించుట కఠినము. వారలు దేనితో బ్రతుకుచున్నారో యదియే పరమావధి యని తలంచుచున్నారు. దీని తరువాత నేమియు లేదని తలంచుచున్నారు. ఉన్నను మానవునకు దానివలనఁ బ్రయోజనము లేదని తలంచుచున్నారు. మానవున కున్న ప్రయోజన మంతయు నోటులనిచ్చు నధికారముపై నాధారపడి యున్నదనియు నదియే నేఁటి యున్నతి యనియు నదియే మానవునకుఁ బరమాశ్రయమనియుఁ దలంచుచున్నారు. కాని విధాత భారతదేశముయొక్క యీసమస్య నన్నిటికంటె ఘనీభూతముగఁ జేసెను. అందుచే మనమే యీసమస్యకు సమాధాన మీయవలెను. దీనికి జవాబు మనదేశమందు స్పష్టముగ వ్యక్తమైనటుల. నిం కెచ్చటను వ్యక్తము కాలేదు.

శ్లో॥ యస్తు సర్వాణి భూతాని ఆత్మన్యేవానుపస్యతి,
సర్వభూతేషు చాత్మానం తతో న విజుగుప్సతే॥

సమస్తభూతములను బరమాత్మయందుఁ జూచువాఁడును, పరమాత్మను సమస్తభూతములయందుఁ జూచువాఁడును, నింకెవ్వరిని నసహ్యించుకొనఁడు. సర్వవ్యాపీ సభగవాన్ తస్మాత్ సర్వగతః శివః. ఆభగవానుఁడు సర్వవ్యాపి, అందుచే నాతఁడే సర్వగత మంగళమయుఁడు. విభాగములచేత, విరోధములచేత నాతని ఖం

డవిఖండములుగఁ జేసి గ్రహించినకౌలఁది నాసర్వగతమంగళము నాటంకపఱతుము.

ఒకప్పుడు భారతదేశ సందేశమువలన మానవుల గొప్పస మస్యకు సమాధాన మీయఁబడెను; మన మితిహాసము ద్వారమున నాసమాధానమునే యీయవలసియున్నది. నేఁడు మనదేశమునకు నానాజాతు లేతెంచినవి; నానాదిక్కులనుండి విరుద్ధశక్తులు సమావేశమయినవి. అభిప్రాయభేదములు, నాచారభేదములు, స్వార్థసంఘాతములు, ఘనీభూతము లయినవి; మన సకలశక్తుల నుపయోగించి భారతదేశసందేశమును నేఁడు సత్యముగ నొనర్చు సమయ మేతెంచినది. అట్లు చేయనంతవఱకు దెబ్బలు తినవలసినదే; కేవల మవమానము, వ్యర్థత సంభవించుచుండును. విధాత యొక దినమైనను మనలను విరామముతో విశ్రమింపనీయఁడు.

మనము మానవుల సకలవిచ్ఛేదములను శాంతింపఁజేసి యాతని నొక్కనినిగా గ్రహించుసాధన చేయుట మనము ప్రబలులమగుదుమనిగాదు, మనవాణిజ్యము వ్యాపించుననియుఁ గాదు, మనస్వజాతి యన్నిజాతులకంటె గొప్పదగు ననియుఁ గాదు, కాని,యీసకల మానవులద్వారమునను మనయాత్మ "సర్వగతః శివః" "సర్వభూతగుహాశయః" "సర్వానుభూః" యను అభూమాయందు సత్యమగు నని తలంచుచున్నారము. ఆతఁడే మనకు కావలెను. ఆతఁడే యాదియందు; ఆతఁడే యంతమునందు. ఇట్లు చేసినయెడల మన కున్నతి గలుగదందువేని మనకు వినతియే మంచిదని నుడువుచున్నాను. ఈసాధనవలన మనస్వజాతీయత దృఢపడ దందువేని, స్వజా

త్యభిమానముయొక్క యతినిష్ఠురమోహమును దప్పించుకొనుట యే మానవుని శ్రేయస్సనియు, నీవిద్యను నేర్పుటకు భారతదేశ మెల్లప్పుడును సిద్ధముగా నున్నదనియు నేను నుడువుదును. "యేనాహం నామృతాస్యాం కిమహం తేన కుర్యామ్" అను నీమహామంత్రమునే భారతదేశము వినిపించినది—సమస్తోద్ధతసభ్యతాసభాద్వారమున నిలువఁబడి భారతదేశము మరల నొకసారి "యేనాహం నామృతాస్యామ్ కిమహంతేన కుర్యా" మని దిక్కుదిక్కులకును మారు మ్రోఁయింపవలసియున్నది. ప్రజలు మూర్ఖుల మని యెగతాళి చేయవచ్చును. ధనికులు దరిద్రుల మని పరిహసింపవచ్చును. అయిన నీవాణిని వినిపింపవలసినదే. ఈవాణి నుచ్చరించుటకు మనకు శక్తిని 'ఏకః, ఒక్కఁడును, 'అవర్ణః' వర్ణము లేని వాఁడును, విచైతిచాంతె విశ్వమాదౌ, సమస్తమున కాదియందును సమస్తమున కంతము నున్నవాఁడు, నిచ్చుఁగాక, సనోబుద్ధ్యా శుభయా సంయునక్తు, ఆయన మనకు శుభబుద్ధిని ప్రసాదించునుగాక ! శుభబుద్ధిచే దూరమును నికటమును, నాత్మపరులనందఱి నొక్కటిగా యుక్తము చేయుఁగాక !

---

# రసధర్మము 8.

విశ్వాసము జ్ఞానసామగ్రి కాదు. ఈశ్వరుఁ డున్నాఁ డనీ విశ్వసించుటనే విశ్వాస మని చెప్పను. నే నేవిశ్వాసమునుగుఱించి చెప్పుచున్నానో, యది సమస్తచిత్తముయొక్క యొకయవస్థ. ఇది యొకయవిచలిత మగునాధారభావము. మనస్సు దీనియందు ధ్రువమై యుండి వసించును. అది తన నేయవస్థయందును నిరాశ్రయునిగ నిస్సహాయునిగఁ దలంపదు.

ఈవిశ్వాస మనువస్తువు పృథివివలె దృఢ మయినది. ఇది యొకనిశ్చిత మగునాధారము. దీనియం దొక గొప్పబల మున్నది.

ఎవ్వనియం దీవిశ్వాసబలము లేదో, యనఁగా నెవనిచిత్తమునం దీధ్రువస్థితితత్త్వముయొక్క యభావ మున్నదో యాతఁడు సంసారమునఁ బలుమాఱులు దేనిని బొందినను దానిని బ్రబలప్రయత్నముతోఁ బట్టుకొని యుండును. ఆతఁ డగాధజలమునఁ బడినట్లుండును. ఆతఁడెచ్చటను గాలిక్రిందఁ గట్టిభూమిని బొందుటలేదు. అందుచే నేవస్తువులు సంసారముయొక్క యాటుపోటులవలనఁ గొట్టుకొనివచ్చి తిరుగఁ గొట్టుకొని పోవునో వానినే శీఘ్రముగ రెండుగుప్పెటలతోఁ బట్టుకొనుటనే యాతఁడు పరిత్రాణ మని తలంచును, దానినుండి యేకొంచె మాతఁడు పోఁగొట్టుకొనునో యే కొంచె మాతనిగుప్పెటనుండి జాఱిపోవునో దానినష్టము నాతఁ డేకాంతనష్టముగఁ దలంచుటచే నాతఁ డెచ్చటను నోదార్పును బొందుట లేదు. మాటిమాటి కతనికి సర్వనాశము సంభవించినటులఁ

దలపోయును. బాధావిఘ్నములు కేవల మాతనిమనస్సునందు నిరాశాభావమును ఘనీభూతముఁ గావించును. ఆతఁ డాసకలవిఘ్నములను దాఁటి యెచ్చటను నొకచరమసఫలత్వముయొక్క నిస్సంశయమూర్తిని గాంచఁడు.

ఇందుచే దృఢవిశ్వాసి యగుమానవుని కార్యకలాపములందు బల మున్నది. కాని యుద్వేగము లేదు. అతనికి నిలువఁబడుట కొకస్థానమును జేరుట కొకయాశ్రయము నున్న దని యాతఁడు నిశ్చయముగ గ్రహించును. ప్రత్యక్షఫల మాతఁడు గాంచకున్నను ఫలమునుండి యాతఁడు వంచితుఁడు కాలే దని లోలోనఁ దలంచును. విరుద్ధఫలమును బొందినను విరుద్ధత నాతఁ డేకాంతముగఁ జూడఁడు. దానినుండియు నొకసార్థకతను బడయఁజూచును. ఒక మిక్కిలి గొప్పస్థానమునందుఁ జిత్తముయొక్క దృఢనిర్భరత యున్నది. ఈస్థానమును ధ్రువ మని యత్యంతస్పష్టభావముతో నుపలబ్ధిచేయుటయే మనధర్మసాధనప్రతిష్ఠితమై యున్నవిశ్వాసమును గుర్తెఱుంగుట.

కాని కేవల మీనిష్ఠాదృఢత్వమే చాలదు. ఈజీవధాత్రి యగు పృథివి మిక్కిలి గట్టిది. దీనిపునాది మిక్కిలి గట్టిరాళ్లపేర్పులతోఁ దయారుచేయఁబడినది. ఈకఠినదృఢత్వము లేకున్నచో దీనిపై మనము నిస్సంశయముగ నాధారపడి యుండఁజాలము. కాని యీకాఠిన్యమే పృథివియొక్క చరమరూప మయినయెడల నిది ప్రస్తరమయ మగునొకభయంకర మరుభూమిగా నుండెడిది.

దీని సమస్తకాఠిన్యముపై నొకరసవిధాన మున్నది. అది

యే దీని చరమపరిణతి. అది కోమల మయినది, సుందరమయినది, విచిత్రమయినది. అచ్చటనే నృత్యము. అచ్చటనే గానము. అచ్చటనే యలంకారము. పృథివియొక్క సార్థకరూప మచటనే ప్రకాశించినది.

అనఁగా నిత్యస్థితిపై నొకనిత్యగతియొక్క లీల లుండని యెడల దానికి సంపూర్ణత లేదు. పృథివియొక్క ధాతుప్రస్తరముల యచలభిత్తికి నగాధమున గతిప్రవాహముఁ బ్రాణప్రవాహము యౌవనప్రవాహము సౌందర్యప్రవాహమును బ్రవహించుచున్నవి. వీని చలనక్రియలకు రాకపోకలకు మిళనములకును నంతము లేదు.

రస మనువస్తువును చలనయుక్తమయినది. అది కఠినము గాక నమ్ర మయి యుండుటచే సర్వత్ర దానికి సంచారము కలదు. అందుచే నది వైచిత్ర్యములతోఁ బొంగి పొరలి జగత్తును బులకాంకిత మొనర్చును. అందుచేతనే తనయపూర్వతను బ్రకటించుకొనుచున్నది. అందుచేతనే దాని నవీనత్వమున కంతము లేదు.

ఈరస మెండిపోయినచోట మరల నానిశ్చలకాఠిన్యత బయటఁబడును. అచటఁ బ్రాణముయొక్కయు యౌవనముయొక్కయు నమనీయతయుఁ గమనీయతయుఁ దొలఁగిపోవును. జరామృత్యువులనిర్జీవత్వమే యచ్చట నుగ్రరూపముఁ దాల్చును.

మన ధర్మసాధనయందును నిట్టిరసమయగతితత్త్వ ముండనియెడల దానికి సంపూర్ణత లేదు. దానిచరమసార్థకతయు నష్టమయి పోవును.

అనేకసమయములందు ధర్మసాధనలోఁ గఠినతయే ప్రబ

లమై యున్నటులఁ గాన్పించును. దానియవిచలితదృఢత్వము నిష్ఠురశుష్కభావముతోఁ దనను బ్రకాశింపఁజేసికొనును. అది తన సీమయం దత్యంతోద్ధతమై యుండును. అది యన్యులపై నాఘాతము వేయును. దానియం దెట్టికదలికయు లేదు. ఇట్టిభావములతో నది గౌరవము ననుభవించును. తనస్థానమును వీడి నడువకపోవుటచేఁ గేవల మది యొక్కచోటనుండియే సమస్తజగత్తును జూచును. అన్యదిక్కునం దున్నవా రేమియుఁ గాంచుట లే దనియు సమస్తమును దప్పుగాఁ గనుఁగొనుచున్నారనియుఁ దలంచును. ఈకాఠిన్యము తనతో నన్యులయొక్క యెట్టియైక్యమును క్షమింపనేరదు. అందఱిని దనయచలప్రస్తరావరణమునకు బలవంతముగ లాగి తెచ్చును. ఈకాఠిన్యము మాధుర్యమును దుర్బలత్వముగను వైచిత్ర్యములను మాయయొక్క యింద్రజాలముగను నెంచి యవజ్ఞ చేయును. మఱియు సమస్తమును సబలముతో నేకాకారముగఁ జేయుటయే సమన్వయసాధన యని తలపోయును.

కాని కాఠిన్యము ధర్మసాధన కంతరాళమున నుండును. దానిపని ధారణచేయుట ప్రకాశము గావించుట కాదు. అస్థిపంజరము మానవదేహముయొక్క చరమపరిచయము కాదు. సరసకోమలమాంసమువలననే దానిప్రకాశము పరిపూర్ణ మగుచున్నది. అది పిండాకారమున భూమిపై దొర్లుట లేదు. అది యాఘాతముల నోర్చుకొనును. కాని విరిగిపోదు. అది తనమర్మస్థానములను సర్వవిధములగు నుపద్రవములనుండి రక్షించుకొనును. దాని కంతర్గతకారణము దానియస్థిపంజరము. కాని తన యీకఠోరశక్తి నది

యాచ్ఛన్నము చేసియే యుంచును. తనరసమయప్రాణమయభావ మయ గతిభంగిమయకోమలసతేజస్సౌందర్యమునే ప్రకాశింపఁ జేయును,

ధర్మసాధనకుఁగూడఁ దనశ్రీ ప్రకటిత మయినచోటనే చరమపరిచయము కలదు. ఈశ్రీ యనువస్తువు రసముయొక్క వస్తువు. దానియం దభావనీయ మగువిచిత్రత యనిర్వచనీయ మగు మాధుర్యము నిత్యచలనశీల మగుప్రాణలీలలు కలవు. శుష్కతయందును నస్రమతయందును దానిసౌందర్యమును లోపింపఁజేసి దానిసచలత్వమును నిరోధించి దానివేదనాబోధమును నిర్జీవముగఁ జేసి పైచును. ధర్మసాధన కెచట నుత్కర్షము కలదో యచట గతికి బాధాహీనత భావవైచిత్ర్యము మాధుర్యముయొక్క నిత్యవికాసము కాన్పించును.

నమ్రత లేనిదే యీవస్తువును బొందుటకు వీలు లేదు.కాని నమ్రత యనఁగా నేర్చుకొనిన వినయము కాదు. అనఁగాఁ గఠినలోహమును గాల్చి సాఁగఁగొట్టి దానికి నుక్కువలెఁ గోమలత్వమును నిశితత్వమును గలిగించునట్టివస్తువు కాదు. సరసనజీవతరుశాఖలయం దేనమ్రత కలదో యేనమ్రతవలనఁ బుష్పములు వికసించునో మలయమారుతములు నృత్యాందోళనముల విస్తరింపఁ జేయునో శ్రావణమాసవర్షధారలు సంగీతమువోలె ముఖరితములగునో సూర్యకిరణములు ఝుంకార మొనర్చుచితారుయొక్క స్వరములవలెఁ బ్రతిధ్వనిత మగుచుండునో నలువైపుల విశ్వమునం దున్నఛంద స్సేనమ్రతవలనఁ దనస్పందనమును విచిత్రముగఁ

గావించుకొనుచుండునో యేనమ్రత సహజముగ నందఱితోఁ దన యోగమును స్వీకరించునో యందఱకును సమాధాన మొసఁగునో యందఱకును జేయూఁత నిచ్చునో యాఘాతమును సంగీతమువలెఁ బరిణమింపఁజేయునో స్వాతంత్ర్యమును సౌందర్యముద్వారా యందఱివస్తువు గావించునో యట్టినమ్రత యావశ్యక మయినది.

ఈమాటవలన నీనమ్రత రసముయొక్క నమ్రత యనియు నేర్చుకొనినసమ్రత కాదనియు మనము గ్రహింపవలసియున్నది. ఈనమ్రత శుష్కనిగ్రహాధారముచే నత మయినది గాక సరస ప్రాచుర్యముచే నత మయినది. ప్రేమవలన భక్తివలన నానంద మువలనఁ బరిపూర్ణతవలన నత మైనది,

కఠోరత సహజముగఁ దనను స్వతంత్రము చేసి యుంచిన టుల, రసము సహజముగ నన్యులవైపునకుఁ దీసికొనిపోవును. ఆనందము సహజముగఁ దనను దానము చేసికొనును, తన నన్యుల యందుఁ బ్రసారితము చేసికొనుటయే యానందముయొక్క ధర్మమై యున్నది. కాని యుద్ధత మయియున్నయెడల నన్యులతో మిశన మెప్పటికిని గలుగదు. అన్యులను గోరినయెడలఁ దనను నతము చేసికొనవలసియే యుండును. రసైశ్వర్యమున నేమానవుఁడు ధనికుఁడో నమ్రతయే యాతనియౌదార్యమునకు లక్షణము.

విశ్వజగత్తునందు జగదీశ్వరుఁ డేస్థానమున మనయొద్ద నత మయి యున్నాఁడు? ఎచ్చట నాయన సుందరుఁడో యెచ్చట నాయన రసస్వరూపుఁడో యచట నానందమును భాగింపకున్నచో నాతనికి జరుగదు. అచ్చట నాయన తననియమములబలముపై

దృఢముగ నిలిచి యుండఁజాలఁడు. అచట నందఱిమధ్యమునకు దిగివచ్చి యాతఁ డందఱిని బిలుచుచుండును. ఆపిలుపునం దెం తయో కరుణ వేదన కోమలత్వము నిమిడి యున్నవి. స్నేహా నందభారములచే దుర్బలక్షుద్రశిశువుకడఁ దలిదండ్రు లెటుల నతమై యుందురో జగదీశ్వరుఁ డటులనే మనవైపునకు నతమై యున్నాఁ డు. ఇదియే మన కన్నిటికంటె గొప్పవిషయము. ఆయననియమ ము సుదృఢ మయినది. ఆయనశక్తి యసీమ మయినది. ఆయన యైశ్వర్య మనంత మయినది—ఈవిషయము లన్నియు దాని కంటె మనకు మిక్కిలి క్షుద్ర మైనవి. ఆయన సతుఁడై సుంద రుఁడై భావములవలనను భంగిమములవలనను హాసములవలనను గా నములవలనను రూపరసగంధస్పర్శములవలనను మన యందఱకుఁ దనను దానము చేసికొనుచున్నాఁడు. ఆయనయందు మనల నంద ఱిని స్వీకరింప వచ్చినా రనువిషయమే మనకుఁ జరమవిషయము. ఆయనయొక్క చరమపరిచయము మన కిచటనే గలుగుచున్నది.

జగత్తునం దీశ్వరునియీరెండుపరిచయములలో నొకటి సుదృఢనియమమువలనను మఱియొకటి సునమ్రసౌందర్యమువల నను గలుగుచున్నవి. దీనియందు నియమము గుప్తముగ నున్నది. సౌందర్యము దాని నావరించి యున్నది, నియమము మిక్కిలి ప్రచ్ఛన్నమై యుండుటచే దానిని గనుఁగొనుటకు మానవున కనేక దినములు పట్టెను. కాని సౌందర్య మెల్లపుడుఁ దనను దానము చేసికొనుచున్నది. సౌందర్యము లభ్యమగుటచేతనే దానము చేసి

కొనుటచేతనే సుందరమై యున్నది. ఈసౌందర్యమునందే రసము సందే మిళనతత్త్వ మిమిడి యున్నది.

ధర్మసాంప్రదాయమునందుఁ గాఠిన్యమే గొప్పదిగ నున్నప్పు డది మానవుని మేళవింపక విచ్ఛిన్నముగఁ జేయును. అందుచేఁ గృచ్ఛ్రసాధన నేధర్మ మయినను దనప్రధానాంగముగఁ జేసికొనినపుడును నాచారవిచారములకే ముఖ్యస్థాన మొసంగినపుడును నది మానవులయందు భేదము గలిగించును. అపుడు దానినీరసకఠోరత్వము దాని నందఱితోనేకత్వము కానీయదు. అది తననియమమునందుఁ దనను స్వతంత్రముగఁ జేసికొని యాబద్ధము చేసికొనును. ఎల్లపుడును భయముతో నుండును. నియమమునకు వ్యతిక్రమము జరిగినచో నపరాధ మగు నేమో యని యందఱిని దూరదూరముగ నుంచి తాను నడువఁ గోరును. కేవల మదియే కాదు. నియమపాలనముయొక్క యహంకారము మానవునిదృఢపఱచును. నియమపాలనయొక్క లోభ మాతని వశీభూతునిగఁ జేసికొనును. ఈసకల నియమములను ధృవధర్మము లని గ్రహించు టాతనికి సంస్కార మయిపోవును. ఆతనికి సంస్కార మయిపోవుటచేతనే నియమములయభావముఁ గాంచినపు డాతఁ డవజ్ఞ ననుభవించును. ఆధునిక హిందూసంఘము కూడ ధర్మముద్వారమున విశ్వమానవులనుండి తనను విచ్ఛిన్నముగఁ జేసికొనినది. తనయందును విభాగముల కంతము లేదు. నిజముగఁ దన నన్నిటినుండి విచ్ఛిన్నముగఁ జేసికొనుటకే యది నియమముల ప్రాకారమును నిర్మించుకొనెను. బౌద్ధధర్మము భారతవర్షీయుల సందఱితో నిరాటంక

ముగ నేకము చేయుచుండెను. ఆధునికహిందూధర్మముయొక్క సకలనియమసంయమములును బ్రధానముగ దానిప్రతీకారమునకే ప్రబలప్రయత్నము లొనర్చెను. ఆప్రయత్నము నేఁటివఱ కటులనే యుండిపోయెను. అది కేవలము దూరము చేయుచున్నది. కేవలము ద్వేషించుచున్నది. తనను సంకీర్ణముగ బంధించుకొని తెరచాటున నుండఁ బ్రయత్నించుచున్నది. హిందూధర్మము బాహ్యామానవులకుఁ గిటికీలను గుమ్మములను బంధించి యుంచినది. తనవారికిఁ గేవలము ప్రాకారములుగ నున్నది.

అన్యదేశమునం దన్యజాతులలో స్వాతంత్ర్యమును రక్షించుట కెట్టిప్రయత్నములును జేయ లే దని చెప్పఁజాలము. కారణ మేమనఁగా స్వాతంత్ర్యమును రక్షించుకొనఁ బ్రయోజన మున్నను నాప్రయోజనము నెవ్విధమునను దృఢీకరింపలేము. కాని యన్యత్ర యీస్వాతంత్ర్యమును రక్షించుకొనఁ జేయుప్రయత్నము రాష్ట్రీయ మయినది. సామాజిక మయినది.

మేళనవృత్తి స్వాతంత్ర్యప్రయత్నమునకుఁ బై నుండు వస్తువు. క్రీతదాసుఁడు రాజును వధించి సింహాసనముపైఁ గూర్చున్నయెడల నెట్టిస్వాతంత్ర్యప్రయత్న మగునో యటులనే మిళనధర్మమును సంపూర్ణముగ నభిభూతము చేసి దానిపైఁ దనస్థానము నాక్రమించుకొనినచో నట్టియన్యాయమే యగును. ఇందుచేఁ బారివారికసామాజికరాష్ట్రీయస్వార్థబుద్ధి మానవుని స్వాతంత్ర్యమువైపునకు లాగుచున్నను బుద్ధి దానిపై నిలిచి విశ్వము వైపునకు విశ్వమానవుల వైపునకు నిరత మాహ్వానించుచుండును.

మనదేశమున నాధునికకాలమున నచ్చుటనే రంధ్ర మేర్పడినది. ఆరంధ్రమువలననే యీదేశముయొక్క శని ప్రవేశించినది. ఏధర్మము మానవుని మానవునితో మేళవించునో ఆధర్మము పేరిటనే మనము మానవులను వేఱు చేయుచున్నాము. శరీరస్పర్శవలననాతనితో నేకాసనమునఁ గూర్చుండి యాహారము భుజించుటవలననాతఁడు భుజించిన యన్నజలములఁ దాఁకుటవలనను మానవుఁడు ధర్మభ్రష్టుఁ డగుచున్నాఁ డని మనము నుడువుచున్నాము. బంధనమును ఛేదించుట దేనిపనియో దానివలననే మనము బంధనమును దృఢపఱిచితిమి. అట్లయిన మనలను నేఁ డుద్ధరింపఁగలవా రెవరు? ధర్మమునకంటె మిక్కిలి నీచమయినపదార్థముపై మనల నుద్ధరించుభారము వైచుట కడు నాశ్చర్యకర మైనవిషయము. మనము భారతవర్షాంతర్గతమానవులతో మానవుల నేకము గావించుటకొఱకు స్వాతంత్ర్యబుద్ధిపై నాధారపడితిమి. అట్లు కానియెడల మనము గొప్పవారము కా మనియు బలిష్ఠులము కా మనియు మనప్రయత్నములు సిద్ధింప వనియు నుడువుచున్నాము.

మనజాతీయస్వార్థబుద్ధిని ప్రయోజనబుద్ధిని ధర్మముకంటె గొప్పదానినిగఁ జేసి వైచితిమి. ధర్మమునందు మన కుద్ధరణము లేదనియు స్వాతంత్ర్యమువలన మన ముద్ధరింపఁబడవలె ననియుఁ జెప్పునంతటివెఱ్ఱి మనకుఁ బట్టినది! ధర్మము మనలను వేఱుగ నుండు మని నుడువుచున్నది. స్వాతంత్ర్యము మనల నేక మగు నటులఁ దఱుముచున్నది!

కాని ధర్మబుద్ధి యేమేళనమునకుఁ గర్త కాదో యామేళ

నముపై నేను విశ్వాస ముంపఁజాలను,
తత్త్వమును మనదేశమందుఁ బ్రతిష్ఠించి యు గ గ్రహింపవలెను.
సహజముగ మనము మేళనమువైపునకె పోయెదము ఘాతములు
వరణముల నేర్పఱచునట్టియుఁ బ్రాకారముల నిర్మించునట్టిఁ ప్రబలమై
వృత్తులనుండి మనము నిష్కృతిఁ బొందఁగలము. ధర్మముయొక్క
సింహద్వారము తెఱవఁబడి యుండినచోఁ జిన్న పెద్ద మున్నగు
సకలయజ్ఞములకును మానవులను మన మాహ్వానింపఁగలము. కా
దేని కేవలము ప్రయోజనములయొక్కయు లేక స్వాతంత్ర్యాభిమా
నములయొక్కయు దొడ్డిసమ్మములనే తెఱచియుంచినచో ధర్మ
నియమములయాటంకముల నతిక్రమించి యాచిన్నసందులద్వార
మున మనదేశముయొక్క యిన్నిప్రభేదపార్థక్యములు నిన్నివిరోధ
విచ్ఛిన్నములుఁ జొఱఁజాలవు; ఏకము కాఁజాలవు.

ధర్మము తనరసమూర్తిని బ్రకటిత మొనర్చినపు డది బం
ధనములను ఛిన్నము చేసికొని సకలమానవుల నొకటిగఁ గావిం
చుటకై పరుగిడుచుండు నని ధర్మాందోళనేతిహాసమునఁ గాన
నగును. జీస స్స్రేమభక్తిరసములప్రవాహములను విముక్త
పఱచెనో దానిని యూదులధర్మముయొక్క కఠినశాస్త్రబంధనము
లలోఁ దమను బంధించుకొని యుంచలేకపోయెను. ఆధర్మము
నేఁటివఱకుఁ బ్రబల జాతులస్వార్థశృంఖములను శిథిలము చేయ
నిరంతరముఁ బ్రయత్నము చేయుచున్నది. నేఁటిదనుక సమస్త
సంస్కారముల నభిమానముల నంతరాయములను భేదించుకొని
మానవునితో మానవునిఁ గలుప దానియాకర్షణశక్తిని బ్రయోగిం
చుచున్నది.

బౌద్ధధర్మమూలమునం దొకకఠోరతత్త్వకథ యున్నది. కాని యాతత్త్వకథవలన మానవు నొక్కటిగఁ జేయలేదు. బుద్ధదేవుని మైత్రీకరుణల విశ్వవ్యాప్త మగుహృదయప్రసారతయే మానవునితో మానవునకుఁ గలప్రభేదమును దగ్గించినది. నానకు రామానంద కబీరు చైతన్యప్రభృతు లందఱు రసముయొక్క యాఘాతమువలననే బంధనములను దెగఁగొట్టి సకల మానవుల నొక్కస్థానమున కాహ్వానించిరి.

ధర్మ మాచారములను నియమములను శాసనముల నాశ్రయించి కఠిన మయినపు డది మానవులను విడఁదీయును. ఒండొరులందు రాకపోకలమార్గము నవరుద్ధము చేయును. ధర్మమునందు రసముయొక్క వర్షము కురియుచున్నపు డేసకలచ్ఛిద్రము లొండొరులలో వ్యవధానములను రచించెనో యవి భక్తిస్రోతస్సునఁ బ్రేమప్రవాహమున నిండిపోవును. ఆపూర్ణతయందు స్వాతంత్ర్యముయొక్క యచలసీమ లన్నియు సచలములై యగ్రసరములై యందఱి నేకము చేయఁగోరును. తీరద్వయము నేకము గావించును. దుర్లంఘదూరత్వము నానందవేగమున సమీపమునకుఁ దెచ్చును. మానవుఁడు సత్యభావముతో గభీరభావముతో నేకము కాఁగలిగినపుడెల్ల నొకవిపులమగు రసావిర్భావమువలననే యేకము కాఁగలిగెను. ప్రయోజనమువలనను దత్త్వజ్ఞానమువలనను నాచారశుష్కశాసనమువలనను నేకము కాలేదు.

ధర్మముయొక్క చరమలక్ష్య మీశ్వరునితో మిళనసాధన మయినపుడు కేవలము విధిబద్ధపూజార్చనాచారానుష్ఠానశుచిత్వము

వలన నది జరుగ నేరదని సాధకుఁడు స్పష్టముగ గ్రహింపవలెను. దానివలన మనస్సును గఠోరముగఁ గావించి యాఘాతములు వైచుచుండును. ధార్మికతయొక్క యహంకారము ప్రబలమై చిత్తమును సంకీర్ణపఱచును. హృదయమున రస మున్నపుడే యా యనతో మిళనము కలుగును. ఇంక దేనివలనను గలుగనేరదు.

భక్తిరసమునందును ప్రేమరసమునందును భోగమునే కేవల మేకాంత మైనదిగఁ జూచినయెడల దుర్బలత్వము వికారము సంభ వించును. దానియం దొకశక్తి యున్నది. అది లేకున్నచో రస మువలన మనుష్యత్వము దుర్గతిని బొందును.

భోగమే ప్రేమయొక్క ప్రధానలక్షణము కాదు. దుఃఖము నానందముతో స్వీకరించుటయే ప్రేమయొక్క ప్రధానలక్షణము. ఏల యనఁగా దుఃఖమువలననే త్యాగమువలననే దానికిఁ బూర్ణ సార్థకత కలుగుచున్నది. భావావేశమునందుఁ గాక సేవయందే కర్మమునందే దానిపూర్ణపరిచయము. దుఃఖమువలనఁ గర్మముల వలనఁ దపస్సువలనఁ బరిపక్వమైనప్రేమమే విశుద్ధమైనప్రేమము. ఆప్రేమమే సర్వతోముఖ మైనప్రేమము.

ఈదుఃఖస్వీకారమే ప్రేమశిరస్సునకు మకుటము. ఇది దానిగౌరవము. త్యాగమువలన నది తనను బొందును. వేదనాద్వారముననే దానిరసమునకు మథనము కలుగును. ఎటుల సాధ్వి యగు సతీమణిని సంసారకర్మములు మలినము చేయక యామె నింకను దీప్తిమతిగఁ జేయునో యెటుల సంసారమందు మంగళకర్మ ములు తనసతీప్రేమమును సార్థకపఱచుచుండునో యటులనే సాధక

చిత్తము భక్తిచేఁ బరిపూర్ణ మయిపోవును. మఱియును గర్తవ్యము లశాసనము లాతనికి శృంఖలములు గాక యలంకారములై యుం డును. దుఃఖమువలన నాతనిజీవితము క్రుంగిపోక దుఃఖమువలననే యాతనిభక్తి గౌరవాన్విత మగును. ఇందుచే మానవసమాజమునఁ గర్మకాండము మిక్కిలి ప్రబలాకారమును దాల్చి మనుష్యత్వమును భారాక్రాంతముగఁ జేసినపు డొకవిద్రోహదళము జ్ఞానసాహా య్యముతోఁ గర్మమూలోత్పాటనము గావించి దుఃఖము నేకాంత ముగఁ బరాభూతము చేయు నుద్యమమందుఁ బ్రవృత్తులగుదురు. కాని భక్తిద్వారమునఁ బూర్ణతయొక్క స్వాదమును బొందిన వారు దేనిని దృణీకరింప నిచ్చగింపరు. వార లనాయాసముగఁ గర్మములను శిరసావహించి దుఃఖమును వరించి స్వీకరింతురు. అట్లు కానియెడల వారలభక్తికి మాహాత్మ్యమే యుండదు. భక్తి నవమానపఱచు టగును. భక్తి బాహ్య మగు సకలాభావములవ లన నాఘాతములకులనఁ దనయంతరపూర్ణతను దనయొద్ద నిరూ పించుకొనఁ గోరును. దుఃఖమునందు నమ్రత కర్మములయం దానం దమే దాని యైశ్వర్యపరిచయము. కర్మములు మానవుని బంధిం చును; దుఃఖ మాతనిని బీడించును; ఐనను యీమానవునియొక్క సమస్యలు రసావిర్భావమువలన సంపూర్ణముగ విలుప్తములగును. అపుడు కర్మములయందును, దుఃఖమునందును మానవుఁడు యథార్థ ముగఁ దనముక్తిని గనుఁగొనును. వసంతోత్తాపముచే హిమము రసరూపమునఁ ద్రవీభూత మైనపుడు చలనమువలననే దానికి ముక్తి. నిశ్చలతయే దానికి బంధనము. అపుడలసట లేనియానందము

తో నది దేశదేశాంతరములను ఫలవంతములుగఁ జేసి నడచుచుం డును. అపు డది ఱాలచే ఱప్పలచేఁ బ్రతిహత మైనకొలఁది దాని యందు సంగీత ముద్భవించి నృత్యముచే సుశోభించుచుండును.

ఒకహిమఖండమునకును ఝరికిని భేద మెచ్చటఁ గలదు? హిమఖండమందు గతితత్త్వము లేదు. దానిని గట్టి లాగి తీసికొని వెళ్లినప్పుడే యది నడచును. కావునఁ జలనమే దానిబంధనము నకుఁ బరిచయము. అందుచే బాహ్యమునుండి దానిని నెట్టి నడ పించినయెడల దానిపైఁ బడుప్రతియాఘాతమువలన నది క్షీణించు చుండును. అందువలనఁ జలనమునుండియు నాఘాతమునుండియు ముక్తిని బొంది స్థిరముగ నుండుటయే దానికి సహజావస్థ.

కాని ఝరికిఁ గలగతి దానికి సహజ మైనది. అందుచే నీగతియందే దానివ్యాప్తి ముక్తి సౌందర్యము నిమిడియున్నవి. అందువలన గతిపథమునం దది యెన్నియాఘాతములు పొందినను నంతయు దానికి వైచిత్ర్యముల నొసఁగుచుండును. ఆటంకముల వలన దానికి వైచిత్ర్యములు కలుగుచుండును. ఆటంకములవలన దానికి నష్టము లేదు, చలనమువలన దాని కలసట లేదు.

మానవునియందు రసావిర్భావము లేనపు డాతఁడు జడపిం డమువలె నుండును. అపుడు క్షుధాతృష్ణాభయభావన లాతనిని ద్రోసిత్రోసి పనిచేయించును. ఆపనియం దాతనికిఁ బలుమాఱు లలసట కలుగుచుండును. ఆనీరసస్థితియందును మానవుఁ డాంతర నిశ్చలత్వమునుండి బాహ్యమునందును గేవలము నిశ్చలత్వమునే వ్యాపింపఁ జేయుచుండును. అపుడే యాతనిక్షుద్రవిషయములు

నాచారవిచారములు శాస్త్రశాసనములు ప్రబలము లగుచుండును. అపుడే మానవునిమనస్సు గతిహీన మగుటచే నలువైపులనుండి యాతఁడు బంధింపఁబడును. అపు డాతఁడు కూర్చుండుట లేచుట తినుట ధరించుట మున్నగున వన్నియు బంధనము లగును. అపుడే యాతఁడు నిరర్థకకర్మముల నన్నిటిని స్వీకరించుటచే నాతనిని సముఖమున కగ్రసరుని గానీయక యాతని ననంత మగు పునరావృత్తి యందుఁ గేవల మొక్క స్థానమందే త్రిప్పి చంపుచుండును.

రసావిర్భావమువలన మానవుని జడత్వము తొలఁగిపోవును. కాన నపుడు సచలత్వ మాతని కస్వాభావికముగ నుండదు. అపు డాతఁ డగ్రిగామి యగుచు గతిశక్తియొక్క యానందమువలననే కర్మములఁ జేయుచుండును, సర్వమును జయించు ప్రాణశక్తియొక్క యానందమువలననే యాతఁడు దుఃఖమును స్వీకరించును.

మానవుఁ డేశక్తివలనఁ దనదుఃఖమును బూర్తిగ నివృత్తి చేసికొనఁగలఁ డనునది ప్రధాన సమస్య కాదు.

ఏశక్తివలన నాతఁడు దుఃఖమును సహజముగ స్వీకరింపఁ గలఁ డనునదియే యాతనిసమస్య. దుఃఖమును నివృత్తిచేయు మార్గమును జూపించువార లహమునే సకలానర్థములకు హేతువని యెంచి దానిని సంపూర్ణముగ విలుప్తము చేయవలయునని చెప్పుదురు. దుఃఖమును స్వీకరింపఁగలశక్తి నొసఁగువార లహమును బ్రేమద్వారమునఁ బరిపూర్ణము గావించి దానిని సార్థకపఱు

పవలె నని చెప్పుచుందురు. అనఁగా బండినుండి గుఱ్ఱమును విడఁ దీయుటయే బండిని గోతిలోఁ బడకుండ రక్షించు సుకౌశలము కాదు. బండిపై సారథిని స్థాపించుటయే బండి నాపదనుండి రక్షించుటకును దానిని గమ్యస్థానాభిముఖముగ నడపుటకు నుచితోపాయము. అందుచే మానవుని ధర్మసాధనయందు భక్తి యావిర్భవించినపుడు సంసారమునం దేది యెచ్చట నుండవలయునో యచ్చటనుండి మానవుని సకలసమస్యలకు మీమాంస లేర్పడుచుండును. అపుడు కర్మములయం దాతఁ డానందమును దుఃఖమునందు గౌరవమును ననుభవించును. అపుడు కర్మమే యాతనికి ముక్తి నిచ్చును. దుఃఖమే యాతని నష్టమునకుఁ గారణమై యుండదు.

---

## శాన్తం శివ మద్వైతమ్ 9.

అనంతవిశ్వమునందుఁ బ్రచండశక్తు లన్నియు దిక్కు దిక్కులకుఁ బరుగిడుచున్నవి; శాంతస్వరూపుఁడు కేంద్రస్థలమందు ధ్రువుఁడై యుండి యవిచ్ఛిన్న మగుశాంతి యనుత్రాటితో నందఱను బంధించి యున్నాఁడు. ఎవ్వరు నెవ్వరిని నతిక్రమింపఁ జాలకున్నారు. మృత్యువు నలువైపుల సంచరించుచున్నది. కాని దేనిని ధ్వంసము చేయుటలేదు. జగత్తునం దున్నసకలప్రయత్నములును దమతమస్థానములందుఁ బ్రబలాకారముఁ దాల్చి యున్న

వి. కాని వానియన్నిటియందు నాశ్చర్య మగుసామంజస్యము గలిగి యనంతాకాశమునం దొరవిపులసౌందర్యమును వికసింపఁ జేయుచున్నది. ఎన్నియోసార్లు లేచుట పడుట, యెన్నియోసార్లు పెరుఁగుట విఱుఁగుట మొదలైనవి జరుగుచున్నవి. ఎన్నియో యుద్ధములు నెన్నియో విప్లవములును జరుగుచున్నవి. కాని లక్షలకొలఁది వత్సరములనుండి యెడతెగని యాఘాతచిహ్నములు విశ్వముయొక్క నూతనముఖబింబమునందుఁ గాన్పించుటయే లేదు. సంసారమునం దనంత మగురాకపోకల కోలాహలముల మధ్యమునుండి శాశ్వతకాల మీమంత్రము ప్రతిధ్వనించుచున్నది—శాన్తిః శాన్తిః శాన్తిః. 'శాంతమ్' అనువాని యానందమూర్తి చరాచరముయొక్క మహాసనముపై స్థిరముగఁ బ్రతిష్ఠిత మై యున్నది.

మనయంతరాత్మయందును నిరంతరము విరాజిల్లుచున్న యాశాంతియొక్క సాక్షాద్దర్శన మెట్లు పొందనగును? ఆశాంతస్వరూపుని యుపాసనఁ జేయు టెట్లు? ఆతనిశాంతరూపము మనయొద్ద నెట్లు ప్రకాశింపఁగలదు?

మనము శాంతము నొందిన నాశాంతస్వరూపుని యావిర్భావము సుస్పష్టముగా గోచరించును. మనక్షుద్రాశాంతిచే జగత్తునం దెంతస్థాన మాచ్ఛన్నమై పోవునో మనము చూచితిమా? నిర్జననదీతీరమందుఁ బ్రశాంతసంధ్యాసమయమున మన మిద్దఱము కలహించుకొందుము. సాయంకాలమున నపరిమేయమగు స్నిగ్ధనిశ్శబ్దత మనపవితలమం దున్నతృణాగ్రమునుండి యారంభించి

సుదూరతమ మగు నక్షత్రలోకములవఱకుఁ బరివ్యాప్తమై యుం డును; ఆవిషయమును మనము క్షుద్రవ్యక్తుల మైనను మనయిద్దఱి యొక్క క్షుద్రకంఠముల కలరవముచే గ్రహింపలేకున్నాము. నామనస్సునం దున్నసామాన్య మగుభయముచేఁ జరాచరజగత్తంతయు బిభీషితామయ మగుచున్నది. నామనస్సునం దున్నసామాన్య మగులోభముచే సమస్తబ్రహ్మాండ మగుసాంసారికముఖశ్రీయందు వికార ముదయించుసటుల నాకుఁ గాన్పించును. అందుచే నేను శాంతుఁడను కానియెడల 'శాంతమ్' అనువానిని సత్యముగా నె ట్లనుభవింపఁగలను ? మనయంతఃకరణమం దున్న చాంచల్యము తనతరంగములనే పెద్దవిగాఁ జేసి చూపించును. దానికలకల శబ్దములే విశ్వమునం దున్నయంతరతమవాణి నాచ్ఛన్నము జేయును.

నానావిధములైన ప్రవృత్తులు నానావిధములుగా నుప్పొంగుచుండును. మనమనస్సుల నొకసా రీమార్గమున మఱొకసారి యామార్గమున నీడ్చుకొనిపోవుచుండును. వీని నన్నిటిని దృఢమగు రశ్మిచే నాబద్ధము చేసి పరస్పరములతో సామంజస్యనియమములచే బంధించి, యంతఃకరణమందుఁ గర్తృత్వము నొంది, జంచల మగు పరిధియం దచంచల మగు కేంద్రమును స్థాపించి, మనలను స్థిరపఱుపఁగలిగినయెడల విశ్వచరాచరమం దున్న 'శాంతమ్' అనువాని నుపాసన చేసి యాయన నుపలబ్ధి చేయగలము. జీవితమునం దల్పత్వమును శక్త్యభావమును మనము శాంతి యని తలంచుచుందుము. జీవనహీన మగు

శాంతి 'మృత్యువు.' శక్తిహీన మగుశాంతి 'లుప్తి'. సమస్తజీవిత మునందును సమస్తశక్తియందును విరాజిల్లుచు నచలప్రతిష్ఠ కాధారమైయున్నదే 'శాంతి.' ఎవఁ డదృశ్యమై యుండి సకలస్వరములను సంగీతముగ మ్రోయించుచు సకలఘటనల నితిహాసముగాఁ జేయుచు నిద్దఱిమానవులకు సేతువై యున్నాఁడో, సమస్తాహోరాత్రములును మాసపక్షములును ఋతువత్సరములును నడచుచు నడచుచు నెవనిచే విధృతమై యున్నవో యతఁడే శాంతమ్. సమస్తశక్తిని విక్షిప్తము చేయక ధారణచేసి యుండినసాధకునకు నీ పరమశాంతిస్వరూపము ప్రత్యక్షమగుచుండును. రైలుబండిని నడుపునది కేవల మావిరియే కాదు. ఆవిరిని నినుపగొలుసులతో బంధించినస్థిరమగుబుద్ధియే యాబండినిని డపును. బండియొక్కయంత్రములు కదలుచుండును. బండిచక్రములు పరుగిడుచుండును. ఐనను బండియం దున్నయాకదలుశక్తియే కర్తగాదు. సమస్తచలనశక్తియం దచలమై యుండి యెక్కువ యచలనశక్తిచే నేవ్యక్తి యెక్కువచలనశక్తిని ప్రతిముహూర్తమునందును స్థిరముగా నియమించుచున్నాఁడో యాతఁడే కర్త. గొప్పయంత్రశాలయం దొక మూర్ఖుఁడు ప్రవేశించినయెడల నిది యొకదయ్యములశాల యని యాతఁడు తలంచును. చక్రములయొక్క ప్రతియావర్తనమును యంత్రముల యనవరతావర్తనమును ఆవిరితెరల ప్రతియుచ్ఛ్వాసము నాతనిమనన్నును విభ్రమముఁ జెందించును. కాని యనుభవము గలవ్యక్తి యీసమస్తశక్తుల చాంచల్యమునకు మూలమున నొకస్థిర మగుశాంతి యున్నటులఁ గాంచును. భయము నభయ

ముగాఁ జేయుచున్న దెవరో, శక్తిని సాఫల్యము చేయుచున్న దెవరో, గతియందు స్థితి యెచ్చటఁ గలదో, కర్మముల పరిణామ మేదియో యాతఁ డెఱుఁగును. ఈశక్తి యెవని నాశ్రయించుచున్న దో యది శాంతి యని యాతఁ డెఱుఁగును. ఈశక్తి యెచ్చట సార్థకపరిణామ మొందుచున్నదో యచ్చటఁగూడ శాంతి యున్న టు లాతఁ డెఱుఁగును. శాంతియందు సకలగతులయొక్కయు, సకలశక్తులయొక్కయు తాత్పర్యమును గ్రహించి యాతఁడు నిర్భ యుఁ డగును. అతఁ డానందితుఁ డగును.

ఈజగత్తునం దేప్రబలప్రచండశక్తి కేవలము శక్తిరూప మున భయంకరాకారముఁ దాల్చియున్నదో 'శాంతమ్' దానిని ఫల పుష్పములతోఁ బ్రాణసౌందర్యములతో మంగళమయముగాఁ గా వించినది. కారణ మేమనఁగా. శాన్తమ్ అయినవాఁడే శివమ్, ఈ శాన్తస్వరూపుఁడు జగత్తునందుఁ గలసకలప్రబలశక్తులను ధారణ చేసి యొక మంగళలక్ష్యమువైపునకుఁ దీసికొని పోవుచున్నాఁడు. శక్తి యీ శాంతినుండియే యుద్భవించినది, శాంతిద్వారమున విధృతమయి యుండుటచేతనే యది మంగళరూపమునఁ బ్రకాశిం చినది. అది ధాత్రివలె నాదికాలమునుండియు మేల్కొనియుండి నిఖిలజగమును బ్రతిముహూర్తమునందును గాచి రక్షించుచున్నది. అది యందఱియం దాసీనమయి యుండి విశ్వసంసారమునందు పిపీలికాది బ్రహ్మపర్యంతము గల ప్రతిపదార్థమును బరస్పర ముతో నవిచ్ఛేద్యసంబంధముతో బంధించి పైఁచుచున్నది. లోక మందున్న ధూళికణములు గూడ లక్షయోజనముల దూరమం దున్న

సూర్యచంద్రగ్రహతారలతో నాడీయోగమున యుక్తమయి యున్న వి. ఏదియు నెవరికి ననావశ్యక మయినది గాదు. నిఖిలవిశ్వము తనయంశప్రత్యంశములను ప్రతియణుపరమాణువుల నొక విశాల కుటుంబమువలెఁ జేసి యొక్క రక్షణసూత్రముతో నొక్కపాలనసూత్రముతో సమకూర్చి యుంచినది.

ఆరక్షణశక్తి. యాపాలనశక్తి నానాకారములను ధరించి జగత్తునందు సంచరించుచున్నది; మృత్యువు దాని కొకరూపము; నష్టము దానికి మఱొకరూపము; దుఃఖము దాని కింకొకరూపము; ఆమృత్యు నష్టదుఃఖముల ద్వారమున నవనవావిర్భావములయొక్క లీలలానందముతో నభివ్యక్తమగుచున్నవి. జన్మమృత్యువుల లో, సుఖదుఃఖములలో, లాభనష్టములలో నన్నిటియందును 'శివమ్' శాన్తస్వరూపుఁడయి విరాజిల్లుచున్నాఁడు. లేనిచో నీభార ములనన్నిటి నొక్కముహూర్తమయిన నెవ్వరేని మోయఁగలరా? అట్లు గానిచో నేఁ డేది మనలను సంబంధబంధనములతోఁ బరస్పర ముల నాకర్షించుచున్నదో యది యాఘాతములచే మనలను బిండి పిండిగాఁ జేసెడిది. ఆలింగనమే పీడనముగా నుండెడిది. నేఁడు సూర్యుఁడు నాకు మంగళము చేయుచున్నాఁడు, గ్రహతారలు నాకు మంగళము చేయుచున్నవి; జలస్థలాకాశములు నాకు మంగళ మొనర్చుచున్నవి; విశ్వమం దున్నయొక్కవాలుకారేణువునైన నేను సంపూర్ణముగా నెఱుఁగను, దాని విశాలప్రాంగణమందు నే నింటిపిల్లవానివలె నిశ్చింతతో నాడుకొనుచున్నాను. నే నందఱివాఁడ నయినటులే యందఱును నావారే— ఇది యెటులు సంఘటిల్లినది?

ఎవఁ డీప్రశ్నమునకు జవా బయియున్నాఁడో యాతఁడే నిఖిలమం దున్న సకలాకర్షణములును, సకలసంబంధములు నయి, సకల కర్మములయందు నిగూఢముగా నుండి నిస్తుష్టుఁ డయి యంటిని రక్షించుచున్నాఁడు. ఆతఁడే శివమ్.

ఈశివస్వరూపుని సత్యముగా గ్రహింపవలయు నన్నచో మనముకూడ సమస్తాశివమును బరిహరించి శివస్వరూపమును దాల్పవలయును. అనఁగా శుభకర్మములలోఁ బ్రవృత్తులము గావల యును, శక్తిహీనతయందు శాంతిలేనటులఁ గర్మహీనతయం దెవ రును మంగళమును బొందఁజాలరు. ఔదాసీన్యమునందు మంగ ళము లేదు. కర్మసముద్రమును మథించుటచేతనే మంగళమం దున్నయమృతమును బొందనగును. మంచిచెడ్డలద్వంద్వముల ద్వార మునను దేవదైత్యులసంఘాతములద్వారమునను దుర్గమసంసారమా ర్గముయొక్క దురూహబాధల నన్నిటిని దొలఁగించుకొనఁగలిగిన యెడల మంగళనికేతనద్వారముకడకుఁ జేరగలము—శుభకర్మముల సాధనచేత సకలనష్టములను నాపదలను క్షోభవిక్షోభములను దాఁటి మనయపరాజితహృదయమందు మంగళమునే ధరింపఁగలిగినయె డల నాఁతడు 'శాన్తస్వరూపుఁడయి, శివస్వరూపుఁ డయి, యున్న టుల జగత్తున జరుగు సకలకర్మములయందును, సకలోత్థానపతన ములందును స్పష్టముగాఁ గాంచఁగలము. అపుడు ఘోరతరదుర్ల క్షణములను జూచినను భయపడము; నైరాశ్యఘనాంధకారమునందు మనశక్తులు పరాస్తము లయినను నచ్చటకూడ శివమ్ ఉన్నాఁడ నియే గ్రహింతుము.

ఆతఁ డద్వైతమ్. ఆతఁ డద్వితీయుఁడు; ఆతఁ డొక్కఁడు.

సంసారమునం దన్నిటిని వేఱుచేసి విచిత్రముగఁ జేసి గణింపఁగోరుదుమేని బుద్ధి యభిభూతమై పోవును. మనము పరాజితుల మైపోవుదుము. సంఖ్యాతీత మగునసిప్లై చిత్ర్యముల మహాసము ద్రమందు మనము పిచ్చివార మయి పోతేము; మనము చింతింపఁ గలుగుచున్నాము; అతిక్షుద్రుల మగుమనముకూడ నీయనంతవై చిత్ర్యములతో నొకవ్యావహారికసంబంధమును నిలుపుకొనఁగలుగుచున్నాము. ప్రతిభూతికణముసుగూర్చియు మనము స్వతంత్రముగా భావించవలసినపని లేదు; మనము సమస్తజగత్తు నొక్కటిగా స్వీకరింతుము; దానివలన నష్ట మేమియు లేదు. ఎన్నియో వస్తువులును నెన్నియో కర్మములును నెందఱో మానవులును లక్షల కొలఁదియుఁ గోట్లకొలదియు విషయములును మనజ్ఞానమునందిముడుచున్నవి.ఆబరువుచే మనహృదయములు నలిగిపోవుట లేదు. ఎందువలనఁ బోవుట లేదు ? గణనాతీత మగునమస్తవై చిత్ర్యములలో నేకత్వమును : సంచరింపఁజేసి యద్వైతమనునాతఁ డొక్కఁడే యున్నాఁడు. అందుచే బరువు లన్నియు తేలిక యగుచున్నవి. అందుచే మానవునిమనస్సు తనబరువుల నన్నిటినిఁ దేలిక చేసి కొని ముక్తినిఁ బొందుటకై యనేకులయం దాయద్వైతమునే వెదకుచున్నది. మనయందఱ నేకముచేసి యాయొక్కఁడే యుండనియెడల మన మెవరిని గ్రహించెడివారము గాము. మనలో నిచ్చిపుచ్చుకొనుట గాని పరస్పరముపై నెట్టి యాకర్షణము గాని యుం

డెడిది గాదు. మన మొకరిభార మొకరము, నొకరియాఘాతము నొకరము, నొకముహూర్త మైన నోర్చుకొనెడివారము గాము. అనేకమునం దైక్యముయొక్క సంధానమును బొందినంతనే మన బుద్ధికిఁ గల బడలిక దూర మగును. ఇతరులతో మనకుఁ గల యైక్యభావమును గ్రహింపఁగలిగినంతనే మనహృదయ మానంద మును బొందును. మనము ప్రధానముగఁ గోరుదానిలక్ష్యమే యాయైక్యము. మనము ధనమును గోరుదుము. ఎందువలననఁగా నొక్కధనమునందుఁ జిన్నపెద్దబహుతరవిషయము లైక్యమును బొందినవి. అందుచే బహుతరవిషయములను బ్రత్యహము వేఱు గా సంగ్రహించుటకుఁ బొందవలసిన దుఃఖముయొక్క విచ్ఛిన్నత ధనమువలననే దూరమగును. మనము ఖ్యాతిని గోరుదుము. కారణ మేమనఁగా ఒక్కఖ్యాతివలననే నానాలోకులతో మనకు సంబం ధము కుదురును. ఖ్యాతి లేనివా రందఱినుండి వేఱైనట్లు తోఁచును. మన మనమాలోచించి చూచినయెడలఁ బార్థక్య మున్నచోటనే మానవునకు దుఃఖము, క్లాంతి యున్నటులు గాంతుము. ఎందువ లన ననఁగా, మానవునిహృద్ధచ్ఛటనే యున్నది. ఆత్మీయుని సహవాసము నన్ను బడలనీయదు. స్నేహితుఁడు నాచిత్తమును బ్రతిహతము చేయఁడు. ఎవఁడు నావాఁడు కాఁడని యెఱుఁగుదునో యాతఁడే నా కాటంకము కలుగఁజేయును. అభావమువలనను విరో ధమువలనను గష్టపెట్టి నన్నాతఁడే పీడితునిగఁజేయును. లోక మునందు మనము సకలమేళనములందును, సమస్తసంబంధము లందును నేకత్వము ననుభవించి పొందు నానందమువలననే యద్వైతుఁడు ప్రకటితమగుచున్నాఁడు.

మనసకలాకాంక్షల మూలమునందును, జ్ఞానమునందును, అజ్ఞానమునందు నాయద్వైతుని సంధాన మిమిడియున్నది. అద్వైతమే యానందము.

అద్వైతునియొక్క యుపాసన మెట్లు చేయఁగలము? పరులను నావారినిగఁ జేసికొని యహమికను దగ్గించుకొని విరోధములనియెడుముండ్లను బెకళించుకొని ప్రేమమార్గమును బ్రశస్తము చేసి యాతని నుపాసన చేయనగును. ఆత్మవత్ సర్వభూతేషు యః పశ్యతి స పశ్యతి—సకలప్రాణులను దనవలెఁ జూచువాఁడె యథార్థముగఁ జూచుచున్నాఁడు. ఏల యనఁగా నాతఁడు సమస్త పార్థక్యములందును బరమసత్య మగు నద్వితీయునే చూచుచున్నాఁడు. అన్యుల నాఘాతము చేయఁబోయినపు డద్వితీయుని యొక్క యుపలబ్ధిని బోఁగొట్టుకొనుచున్నాము, అందుచే నాతనికి దుఃఖము కలుగఁజేసి మనము దుఃఖము పొందుదుము. మనస్వార్థము వైపునకుఁ జూచినపు డాయద్వితీయుఁడు ప్రచ్ఛన్నుఁడైపోవును. అందుచేతనే స్వార్థసాధనయం దింత దుఃఖము కలుగుచున్నది.

జ్ఞానమునందును గర్మమునందును బ్రేమయందును శాంతుని, శివుని, నద్వితీయుని నుపలబ్ధిజేయుక్రమ ముపనిషత్తులయొక్క "శాంతం శివ మద్వైతమ్" అనుమంత్రమం దెంత నిగూఢముగ నిహితమైయున్నదో యావిషయమునే యాలోచించి చూడుము. ప్రథమమున శాంతమ్. ఆరంభమందే జగత్తునం దున్న విచిత్రశక్తులు మానవుని నేత్రమునకుఁ బొడగట్టును. శాంతియందు దాని

పరిసమాప్తిఁ జూడనంతవఱకు నెన్నియో భయములు నెన్నియో సంశయములు నెన్నియో నిర్హేతుక మగుకల్పనలును గలుగుచుండును. సకలశక్తుల మూలమందును, నమోఘనియమములందును శాంతిస్వరూపుని గాంచఁగలిగినపుడు మనకల్పనలు శాంతిని బొందును. శక్తియం దాతఁడు నియమస్వరూపుఁడు. ఆతఁడు శాంతమ్. మానవుఁడు తన యంతఃకరణమందుఁ బ్రవృత్తిరూపముఁ దాల్చిన యనేకశక్తులతో సంసారమందుఁ బ్రవేశించును. వానిపైఁ గర్తృత్వమును బొందనంతవఱకు నడుగడుగున కాపదల నెదుర్కొనుచుండును. దుఃఖమున కంత ముండదు. కావున నీసమస్తశక్తులను శాంతియందు సమావేశపఱచుటయే మానవజీవితమునందుఁ బ్రథమ మైనకార్యము. ఈసాధనయందు సిద్ధిఁ బొందినపుడు జగత్తునం దసఖ్యాంకములగు శక్తులను నియమితము చేసి యాద్యంతరహితకాలములనుండియు స్థిరమై యున్న యాశాంతస్వరూపునే జలస్థలాకాశములందుఁ గాంతుము. ఇందుచే మనకు జీవితమునందుఁ బ్రథమాశ్రమము బ్రహ్మచర్యమై యున్నది— అనఁగా శక్తియందు శాంతిని బొందుసాధన.

అనంతరము శివమ్. నిగ్రహద్వారమున శక్తిని స్వాధీనపఱచుకొనఁ గలిగినయెడలఁ గర్మములు సహజ మగును. ఈవిధముగఁ గర్మముల నారంభించినపుడు నానాలోకులతో నానాసంబంధములవలన మనము చుట్టఁబడుదుము. ఈస్వపరసంబంధమునందే మంచిచెడ్డలును పాపపుణ్యములును నాఘాతప్రతిఘాతములును సంఘటిల్లుచుండును. శాంతి యెటుల శక్తిని యథోచితముగ నణఁచి

దానివిరోధభావమునుదొలఁగించునో అటులనే సంసారమం దాత్మప రులశతసహస్రసంబంధముల యనంతజటిలత్వమునందు సామంజ స్యము నెవ్వరు స్థాపింపఁగలరు? మంగళము స్థాపింపఁగలదు. శాంతి లేనియెడల జగత్ప్రకృతికిఁ బ్రళయము వాటిల్లును. మం గళము లేనియెడల మానవసంఘమునకు ధ్వంసము గల్గును. శాంత స్వరూపుని శక్తిసంకులజగత్తునం దుపలబ్ధి చేయవలయును. శివ స్వరూపుని సంబంధ సంకులసంసారమునం దుపలబ్ధి చేయవలయు ను. ఆతని శాంతస్వరూమును జ్ఞానమువలనను, నాతని శివస్వరూ పమును శుభకర్మములవలనను మనస్సునందు ధారణచేయవల యును. మనశాస్త్రములందు మొదట బ్రహ్మచర్యము ననంతరము గార్హస్థ్యము నవలంబింపవలసిన విధానము లున్నవి. మొదట జ్ఞానమువలన దయారగుట, తరువాతఁ గర్మములవలనఁ బరిపక్వ మగుట. మొదట శాంతమ్, అనంతరము శివమ్.

అనంతర మద్వైతము; ఇచ్చటనే సమాప్తి. జ్ఞానమం దును సమాప్తి లేదు. కర్మములయందును సమాప్తి లేదు. ఎందు లకు నేర్చుకొనవలయును? ఎందులకుఁ బరిశ్రమచేయవలయును? అనుదాని కొకకవిధ మైనపరిణామ మున్నది. ఆపరిణామమే యద్వైతము, అదియే నిరవచ్ఛిన్న మగుప్రేమ. అదియే నిర్వికా రానందము. మంగళకర్మములసాధనయందుఁ గర్మబంధనములు క్షీణించినపుడును, నహంకారతీవ్రత యణఁగిపోయినపుడును నాత్మ పరులనెడుసకలసంబంధములవిరోధములు నమసిపోయినపుడును నమ్రతవలనను క్షమవలనను గరుణవలనను బ్రేమమార్గము సిద్ధ

మగును. అపు డద్వైతము. అపుడు సకలసాధనలును సిద్ధిపొందును. సకలకర్మములు నవసాన మొందును. అపుడు మానవజీవితము ప్రారంభమునుండి పరిణామమువఱకును బూర్ణ మగును. అది యిఁకనెన్నటికిని నసంగతముగను నసమాప్తముగను నర్థహీనముగను నుండదు.

ఓపరమాత్మా! మానవజీవితమునందు సకలప్రార్థనలయందు నొకగభీర మగుప్రార్థన మున్నది. దానిని మేము గ్రహించినను గ్రహింపకపోయినను, మేము నోరితో నుచ్చరించినను నుచ్చరింపక పోయినను మాభ్రమయందును, మాదుఃఖమునందును, మాయంతరాత్మనుండి యాప్రార్థన మెల్లపుడు నీవైపునకు మార్గమును వెదకికొనుచున్నయది. ఆప్రార్థన యే దనఁగా, మాసమస్తజ్ఞానముచేతను శాంతస్వరూపుని గ్రహింతుముగాక! మాసమస్తకర్మములచేతను శివస్వరూపుని జూచెదముగాక! మాసమస్తప్రేమలచేత నద్వితీయుని నుపలబ్ధి చేసికొందుముగాక! ఫలమును బొందుప్రత్యాసను నీకెఱిఁగింపఁజాలము. కాని నాకోరిక యేమనఁగా సమస్తవిఘ్నవిక్షేపవికృతులయందు నీప్రార్థన సమస్తశక్తితో సత్యభావముతో నీయొద్దకుఁ జేరుగాక! ఓయంతర్యామీ! ఇతర సకలాభీప్సితములను వ్యర్థముచేసి నాయీప్రార్థననే స్వీకరింపుము. నే నెల్లపుడును జ్ఞానమునందును గర్మమునందును బ్రేమమునందును నీవు "శాంతమ్" "శివమ్" "అద్వైతమ్" అనువిషయమునే గ్రహింతునుగాక! ఓమ్! శాంతి, శ్శాంతి, శ్శాంతిః.

---

# పితృబోధము 10.

ప్రాణవస్తువును నాచారవస్తువునుగఁ జేసివైచుటచే దాని వలన మన కెంతటినష్టము వాటిల్లుచున్నదో మన కది ప్రతిదినమును గోచరింపదు. కాని మన క్షుత్పిపాసలను ప్రవంచనతోఁ బరితృప్తిఁజెందింపలేము. అన్నజలమును నిజముగ నన్నజలమువలెనే వాడుచుందుము. ధన మెవ్వరిని ధనికునిగఁ జేయదో, ఖ్యాతి ప్రతిపత్తు లెవ్వని అలాభమున విహీనతములై యుండవో, సంసారవ్యాపారప్రవాహముపై నెవ్వనిలాభనష్టము లాధారపడి యుండవో, అట్టి మన యంతరితుఁడగు చిరంతనమానవునకు దినదినమును వస్తువు లీయక కేవలము నామముతో వంచితునిగఁ జేయుచున్నాము. ఆతనికి మనమన్నమీయక మంత్రములతోఁ బని నెఱవేర్చుకొనుచున్నాము. ఆతఁడు కోరున దన్నిటికంటె గొప్పది. అందుచే నన్నిటికంటె శూన్యము నిచ్చి యాతనిని నిలువఁబెట్టి సమస్తప్రయోజనములను నెఱవేర్చుకొను నాతురతఁ జెందుచుందుము.

మన యీబాహ్య సాంసారిక మానవునకును మనయంతర్గతమానవునకును జాల భేదము కలదు. ఈబాహ్యమానవుని మనమాదరించినను నవజ్ఞపఱచినను, ఉపహారమిచ్చినను భిక్షపెట్టినను దాని నాతఁడు పొందును— సత్యముగ నిచ్ఛతో శ్రద్ధతో నొసఁగనియెడల నాయాంతర మానవునియొద్ద కేదియుఁ జేరఁజాలదు.

అందుచే దానవిషయమయి శాస్త్రమందు "శ్రద్ధయా దే

యమ్" శ్రద్ధతో దానముచేయు మని చెప్పఁబడియున్నది. ఏల యనఁగా, మానవుని బాహ్యాభ్యంతరములందు రెండు విభాగములున్నవి. ఒకవిభాగమునందు ధనము సమకూడును, మఱొక విభాగమునందు శ్రద్ధ సమకూడును. అందుచే శ్రద్ధఁ జూపక కేవలము ధనమే యిచ్చినయెడల మానవుని యంతరాత్మ కేదియు నీయక పోవుటయేగాక దాని నవమానపఱచుటయే యగును. అట్టిదానమెప్పుడును సంపూర్ణదానము కానేరదు— కావున నాదానము సంసారదానము కావచ్చును. కాని యది ధర్మముయొక్క దానము కానేరదు. మనము పరుల కిచ్చునదియే దానము కాదు. వస్తుతః ప్రతిముహూర్తమందును మనము మనయొద్దనే మనలను దానము చేసికొనుచున్నాము— ఆదానమువలననే మనప్రకాశము. ప్రతిముహూర్తమందును మనము మనలను మనయందే దాహ మొనర్చుకొనుచున్నా మని యంచ తెలుఁగుదురు. ఆదాహము గావించుటయే మన ప్రాణక్రియ. ఈవిధముగా మనయొద్ద మనల నాహుతి నొనర్చుకొనుట బంధింపఁబడినపుడు ప్రాణాగ్ని యింక వెలుఁగదు, జీవనప్రకాశ మంతమొందును. ఈవిధముగ మనన క్రియలయందును నానావిధములగు క్షీణదశలయందును జింతనమును మేల్కొల్పవలయును. అందుచే మనప్రకాశమును మేల్కొలుపుటకై మన మహరమును మనయం దొకయజ్ఞము నొనర్చి శక్తివంచనలేక మనలను దానము చేసికొనుచున్నాము. ఆదానముయొక్క సంపూర్ణత్వముపై మనప్రకాశముయొక్క సంపూర్ణత్వమున్నది. దీపము తన నెంతదానము చేసికొనిన దాని వెలుతు

రంత యుజ్జ్వలముగ నుండును. తనయెడలఁ దనదానోపకరణము లెంతవిశుద్ధముగ నున్న దానిశిఖ యంత ధూమశూన్యముగ నుండును. మన ప్రకాశయజ్ఞమంతయు మన నిరంతరదానమునుగూర్చియు నట్టివిషయమే చెప్పఁదగును.

ఆదానము మనవలన జరుగుచునే యున్నది. కాని, యేమి దానము చేయుచున్నామో, యది యెచ్చటఁ జేరుచున్నదో యావిషయము మనము చూడవలయును, దినమంతయుఁ జెమటూర్చి పరిశ్రమ చేసి ప్రోగుచేసి పొందిన బాహ్యవస్తువుల నన్నిటిని మన మెవనిహస్తమునందుఁ గూడఁబెట్టుచున్నారము ? అది యంతయు బాహ్యముననే సంపాదింపఁబడినటులఁ గాంచుచున్నాము. ధనధాన్యములు, గృహములు మొదలగునవన్నియు బాహ్యమానవునకుఁ జెందినవి.

మనము మనలను దానము చేయుటయేగాక మన ప్రయత్నములను మనసమస్తమును దానము చేయుచున్నాము— ఇది పూర్ణమైనట్టియు, శ్రద్ధతోఁ గూడుకొన్నట్టియు, ధర్మమునకుఁ జెందినట్టియు దానమా ? దీనివలన మన ముపకరణములను బెంచుకొనుచున్నారము గాని, పెద్దవారము కాఁజాలకున్నారము. దీనివలన మనము సుఖపడుచున్నాము గాని, యానందమును బొందుటలేదు. దీనివలన మనప్రకాశము పరిపూర్ణ మగుటలేదు. మానవుఁడనిన నెంతయర్థ మిచ్చునో, యంతవ్యక్త మగుట లేదు.

ఇట్లు జరుగుటకుఁ గారణమేమి ? కారణ మేమనఁగా దీనియందుఁ జాల నశ్రద్ధ కలదు. ఈదానమువలన మనము మనపై

నశ్రద్ధఁ జూపుచున్నాము. మనము మనయొద్ద ధరించినయర్ఘ్యము వలననే మనయందు వరణీయమయిన దేమియు లే దని యంగీకరించుచున్నాము. మనయాత్మపూజ దేవతకుఁ జెందిన పూజ కాదు; అది యపదేవతాపూజ; అది మిక్కిలి యవజ్ఞతోఁ గూడిన పూజ. మనయందున్న యపవిత్రతవలననే యా నైవేద్యమును నింపుచున్నాము.

తనకొఱకు ధనగౌరవములను సంపాదించుమానవుఁడు తనసత్యమును నమ్మఁజాలకున్నాఁడు. ఆతఁడు తనయంతరమానవుని సేవల నవమానపఱుచుచున్నాఁడు. ఆతని కాతఁ డేమియు నీయకుండుటయేగాక యిచ్చుటకు యోగ్యుఁ డని కూడఁ దలంచుటలేదు. ఈవిధముగ నాతఁ డతనికొఱకు ధన మిచ్చుచున్నాఁడు గాని శ్రద్ధ చూపుట లేదు—"శ్రద్ధయా దేయమ్" అను నీయుపదేశవాణి నన్నిటికంటె వ్యర్థపుచ్చుచున్నాఁడు.

కాని సత్యమును మన మెంతతృణీకరించినను దానిని మనము వినాశము చేయఁజాలము. మన యాంతరసత్యమానవుని మన మెల్లపుడు నభుక్తునిగ నుంచుచున్నాము. అందువలనఁ గలుగు దుర్గతి నేయారామమువలనను నేయాడంబరమువలనను మఱుఁగుపఱుపఁజాలము. మనము దేనిసేవఁ జేయుచున్నామో యది మనలను బ్రతికింపలేదు. మన మెవనిభోగసామగ్రిని సమకూర్చుచున్నామో యాతఁడు మనచిరానందమార్గమునకు సంబళముగ స్వీకరించునట్టి యొక్కచిల్లిగవ్వయైనను మన కియ్యఁడు. ఆరామావరణమును ఛిన్నము చేసి వెచి దుఃఖదిన మాహ్వానింపఁబడకయే

మన సుసజ్జితగృహములమధ్యమున రేతెంచి నిలుచును.అపుడు మన రక్త మిచ్చియైనను దానికోర్కెను నిశ్శేషముగ నొనర్పఁజాలము. పిడుగువోలె నకస్మాత్తుగ మృత్యు వరుదెంచి మనసంసారమర్మ స్థానములయం దొకగొప్పశూన్యతను గలిగించినపుడు రాసులురాసు లగు ధనజనమానములతో నాశూన్యతను నింపఁజాలము. ఒక వైపున ధారముచే జీవితసామంజస్యము నష్టమయి పోవునప్పు డును, బ్రవృత్తులతోఁ బ్రవృత్తులకు సంఘర్షణ లేర్పడినప్పుడును, దుద కొకవైపున లోలోపలఁ బాపోత్తాప మభివృద్ధి చెంది వినాశ దావానలము భగ్గుభగ్గున మండుచున్నపుడు నేమానవులను నేసైన్య సామంతులను బిలిచి దానిపై నొక్కబిందెడునీళ్లు పోయు మని చెప్పఁగలము ? మూఢుఁడా ! నీవెవ్వనిని బ్రబలముగఁ జేసి బల శాలి వైతివి ? ఎవనికి ధనదానముచేసి నీవు ధనికుఁడవు కాఁగల్గి తివి ? ఎవనిని బ్రతిదినమును రక్షించి నీవు శాశ్వతముగ బ్రదికి పోయితివి ?

మనయాంతరసత్యమానవుఁ డేయాశ్రయముకొఱకు దారి యందుఁ గాచి యున్నాఁడు? మన మిన్నినాళ్లాతని కెట్టియాశను గలి గించితిమి? బాహ్యాంగణమందు మనము ధూపదీపములను వెలిఁగిం చితిమి. కాని యంతర్గృహకోణమున మనము సంధ్యాదీపమయినను వెలిఁగింపలేదు. రాత్రి గభీరముగ నున్నది. అంధకారము నిబిడమై నది. అతఁ డొంటరిగ నాగృహమున నిబిడాంధకారమున ధూళిపైఁ గూర్చుని యేడ్చుచున్నపుడు మనము గంట గంట కెటుల నాతని కాశ్వాసము గలిగించితిమి ?

ఆతని యామర్మభేదిరోదనము నిశీథరాత్రియొక్క పరి మోదసభయందు మాటిమాటికిని మన కెక్కువ యాటంకమును గలిగించుచుండెను. మనమత్తతయం దాతనియాగభీరాక్రందనము మనప్రమత్తభావమును బలుమాఱులు తొలఁగింప నుపక్రమించి నపుడు మన మాతని నేదో యొకవిధమున నాఁపియుంచుట కాతని ద్వారమువెలుపల నిలువఁబడి యుచ్చకంఠముతో "భయములేదు, నేనున్నాను" అని యాతనితోఁ జెప్పితిమి. నేనున్నానను విషయ మన్నిటికంటె గొప్పయభయమంత్రము కాఁబోలు నని తలంచితిని. నాసమస్త ధనసంపదలను మానమర్యాదలను నొక్కమమతాసూత్రముతో జపమాల వోలెఁ గూర్చి యాతని హస్తమందుంచి దీనినే నీవు దివారాత్రములు తిరిగితిరిగి యేక మనస్సుతో నేను నేను నేను, నేను సత్యము, నేను పెద్దవాఁడను, నేను ప్రియమయినవాఁడ నని జపించుచుండుమని చెప్పియుంటిని. దానినే యాతఁడు నేను నేను నేను అని జపించుచున్నాఁడు. కాని యాతని నేత్రములనుండి యశ్రుబిందువులు పడుట యాఁగలేదు. ఆతనియంర్నిహితమగు నేమహావిషాదమో యశ్రుబిందువులమా లను ధరించి లేదు లేదు లేదు, కాదు కాదు కాదు, అని జపించు కొనుచున్నది. ఏతపస్వినియొక్క కరుణావీణయందో యిట్టియుదా సీన భైరవవస్వరముతో నామహావిషాదము సమస్తాకాశమును గం పించునటుల నాక్రందనము చేయుచున్నది—వ్యర్థమయినది, వ్యర్థ మయినది—ప్రభాతకాలముయొక్క నాలోకము వ్యర్థమయినది, రాత్రి

వేళ నిస్తబ్ధతవ్యర్థమయినది—మాయను వెదకితిని, ఛాయను బొందితిని. ఎక్కడ నేదియుఁ జిక్కలేదు.

ఏయభయవాణికొఱకు నాయీయంతర్యానవుఁ డుత్కంఠితుఁడయి చెవి యొగ్గి యున్నాఁడు ? అది యాచిరకాలపు సత్యవాణి, పితా నోసి—పితా ! నీవే యున్నావు.

నీవు తండ్రివై యున్నావు, నీవున్నావు—మాతండ్రిని నీవేయై యున్నావు—ఈవాణివలననే సమస్తశూన్యమును నిండిపోయినది. సకలభారములును దొలఁగిపోయినవి. ఎట్టిభయ మెచ్చటను లేదు.

"నే నున్నాను" అనున దెంత భయంకరమగు మిథ్య ! ఎక్కడ నున్నావు, నీ వెక్కడ నున్నావు ? నీవు భవసముద్రమునందలి యేఫేనమునో యాశ్రయించి "నేనున్నా"నని నుడువుచున్నావు. ఏబుద్బుద మెపుడువగిలిపోయినను దానివలన నీకే నష్టము కలుగుచున్నది; సంసారమందు దీర్ఘనిశ్వాసముయొక్క లేశమాత్రమగు వేఁడిగాలి నీదేహమున సోఁకుచున్నను నది నీసత్తపై నాఘాతము వేయుచుండును. నీవు దేనిపై నున్నావు ? నీ వెవరవు ? ఐనను నాయాంతరమానవుఁడు "కావలయు" నని నుడువుచున్నపుడు నే నున్నాను, నీవు నన్నే కోరుచున్నావు, నీవు నాతోనే సంతుష్టి చెంది యుందుము. అని నీ వహంకారముతో నాతనితోఁ జెప్పుచున్నావు. ఈనీదాన మెట్టిది ! నీప్రకాండమగుబరువును మోయుహా రెవరు ? ఇది భయంకరమైన బరువు ! ఇది వస్తువులపై వస్తువులను, క్షుత్తులపై క్షుత్తులను, దుర్భిక్షములపై దుర్భిక్షము

లను రాశీకృతముగాఁ జేయుట; ఇది నిన్నాశ్రయించుట కాదు; నిన్ను మోయుట, నీవు కుంటివాఁడవు, నీకు పాదములు లేవు, నీ వన్యులపై నాధారపడి సంసారమునఁ దిరుగాడుచుందువు. నీ యీ బరువెచ్చటి దచ్చటనే పడియుండి ధూళితోఁ గలిసిపోవుచుండు నుగాక ! ఏమానవుఁడు యాత్రికుఁడో, ఎవఁడు పథమునఁ బథికుఁడో, యనంతునియభిముఖమున కెవనికిఁ బిలుపు కలదో, యాతఁడు నీయీభారమును మోయుచు నెందులకుఁ దిరుగవలయును? ఈసమస్తరాసులపై రాత్రింబవళ్లు తనవక్షమునందు దాఁచియుంచి పడియుండుట కాతని కవకాశ మెక్కడిది ? అందుచేత నాతఁ డెవనిపై భారముంచి నిశ్చింతగ నుండఁగలఁడో, ఎవనిభారము నాతఁడు మోయవలసినపని లేదో, యట్టివానినే కోరుచుండును. నీ వాయాధారమవా ? "నే నున్నాను" అను మంత్రము నేయాశను గలిగించుటకు నీ వాతని కర్ణముకడ జపించుచున్నావు !

పితా నోసి—— తండ్రివి నీ వున్నావు. నీ వున్నావు——ఇది నాయంతరమున నేకమాత్రమంత్రము. నీ వున్నా వనువిషయముతో నాజీవితమును జగత్తునందున్నసమస్తమును బూర్ణమయియున్నది, "సత్యమ్" అని ఋషీశ్వరులు నిస్నైకాగ్రతతో జపించుచున్నారు - ఆమాట కర్థ మేమనఁగా, "పితా నోఽసి" తండ్రివి నీ వున్నావు. ఏది సత్యమో, యది కేవలము సత్యమే కాదు. అదియే నాకుఁ దండ్రి.

కాని నీ వున్నా వను నీబోధమును సమస్తమనఃప్రాణములతోఁ బొందవలెను. నీ వున్నావు——ఇది కేవల మొకమంత్రము

కాదు—నీవున్నావు. ఈవిషయము కేవలము తెలిసికొని యుంప వలసిన యొకమాట కాదు. "నీ వున్నావు" ఈబోధమును నేను పూర్ణముచేసి యేతేరకున్నచో నే నీజగత్తునకు వచ్చు టెందులకు? నానావస్తువులను గట్టిగఁ బట్టుకొని కొన్నా ళ్లెందుల కిటులఁ దిరుగుచుంటిని—తుద కెందుల కీయసంలగ్న నిరర్థకతయందు హఠాత్తుగ దినము లంతము నొందుట ?

నే నున్నా ననునీబోధమునే నేను రాత్రింబవ ళ్లన్నిసమయములలో నభ్యాసము చేసికొంటిని. జీవితమునందు సకలప్రయత్నములలోఁ గేవల మీయుహామునే నానావిధములుగ స్వీకరించితిని. ప్రతిదినముయొక్క సమస్తఖజానా నాతనిహస్తమందు జివరపై సవఱకు జమకట్టితిని. నేను అనుబోధము సంపూర్ణముగా నస్థిమజ్జలతోఁ గలిసిపోయినది. అది మిక్కిలి దుఃఖము గలుగఁజేయుచున్నను దాని నన్యమనస్సుతో దృఢముగఁ బట్టుకొందును. దానిని మఱవ నిచ్చగించినను మఱవలేను.

అందుచే మనప్రతిదినప్రార్థన యేమనఁగా, పితా నో బోధి-నీవు తండ్రివి, నీ వున్నా వను నీసత్యబోధముతో నాసమస్తజీవితమును బూర్ణముఁ జేయుము.

తాపముచే జలము బాష్పాకారముఁ దాల్చి తేలికయై పైకెగయుచుండును. అపు డది లోకమునందున్న సమస్తజలరాశితోఁ దనసంబంధమును వేఱుచేసికొనును—అపు డది వ్యర్థమై యుటికి యెగురుచుఁ దిరుగుచుండును. అపుడే యది యాలోకము నావృతముఁ జేయును. కాని యట్లున్నను జలముయొక్క యథార్థస్వధర్మ

ము సమతలమును గోరునని యందఱు నెఱుంగుదురు. ఆసమతల మును గోరుటయే దానినమస్కారప్రార్థన--ఆ సమస్కారమువలననే యది తనరసధారలతో నలువైపులను ప్రవాహితమగుచుండును. భూమిని సఫలత్వముతో నభిషిక్తము చేయుచుండును—దానియా ప్రణతసాష్టాంగనమస్కారమే సమస్తలోకమునకును గళ్యాణము. ఏలఘుబాష్పరాశి వేత్తై యాకాశమునఁ దిరుగుచు నడుగుననున్న భూమితోఁ దన యాత్మీయతను స్వీకరింపఁగోరదో, దాని శరీర మున శుభముహూర్తమునందు రసవాయువు తగిలినంతనే, యది తనయథార్థమగుగౌరవముతో నిండినంతనే తన నింకఁ బట్టియుం పఁజాలదు—నమస్కారముతో విగళితమయి యాసర్వజనుల నిమ్న క్షేత్రమున నాయందఱికేంద్రమునకు వచ్చి పొరలుచుండును. అపుడే నీటితో నీరు కలిసిపోవును; అపుడే మేళనస్రోతము నలు వైపులఁ బ్రవహించుచుండును; వర్షసంగీతముచే నలుదిక్కులు ముఖరితము లగుచుండును. ప్రతిజలబిందువు నపుడే తనను సత్య రూపముగఁ బొంది తనధర్మమునఁ దాను బూర్ణమయిపోవును.

అటులనే నాయాంతరమానవుఁడు ప్రతియంతరమునందును దనను వర్షింపఁజేయుటకును, దనను సమర్పించుకొనుటకును గోరు చున్నాఁడు. ఇదియే యాతని యథార్థధర్మము. అతఁడు యహం కారాటంకములను సంపూర్ణముగ విలుప్తము గావించి నమస్కార గౌరవమునే గోరుచున్నాఁడు—పరిపూర్ణప్రణతితో నిఖిలమునం దున్నసమస్తముతోఁ దనబృహత్తరసమతలత్వమును బొందుట కాతఁడు చిరకాల ముత్కంఠితుఁడయి యున్నాఁడు. తన యా

యంతరతమస్వధర్మమును బొందనంతకాలమే యాతఁ డెన్నియో దుఃఖములను, ఎంతయో యపమానమును బొందవలసియున్నది. అందుచే నాతఁడు ప్రతిదినమును జేతుల జోడించి నమస్తేస్తు— నీకు నమస్కారమును జేయఁగలుగుదును గాక యని నుడువు చున్నాఁడు.

---

# చిరనవీనత్వము 11.

మనము చింతించుచుఁ బను లొనర్చుచు యుద్ధము సల్పుచు నున్నప్పుడు చిరంతనమైన యీజగత్తు క్లాంతిచే నవసన్నమై భావనలచే భారాక్రాంతమై ధూళిచే ధూసరితమై పడియున్నదని మన మెల్లపుడును దలంతుము. ఇట్టిసమయములోఁ బ్రత్యూషమునఁ బ్రభాత మేతెంచి పూర్వాకాశప్రాంతమున నిలిచి స్మితహాసముతో నింద్రజాలకునివలె జగత్తుపైనున్న యంధకారావరణమును నెమ్మదిగా నపసారితము గావించును. అపు డంతయు నవీనముగ నున్నటులను సృష్టికర్త యాముహూర్తమునందే జగత్తును బ్రథమమున సృష్టించినట్లుగను మనకుఁ గాన్పించును. ఈప్రథమకాల చిరంతననవీనత్వ మిం కెన్నఁటికి సంత మొందునది గాదని ప్రభాతము మనకు బోధించుచున్నది.

నేఁడు మనకుఁ గాన్పించిన దిన మీనాఁటిదా ? ఇది యేయుగారంభమున జ్యోతిర్బాష్పావరణమును ఛిన్నము చేసికొని

యాత్ర నారంభించెనో దాని నెవరు లెక్కింపఁగలరు ? ఈదినము యొక్క నిర్నిమేషదృష్టిసమక్షమునఁ దరళ మగు పృథివి కాఠి న్యము వహించెను. కఠినపృథివియందు జీవననాటక మారంభ మాయెను. ఆనాటకమునం దొక్కొక్కయంకమునం దెన్నియో నూతనప్రాణులు తమజీవలీలల నారంభించుకొని సాంగము చేసి కొనినవి. ఈదినము మానవేతిహాసమునం దెన్నియో విస్మృత శతాబ్దముల కాలోకమును బ్రసాదించినది. కొన్నిచోట్ల సింధుతీర ములందును మఱికొన్నిచోట్ల మరుప్రాంతములందును నింకఁ గొన్నిచోట్ల నరణ్యచ్ఛాయలయందును నెంతయో గొప్పనాగరికత జన్మించినటులను వికసించినటులను వినాశ మొందినటులను ఆదిన ము గాంచినది. పృథివి తన ప్రథమజన్మముహూర్తమునందే యీ యతిపురాతన మగుదినమును దనకుప్రాంచలమును బఱిచి స్వీకరిం చెను. సౌరజగత్తుయొక్క సకలగణనముల నది ప్రథమసంఖ్యనుం డియే యారంభించెను. ఆయతిప్రాచీనదినమే చిరునగవుతో నేఁటిప్ర భాతమున మననేత్రసమక్షమున వైణికుఁడగు ప్రియదర్శనబాలకుని వలె వచ్చి నిలిచినది. ఇది సంపూర్ణముగ నవీనత్వముయొక్క మూర్తి—సద్యోజాతశిశువువలె నవీనమయినది. ఇది యెవనిని స్పృశించిన నాతఁ డపుడే నవీనుఁ డయిపోవును. ఇది తనకంఠ హారమునఁ జిరయౌవనవముయొక్క స్పర్శమణి నమర్చుకొని యేతెంచును.

దీని కర్థ మేమి ? దీని కర్థ మేమనఁగా—చిరనవీనత్వమే జగత్తుయొక్క యంతర్నిహితధనము. జగత్తుయొక్క నిత్య

సామగ్రి. పురాతనత్వము జీర్ణత్వము దానిపైనుండి ఛాయవలె వచ్చుచున్నది, పోవుచున్నది, చూచుచుండఁగనే యదృశ్యమయి పోవుచున్నది, దీని నేవిధమున నాచ్ఛన్నముఁ జేయఁజాలకున్నది. జర మిథ్య, మృత్యువు మిథ్య, క్షయము మిథ్య; అవి మరీచికలవంటివి. జ్యోతిర్మయాకాశమువయి నవి ఛాయవలె నృత్యము చేయును. నృత్యము చేయుచుఁ జేయుచు నవి దిక్ప్రాంతముల కంతరాళమున విలీనము లయిపోవును. సత్యము కేవలము శాశ్వతమగు నవీనత్వము. ఎట్టినష్టము దాని నంటఁ జాలదు. ఎట్టియాఘాతమును దానియందుఁ బడదు—ప్రతిదినప్రభాతమునం దీవిషయమే ప్రకటితమగుచున్నయది.

ఈపృథివియందున్న యీయతిపురాతనదినము ప్రతిప్రభాతమునందును నూతనజన్మను బొందవలసియున్నది. ప్రత్యహ మది యొకసారి తనమూలస్థానమునకుఁ దిరిగి వెళ్లవలసియున్నది. లేనిచో నది దానిమూలస్వరమును బోఁగొట్టుకొనును. ప్రభాతము దానికిఁ దనచిరకాలపు ధూమము నొకసారి చూపించుచుండును. దానిని మఱవనీయదు. దినము క్రమముగ నొకేవిధమున నడచుచున్నయెడలను, దాని కెచ్చటను గనుపూఁతలు పడనియెడలను, ఘోరతరకర్మముల యాతురత్వమునందును, శక్తియొక్క యౌద్ధత్యమునందు నున్నవు డొక్కసారి సుగభీరాంధకారమునందుఁ దనను నిమగ్నముగఁ జేసికొననియెడలను, అనంతరము మరల నాయాదిమనవీనత్వమందుఁ దననవజన్మము నొందనియెడలను దుమ్ముపై దుమ్ము, నావర్జనముపై నావర్జనమును బెరిఁగిపోయె

డిది—ప్రయత్నములక్షోభచే, నహంకారముల తాపముచేఁ, గర్మ ముల భారముచే దాని చిరంతనసత్య మాచ్ఛన్నమయిపోయెడిది. అట్లయినయెడల మధ్యాహ్నతీవ్రతయుఁ, బ్రయాసాప్రబలత్వమును గేవలము లాగి తీసికొనుట, కేవలము దెబ్బలు తినుట, కేవల మంతహీనమార్గము, కేవల లక్ష్యహీనమగుయాత్ర - - వీని యున్మ త్తతయొక్క తప్తబాష్పము లేకమయి పృథివి నొక్క బుద్బుము వలె విదీర్ణము చేసి వైచెడివి.

ఇంకను దినముయొక్క విచిత్రసంగీతము తనసమస్త మూర్ఛనలతో మ్రోఁగలేదు. కాని యీదిన మగ్రసర మయిన కొలఁదిని గర్మసంఘాతము లభివృద్ధిఁ జెందును. అనైక్యములు, విరోధభావములు నుగ్రరూపముఁ దాల్చును. చూచుచుండఁగనే లోక మంతటను దీవ్రోద్వేగములును క్షుధాతృష్ణలక్రందనధ్వను లును బ్రబలము లగును. ప్రతిద్వంద్వముల తర్జనగర్జనములు విపు లము లగును. కాని, యవి యన్నియు నటుల జరుగుచున్నను స్నిగ్ధప్రభాతము ప్రతిదినమందు దేవదూతవలె నేతెంచి ఛిన్నతం తువులను మేళవించి, యేమూలస్వరమును మ్రోయించునో అది యెంతసరళమైయుండునో, యంతయుదారమయియుండును. ఎంత శాంతముగ నుండునో యంత గంభీరముగ నుండును. దాని యం దెట్టితృష్ణలేదు, సంఘర్షణలేదు, ఖండత్వము లేదు, సంశయ మును లేదు—అది యొక బృహత్తరమగు సమగ్రతయొక్కయు సంపూర్ణత్వముయొక్కయు స్వరము—నిత్యరాగిణులమూర్తి యతి సౌమ్యభావముతో దానినుండి ప్రకాశించుచుండును.

ఈవిధముగఁ బ్రతిదినమును బ్రభాతముయొక్క నోటినుండి మనము తిరిగి యీవాణినే వినుచున్నారము—కోలాహల మెంత విషమించిన నదియే చరమ మయినది కాదు. అసలు వస్తువు "శాంతమ్." అదియే యాదియం దున్నది. అదియే యంతరమం దున్నది, అదియే యంతమునం దున్నది. అందుచేతనే దినము యొక్క సహస్రోన్మత్తతానంతరము ప్రభాతమున మరల నాశాంత మును జూచినపు డామూర్తియం దెట్టియాఘాతచిహ్నము గాని, ధూళికణము గాని లేనటులఁ గాంతుము. ఆమూర్తి చిరస్నిగ్ధ మయినది, చిరశుభ్రమయినది, చిరప్రశాంత మయినది.

సమస్తదినమును సంసారక్షేత్రమునందు దుఃఖదైన్యమృత్యువుల యాందోళనములు జరుగుచునే యున్నవి. కాని సమస్తా కళ్యాణమే చరమమయినది కాదనియు, "శివమ్" అనునదియే చరమమ్మయిన దనియుఁ బ్రతిదినమును బ్రభాతమున మన కొక వాణి చెప్పుచున్నది. ప్రభాతమునందు దాని నిర్మలమూర్తిని జూతుము. అచట నష్టరేఖ లేమియు లేనటులను సమస్తమును బూర్ణ మయి యున్నటులను గాంతుము. ఏబుద్బుద మెపు డదృశ్య మైనను సముద్రమున కణుమాత్రమయిన నష్టము లేనటులే గాంతుము. మననేత్రసమక్షమున నేది యెంత తల్లక్రిందులైనను సమస్తమును ధ్రువమయియున్నటులను, నేదియుఁ గదలలేనటులను గాంతుము. ఆదియందు "శివమ్." అంతరమందు "శివమ్." అంతమునందు "శివమ్."

సముద్రతరంగము లుప్పొంగుటఁ జూచినపుడు సముద్ర

మింక జ్ఞాపక ముండదు-అవియే యసంఖ్యాకములయిన వనియు, నవియే ప్రకాండమయిన వనియు, నవియే ప్రచండమయిన వని యుఁ దోఁచును. అటులనే సంసారమందున్న యనైక్యములే విరోధములే యన్నిటికన్నఁ బ్రబలము లయినవిగఁ గన్పట్టును. మిగిలిన విషయము లేమియు మనకల్పనలయందుఁ బొడకట్టవు. కాని ప్రభాతముఖబింబమునం దొకమేళసవార్త యున్నది. చెవియొగ్గి మన మది వినఁ గలిగినయెడల నీవిరోధములే యీయనైక్యములే చరమమయినవి గావనియు "అద్వైతమ్" అనునదియే చరమ మయిన దనియు మనము వినఁగలము. మనము నేత్రసమక్షమునఁ బోరాటముల కంతు లేనటులఁ గనుఁగొందుము. కాని యనంతరమున ఛిన్నవిచ్ఛిన్నతల కెట్టిచిహ్నమయినను గన్గొనఁ జాలము. విశ్వమునకు మహాసేతువయిన దేమాత్రమును గదల లేదు. గణనాతీతములగు నవైక్యముల నొక్కవిపులమగు బ్రహ్మాండమందు బంధించి, "ఆయద్వైతమ్" ఆయేకమాత్రుఁ డగు నొక్కఁడు కూర్చుని యున్నాఁడు. ఆదియం 'దద్వైతమ్,' అంతమం 'దద్వైతమ్,' అంతరమం 'దద్వైతమ్.'

మానవుఁడు యుగయుగములందుఁ బ్రతిదినమును బ్రాతఃకాలమున దినారంభమునఁ బ్రభాతపుఁబ్రథమజాగ్రదాకాశమునుండి, "శాంతమ్" "శివమ్" "అద్వైతమ్" అనునీమంత్రమునే యంతర్బాహ్యములందు వినఁగలిగెను. ఒకసారి తనసమస్తకర్మముల నాఁపియుంచి తనసమస్తప్రవృత్తులను బ్రశాంతపఱిచి, నవీనాలోకముయొక్క యీయాకాశవ్యాప్తమగు "శాంతమ్, శివమ్, అద్వై

ఱమ్" అను నీవాణి నాతఁడు స్వీకరింపవలసివచ్చెను. ఇట్లెన్నియో వేలకొలఁదివత్సరములనుండి ప్రతిదిన మీయొక్కవాణినే, యాతని కర్మారంభముల కీయొక్కదీక్షామంత్రమునే యనుసరింపవలసి వచ్చెను.

ప్రథమమునం దెవ్వఁ డుండెనో, యాతఁడే నేఁడుకూడఁ బ్రథముఁ డయియే యున్నాఁ డనునదియే యథార్థమగు సత్యము. ప్రతిముహూర్తమునం దాయన సృష్టిని జేయుచున్నాఁడు. నిఖిలజగత్తిప్పుడే ప్రథమమున సృజింపఁబడిన దనినను నతిశయోక్తి కానేరదు. జగత్తొకదినమున నారంభమయి యనంతరము దానిధారము నదియే వహించి యొక్కసరళమార్గముననే యీడ్చుకొని పోవుచున్నదను విషయము సత్యము కాదు. జగత్తు నెవరును మోయుటలేదు. జగత్తు కేవలము సృష్టింపఁబడుచున్నది—ఎవఁడు ప్రథముఁడో, జగత్తాతనినుండియే ప్రతినిమిషమునం దారంభ మగుచున్నది—అప్రథముని సంబంధము నేవిధముగను విడనాడ లేకున్నది—అందుచేతనే ఆరంభమునఁ బ్రథముఁడు, ఇపుడును బ్రథముఁడే, ఆరంభమందు నవీనుఁడు, ఇపుడును నవీనుఁడే. విచైతి చాంతే విశ్వమాదౌ—విశ్వారంభమునందును ఆతఁడు, అంతమునందును ఆతఁడు, ఆతఁడే ప్రథముఁడు, ఆతఁడే నవీనుఁడు, ఆతఁడే నిర్వికారుఁడు.

ఈసత్యమునే మన ముపలబ్ధి చేయవలయును—మనము ప్రతిముహూర్తమునందును నవీనులము గావలయును—మనము తిరిగి తిరిగి యాతనియందే జన్మమును బొందవలయును. పద్యము

ప్రతిమాత్రమాత్రకును దనఛందస్సునందు సమాప్త మగుచుం డును—ప్రతిమాత్రమాత్రయందును మూలచ్ఛందస్సును నూతన ముగ స్వీకరించును. అందుచే సమగ్రముగా దాని ప్రత్యేకాంశ ముయొక్క యోగము సుందరమగుచుండును. అటులనే మనము కూడఁ జేయవలసియున్నది. మనము ప్రవృత్తులమార్గమందును స్వాతంత్ర్యమార్గమందును నొక్కరీతిగా నడచిపోవుటకు వీలు లేదు—మనచిత్తము తిరిగి తిరిగి యామూలమునకు మరలివచ్చు చుండును—ఆమూలమునకు మరలివచ్చి దానియందు సమస్తచరా చరములకును దనకును గలయఖండయోగమును బలుమార్లనుభ వింపఁ గలిగినపుడే యది మంగళ మగును, అపుడే యది సుం దర మగును.

ఇట్లు కానియెడల నందఱితో నేయోగమున మనమంగ ళము కలదో, మనస్థితి కలదో, మనసామంజస్యము కలదో, ఏయో గము మన యస్తిత్వమూలమునసున్నదో, దానిని విసర్జించి మన మత్యంతౌన్నత్యమును బొందు నేర్పాట్లు చేయఁగల మని తలంచి నను, మనస్వాతంత్ర్యమునే సంపూర్ణముగ నిత్యమయినదిగను నుత్కటమయినదిగను జేయ యత్నింపఁదలంచినను, అది యెంత మాత్రమును సఫలముగాఁగాని, స్థాయిగాఁ గాని కానేరదు. ఒక గొప్పవిధ్వంసమునం దది యవసాన మొందవలసియుండును.

జగత్తునందు జరిగిన విప్లవము లన్నియు నిటులనే జరిగి నవి. పరితాప మొక్కస్థానమునఁ బుంజీభూతమయినపుడే వర్ణముల, కులముల, ధనరాసుల, శక్తిసామర్థ్యముల భాగవిభాగములు, భేద

విభేదములు పరస్పరులవ్యవధానములను దుర్లంఘ్యముగఁ జేసికొనినపుడే సంఘమందుఁ దుపానుద్భవించుచున్నది. ఎవఁడద్వైతమో, ఎవఁడు నిఖిల జగత్తునందున్న సమస్తవైచిత్ర్యముల నొందారులసీమ నతిక్రమింపనీయఁడో, ఆతని నేతాకిగాఁ ద్యజించి జయము పొందఁగలమను శక్తి యేరాజునకు నేరాజ్యమునకుఁ గలదు ? ఏల యనఁగా, ఆయద్వైతునితో యోగమందే శక్తి గలదు. ఈయోగోపలబ్ధిని శీర్ణ మొనర్చినయెడల దుర్బలత్వ మేర్పడుచున్నది. అందుచేతనే యహంకారమును వినాశమునకు మూల మనుచున్నారు. అందుచేతనే ఐక్యహీనతయే శక్తిహీనతకుఁ గారణ మని యందురు.

అద్వైతుఁడే జగత్తన కాంతరతరరూపుఁడుగా విరాజిల్లుచున్నయెడలను,నందఱితో యోగసాధనయే జగత్తునకుమూలతత్త్వమయినయెడలను, స్వాతంత్ర్య మనువస్తు వెచ్చటనుండి వచ్చునా యనుప్రశ్న మనస్సునం దుదయింపఁగలదు. స్వాతంత్ర్యముకూడ నాయద్వైతమునుండియే వచ్చును. స్వాతంత్ర్యముకూడ నాయద్వైతునియొక్క ప్రకాశమే.

జగత్తునం దున్నయీస్వాతంత్ర్యము లన్నియు నెట్టివి ? గానముయొక్క తానమువంటివి . తాన మెంతదూర మరిగినను గానమును నిరాకరింపలేదు. ఆగానమూలమున దానికి యోగ ముండును. ఆయోగము నది తిరిగి తిరిగి చూపించుచుండును. తానము గానమునుండి హఠాత్తుగా బయల్వెడలినపు డది వేఱై యెగిరిపోవుచున్నదా యని తోఁచును. కాని, యది యెగిరిపోవుట

కేవలము మూలగానమునకు మరలివచ్చుటకును, మరలివచ్చురస మును గాఢము కావించుటకునై యున్నది. తండ్రి లీలాచ్ఛలమునఁ దనరెండుచేతులతో శిశువు నాకాశమువైపున కెత్తునపు డాతఁడాబిడ్డను దూరముగఁ బాఱవైచుచున్నాఁడా యని తోఁచవచ్చును ఆ బిడ్డమనస్సునందుఁగూడ నొకవిధమగు భయ ముదయింపవచ్చును. కాని ఒకసారి యట్లు లాశిశువును పైకెగురవైచి మరలఁ బరముహూర్తమందే యాతనిని దనయొడియందుఁ జేర్చుకొనును. తండ్రియొక్క యీలీలయందు సత్యమగు వస్తువేది? ఒడియందుఁ జేర్చుకొనుటయే సత్యమగు వస్తువయి యున్నది. ఆయననుండి పైకెగవేయుట కాదు. విచ్ఛేదభావమును భయమును గలిగించునది సత్యమగువిచ్ఛేదము కొఱకుఁగాదు, విచ్ఛేదము లేదను నానందమును దృఢపఱచుటకే యైయున్నది.

కావున గానముయొక్క తానమువలె మనస్వాతంత్ర్యముయొక్క సార్థకత మూలైక్యము నుల్లంఘింపక దానినే యింకను నధికముగా బ్రకాశింపఁజేయునంతవఱకే యయియున్నది. సమస్త మూలమునందే "శాంతమ్ శివమ్ అద్వైతమ్" ఉన్నదో దానితోఁ దనయోగమును స్వీకరించునంతవఱకే యయి యున్నది— అనఁగా! ఏస్వాతంత్ర్యము లీలారూపమున సుందరమయినదో, దానిని విద్రోహరూపమున వికృతముచేయనట్టిది. విద్రోహి యైనచో మానవునకుఁ బరిత్రాణ మెక్కడిది? ఎంతదూర మేఁగిననాతఁ డెచ్చటకుఁ బోఁగలఁడు? ఆతనిలోనికిఁ దిరిగి వచ్చు సహజమార్గము నాతఁడు గ్రహింపలేకున్నను బ్రవృత్తుల వేగమున

వాయువువలె నెగిరిపోవఁ గోరినను, ఏవిధముగను నిఖిలము యొక్క యామూలము సంగీకరింపకపోయినను నాతఁడు తిరిగి రావలసియే యుండును. కాని యాతిరిగివచ్చుట ప్రళయము వలనను బతనమువలనను సంఘటిల్లును—ఆతఁడు విదీర్ణుఁడయి, దగ్ధుఁడయి తనసమస్తశక్తియొక్క యభిమానమును భస్మముచేసికొని నపుడు తిరిగి రావలెను. ఈమాటను బలపఱచి సమస్త ప్రతికూల సాక్ష్యములకు విరుద్ధముగ భారతవర్ష మిట్లు ప్రచారము చేసియుండెను—

అధర్మే ణైధతే తావత్ తతో భద్రాణి పశ్యతి
తతః సపత్నాన్ జయతి సమూల స్తు వినశ్యతి.

అధర్మముద్వారా లోకులు వృద్ధి పొందుదురు. దానియందే వారిష్టసిద్ధిని గాంతురు. దానివలననే వారు శత్రువులనుగూడ జయింతురు. కాని సంపూర్ణముగ మూలమునుండి వినాశము నందుదురు. ఏల యనఁగా, సమస్తమునకు మూలమునందున్నవాఁడు శాంతుఁడు, మంగళమయుఁడు, ఒక్కఁడు. ఆతనిని దాఁటి పోవుటకు వీలులేదు. కేవల మాతనిలోనికే తిరిగివచ్చి యాతనినే నిబిడముగఁ బొందునంతవఱకే, విచ్ఛేదముద్వారమున నాతని ప్రకాశము ప్రదీప్తమగునంతవఱకే యాతని నుల్లంఘించి నడువ నగును.

అందుచే భారతవర్షమందు జీవనారంభమందే యామూల స్వరముతో జీవితములు చక్కఁగ బంధించుకొను నేర్పాటు లుండెను. మనవిద్యయొక్క యుద్దేశ్యముగూడ నదియే. ఈయనం

తుని స్వరముతో స్వరమును మేళవించుటయే బ్రహ్మచర్యమై యుండెను——మిక్కిలి విశుద్ధముగను నిర్మలముగను జేసి సకల తంతుల నామూలగానమున కనుగతము గావించి యుచితరీతిని శ్రుతిని మేళవించుటయే జీవనముయొక్క మూలసాధనమై యుండెను.

ఈవిధమున బంధింపఁబడియుండినయెడలను మూలగాన మనుకూలముగ శ్రుతిఁ గూర్పఁబడి యుండినయెడలను అనంతరము గృహస్థాశ్రమమం దిష్టానుసారముగఁ దానమును బలికింపవచ్చును. దానివలన స్వరలయలకెట్టి స్ఖలనముసుండదు. సంఘమునందు నానాసంబంధములయం దాయొక్కనిసంబంధమునే విచిత్రభావములతోఁ బ్రకటింప నగును.

స్వరమును బోషించుకొనుచు గానమును నేర్చుకొనుటకు మానవుఁ డెన్నియోదినములు సాధనచేయవలసియుండును. అటులనే సమస్తమానవజీవితము, ననంతుని రాగిణితోఁ గూర్పఁబడిన యొకసంగీత మని గ్రహించినవారుగూడ సాధనయం దశ్రద్ధఁ జేయలేరు. స్వరమును గ్రహించుటకును కంఠమును సత్యముగ నొనర్చుటకును వారు యోగ్యులగు గురువులయొద్ద ననేకదినములు సంయమసాధనఁ జేయుటకు సంసిద్ధులయి యుండిరి.

అనంతరము గృహస్థాశ్రమమం దెన్నియోకర్మములు, నాయవ్యయములు, లాభనష్టములు, నెన్నియోవిచ్ఛేదమేళనములును దటస్థించుచుండును. కాని యీవిక్షిప్తతయే చరమమయినదికాదు. దీనివలన నెంతదూర మరుగుట కవకాశము గల్గునో, అంతదూర మేఁగి తిరిగి రావలసియుండును. గృహము నిండిపోయినపుడు, భాండాగా

రము పూర్ణమయినపుడు దానియందే యాబద్ధమయి కూర్చున్నయె డల జరుగనేరదు—మరల ప్రశస్తమయినమార్గమున బయలుదేఱ వలసియుండును—మరల నాముక్తాకాశము, నావనచ్ఛాయ, ఆధన హీనమైనట్టియు, నుపకరణహీనమైనట్టియు జీవనయాత్ర. ఎట్టి యాభరణములు గాని, యెట్టి యావరణములు గాని, యెట్టిబాహ్యో యోజనములుగాని యచ్చట లేవు. మరల నావిశుద్ధస్వరమునకు నాసమత్వమునకుఁ దిరిగి వచ్చి శాంతిని బొందవలయును. ఎచ్చట నుండి యారంభమయ్యెనో యచ్చటికే ప్రత్యావర్తనము చేయవల యును—కాని, యీప్రత్యావర్తనము మధ్యావకాశమందుఁ గర్మ ములవలనను వైచిత్ర్యములవలనను గభీరత్వము నొందును. యా త్రచేయునపుడు స్వీకరించుసాధనయుఁ, దిరిగి వచ్చునపుడు తనను దానము చేయుసాధనయును జేయవలయును. ఆనందమునుం డియే సకలజీవులజన్మ మనియు, నానందమునందే సకలజీవుల జీవ నయాత్ర యనియు, నాయానందములోనికే సకలజీవులును మరలి పోవుచున్న వనియు నుపనిషత్తులు నుడువుచున్నవి. విశ్వజగత్తు నం దీయానందసముద్రమునఁ గేవలము తరంగలీల లుప్పొంగు చున్నవి. ప్రతిమానవుని జీవనమును దీనిఛందస్సుతో మేళవించు టయందే జీవితముయొక్క సార్థకత గలదు. ప్రథమమునం దీయు పలబ్ధి నాతఁడు పొందవలయును—ఆయనంతానందమునుండియే యాతఁడు మేల్కొనుచున్నాఁడు. ఆనందమునుండియే యాతని యాత్రారంభము. అనంతరము కర్మముల వేగముచే నాతఁ డెంత దూరము పరుగిడినను, ఆయనంతానందసముద్రమునందే యాతని

లీలలు జరుగుచున్న వనియెడి యనుభూతి నాతఁడు రక్షించుకొను నుగాక!—అనంతరము కర్మములను సమాప్తి చెందించి మరల నాతఁ డతిసహజముగ నతుఁడయి, యాయానందసముద్రము నందే తనసమస్తవిక్షేపములను బ్రశాంతపఱుచుకొనును. ఇదియే యథార్థమగు జీవనము—ఈజీవితముతోనే సమస్త జగమునకును మిళనము—ఆమిళనమునందే శాంతి, మంగళము, సౌందర్యములు ప్రకాశించును.

ఒకప్పు డీలోకమున నగ్నశిశువునై ప్రవేశించితిని—ఓ చిత్తమా! నీవపు డాయనంతనవీనత్వముయొక్క క్రోడమునందుఁ గ్రీడించుదానవు. అందుచే నాదినమున నీయొద్ద నన్నియు నవరూపములై యుండెను. ధూళిధూసరమందును నీకపు డానందమే యై యుండెను. లోకములోని సమస్తవర్ణగంధరసములలో నేది నీహస్తమునొద్దకు వచ్చిపడినను దానినే నీవు లాభముగా గ్రహించెడిదానవు, దానముగా స్వీకరించెడిదానవు. ఇది పురాతన మయిన దనియు, నది సాధారణ మయిన దనియు, దీనికెట్టి విలువ లేదనియు నీవిపుడు నుడువ నేర్చుకొనియున్నావు. ఈవిధముగా జగత్తునందు నీయధికారము సంకీర్ణ మయిపోవుచున్నది. జగత్తటులనే నవీనమయి యున్నది; ఏల యనఁగా నిది యనంతరససముద్రమునఁ బద్మమువలె రసముపైఁ దేలియాడుచుండును; నీలాకాశనిర్మలలలాటమున వార్ధక్యచిహ్నము లేమియును గాన్పింపవు; మనశైశమునాఁటి యాచిరస్నేహితుఁడగు చంద్రుఁడు నేఁడును బ్రతిపౌర్ణమియందును జ్యోత్స్నాలోకదానసాగరవ్రతమును బాలిం

చుచున్నాఁడు. షడృతువులపుష్పపల్లైరము లిప్పుడుగూడ నటులనే తమంతట నవియే నిండిపోవుచున్నవి; రజనీనీలాంబరాంచలము నుండి నేఁడుగూడ నొక్కముత్యమయినను జాఱిపోలేదు. నేఁడు కూడఁ బ్రతినిశాంతమునఁ బ్రభాతమునఁ దనబంగారుబరణియం దాశారహాస్యము నుంచుకొనివచ్చి జగత్తునందున్న ప్రతిప్రాణి యొక్క ముఖము వైపునకుఁ జూచి నేను నీకేమి తెచ్చితినో చెప్పుము చూత మని నవ్వుచు నవీనత్వము నుడువుచున్నది! అట్లయిన నింక జగత్తునందు జర యేది ? జర కేవలము కోరకముయొక్క పైరేకువలెఁ దనను విదీర్ణము గావించుకొని విదలించుకొనుచుండును. చిరనవీనతయొక్క పుష్పమే లోనుండి వికసించుచుండును. మృత్యువుకూడ కేవలము తనను తానే ధ్వంస మొనర్చుకొనుచున్నది- అది దేనిని తొలఁగించినను దానివలనఁ దననే తొలఁగించుకొనుచున్నది. లక్షలకొలఁది కోట్లకొలఁది వత్సరములనుండి యది యీజగత్తు నాక్రమించుచున్నను ఈజగత్పాత్రమునందున్న యమృమున కణుమాత్ర మేని నష్టము గలుగలేదు.

ఇపుడు నీవు నవీనత్వమునందు జన్మింపుము. నీనలువైపుల నున్న జరాజీర్ణత్వముయొక్క బాహ్యావరణము మంచువలె విలీనమయి పోవుఁగాక; చిరనవీనుఁ డగుచిరసుందరుని నేఁడు నీసమక్షమునందే చూడుము—మీ శైశవముయొక్క సత్యదృష్టి తిరిగి వచ్చుఁగాక, జలస్థలాకాశములు రహస్యముతోఁ బూర్ణమయి పోవుఁగాక, మృత్యువుయొక్క యాచ్ఛాదనమునుండి బయటికి వచ్చి నిన్నుఁ జిరయౌవనదేవతవలె నొకసారి చూచుకొనుము;

అందఱి నమృతపుత్రులనుగా నొకసారి గ్రహింపుము. సంసారముయొక్క సకలావరణములను భేదించుకొని నేఁ డొకసారి యాత్మను దర్శింపుము—అది యొక గొప్పమేళనమందు నిమగ్నమయి నిస్తబ్ధమయి యున్నది. అది యంత నిబిడమయినది, నిగూఢమయినది, ఆనందమయ మయినది ! ఎట్టి క్లాంతియు లేదు, జర లేదు, మ్లానత లేదు. ఆమేళనమురళి జగత్తుయొక్క సమస్త సంగీతమునందును మ్రోఁగుచున్నది. ఆమేళనసజ్జ సమస్తాకాశమునందును వ్యాప్తమైయున్నది. ఈజగత్తంతటను వ్యాపించిన సౌందర్యమున కొక్క యర్థమే కలదు. నీకును దానికిని మేళనము కల్గుటచేతనే యింతశోభయు, నిట్టి యాయోజనములును గాన్పించుచున్నవి. ఈసౌందర్యమునకు హద్దు లేదు. ఈయాయోజనములకు నష్టము లేదు. చిరయౌవనమా ! నీవు చిరసుందరుని బాహుపాశములతో శాశ్వతముగ బంధింపఁబడినావు— సంసారముయొక్క సకలావరణములను దొలఁగించి సకలలోభమోహాంధకారముల యావర్జనమును దాఁటి నేఁ డొకమా ఱాచిరదినానందమందుఁ బరిపూర్ణభావముతోఁ బ్రవేశింపుమీ—నీజీవితము నీజగత్తును సత్యమగుఁగాక, జ్యోతిర్మయ మగుఁగాక, అమృతమయమగుఁగాక !

---

# చిన్న—పెద్ద 12.

సత్యమునుండి యవిచ్ఛిన్నము చేసి తత్త్వవిషయములను వాక్యములందుఁ గూర్చినపుడు వానినిగుఱించి తర్కవితర్కము లొనర్చుట సులభము. కాని ద్రష్ట యనంతపురుషుని సమస్తసత్యమునందును గాంచి, ఏషః— అతఁ డిదిగో యనినపు డింక నెట్టి వాదోపవాదములును జరుగవు. "సీమ" శబ్దముతో నొక "నా"ను జేర్చి మనము "అసీమ" అనుశబ్దమును రచించి, యాశబ్దమును శూన్యాకారముగఁ జేసి వృథాగా భావింపఁ బ్రయత్నింతుము, కాని అసీమ మనునది "నా" కాదు. అతఁడు నిబిడనిరవచ్ఛిన్న మగు "అవును"—అందుచేతనే యాతనిని "ఓమ్" అని ధ్యానము చేయఁగలుగుచున్నారము—'ఓమ్' అనునది అవును, ఓమ్ అనునది సమస్తము నేకము చేసి సమస్తముతోఁ గలిసియున్న యఖండపరిపూర్ణత్వము. మనయం దది ప్రాణవస్తువు—మాటలతో దానిని వ్యాఖ్యానము చేయఁబూనుచు మేని యది ప్రతిముహూర్తమునందును ధ్వంసమగుచున్నటులను మృత్యువుయొక్క మూలముగను గనుఁగొందుము. కాని తర్కము చేయక మన యంతర్నిహితసహజబోధముచేఁ గాంచినయెడల మనప్రాణము తనప్రతిముహూర్తపు మృత్యువు నతిక్రమించి యున్నటులఁ గనుఁగొందుము. మృత్యువుయొక్క "కాదు" అనుదానిచేత దానిపరిచయమును బొందనేరము. మృత్యువునందున్న యాప్రాణమే "అవును."

సీమయం దసీమ మటులనే "ఓమ్." తర్కముచేయక

యుపలబ్ధిచేఁ జూచినయెడల సమస్తమును నడచుచున్నట్లును సమస్తమును స్ఖలిత మగుచున్నట్లును గాంచినను, ఒకయఖండము యొక్కబోధము తనయంతట నదియే నిలిచిపోవుచున్నట్లును, సమస్తపరివర్తనములును సమస్తగతాగతములును జరుగుచున్నను నాయఖండబోధమునందే స్నేహితుని స్నేహితునిగ గ్రహించుచున్నామని గాంచననును. నిరంతరము సమస్తచలనమును దాఁటి స్థిరముగ నుండునదియే మనబోధము నంది విరాజిల్లుచున్నది. స్నేహితుని మనము బాహ్యబోధముచేత ఖండఖండములుగఁ జేసి చూచుచున్నాము. ఒకప్పుడు నేఁడును మఱియొకప్పుడు కొన్నాళ్లతరువాతను, ఒకప్పు డొకఘటనయందును మఱియొకప్పు డింకొకఘటనయందును, ఆతనిగుఱించి నాబాహ్యబోధ నొక్కచోఁ జేర్చి చూచినచో దానిపరిమాణ మత్యల్పముగ నుండును, కాని దానిని గుఱించి యంతరమం దుదయించిన నిరవచ్ఛిన్నబోధముయొక్క పరిమాణమున కంతము లేదు, నాసమస్త ప్రత్యక్షజ్ఞానతీరములను దాఁటి యెచ్చటికో వెడలినది, గతించినకాలముగూడ దానిని బట్టుకొనలేకపోయెను. సమాగతకాలము నాటంకపఱుపలేకపోయెను. మృత్యువుసహితము దాని నాబద్ధము చేయలేకపోయెను. నాస్నేహితుని ప్రతిక్షణమునందును బ్రతిఘటనయందును వేఱువేఱుచేసి చూచితిని. ఆసీమావచ్ఛిన్నదృష్టిని సునిర్దిష్టభావముతో స్మరించుకొనవలయుననినచో మనస్సోడిపోవును—కాని సమస్తఖండజ్ఞానసీమను నన్నిదిక్కులను దాఁటిపోయి నాస్నేహితునియొక్క యేపరమానుభూతి యసీమునియందు నిరంతర ముపలబ్ధి చేయఁబడినదో, యదియే

సహజమయినది. కేవలము సహజమగుటయేగాక యానందమయ నది. మనప్రియజనుల సమస్తానిత్యతయొక్క సీమను బూర్ణము చేయుచున్న యొకచిరంతనుని ననాయాసముగను నానందముతోను జూచునటులఁ చెమసహజవిపులబోధముచే సంసారమునందు సమస్తచలనముయొక్క యంతర్ణిహితాసీమస్థిరత్వము నేకాంతముగ ననుభవించినవారే, "ఏ షాస్య పరమా గతిః, ఏ షాస్య పరమా సంపత్, ఏ షోస్య పరమో లోకః, ఏ షోస్య పరమానంద" అని నుడువఁగలిగిరి. ఇది జ్ఞానియొక్క తత్త్వవిషయము గాదు. ఇది యానందముయొక్క నిబిడానుభవము! ఏషః=ఈతఁడు (మిక్కిలి నికటమునందున్నయీతఁడు) జీవునిపరమగతి, పరమధనము, పరమాశ్రయము, పరమానందము—ఆతఁ డొకవైపున గతియై యున్నటుల మఱొకవైపున నాశ్రయమయి యున్నాఁడు, ఒకవైపున సాధనమయి యున్నటుల నింకొకవైపున సిద్ధి కానందమయి యున్నాఁడు.

నాస్నేహితుని నాచేతులతోఁ దయారుచేసికొనలేదు. చేతులతోఁ జేసికొనవలసి వచ్చినయెడల నాతనితో నాకెప్పుడును సత్యమగు స్నేహము కుదురనేరదు. స్నేహితుని బాహ్యప్రకాశము నాచేష్టలకును నాకల్పనలకును నిరపేక్షమయినది. అటులనే యనంతస్వరూపుని ప్రకాశముకూడ నేను సంగ్రహించిన యుపకరణముల నపేక్షింపలేదు. ఆతఁ డనంతుఁ డగుటచేతనే తనసహజశక్తియందే తనను బ్రకటించుకొనుచున్నాఁడు. ఆతఁడు మనలను సృజించినప్పుడాతఁడు తనను మన యంతర్బాహ్యములందు మానవునకు ధన

ముగఁ బట్టువడి యున్నాఁడు. ఆతనిని రచించుభార మాతఁడు మనపయి నుంచలేదు. ప్రభాతారుణప్రకాశము నాదే యయి యున్నది. వనముయొక్క శ్యామలశోభయు నాదియే. పుష్పము వికసించిన దెవనికొఱకు ? పృథివీవీణాయంత్రమునందు ధ్వనించుచున్న నానాస్వరముల సంగీత మెవనికొఱకు ? మాతృక్రోడము నందున్న శిశువును, స్నేహితుని దక్షిణహస్తమును బట్టుకొనిన స్నేహితుఁడును, గృహమునందును గృహమువెలుపలను బ్రేమింపఁబడినవారును నాప్రియజనులు. వీరియం దేయనిర్వచనీయానందము ప్రసారిత మగుచున్నదో యాయానంద మాయానందమయుని నిజహస్తరచితాసనమయి యున్నది. ఈయాకాశవినీలోల్లోచనము క్రిందను, జననియగు వసుంధరపైఁ జిత్రవిచిత్రరూపములతోఁ జిత్రింపఁబడిన రంగవల్లికల వరణవేదికపై నాసమస్తాత్మీయుల నడుమను ఆ "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" ఆనందరూపముతో నమృతరూపముతో విరాజిల్లుచున్నాఁడు.

ఈసమస్తమునుండియు నాతనినిజాత్మదానమునుండియు నవచ్ఛిన్నము చేసి యేకల్పనలతో నిర్మించి స్వతంత్రముగఁ జేసి యాతని నేకుడ్యములయందుఁ బట్టియుంచెదను ? అది మనయొద్ద సత్యమయి యుండునా? మఱియు నెవఁ డంతర్బాహ్యములయందు నిండి నిబిడీకృతమయి యుండి నిత్యనవీనశోభతోఁ జిరసుందరుఁడై యున్నాఁడో, యాతఁడుతత్త్వవిషయ మగునా ? అట్లయిన నీనీలాకాశ మెందుకు ? అమావాస్యాపటావకుంఠనముపయి నిన్ని తారల తళుకుబెళుకు లెందులకు ? వసంతకాలోత్తరీయ మెగిరి

వచ్చి పుష్పసౌరభములతో దక్షిణానిలుని నున్మత్తునిగఁ జేయుచెం దులకు? అట్లయినచో సృష్టి వృథా యయిన దని నుడువవలసియుం డును. అనంతుఁడు తాను స్వయముగ దర్శన మిచ్చుచున్నచోట నాతనితో మిళిత మగుట కెట్టియుపాయముకూడ లేదని చెప్పవలసి యున్నది. ఆయన సంతర్పణ జరుగుచున్నచోట నుపవాసములు తగ్గుట లేదనియుఁ, దల్లి యేయన్నమును స్వహస్తములతోఁ దయా రుచేసి సిద్ధముగఁ గూర్చుండి యున్నదో, సంతానమునకు దాని యందుఁ దృప్తి లేదనియు, ధూళిధూసరములచే నాతఁడు స్వయ ముగ రచించిన క్రీడాన్నమువలననే యుదరపూరణ మగు ననియుఁ జెప్పవలసియున్నది.

ఈమాట లన్నియు దుర్బలులయొక్కయు నుదాసీనులయొ క్కయు మాటలయి యున్నవి—మార్గమున నడువక దూరమునఁ గూర్చుండి యీమార్గమునఁ బోలే మని నుడువువారిమాటలును నై యున్నవి. ఒకపిల్లవాఁ డొకసులభ మగుపద్యమును వల్లించు చుండెను. నీవు చదువుచున్నపద్యమునం దేమున్న దనియు, దాని నుండి నీ వేమి గ్రహించితి వనియు నే నాతని నడిగి యుంటిని. ఆవిషయ ముపాధ్యాయులు చెప్పి యుండ లేదని యాబాలుఁడు నుడివెను. పాఠశాలయందుఁ బాఠము వల్లెవేసి యాపద్యమునుండి తనమనస్సుతో గ్రహించున దేదియు లేదని యాతని కొకయభి ప్రాయము గలిగియుండెను. ఉపాధ్యాయుఁ డావిద్యార్థికిఁ బ్రతి పదార్థమును వ్యాకరణమును దెలియఁజెప్పెను గాని రసమును దన హృదయముచేతనే గ్రహింపవలయు ననియు, నుపాధ్యాయుఁడు

నేర్పిన జ్ఞానమువలనఁ గా దనియు నాతనికిఁ దెలియఁజేయలేదు. గ్రహించుట యనఁగా, నొకశబ్దమునకుబదులు మ ఱొకశబ్దము నుపయోగించుట యని యాతఁడు తలంచెను. "సుశీతల" శబ్దము నకు బదులు "సుస్నిగ్ధ" శబ్దమును బ్రయోగించుట. ఇంతవఱ కుపాధ్యాయుఁ డాతని కాశను గలిగింపలేదు. ఆతని మనస్స్వాధీన తను సంపూర్ణముగ నపహరించెను. సహజముగ గ్రహించు విష యమునుగూడ గ్రహింపఁగల నను భావమే యాతనికి లేకుండెను. అందుచే భయమువలన నాతఁడు తనసహజశక్తిని బ్రయోగింప లేదు—నాకుఁ దెలియలే దని యాతఁడు నుడువును. ఆతఁడు గ్ర హింపలే దని మనము చెప్పుదుము. అలహాబాదుపట్టనమందు గంగా, యమున అను నీరెండునదు లేకముగఁ గలిసిన స్థానమును జూపించి భూగోళతరగతియందున్న యొకవిద్యార్థిని బిలిచి, నది యనఁగా నెట్టివస్తువు? నీవు దాని నెపుడయినఁ జూచితివా? యని యుపాధ్యాయుఁడు ప్రశ్నించెను. లే దని విద్యార్థి నుడివెను. భూగోళపటమునందున్న నదియొక్క సంజ్ఞ నాతఁ డనేకప్రహార ములు తిని నేర్చుకొనియెను. ఏనది నాతఁడు నేత్రములతో రెండు వేళలఁ జూచుచుండునో, యాతఁ డానందముతో దేనియందు స్నా నము గావించెనో, యానదియే తనభూగోళవివరణముయొక్క నది యనియు, నాతఁడు బహుదుఃఖము నొంది పరీక్షయం దుత్తీర్ణుఁ డగుటకుఁ దోడ్పడిన నది యదియే యనియుఁ దలంచుటకు సాహ సము లేకుండెను.

అట్టులనే మనక్షుద్రపాఠశాలోపాధ్యాయు లనంతుని నేకాం

తద్భావముతో మనయందును సమస్తమునందును బ్రత్యక్షముగ నుప లబ్ధి చేయవచ్చు ననువిషయము మన కెవ్విధముననుదెలియనీయ లేదు. అందుచే ననంతస్వరూపుఁడు మనగృహ మందంతటను నిండి లోకమం దంతటను నిండియుండి తాను స్వయముగా దర్శన మొ సంగినచోట మనము గ్రహింపలే మనియు, మనము చూడఁజా లకపోయితి మనియు నుడివితిమి. గ్రహింపవలసిన దేమున్నది ? ఈ ఏషః, ఈ యాతనినే. నేత్రములు చల్లఁబడినవి, ప్రాణము నిండిపోయినది, పర్ణగంధగీతములతో నిరంతరము మనయింద్రియ వీణయం దాయన హస్తస్పర్శ తగులుచున్నది; స్నేహప్రేమసఖ్య ములతో మనహృదయమునం దెన్నియో రంగులు ఫలించుచు న్నవి; ఎంతయో మాధుర్య ముద్భవించుచున్నది; దుఃఖరూపమును ధరించి యంధకారపథద్వారమునఁ బరమకళ్యాణము మనజీవన సింహద్వారములకడ కేతెంచి యాఘాతములు వేయుచున్నది; మన సమస్తప్రాణమును గంపించుచున్నది; వేదనచే పాషాణము విదీర్ణ మయి పోవుచున్నది; ఆయన యనేకాశ్వముల రథమును, మానవేతి హాసపురథము నెన్నియో యంధకారమయము లగునిస్తబ్ధరాత్రుల ద్వారమునను గోలాహలమయము లగుదినములవలనను బంధుర పథములందు యాత్ర సలుపుచున్నవి; ఆయన విద్యుచ్ఛిఖామయ మగుకొరడా యపుడపుడు నాకాశమును మిఱుమిట్లు గొలుపుచు న్నది— ఈ యేషః. ఈ యితఁడే. ఆ యాతనిని సమస్తజీవన మనస్సులలో నా వానినిగఁ జేసికొని నేను గ్రహింతును. ప్రతిదిన ఘటనయందును నే నాతని స్వీకరింతును. ఉత్సవదినమున విశ్వ

వాణిని విజయకంఠమున ధరించి యాతనిని ఘోషింతును—ఆ సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మనే, ఆ శాంతం శివ మద్వైత మునే, ఆకవిర్మనీషీ పరిభూః స్వయంభూఃనే, అనేకుల ప్రయోజనములను గంభీరముగఁ బూర్ణము గావించుచున్న యాయొక్కనినే, ఆయంతహీనునే, జగత్తున కాదియందును నంతమునందును బరివ్యాప్తమయి యున్నవానినే, ఎవని శుభయోగముచే మనబుద్ధి శుభబుద్ధిగఁ బరిణమించునో, యట్టి మహాత్మా సదా జనానాం హృదయే సన్నివిష్టః యనువానినే.

నిఖిలమునందు మానవుఁ డౌనని మానవసంబంధముతో పితా ! మాతా ! బంధూ ! యని పిలువఁగలిగినపుడు సమస్తచిత్తమును బ్రత్యాఖ్యానము గావించి మనమనంతుని క్షుద్రముగ నొనర్చి మనస్వహస్తములతో మనవలె నిర్మించినపు డేమిచేసితిమో దాని నితిహాసము వైపునకుఁ జూచి స్పష్టముగ నొకసారి చూడుమా? మనపరమధనమును సహజముగఁ జేయుటకై క్షుద్రునిగఁ జేసినపుడే మనపరమార్థమును నష్టము చేసితిమి. అపు డొకఖండము వేయిఖండములు గాఁజొచ్చెను. అపుడు దాని కంత మెచ్చటను లేకుండెను. కల్పనల కాటంకము లేకుండుటచే నవి యుజ్జ్వలాకారమును దాల్చెను. కృత్రిమబిభీషికలచే సంసారమును గంటకితముగ నొనర్చెను. బీభత్సము లగునాచారములును నిష్ఠురము లగు నియమములును సులభముగ ధర్మసాధనయందును సమాజవ్యవస్థలయందును దమస్థానమును నిలుపుకొనఁగలిగెను. మనబుద్ధి యంతఃపురచారిణి యగు భీరువురాలయిన రమణివోలె స్వాధీనచర్చ

యొక్క ప్రశస్తరాజమార్గమున బయల్వెడల భయ మొందుచున్నది. అసీమాభిముఖమునకు మనము నడచుమార్గము ముక్తముగ నుంచనియెడల లాభములే దని గ్రహింపవలయును. స్థిరముగ నుండు సీమయే మనకు మృత్యువు. ఇంకను నింకను నడచునదియే మనకుఁ బ్రాణము— మనభూమాస్వరూపుని దిక్కు జగత్తు యొక్క దిక్కు గాదు, సహజ మయినదానియొక్క దిక్కుగాదు, అది గ్రంథముగ ననుసరించు నట్టిదియుఁ గాదు, అది యెల్లప్పుడును సాధన చేయునట్టిది— ఆముక్తిదిక్కును దనకల్పన లను నావరణములచేఁ జుట్టివైచినచోఁ దనదుర్బలత్వమును దోషించుట చేతను శక్తి నవమానపఱచుటచేతను నాతనికే వినాశకాల మాసన్నమగును.

మానవుఁడు తనపూజను సులభముగఁ జేయుటకై క్షుద్రముగఁ జేయఁబోయి పూజనీయు నొకవిధముగ విసర్జించును. అపుడు మరల నాదుర్గతినుండి తన్ను రక్షించుకొను నాతురతతో మఱియొక యాపదయందుఁ బడిపోవును—మనపూజ నందుటకు వీలులేనంత దూరమునఁ బూజనీయునిఁ గూర్చుండఁబెట్టును. లేక పూజ చేరునంతటిలో దానిరస మంతయు శుష్కించిపోవును. అసీమునిఁ గేవలము క్షుద్రునిగఁ జేసినచో నాతనిని మిథ్యగఁ జేసినటు లగును. ఆతనిని గేవలము గొప్పవానినిగఁ జేసినను నాతనిని మిథ్యగాఁ జేయుట యగును, ఆతనిని గేవలము క్షుద్రునిగ నొనర్చుటచే వికృతియు, నాతనిని గేవలము గొప్పవానినిగఁ జేయుటచే మనకు శుష్కతయు సంభవించును.

"అనంతం బ్రహ్మ" అనంతుఁ డగుటచెతనె క్షుద్రుఁడ య్యును మహత్తరుఁడు, మహత్తరుఁ డయ్యును క్షుద్రుఁడు. ఆతఁ డనంతుఁ డగుటచేతనే సమస్తము నతిక్రమించియున్నాఁడు; అనం తుఁ డగుటచేతనే సమస్తము నావరించియున్నాఁడు. అందుచేతనే మానవుఁడు మానవుఁడుగా నున్నచోట నాతఁడు మానవుని ద్య జించి యుండలేదు. ఆతఁడు తలిదండ్రుల హృదయపాత్రముచే మనకు స్నేహ మిచ్చెను. మానవప్రీతియొక్క యాకర్షణవలన నాతఁడే మన హృదయగ్రంథులను మోచనము గావించెను. ఈ పృథివ్యాకాశములయందు మ్రోఁగుచున్న యాతని వీణాతంతులతో మనహృదయతంతుల నొక్కస్వరమున బంధించెను. మానవుల ద్వారముననే యాతఁడు మనసేవను స్వీకరించుచున్నాఁడు. మన మాటలను వినుచున్నాఁడు; వినిపించుచున్నాఁడు. జ్ఞానప్రేమ కర్మ ములతో సర్వతోభావముగ నాతనికిని మనకును మిళన మేర్పడిన స్థానమే పుణ్యలోకము, స్వర్గలోకము. కావున మానవుఁ డనంతుని సమస్తమానవసంబంధములనుండి విచ్ఛిన్నము గావించి గ్రహిం చుటయే సత్య మని తలంచిన యెడల నాతఁడు శూన్యత్వమునే సత్యమని తలంచును. మనము మానవులమయి జన్మించినారమను విషయము సత్యమయినపుడు, మన సకలవ్యాపారములలోను మా నవక్షేత్రమునందును మానవ బుద్ధికిని మానవప్రేమకును మాన వశక్తులకును ననంతునకును సంబంధమున్నదనువిషయము కూడ సత్యమయినది. అందుచే భూమాస్వరూపుని యారాధనయందు మానవుఁడు రెండుదిక్కులను రక్షించుకొని నడువవలసి యుండు

ను. ఒకవైపునఁ దనయం దాభూమాస్వరూపుని యారాధన జరుగ వలసి యుండును. ఇంకొకవైపున నన్యాకారముతో నది తన స్వకీ యారాధన కాకుండ నుండవలయును. ఒకవైపునఁ దన శక్తివల నను దన హృదయవృత్తులవలనను నాయనసేవఁ జేయుట యగును. ఇంకొకవైపున దనరిపులను ధర్మభావముతో సిక్తముచేసి సేవచే యు నుపాయము కాకుండ నుండవలయును.

అనంతునియందు దూరపుదిక్కు సమీపదిక్కు అను రెండుది క్కులున్నవి. మానవుఁడు దూరనికటముల సామంజస్యము నెంతవ ఱకు నష్టము గావించునో, యంతవఱకు ధర్మ మాతనికి యసం పూర్ణమయి యుండుటయేగాక యకళ్యాణముకూడ నయియున్నది. అందుచే మానవుఁడు ధర్మముపేరిట సంసారమునందు సృజించిన దారుణ బిభీషికలను సంసారబుద్ధి పేరిట సృష్టింపలేదు. నేఁటి వఱకు ధర్మముపేరిట నెన్నియో నరబలులు జరిగినవి; జరు గుచున్నవి; వాని కంతము లేదు. ఆబలి కేవలము మానవప్రా ణముయొక్క బలియే గాక బుద్ధిని దయను బ్రేమను బలి యిచ్చుట యై యున్నది. నేఁటివఱకు నెన్నియో దేవమందిరములయందు మానవుఁడు తనసత్యమును ద్యజించెను, తనమంగళమును విసర్జిం చెను, కురూపమును వరించెను. మానవుఁడు ధర్మముపేరితోఁ దన కృత్రిమావరణముల బాహ్యమానవుని ననహ్యాంచుకొను నిత్యాధి కారమును బొందఁ గోరుచున్నాఁడు. మానవుఁడెపుడు హింసయను దన ప్రకృతిరక్తమును బానముచేయ నిచ్చగించు శునకమును సంపూర్ణముగ శృంఖలములఁ ద్రెంచి విడిచివైచెనో, యపుడు

నిర్లజ్జతో ధర్మమును దన సహాయముగ నాహ్వానించెను. మానవుఁడు భయంకరమగు దస్యవృత్తిని జేసి లోకము నడలఁగొట్టినపుడు తనదేవతకుఁ బూజాలోపమును జూపించి దళపతిపథమును నియమింప సంకల్పించుకొనియెను; కృపణుఁడు తనరూపాయలసంచిని దాఁచుకొని యుంచునటుల మనముకూడ మనభగవానుని మనక్షుద్రసంఘ మను నినుపపెట్టెయందు బంధించి యుంచితిమని సుఖము ననుభవింతుము. మనక్షుద్రవంశ నామమును ధరింపనివారీశ్వరుని త్యాజ్యపుత్రులుగఁ గల్యాణాధికారమునుండి వంచితులని తలంతుము. మానవుఁడు ధర్మముపేరిట నిట్లునుడువుచున్నాఁడు- ఈసంసారము విధాతయొక్క ప్రవంచనము; మానవజన్మమే పాపము; మనము భారమును లాగు నెద్దులవలెఁ బూర్వపురుషులయొక్కయో లేక మన జన్మజన్మాంతములయొక్కయో పాపభారమును మోయుచు నంతములేని మార్గమున నడచుచున్నాము. ధర్మముపేరిట నిష్కారణముగా భయముచే మానవుఁడు పీడింపఁబడుచున్నాఁడు. అద్భుతమూఢత్వమువలనఁ దన్ను నిచ్ఛాపూర్వకముగ నంధుని జేసివైచినాఁడు.

కాని, యీసమస్త వికృతులయందును వ్యర్థతయందును ధర్మముయొక్క సత్యరూపమును నిత్యరూపమును వ్యక్తమగుచున్నవి. విద్రోహి యగు మానవుఁడు దానిని సమూలముగ ఛేదింపఁ బ్రయత్నించి కేవలము దాని యాటంకములనే ఛేదించుచున్నాఁడు. అసీమునియారాధన మనుష్యత్వముయొక్క యేయంశమును ఛేద మొనర్చుసాధన కా దనియు, మనుష్యత్వముయొక్క

పరిపూర్ణపరిణతి యనియు మానవుఁ డుపలబ్ధిఁ జేయు సమయ మేతెంచినది. అనంతుని నేకకాలమునందే యొకవైపున నానంద మువలనను మఱియొకవైపునఁ దపస్సువలనను నుపలబ్ధి చేయవల యును. కేవలము రసమందు నిమజ్జిత మయి యుండఁ జనదు; జ్ఞానమువలన గ్రహింపవలయును; కర్మములవలనఁ బొందవలయు ను. ఆయనను నాలోని కెటులఁ దెచ్చుకొనవలెనో, యటువలెనే నా శక్తి నాయనలోనికిఁ బ్రేరణ చేయవలయును.

అనేకదినములకుఁ బూర్వ మొకవైరాగి పాడుచుండఁగా గాన మొకటి వింటిని. "నామానస రాజ్యమందున్న మానవుని నే నెచ్చటఁ బొందఁ గలను?" "నామనోరాజ్యపు మానవుఁ డున్నస్థా నమునకు నే నేసంధానమున నేఁగవలయునో" యని యాతఁడు పాడియుండెను. ఆతని యీగానమునం దున్న మాటలు నేఁటివఱ కును నామనస్సునందుఁ దిరుగాడుచున్నవి. ఆగానము నాకర్ణించి నప్పుడు దాని స్పష్టార్థమును నే నపుడు గ్రహింపనైతిని. గ్రహిం చుట కయిన నపుడు ప్రయోజనము లేకుండెను. పాడుచున్నవారు ను దీనియర్థమును గ్రహించియుండరు. ఏల యనఁగా, మానవుఁ డనేక సమయములలో సత్యభావముతో నేవిషయమును జెప్పనో మిథ్యాభావముతో నావిషయమును గ్రహించును. కాని యీగానము నందు మానవుని గభీరమగు నంతర్నిహితవిషయము ప్రకటింపఁ బడిన దను సంగతి వాస్తవము. మానవుని మనస్సుయొక్క మానవుఁ డాతఁడే. లేనియెడల మానవుఁ డెవనిబలముచే మాన వుఁడు కాఁగలిగెను? యీదుల పురాణమందుఁ జెప్పఁబడిన దే

మనఁగా, నీశ్వరుఁడు మానవుని దన ప్రతిరూపముగ నిర్మించి యున్నాఁడు. స్థూలముగను బాహ్యముగను దీనియర్థ మేమయినను గభీరముగఁ గాంచినపు డిది యథార్థమే యగుచున్నది. ఆతఁ డంతరమునం దుండి తనలోనే మానవుని దయారుచేయుచున్నాఁ డు. అందుచే మానవుఁడు తనసకలమునందును దనకంటె గొప్ప వాని నొకని ననుభవించుచున్నాఁడు. అందుచే నాసమస్తసీమ యందును సీమ కతీతమైన యాయగ్రాహ్యుని క్షణక్షణమును గ్ర హింపఁగలుగుచున్నాను. ఆయసీముని నావానినిగఁ జేసికొనుటకే ప్రాణము వ్యాకులతఁ జెందుచున్నది. అసీమునియం దేఛందస్సు దూరనికటరూపములతో నాందోళిత మగుచున్నదో, యేది విరాట మగు హృదయస్పందనమువలె విశ్వమునం దంతటను దన చైత న్యధారను బ్రేరణ చేయుచు సర్వస్థానములనుండి యసీమాభిముఖ మున కాకర్షించుకొనుచున్నదో, యీగానమునం దాఛందస్సుయొ క్క స్పర్శ యిమిడియున్నది. అనంతస్వరూపుఁ డగుబ్రహ్మ యన్య జగత్తునం దన్యజీవులతోఁ దన్నెట్టి సంబంధముతో నెటుల బం ధించుకొనెనో యది గ్రహించుకొనుటకు మన కెట్టి యుపాయము ను లేదు. కాని మానవున కాతఁడు మనస్సునకుఁ జెందిన మానవుఁ డని మాత్రము గ్రహించితిని. ఆతఁడే మానవుని బిచ్చివానినిగఁ జేసి మార్గమున బయలుదేఱఁ దీయుచున్నాఁడు. ఆతనిని స్థిరముగ నిదురఁ బోనిచ్చుట లేదు. కాని యామనస్సునకుఁజెందిన మాన వుఁడు నాయీసామాన్యమానవుఁడు కాఁడు. ఆతనికి బట్టలు కట్టి యాహారముఁ బెట్టి పరుండఁబెట్టి భోగసామగ్రినొసఁగి మఱపింప

విలయ్యేడువాఁడు కాఁడు. ఆతఁడు నామనస్సుయొక్క మానవు డయి యున్నను, "నామనస్సుయొక్క మానవుని నే నెచ్చట బొందుదును?" అని రెండుచేతుల నెత్తి చెప్పవలసి వచ్చుచున్నది ఆతఁ డెట్టివాఁడో గ్రహించుటకు న న్నొక సహజ మగు నభ్యాస మందు స్థూలముగ మఱపించి యుంచిన యెడల గ్రహింపలేను— ఆతనిని జ్ఞానసాధన వలన గ్రహింపవలయును. అదియే యథార్థ మగు తెలిసికొనుట; ఆతెలిసికొనుట యెచ్చటను బంధింపఁ బడి యుండదు. "ఆతని నెచ్చటఁ బొందఁ గలను?" ఒక నియమిత స్థానమునందుఁగాని లేక విశేషస్థానమునందుఁగాని బొందవీలులేదు- స్వార్థబంధనము మోచనము చేయఁబడినపుడు మంగళము సాధ నము చేయఁబడినపుడు పొందనగును తన్నెల్లపుడును దానము చేయుటవలననే యాతనిని బొందనగును.

మానవుఁ డిటులనే తన మనస్సుయొక్క మానవుని వెద కుచున్నాఁడు— ఈవిధముగఁ దన సమస్తదుస్సాధసాధనవల ననే యా మనస్సుయొక్క మానవుఁడు యుగయుగములందును బ్రత్యక్ష మగుచున్నాఁడు. ఆతనిని బొందినకాలఁది "నే నాతని నెచ్చటఁ బొందఁ గలను?" అని యనుచున్నాఁడు. ఆమనస్సుయొ క్క మానవునివలననే మానవునకు విచ్ఛేదమేళనము లొక్కసా రిగా జరుగుచున్నవి. ఆతనిని బొందుటయందే యాతనిని బొంద కుండుటయు నున్నది. ఆపొందుటయుఁ బొందకుండుటయు ననువాని నిత్యాకర్షణము వలననే మానవుఁడు నవనవైశ్వర్యము ను బొందుచున్నాఁడు; జ్ఞానాధికారము వ్యాప్త మగుచున్నది;

కర్మక్షేత్రము ప్రసారిత మగుచున్నది—పూర్ణత్వమునం దెల్లపుడు తనను నవనవరూపములతో నుపలబ్ధి చేయుటయే ప్రధానవిషయము. అసీమునితోఁ గల మేళనమం దొకచిరవిరహ మున్నది, ఇది కేవలము రసముయొక్క విరహము కాదు. కేవలము భావమువలననే దీనికిఁ బూర్ణత్వము కలుగఁగలదు. జ్ఞానకర్మముల లోనికి మానవు నీవిరహ మాహ్వానించినది. త్యాగమార్గమువలన మానవుఁ డభిసారమునకు నడచుచున్నాఁడు.

జ్ఞానమార్గమునందును, శక్తిమార్గమునందును, ప్రేమమార్గమునందును నంతమువఱకుఁ జేరఁ గలిగితిననియు, నేను బొందఁ గలిగితి ననియుఁ జెప్పి యాతఁ డాయుపలబ్ధిని నిశ్చలత్వముయొక్క బంధనముచే బంధింపఁ గోరినపు డచటనే యాతఁడు కేవలము బంధనమునే పొందినాఁడు; సంపదను బోఁగొట్టుకొనినాఁడు. ఆతఁడు బంగారమును బాఱవైచి యంచలమును ముడివైచెను. "నామనస్సుయొక్క మానవుని నే నెచ్చటఁ బొందుదును?" అనున దాతని చిరకాలపు గానము. "మనస్సుయొక్క మానవుఁ డెచ్చట నున్నాఁడో యచ్చటి కేసంధానమునఁ బోవలయును?" అనునదియే యాతని చిరకాలపుఁ బ్రశ్న. ఏల యనఁగా, వెదకుట పొందుట యొక్కసారి జరుగుచుండవలయును. వెదకుట యంతమొందినయెడల నుపలబ్ధికి వికృతి వినాశము వాటిల్లును.

---

# త్స వ ది న ము 13.

ఉదయమున నంధకారమును భేదించుకొని వెలుతురు నలు వైపుల వ్యాపించిన వెంటనే వనోపవనములలోఁ బక్షుల యుత్సవ మారంభమగును. ఆయుత్సవము దేసియుత్సవము? యెందుల కీ సకల విహంగమదళములు నృత్యము చేసి పాటలు పాడి యిట్లు స్థిరముగా నుండును? దానికి కారణ మేమన:— ప్రతిదినము ప్రభాతమున నాలోకస్పర్శచేఁ బక్షులు నూతనముగఁ దమప్రాణ శక్తి ననుభవించును. చూచుశక్తి, యెగురుశక్తి, యాహారమును వెదకుశక్తి వానియందు మేల్కొని వానిని గౌరవాన్వితముగాఁ జేయును. ఆలోకముచేఁ బ్రకాశిత మైన యావిచిత్రవిశ్వమునం దది తనప్రాణము గల, గతిగల, చేతనత్వముగల, పక్షిజన్మము ను సంపూర్ణముగా గ్రహించి యంతర్నిహితానందమును సంగీత ప్రవాహముగాఁ బ్రవహింపఁ జేయును.

జగత్తునం దెచ్చట నవ్యాహతశక్తి యనంతముగఁ బ్రకా శించునో, యచ్చటనే మూర్తిభవించిన యుత్సవము. అందుచే హేమంతకాలసూర్యకిరణములందును మార్గశీర్షమాసపుఁ బరిపక్వ సస్యసముద్రమునందును స్వర్ణోత్సవము తరంగములవలెఁ బొం గుచుండును. అందుచే నామ్రమంజరుల సాంద్రతమసౌరభము చే వ్యాకుల మందిన నవవసంతమునందు విచిత్రపుష్పములతో నిండిన కుంజవనమున నుత్సవోత్సాహ మున్పొంగు చుండును.

ప్రకృతియం దిటుల మనము నానాస్థానములతో నానాభావములతో శక్తియొక్క జయోత్సవమును గాంచుచుందుము.

మనుజుని యుత్సవ మెప్పుడు ? మనుజుఁ డెపుడు తన మనుష్యత్వముయొక్క శక్తిని విశేషముగా స్మరించునో విశేషముగ గ్రహించునో ఆదినమున మానవుని యుత్సవము. ఏదినమున మనము మనలను ప్రాత్యహికప్రయోజనములచే నడపుకొందుమో యాదినమునఁ గాదు. ఏదినమున మనము మనలను సాంసారికసుఖములచే క్షుబ్ధులనుగాఁ జేసికొందుమో యాదినమునఁ గాదు. ఏదినమునఁ బాకృతికనియమపరంపరలహస్తమునందు మన మాటబొమ్మలవలె క్షుద్రమగు జడభావము ననుభవింతుమో యాదినము మనయుత్సవదినము కాదు:— ఆదినము మనము జడమువంటివారము. ఉద్భిదములవంటివారము. సాధారణజంతువులవంటివారము. ఆదినమున మనము మనయంతరమునందు సర్వమును జయించుమానవశక్తిని గ్రహింపలేము. ఆరోజున మన కానందమేది ? ఆదినమున మనము గృహమునందు బంధితులము, ఆదినమున మనము కర్మములచే దుర్బలులము. ఆదినమున మనము మనల సుజ్జ్వలముగా నలంకరించుకొనలేము. ఆదినమున మనమెవరిని నుదారభావముతో నాహ్వానింపలేము. ఆదినమున మన గృహమునందు సంసారచక్రముయొక్క రణఝుణధ్వని వినుపించును కాని సంగీతము వినిపింపదు.

ప్రతిదినము మనుజుఁడు క్షుద్రుఁడు, దీనుఁడు, ఏకాకి. కాని యుత్సవదినమున మనుజుఁడు మహత్తర మైనవాఁడు. ఆదిన

ఘునం దాతఁడు సకలమనుజులతో నేకమై మహత్తరుఁ డగుచు న్నాఁడు. ఆదినమునం దాతఁడు సమస్తమనుష్యత్వముయొక్క శక్తిని ననుభవించుటచే మహత్తరుఁ డగుచున్నాఁడు,

సోదరులారా ! నేఁడు నేను మిమ్ముల నందఱిని సోదరు లని సంభాషించుచున్నాను. నేఁడు దీపములు వెలిఁగినవి, సంగీతము ధ్వనించుచున్నది, ద్వారములు తెఱవఁబడినవి. నేఁడు మనుష్యత్వముయొక్క గౌరవము మనలను స్పృశించినది. నేఁడు మన మెవ్వరము నేకాకులము గాము. నేఁడు మన మందఱమును గలసి యేకమై యున్నాము. నేఁ డతీతసహస్రవత్సరముల యమృతవాణి మన కర్ణకుహరములలో ధ్వనించు చున్నయది. నేఁ డనాగతసహస్రవత్సరములు మనకంఠస్వరమును ధరించియుండుట కెదుట వేచియున్నవి.

నేఁడు మన కెట్టియుత్సవము ? శక్తియుత్సవము. మనుజునియం దెంతయాశ్చర్యశక్తి యాశ్చర్యముగఁ బ్రకాశించుచున్నది. తన సమస్తక్షుద్రప్రయోజనముల నతిక్రమించి మనుజుఁ డేయూర్ధ్వస్థానమునకో వెడలి నిలచియున్నాఁడు. జ్ఞాని జ్ఞానముయొక్క యేదుర్లభదుర్గమమార్గమునఁ బరుగిడినాఁడు, ప్రేమికుఁడు ప్రేమయొక్క యేపరిపూర్ణాత్మవిసర్జనమునందుఁ బ్రవేశించి యుత్తీర్ణుఁడై నాఁడు, కర్మి కర్మముయొక్క యేయశ్రాంతదుస్సాధసాధనయందు నిర్భయముగాఁ బ్రవేశించినాఁడు? జ్ఞానమునందు ను బ్రేమయందును గర్మమునందును మనుజుఁ డేయప్రమేయ శక్తిని బ్రకాశింపఁజేసినాఁడో నేఁడు మన మాశక్తియొక్క గౌర

వము స్మరించుకొని యుత్సవమును గావించుకొందుము, నేఁడు మనము మనలను వ్యక్తివిశేషముగాఁ గాక మనుజుల మని గ్రహించి ధన్యుల మయ్యెదము.

మనుజునిసమస్తప్రయోజనములను దుర్లభములుగాఁ జేసి యీశ్వరుఁడు మనుజుని గౌరవము నభివృద్ధిచేసినాఁడు. పశువుకొఱకై దేశమంతయుఁ దృణముతో నింపియున్నాఁడు. మానవుఁ డన్నముకొఱకై యావచ్ఛక్తిని వినియోగింపవలసియున్నది. ప్రతిదినము మనము స్వీకరించుచున్నయన్నము వెనుక మనుజుని బుద్ధి, మనుజునియుద్యమము, మనుజునియుద్యోగములు నున్నవి. మనయన్నముష్టి మనకు గౌరవము. పశువునకు వస్త్రప్రయోజన మెప్పుడును లేదు. మనుజుఁడు దిగంబరుఁడై జన్మించును. శక్తి వలనఁ దనయభావమును జయించి మనుజుఁడు తనదేహము నాచ్ఛాదితము గావించుకొనవలసి వచ్చినది. గాత్రవస్త్రము మనుష్యత్వమునకు గౌరవము. ఆత్మరక్షణోపాయముతో మనుజుఁడు జన్మింపలేదు. తనశక్తిద్వారా తనవస్త్రములను నిర్మించుకొనవలసి వచ్చినది. కోమల మగుచర్మముతో దుర్బలమగుశరీరముతో మానవుఁడు నేఁడు సమస్తప్రాణిసమాజమునందును దన నజేయునిగాఁ జేసికొనుచున్నాఁడు. ఇది మానవశక్తికి గౌరవము. మనుజునికి దుఃఖ మిచ్చి యీశ్వరుఁడు మనుజుని సార్థకునిగాఁ జేయుచున్నాఁడు. ఆతడు తనపూర్ణశక్తి ననుభవించుటకు మానవుని కధికారిగాఁ జేయుచున్నాఁడు.

మానవునియీశక్తి తనప్రయోజనసాధనముల సీమయం

దే సార్థకత పొందినయెడల మన కదియే చాలును. అట్లు జరిగి నను మనము జగత్తునందున్నసకలజీవులపై మనశ్రేష్ఠత్వమును స్థాపించుకొనఁగలిగెడువారము. కాని మనశక్తిలోని కేమహాసము ద్రమునుండి తరంగములు వచ్చినవో కాని యది మనసమస్తాభావ ములకూలము నుల్లఘించి సకలప్రయోజనముల నతిక్రమించి య హర్నిశము నక్లాంతోద్యమముతో నెట్టియసీమరాజ్యమునఁ బ్రవేశిం చినది, ఎట్టియనిర్వచనీయానందాభిముఖమునకు ధావమానమయి నది, దేనిని దెలిసికొనుటకు సమస్తమును బరిత్యజించుచున్నదో, దానిని దెలిసికొనుటవలన దీనికిఁ బ్రయోజన మేమి? దేనియొద్ద యాత్మను సమర్పించుటకు దీనిసమస్తాంతరాత్మ వ్యాకులపడుచు న్నదో, దానితో దీనికిఁ గల యావశ్యకసంబంధ మెచ్చటనున్నది? దేనిపనులు చేయుట కిది తన యారామమును, స్వార్థమును, బ్రా ణమును సైతము తుచ్ఛముగఁ దలంచుచున్నదో దానికిని దీనికిని గలయాదానప్రదానములలెక్క లెచ్చటఁ గలవు? ఇదియే యా శ్చర్యము! ఇదియే యానందము! ఎచ్చట మనుష్యునియొక్క సకలావశ్యకములును హద్దును దాఁటిపోయినవో, యచ్చటనే మను ష్యుని గభీరతమ సర్వోచ్చతమశక్తి సర్వదా తనను స్వాధీనానంద ముతోఁ నెగురవేయఁ బ్రయత్నము చేయుచున్నది.

జగత్తునం దిం కెచ్చటను దీనికి సాదృశ్యము లేదు. మను ష్యశక్తియొక్క యాప్రయోజనాతీతమగుపరమగౌరవము నేఁటి యుత్సవమునం దానందసంగీతముతోఁ బ్రతిధ్వనించుచున్నది. ఈ శక్తి కభావములపై జయము కలిగినది.భయశోకములపై జయము

చేకూరినది. మృత్యువుపై జయము లభించినది. నేఁడతీతభవిష్యత్తు యొక్క మహామానవలోకము వైపునకు దృష్టిని నిగిడ్చి మానవాత్మయం దీయభ్రవేదియగు చిరంతనశక్తిని బ్రత్యక్షముగఁ జూచి మనలను సార్థకపఱుచుకొందుము.

ఒకప్పు డెన్నియో సహస్రవత్సరములక్రిందట మనుజుఁ డిటుల నుడివినాఁడు.

శ్లో. వేదాహమేతం పురుషం మహాంతం
ఆదిత్యవర్ణం తమస్తః పరస్తాత్—

నే నామహాపురుషు నాజ్యోతిర్మయు నంధకారమున నావలగట్టున నున్నవానిని దెలిసికొన్నాను.

ఈప్రత్యక్షపృథివియందు మన కాహార మెచ్చటఁ గలదో మన ఖాదకు లెచ్చటఁ గలరో, మన కారామ మెచ్చటఁ గలదో, మన కాఘాతము లెచ్చటఁ గలవో యనువిషయములను దెలిసికొను టావశ్యకము. కాని యీసమస్తమును దెలిసికొనుటను బహుదూరమునఁ ద్రోసివైచి మనుజుఁడు చిరరహస్యాంధకారము యొక్క యేఘట్టమునకు నేజ్యోతిర్లోకమునకు నేయాశతో వెళ్లినాఁడు! మనుజుఁడు తనసమస్తప్రత్యక్షప్రయోజనములందు నాతిమిరాతీతజ్యోతిర్మయమహాపురుషుని గ్రహించినాఁడు. నేఁడు మనము మనుజుని యాయాశ్చర్యజ్ఞానగౌరవముతో నుత్సవము చేయనున్నారము. ఏజ్ఞానశక్తి యెట్టిసంకీర్ణతయందును నెట్టినిత్యనైమిత్తకావశ్యకములయందును బంధింపఁబడి యుండఁగోరదో,

యేజ్ఞానశక్తి కేవలము ముక్తియొక్క యానందము ననుభవించుటకు ననంతునియందుఁ బరమసాహసముతోఁ దనపక్షములను విస్తరింపఁజేయునో, యేతేజస్వి జ్ఞానము తనశక్తి నెట్టిప్రయోజన సాధనముల కుపాయముగాఁ గాక చరమశక్తిరూపముగా ననుభవించుట కగ్రసర మగునో మనుష్యత్వమునందు నేఁడు మన మాజ్ఞానమును నాశక్తిని స్పృశించి కృతార్థుల మయ్యెదము. ఎన్నియో వత్సరసహస్రములపూర్వమున నొకపుడు మనుజుఁ డీమాటను నుడివియున్నాఁడు.

శ్లో. ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చన :—

బ్రహ్మయొక్క యానందము నెవరు గ్రహించినారో యాయన దేనికిని వెఱవరు.

ఈలోకమునం దెచటఁ బ్రబలులు దుర్బలులను బీడించుచున్నారో, యెచట వ్యాధివిచ్ఛేదమృత్యువులు దైనికఘటనలయియున్నవో, యాపద యెచ్చట నదృశ్యముగా నుండి ప్రతిపదక్షేపమున మనకొఱకై వేచి యున్నవో, మఱియుఁ బ్రతీకారమున కుపాయము లెచట ననేకపర్యాయములు మనకు స్వాధీనములు గావో యచట మనుష్యుఁడు సమస్తప్రాకృతికనియమములకుఁ బైనఁ దల నెత్తి యెట్టిమాట నుడివినాఁడు!—ఆనందం బ్రహ్మణో విద్వాన్ నబిభేతి కుతశ్చన—నేఁడు మనము దుర్బలమనుష్యులనోటి నుండి వెలువడిన యీప్రబలవాణితో నుత్సవమును జేయఁ గూరుచున్నాము. సహస్రశీర్షములుగల భీకరకరాళవక్త్రముల నెదుట నిలువఁబడి యేమానవుఁ డకుంఠితచిత్తముతో బ్రహ్మ యున్నాఁడు.

భయము లేదని నుడువఁగలిగెనో, నేఁడు మనల నామానవున కం తర్గతులనుగా గ్రహించి గౌరవమును బొందుదము. బహుసహస్ర వత్సరములకుఁ బూర్వమున నుచ్చారితమైన యీవాణి నేఁడును ధ్వనించుచున్నయది.

శ్లో. తదేతత్ ప్రేయః పుత్రాత్ ప్రేయో విత్తాత్
ప్రేయోఽన్యస్మాత్ సర్వస్మాత్ అంతరతర య దయ మాత్మా.

అంతరతరుఁ డగు నీయాత్మపుత్రునికంటెఁ బ్రియమైనది. విత్తమునకంటెఁ బ్రియమైనది, సకలముకంటెఁ బ్రియమైనది. సంసారముయొక్క సకలస్నేహప్రేమసామగ్రులతో మనుజునిప్రేమ సంపూర్ణముగఁ దృప్తిఁ జెందలేదు. సంసారముయొక్క సకల ప్రియపదార్థములతో నతని యంతరతముఁ డగుప్రియతముఁ డెవ రో, యెవరు సకలాత్మీయవరుల కంతరతముఁడో, యెవరు సమ స్తదూరనికటముల కంతరతముఁడో, యీయనపై నున్నప్రేమ మింతప్రబలావేగముతో నింతనిస్సంశయముతో నాకర్షింపఁబడి నది. మనుజుని పరమతమ మగుప్రేమ తనసమస్తప్రియసామగ్రి నొక్కముహూర్తములో విసర్జింప నుద్యమించె నని మన మెఱుఁ గుదుము. మనుజుని యాపరమాశ్చర్యప్రేమశక్తియొక్క గౌరవ మును నేఁడు మనము గ్రహించి యుత్సవము చేయ సమావేశ మైనారము. సంతానముకొఱకు మానవుఁడు దుస్సాధకర్మము లలోఁ బ్రవేశించుట మనము చూచినారము.

అనేకజంతువులను గూడ నట్లే చూచి యున్నారము. స్వదే

శీయులకొఱకు మానవుఁడు దుస్సాధప్రయోగములను బ్రయోగించి నటుల మనము గాంచియున్నారము. పిపీలికలను మధుమక్షిక లను గూడ నట్లే చూచియున్నారము. కాని మనుజునికర్మము లెచ్చటఁ దనను దనసంతానమును దనదశమును నతిక్రమించి పోయినవో, యచ్చటనే మనము మనుష్యత్వముయొక్క పూర్ణ శక్తివికాసముచేఁ బరమగౌరవమును బొందియున్నారము. బుద్ధ దేవునికరుణ సంతానవాత్సల్యము గాదు, దేశానురాగము గాదు. దూడ యేవిధమునఁ దల్లియొక్క పూర్ణస్తనములనుండి పాల నాక ర్షించుకొనునో యావిధమున క్షుద్రమగు లేక మహత్తరమగు నేదో శ్రేణియొక్క స్వార్థప్రవృత్తు లాకరుణ నాకర్షించుకొనఁ జాలకున్న యవి. అది జలభారాక్రాంతనిబిడమేఘమువలెఁ దనప్రభూతప్రాచు ర్యముచేఁ దనను సంపూర్ణముగా సర్వలోకులపై వర్షించుకొను చున్నది. ఇదియే పరిపూర్ణతయొక్క చిత్రము. ఇదియే యైశ్వ ర్యము. ఈశ్వరుఁడు ప్రయోజనానురూపముగాఁ గాక శక్తియొక్క యనంతమైన ప్రాచుర్యమువలననే తనను సంపూర్ణముగా నెల్లప్పు డును విశ్వరూపమున దానము చేసికొనుచున్నాఁడు. మనుజుని యందుఁగూడ మన మెప్పు డట్టిశక్తియొక్క ప్రయోజనాతీతప్రా చుర్యమును, స్వతఃప్రవృత్తమగు త్యాగమును జూచెదమో, య పుడే మనుజునియం దీశ్వరునిప్రకాశము విశేషముగా ననుభవిం తుము; బుద్ధదేవుఁ డిటుల నుడివియున్నాఁడు—

శ్లో. మాతా యథా నియం పుత్తం
ఆయుసా ఏకపుత్త మనురక్ఖే

ఏవంపి సబ్బభూతేసు
మానసంభావయే అపరిమాణం.

శ్లో. మెత్తంచ సబ్బలోకస్మిన్
మానసం భావయే అపరిమాణం
ఉద్ధం అధోచ తిరియంచ
అసంబాధం అవేరమసపత్తం.

శ్లో. తిట్ఠంచరం నిశిన్నో వా సయా
నో వా యావతస్సా విగతమిద్ధో
ఏతం సతిం అధిట్ఠేయం బ్రహ్మ
మేతం విహారమిదమాహు.

తల్లి తనసమస్తప్రాణమునైనను నిచ్చితనబిడ్డ నెట్లు రక్షించు కొనునో యటులనే సకలప్రాణులపై ననంతమగు దయాభావమును జన్మింపఁజేసికొనుము. ఊర్ధ్వదిక్కున, నధోదిక్కునఁ, జతుర్ది క్కులను, సమస్తజగత్తుపైనను బాధాశూన్యమగు హింసాశూన్య మగు శత్రుతాశూన్యమగు మానసమునందు నపారమగు దయాభావ మును నుద్భవింపఁ జేసికొనుము, నిలచినపుడు, నడచుచున్నపుడు కూర్చున్నపుడు, పరుండియున్నపుడు నిద్రించునంతవఱకు నీమైత్త్రి భావమునందు నధిష్ఠితుఁడవయి యుండుము. దీనినే బ్రహ్మవిహార మందురు.

ఈబ్రహ్మవిహారమును గుఱించి భగవాన్ బుద్ధుఁడు నుడివి యున్నాఁడు ఇది నోటిమాట కాదు, అభ్యస్తమగు నీతిమాట కాదు. ఇది యాధ్యునజీవితమధ్యమునుండి సత్యమై యుద్భవించి

నటుల మన మెఱుఁగుదుము. దీనితో నేఁడు మనము గౌరవము ననుభవింతము. ఈవిశ్వవ్యాప్తమగు చిరజాగ్రత్కారుణ్య మీబ్రహ్మ విహారము, ఈసమస్తావశ్యకముల కతీత మగు నహేతుకాపరిమే యమైత్రీశక్తి మనుజునియందు కేవల మొక సాధారణమగుమాటయై యుండక, ఇది యేదోయొక స్థానమునందు సత్యమయి వెలసినది. ఈశక్తిని మన మవిశ్వాసముతోఁ జూడఁజాలము. ఈశక్తి మనుష్యత్వముయొక్క భాండాగారమునందుఁ జిరకాలముకొఱకు సంచితమై యున్నయది. ఏమనుజునియం దీశ్వరునియొక్క యపరిమిత మగుదయాశక్తి యీవిధమున సత్యరూపముగా వికసించినదో, మనల నట్టిమానవులనుగా గ్రహించి యుత్సవముఁ జేయుచున్నారము.

ఈభారతవర్షమునం దొకపుడు మహాసమ్రాట్టగు నశోకుఁడు తనయాత్మశక్తిని దనరాజశక్తిని ధర్మప్రచారకార్యమునందును,మంగళసాధనకార్యమునందును నియమించి యుండెను. రాజశక్తిప్రాబల్య మెంత సుతీవ్రమైనదో దానిని మన మందఱ మెఱుఁగుదుము. ఆశక్తి క్షుధితాగ్నివలె గృహమునుండి గృహాంతమునకును, గ్రామమునుండి గ్రామాంతరమునకును, దేశమునుండి దేశాంతరమునకును దనజాజ్వల్యమానమగు లోలుపజిహ్వను వ్యాపింపఁజేయనుద్యుక్తమై యున్నది. ఆవిశ్వలుబ్ధ మగురాజశక్తిని మహారాజగు నశోకుఁడు మంగళకార్యములలో నియమించెను. తృప్తిహీనములగుభోగములను విసర్జించి యాయన యలసటలేని సేవను స్వీకరించెను. రాజత్వమున కిది యవసరము లేదు. ఇది యుద్ధవేషము

కాదు. దేశజయము కాదు. వాణిజ్యవిస్తారమును గాదు. ఇది మంగళశక్తియొక్క యపరిమితశక్తి. ఇది హఠాత్తుగాఁ జక్రవర్తి యగు రాజు నాశ్రయించి యాయనసమస్తరాజాడంబరము నొక్క నిమిషములో శూన్యముగఁ జేసి సమస్తమనుష్యత్వమును సముజ్జ్వలము గావించినది. ఎంతో గొప్పగొప్పరాజుల పెద్దపెద్దసామ్రాజ్యములు విధ్వస్తమైనవి, విస్మృతమైనవి, దుమ్ములోఁ గలసిపోయినవి. కాని యశోకునియందీమంగళశక్తియొక్క మహావిర్భావము మనగౌరవమునకు ధనమై నేఁడును మనయందు శక్తిని గలిగించుచున్నది. మనుజునియం దేకొంచెము సత్యమై యున్నదో దాని గౌరవమునుండి దానిసహాయతనుండి మనుజుఁ డింకెన్నఁడును, వంచితుఁడై యుండఁడు. నేఁడు మనుజునియందు సమస్తస్వార్థమును జయించు నీయద్భుతమంగళశక్తియొక్క మహిమను స్మరించుకొని మనము పరిచితులము నపరిచితులము నందఱము నేకమై యుత్సవముచేయఁ బ్రవృత్తుల మైనాము. మానవుని యీమహత్త్వ మంతయు నేఁడు మనదీనతముని మనశ్రేష్ఠతమునితో నేకగౌరవబంధనమునందు మిళితము చేసినది. నేఁడు మనము మానవుని యీసమస్తావారిత మగుసాధారణసంపదయొక్క సమానాధికారసూత్రమున సోదరుల మైతిమి. నేఁడు మనుష్యత్వముయొక్క మాతృశాలయందు మనభ్రాతృసమ్మేళనము.

ఈశ్వరుని శక్తివికాసమును మనము ప్రభాతముయొక్క జ్యోతిరావిర్భావమునందుఁ గాంచితిమి. ఫాల్గుణమాసపువిపులపుష్పగుచ్ఛములలోఁ గాంచినారము. మహాసముద్రముయొక్క నీలాం

బరవృత్యమునందుఁ దిలకించినారము. కాని సమస్తమానవులతో నే దినమం దాయనయొక్క విరాడ్వికాసమును జూడ సమావేశ మయ్యెదమో, యాదినమే మనకు మహామహోత్సవము. మను ష్యత్వమునం దీశ్వరునిమహిమ యనేకాభ్రభేదియగు శిఖరమాలల యం దెచ్చట జాగ్రతమై విరాజిల్లుచున్నదో, యచ్చట నాయుత్తుంగ శైలాశ్రమమున మనము మానవమాహాత్మ్యముయొక్క యీశ్వరుని మానవసంఘమునందుఁ గూర్చుండి పూజింప వచ్చియున్నారము.

మనభారతవర్షమునందు సమస్తోత్సవములు నీమహాభావ ముపైఁ బ్రతిష్ఠితములై యున్న వనువిషయమును మనము ప్రతి దినమును మఱచిపోవుచున్నాము. మనజీవితమునం దేయేఘటనల నుత్సవఘటనలనుగాఁ జేసితిమో వానిలో బ్రతిదానికిని మనము విశ్వమానవగౌరవమును గలిగింపఁ బ్రయత్నించినారము. జన్మోత్స వమునుండి శ్రాద్ధానుష్ఠానమువఱకు దేనినిగూడ మనము వ్యక్తిగత ఘటనల క్షుద్రత్వమునందు బంధించి యుంచలేదు. ఈసకలోత్సవ ములందును మనము సంకీర్ణతను విసర్జింతము. ఆదినమున మన గృహద్వారము సంపూర్ణముగా నున్ముక్తమై పోవును. కేవల మా త్మీయులకుఁ గాక కేవలము బాంధవులకుఁ గాక, ఆహ్వానితు లకు ననాహ్వానితులకుగూడ నాగృహద్వారము తెఱవఁబడి యుం డును. పుత్రుఁడు జన్మించునది నాగృహమునందుఁ గాక సమస్త మానవగృహమునందై యున్నది. సకలమనుజులగౌరవమున కధి కారియై యాతఁడు జన్మించును. ఆతనిజన్మమంగళానందముతో సకలమానవుల నాహ్వానింపనా? ఆతఁడు కేవలము నాగృహము

నందే జన్మించినచో నాతనివంటి దీనహీనుఁడు జగత్తునం దింకెవ రుండఁగలఁడు ? సకలమనుజు లాతనికొఱకు నన్నము, వస్త్రము, నిల్లు, భాష, జ్ఞానము, ధర్మము సిద్ధముచేసి యుంచినారు. మానవుఁ డంతర్నిహిత మగునానిత్యమైనస్యమంగళశక్తియొక్క క్రోడమున జన్మించి యాతఁ డొక్కముహూర్తమున ధన్యుఁ డైనాఁడు. ఆత నిజన్మసంవత్సరమున నొకదినమున గృహముయొక్క సమస్త ద్వారములను దెఱచియుంచి సకలమనుజులను స్మరింపకున్నచో నింకెపుడు స్మరించుకొందుము ? ఇతరసమాజము దేనిని గృహ ఘటనగాఁ జేసెనో భారతసమాజము దానిని జగద్ఘటనగాఁ జేసి నది. ఈజగత్తుయొక్క ఘటనయే జగదీశ్వరుని పూర్ణమంగళావి ర్భావమును బ్రత్యక్షముగఁ జూచుటకు యథార్థమైన యవకాశమయి యున్నది. వివాహవ్యాపారమును భారతవర్షము కేవలము భార్యా భర్తల యానందమిళనఘటన యని యెఱుఁగదు. ప్రతిమంగళ వివాహము మానవసమాజమున నొక్కొక్కస్తంభ మని గ్రహించి భారతవర్షము దానిని సమస్తమానవవ్యాపారముగాఁ జేసివైచినది. ఈయుత్సవమునందును భారతవర్షముయొక్క గృహస్థుఁడు సకల మనుజుల నతిథులనుగా గృహమునందు స్వీకరించును. అది చేసి నపుడే యథార్థభావముతో నీశ్వరునిగృహమున కాహ్వానించుట యగును. కేవల మీశ్వరునినామ ముచ్చరించినంతనే లాభము లేదు. ఈవిధముగా గృహముయొక్క ప్రతివిశేషఘటనలయందును మన మొక్కొక్కదినము గృహమును మఱచి సకలమానవులతో మిళిత మయ్యెదము. మఱియు నాదివసము సకలమానవులయందు నీశ్వ రునితో మన మేకమయ్యెడి దివసము.

అయ్యో ! ఇపుడు మన యుత్సవమును బ్రతిదినమును సంకీర్ణముగఁ జేయుచున్నారము. ఇన్నిదినము లేది వినయరసాప్లుత మంగళకార్యమై యుండెనో, ఇపు డది యైశ్వర్యమదోద్ధతాడంబరముగాఁ బరిణమించినది.

ఇపుడు మనహృదయము సంకుచితమై యున్నది. మన ద్వారము బంధింపఁబడి యున్నది. ఇపుడు కేవలము బాంధవులును ధనికులును దప్ప మంగళకార్యదినములలో మనయింటియందింకెవరికిని స్థానము లేదు. నేఁడు మనము మానవసాధారణులను దూరము చేసి, యీశ్వరుని బాధాహీన మగుపవిత్రప్రకాశమునుండి వంచింపఁజేసి, మనలను విచ్ఛిన్నులుగను క్షుద్రులుగను జేసికొని గొప్పవారమైతి మని తలంచుచుందుము. నేఁడు మనదీపాలోకము లుజ్జ్వలతరములు, నాహారము లపరిమితములు, నాయోజనము లతివిచిత్రతరములు. కాని, మంగళమయుఁ డగు నంతర్యామి మనశుష్కత్వమును, మనదీనత్వమును, మనకృపణత్వమును, జూచుచున్నాఁడు. మనయాడంబరములు దినదినమును బెరిఁగినకొలఁది నీదీపాలోకములలో నీగృహాలంకారములలో, నీరవలేశశూన్య మగు కృత్రిమతయందును, నా శాంతమంగళస్వరూపుని ప్రశాంతప్రసన్న ముఖబింబము మనమదాంధదృష్టిమార్గమునుండి యాచ్ఛన్నమై పోవుచున్నది. ఇపుడు మనము కేవలము మనలనే చూచుచున్నాము. మనస్వర్ణరౌప్యచాకచక్యములను జూపించుచున్నాము. మన నామమును వినుచున్నాము, వినిపించుచున్నారము.

ఓయీశ్వరా ! నీవు నేఁడు మమ్ముల నాహ్వానింపుమి !

బృహత్తరమగు మనుష్యత్వమున కాహ్వానింపుమి ! నేఁ డుత్సవ దినము, ఇది భావరససంభోగదినము గాదు. కేవలము మాధుర్య మందు నిమగ్నులమై యుండుదినము గాదు. నేఁడు బృహత్తరసమ్మే శనమందు శక్తి నుపలబ్ధి చేయుదినము, శక్తిని సమకూర్చుకొను దినము. నేఁడు నీవు మమ్ములను విచ్ఛిన్నజీవితముయొక్క ప్రాత్యహికజడత్వమునుండియుఁ బ్రాత్యహికౌదాసీన్యమునుండియు నుద్బోధితులనుగాఁ జేయుము. ప్రతిదిననిర్వీర్యనిశ్చేష్టత్వమునుండియు, నారామావేశములనుండియు నుద్ధరింపుమి ! ఏకఠోరత్వము నందు, నేదుద్యమమునందు, నేయాత్మవిసర్జనమునందు సార్థకతగలదో, దానియందు మమ్ములను బ్రతిష్ఠితులనుగాఁ జేయుము. నేఁడు మే మిందఱ మేకమై యుగయుగములందు నీమానవసమాజమునం దేసత్యగౌరవము, నేప్రేమగౌరవము, నేమంగళగౌరవము, నేకఠిననిర్భీకమాహాత్మ్యగౌరవములు విలసిల్లినవో వానిని జూడక కేవల క్షుద్రదీపాలోకమును, దుచ్ఛధనాడంబరమును జూచెద మేని సమస్తమును వ్యర్థమైపోవును. యుగయుగములందు మహాపురుషుల కంఠనిశ్చ్రితమగు యభయవాణిని నమృతవాణిని మహాకాలమంగళశంఖనిర్ఘోషమువలె వినక, కేవలము లౌకికత్వమును గుఱించియే చర్చించినయెడల సమస్తమును వ్యర్థమయి పోవును. ఈసమస్తధనాడంబరముల నిబిడనీహారరాసులను భేదించుకొని ధూళిశయ్యయందు నగ్నదేహములో నెచట నీసాధకుఁడు కూర్చుండియున్నాఁడో, సర్వత్యాగియగు నేసేవకుఁడు కర్తవ్యముల కఠినమార్గమునందు రిక్తహస్తముతో నెచటఁ బయనించుచున్నాఁడో

నీవరపుత్రు లెచట దారిద్ర్యముతోఁ బీడింపఁబడుచున్నారో, భోగపరాయణులచేఁ బరిత్యక్తులై మదాంధులచే నవమానితు లగుచున్నారో, యట్టియాపవిత్రదృశ్యములోనికిఁ దీసికొనిపొమ్ము! అచ్చట దీపాలోకములు, వాద్యోద్యమములు, స్వర్ణభాండారములు, మణిమాల్యములు నేవి ? అచటనే తేజము, నచటనే శక్తియు, నచటనే దివ్యైశ్వర్యములు నున్నవి. అచటనే నీవును ఉన్నావు. ఈసమస్తావరణాచ్ఛాదములను, నీసమస్తక్షుద్రదంభములను నీసమస్తమిథ్యాకోలాహలములను, నీసమస్తాపవిత్రాప్రయోజనములను దూరము చేయుము. మనుష్యత్వముయొక్క యాయభ్రభేదిశిఖరముగల నిరాభరణనిస్తబ్ధరాజనికేతనద్వారసమ్ముఖమున నేఁడు మమ్ములను నిలువఁబెట్టుము! అచట నాకఠినక్షేత్రమున, నారిక్తనిర్జనత్వమున, నాబహుయుగానిమేషదృష్టిసమక్షమున నీనుండి దీక్షను స్వీకరింతుముగాత!

---

## ప్రార్థన 14.

ఉపనిషత్తులు భారతవర్షబ్రహ్మజ్ఞానమునకు వనస్పతులవంటివి. ఇవి కేవలము సుందరశ్యామలచ్ఛాయామయములయినవే కాక, మహత్తరములయినవియుఁ గఠినములైనవియు నైయున్నవి. వీనియందుఁ గేవలము సిద్ధియొక్క ప్రాచుర్యము పల్లవితమయి యుండుటయేకాక, తపస్సుయొక్క కఠోరతయు నూర్ధ్వగామియ

యి యున్నది. ఆయభ్రభేది యగుసుదృఢకఠినత్వమునం దొక మధురపుష్పము వికసించినది—దాని సౌరభముచే మనల నది వ్యాకుల మొందింపఁ జేసినది. అది మైత్రేయియొక్క ప్రార్థనా మంత్రము.

యాజ్ఞవల్క్యుఁడు గృహమును బరిత్యజించి యరణ్యమున కేఁగుసమయమునఁ దనపత్నీద్వయమున కాయన సమస్తసంపదను దానము చేయ నుద్యుక్తుఁ డాయెను. అపుడు దానివలన నే నమరత్వమును బొందుదునా యని మైత్రేయి ప్రశ్నించెను. లేదు, అమరత్వము నొందుటకు వీలులేదు. అయితే సకలభోగముల ననుభవించుచున్నవారిజీవితమువలె నీజీవితముకూడ నుండు నని యాజ్ఞవల్క్యుఁడు ప్రత్యుత్తర మొసంగెను. సంసారు లేవిధమునఁ దమగృహములను, దమ సంతానమును, దమవస్తువాహనములను, దమపశువులను, దుస్తులను చక్కఁబెట్టుకొనుచు సుఖముగ దినములను గడపుచుందురో మీరుకూడ నటులనే దినములను గడపవచ్చును.

మైత్రేయి తత్క్షణమే "ఏనాహం నామృతాస్యాం కిమహం తేన కుర్యామ్" దేనివలన నే నమృతత్వమును బొందలేనో దానివలన నాకుఁ బ్రయోజన మే మని నుడివియుండెను. ఇది కఠోరమయిన జ్ఞానవిషయము కాదు—ఆమె చింతనముచేతను ధ్యానముచేతను ఏది నిత్యమో యేది యనిత్యమో దానివిషయమై విచక్షణ చేసి యీమాట నుడువలేదు—ఆమె మనస్సునం దొక నికష ముండెను. దానిపై నామె సంసారమందున్న సకలోపకరణముల నొక

సారి గీచి పరీక్షించియే "నేను దేనిని గోరుచున్నానో అది యిది కాదని" యుచ్ఛకంఠముతో నుడివియుండెను.

ఉపనిషత్తులయందున్న సకలపురుషఋషీశ్వరుల జ్ఞాన గంభీరసందేశములందు నొక్క స్త్రీకంఠమునుండి యొక వ్యాకులవాక్యము ధ్వనిత మయ్యెను. ఆధ్వని విలీన మయి పోలేదు—ఆధ్వని వారల మేఘమంద్రశాంతస్వరములయం దపూర్వ మగు నొక య శ్రుపూర్ణమాధుర్యమును మేల్కొలిపెను. మానవునియం దేపురుషుఁ డున్నాఁడో యాతని సాక్షాత్కారము నుపనిషత్తులయందు నానాదిక్కులనుండి నానాభావములతో మనము పొందియున్నాము. ఇట్టిసమయమునం దాకస్మికముగా నొకప్రాంతమునుండి మానవుని యందున్న నారీమణి తనసౌందర్యమును బ్రకాశితముచేసి నిలిచి యుండెను.

మన యాంతరప్రకృతియం దొకనారీమణి యున్నది. మన మామెకు మనసమస్తసంచయమును దెచ్చి యిత్తుము. మనము ధనమును దెచ్చి యిదిగో! తీసికొను మని నుడువుదుము. గౌరవమును సంపాదించి తెచ్చి యిదిగో! కూడఁబెట్టి యుంచు మని యిత్తుము. మన పురుషుఁడు సమస్తజీవితమును ధారవోసి పరిశ్రమచేసి యెన్నివిధముల నెంత గడించుచున్నాఁడో చెప్పలేము— ఇదిగో! దీనితో నీవు సంసారమును నిర్వహింపుము. సుఖముగా జీవితమును గడపు మని నారీమణితోఁ జెప్పుచున్నాఁడు. మన యాంతరతపస్విని యింకను స్పష్టముగ నిటులఁ జెప్పలేకున్నది— వీని యన్నిటివలన నాకెట్టిఫలమును గలుగనేరదు. నేను దేన్నిని

గోరుచున్నానో యది యిదియే కాఁబోలు నని తలంచుచున్నది. కాని, అన్నిటిని బొందినను,అన్నిటిని బొందితి నని తనమనస్సంగి కరించుటలేదు. పొందుపరిమాణము నింకను ఎక్కువచేయ వలె నని తలంచుచున్నది—ధన మింకను గావలెను; ఖ్యాతి యింకను అవసరము; శక్తి యింకను గావలయును. కాని యా "ఇంకను" అనుట కంతము లేదు. నిజమున కది యమృతమునే కోరుచున్నది. ఈయుపకరణము లమృతము కావని యొకదినమం దది గ్రహింపవలసియే యుండును - ఒకదినమం దొకముహూర్తమున సమస్తజీవితముయొక్క స్తూపాకారసంచయము నొకపూలకు నావర్జనమువలె నెట్టివేసి యది—"ఏనాహం నామృతా స్యాం కిమహంతేన కుర్యామ్" అని నుడవవలసియుండును.

కాని, "నేను దేనివలన నమృతత్వమును బొందలేనో దాని వలన నాకేమి ప్రయోజన" మని మైత్రేయి నుడివినమాట కర్ధమేమి ? అమరత్వమును దాల్చుట యనఁగా నీపార్థివశరీరము ననంతకాలము ధరించి నడచుటయా ? లేక మరణానంతరముకూడ నేదియో రూపమున జన్మాంతరమునందో లేక యవస్థాంతరము నందో నిలిచియుండుటయా ? మైత్రేయి శారీరకామరత్వమును గోరలేదు; ఆత్మయొక్క నిత్యత్వమును గుఱించియు నామె కెట్టి దుశ్చింతయు నుండలే దనువిషయము నిశ్చయము. అట్లయిన నామె యెవ్విధమున నమృతత్వము నొందఁగోరెను ? సంసారము నందు మన మొకదానినుండి మఱియొకదానిలోనికిఁ బోవుచున్నార మనియు, నెవ్విధముననుగూడ స్థిరముగ నుండలేకున్నార మనియు

నామె నుడివియుండెను. నామానసికవ్యాపారములు జరగిపోవుచున్నయవి; నామనస్సుకూడ జరగిపోవుచున్నయది; నాచిత్త మవలంబించినదానిని నేను బరిత్యజించినపుడు దానివిషయమయి నాకు మృత్యువు సంభవించుచున్నది. ఈవిధమునఁ గ్రమముగా నొక మృత్యువునుండి మఱియొకమృత్యువులోనికి నడచుచున్నారము. ఈమృత్యుపారంపర్యాయమున కంతము లేకున్నది.

అయినను నామనస్సొకస్థిర మయినదానిని గోరుచున్నది. దేనిని బొందిన నింకఁ గదలవలసినపని యుండదో,దీనికన్న నింక నెక్కువ కోర నని చెప్పఁగలదో, ఎడఁబాటునుగూర్చి తలంచుట కయిన వీలుండదో—అట్టి దానిని గోరుచున్నది. అట్లయినచో మృత్యుముఖమునుండి తప్పించుకొన వీలగును. ఏమానవుని యే యుపకరణము నొందిన నాచిరజీవితమునకు సంబళ మేర్పడిన దనియు, నాకిం కెద్దియు నవసరము లేదనియుఁ జెప్పఁగలనో అట్టి దేది కలదు ?

అందుచేతనే తనభర్త త్యజించిన సమస్తవిషయసంపదలను ద్రోసిపుచ్చి వీనివలన నాకేమి ప్రయోజన మని మైత్రేయి నుడివి యుండెను. నాకు అమృతము కావలయును.

ఉపకరణము లమృతము కానప్పుడిఁక నమృత మేది ? అమృత మనఁగా నేమియో మనకుఁ దెలియును. లోకమునందు మనము దానిస్వాదమును బొందలేదని చెప్పలేము. పొందకున్నచో దానికొఱకు మనక్రందన మెందులకు ? మనము సంసారమందలి సకలవిషయములందును గేవలము దానినే వెదకుచున్నారము. ఏల

యన, నిమిషనిమిషమునకు నది తనస్పర్శమును మనకు లభింపఁ జేయుచున్నది.

మృత్యువునం దీయమృతస్పర్శను మన మెచ్చోటఁ బొందు చున్నాము ? మన ప్రేమ మున్నచోటనే దానిని బొందుచున్నాము. ఈప్రేమమునందే మన మనంతుని స్వాదమును బొందుచున్నా రము. ప్రేమమే సీమయం దసీమునిఛాయను బఱపి పురాతన మును నవీనముగఁ జేసివైచును. మృత్యువు నెంతమాత్రము నంగీ కరింపదు. సంసారమందలి విచిత్రవిషయములలో నీప్రేమాభాస మును గాంచి మనము మరణాతీతమగు పరమపదార్థముయొక్క పరిచయమును బొందుదుము. ఈప్రేమనే పరిపూర్ణరూపముతోఁ బొందఁగోరినచో మన యంతరాత్మయొక్క సత్యాకాంక్షను గ్రహిం పఁగలిగితిమేని మనము సమస్తోపకరణముల ననాయాసముగఁ ద్రోసివైచి "ఏనాహం నామృతా స్యాం కిమహం తేన కుర్యామ్" అని నుడువఁగలము.

ఈవాక్యము రమణీముఖమునుండి వెలువడినపు డెంతస్పష్ట ముగ నెంతసత్యముగ నెంతమధురముగ వెలువడినది ! సకలచిం తనములను సకలోక్తులను బరిహరించి యెంతయనాసముగ నిది ధ్వనించినది! నే నెట్టియుపకరణములను గోరుటలేదు. నేను ప్రేమనే కోరుచున్నాను—ఇది యేమి క్రందనము !

మైత్రేయియొక్క యాసరళాక్రందనము ప్రార్థనారూపము ధరించి జాగరిత మాయెను. అట్టి యాశ్చర్యకరమయిన పరిపూర్ణ మయిన ప్రార్థన జగత్తునం దింకెచ్చట నయిన నెపు డయిన విన

వచ్చెనా ? సకలమానవహృదయములయొక్కయు నేకాంతప్రార్థన యీరమణీమణియొక్క వ్యాకులకంఠమునందు శాశ్వతకాలసందేశాకారమును దాల్చెను, ఈప్రార్థనయే మన ప్రతివానియొక్క ప్రార్థనయై యున్నది. ఈప్రార్థనయే విశ్వమానవుని బృహత్తరేతిహాసమునందు యుగయుగాంతరములలో నుచ్చారిత మగుచున్నది.

ఓతపస్వినీ ! మైత్రేయీ ! రమ్ము, సంసారమునం దుపకరణపీడితుల హృదయములందు నీపవిత్రచరణద్వయమును నేఁడు స్థాపింపుము—నీయీయమృతప్రార్థనను నీమృత్యురహితమధురకంఠముతో నాహృదయమునం దుచ్చారితము కావింపుము. శాశ్వతముగా నెట్లు రక్షింపఁబడుదునా యను విషయమయి నామనస్సునం దెట్టిసందేహము నుండకుండునుగాక !

---

## ప్రార్థనావశ్యకత 15.

ఉపాసనయందుఁ బ్రార్థన కవకాశము లే దనియు, నుపాసన యనఁగాఁ గేవలధ్యాన మనియు, మనస్సునం దీశ్వరస్వరూపోపలబ్ధి యనియుఁ గొందఱు చెప్పుచున్నారు.

ప్రపంచమునం దిచ్ఛయొక్కప్రకాశమునే మనము చూడఁజాలకున్నయెడలఁ బైవాక్యములను దప్పక స్వీకరించియే తీరవలయును. మనము లోహములయొద్దను బర్వతములయొద్దను బ్రార్థన చేయుటలేదు. ఎవ్వని కిచ్ఛావృత్తి యున్నదో యతనిసమీపమునసే మనము మనప్రార్థనల నివేదించుచున్నాము.

ఈశ్వరుఁడు కేవలసత్యస్వరూపుఁడే యైనను, గేవల మవ్య ర్థనియమములతో నతఁడు ప్రకాశించుచున్నను, నాతఁ డిచ్ఛామ యుఁడే కానియెడల నతనియొద్దఁ బ్రార్థింపవలయు నన్నభావమే మనయం దంకురింపకపోవును. పరమేశ్వరుఁడు "ఆనందరూప మమృతమ్" అతఁ డిచ్ఛామయుఁడు; ప్రేమమయుఁడు; ఆనంద మయుఁడు. అందువలననే కేవలవిజ్ఞానద్వారమున నతనిని మన మెఱుఁగఁజాలకున్నాము. ఇచ్ఛాద్వారముననే పరమేశ్వరుని యి చ్ఛాస్వరూపమును, నానందస్వరూపమును మనము తెలిసికొనవల యును.

ప్రపంచమునం దెచ్చటఁ జూచినను మనకుఁ బరమసౌంద ర్యము కాన్పించుచున్నది. భగవంతుఁ డిచ్ఛామయుఁ డని తెలు పుట కదియే ప్రబలనిదర్శనము. భగవదిచ్ఛ సౌందర్యరూపమునఁ బ్రకాశించుచున్నది. అందుచే మనము సౌందర్యమును బ్రయోజన క్షేత్రమునం దుపకరణరూపముగా వ్యవహరించుచున్నాము. ఇచ్ఛతో నిచ్ఛయు నానందముతో నానందమును మిళితమైనచోట మనకు శృంగారము సంగీతము సౌందర్యము కానుపించును. జగదీశ్వ రుఁడు తనజగత్తునం దిట్టియావశ్యకసౌందర్యముయొక్క విపుల మైన సామగ్రిని రచించుటవలననే జగత్తు నొకమేలనక్షేత్రముగా మనహృదయము గ్రహింపఁ గలిగినది. అట్లు కానిచో నిచ్చట మనవేషభూషణములన్నియు వైయర్థ్యబహుళములై కాన్పించును.

జగత్తునందు మనహృదయముగూడ గ్రహింపవలసిన యొకవిషయ మున్నదని విశ్వసింపవలయును. ఒకవైపున వెలుఁ

గుండుటవలననే మనకు నేత్రము లున్నవి. సత్య ముండుటవల ననే మనకు చైతన్య మున్నది. జ్ఞాన ముండుటవలననే మనకు బుద్ధి యున్నది. అట్లే మఱియొక వైపున మనహృదయమునకుఁ గూడఁ బ్రతిరూప మేదైన నున్నదా ? ఉపనిషత్తు లీప్రశ్నమున కిట్లుత్తర మిచ్చియున్నవి—“రసో వై సః” రసస్వరూపుఁడును, నానందస్వరూపుఁడును నగు పరమాత్మ యున్నాఁడు.

మనము శక్తిద్వారమునఁ బ్రయోజనములను సాధింపగలుగుదు మనియు, యుక్తిద్వారమున జ్ఞానసంపాదనమును జేయఁగలుగుదు మనియు నింతకుఁ బూర్వమే నేను సూచించియున్నాను. కాని శక్తియుక్తు లానందముయొక్క ద్వారమువఱకుమాత్రమే పోయి యచ్చట నాఁగిపోవుచున్నవి. ఆనందమును సమీపింపఁజాలకున్నవి. ఆనందముతోఁ బూర్తిగా నంతఃపురసంబంధమును గలిగించుకొనునది యిచ్ఛ యొక్కటియే. ఇచ్ఛ గాక మఱియే యితరశక్తియు నానందమును సమీపింపఁజాలదు.

నాయందున్న యీయిచ్ఛకు నికేతన మేది ? హృదయము. ఇచ్ఛామయమైన నాహృదయము శూన్యమునఁ బ్రతిష్ఠితమై యున్నదా ? దానికిఁ బుష్టి మిథ్యయందా ? దానిగమ్యస్థానము వ్యర్థతయందా ? అట్లయిన నీయద్భుతమైన యుపసర్గ మెక్కడనుండి వచ్చినది ? ఏయుపాయముచే నాహృదయము నిలిచి యుండఁగల్గును ? జగత్తులో నున్న దంతయు మోసమా ? ఆమోసమే నా హృదయమా ?

కాదు. ఎన్నటికిని గాదు. ఇచ్ఛారసపోషిత మగు మనహృదయము జగద్వ్యాపనముగల యిచ్ఛారసముయొక్క నాడులతో సంబంధింపఁబడియున్నది. దానినుండియే మనహృదయ మానంద రసమును బొంది బ్రతుకుచున్నది. ఆనందరసమును గ్రోలకున్న హృదయమునకుఁ బ్రాణములు నిలువవు. మనహృదయ మన్న వస్త్రములు గోరుటలేదు. విద్యాసాధ్యములను గోరుట లేదు. అమృతమును మాత్రమె కోరుచున్నది. హృదయము దేనిని గోరుచున్నదో యది యల్పరూపముగ సంసారమునందును, నధికరూపముగఁ బరమాత్మయందును నుండుటవలన హృదయము పరమాత్మనే గోరుచున్నది. అంతేకాని కేవలరుద్ధద్వారముకడఁ దనతలను దూర్చి చచ్చుటకు మనహృదయము సృజింపఁబడలేదు.

కావున హృదయము తనను దా నెఱుఁగఁగలుగుటవలననే తన కౌకపరిపూర్ణకృతార్థత యనంతపరమాత్మలో నున్నదని యది నిశ్చయముగా నెఱుఁగఁ గలుగుచున్నది. ఇచ్ఛ తనకే గాక పరమాత్మకుఁ గూడ నుండుటవలననే హృదయము నిలువఁగలుగుచున్నది. పరమాత్మయం దిచ్ఛయే లేనియెడల నొకనిమేషమైనను హృదయమున నుచ్ఛ్వాసనిశ్వాసములు జరుగనేరవు. అందుచేత నుపనిషత్తు లిట్లు నొక్కి వక్కాణించుచున్నవి—'కోహ్యేవాన్యాత్ కః ప్రాణ్యాత్ యదేషఆకాశ ఆనందో నస్యాత్' ఆకాశమునం దాయానందస్వరూపుఁడే లేనియెడల నెవ్వఁడు చలించును? ఎవ్వఁడు జీవించును?

ఒకయిచ్ఛకును మఱియొక యిచ్ఛకును మధ్యస్థలమున

దూత్యసాధనముగ నున్నది ప్రార్థన. రెండిచ్ఛలకును విచ్ఛేదము కలిగినచోట వ్యాకులవేషముతో నిలఁబడి యుండునది యాప్రార్థనాదూతికయే. అందుచే నసాధారణసాహసముతో వైష్ణవు లిట్లు చెప్పుచున్నారు—"జగత్తునందు విచిత్రసౌందర్యముతో భగవానుఁడు వేణుగానమును జేయుచు ననేకస్వరములను బాడుచున్నాఁడు. అవి కేవలము మనకొఱకే. అతఁడు మనహృదయముల నిట్టి యనిర్వచనీయసంగీతముతోఁ బిలుచుచున్నాఁడు. అందువల ననే సౌందర్యమైన సంగీతము మనహృదయమునందలి విరహవేదనమును రవుల్కొల్పుచున్నది."

ఆయిచ్ఛామయుఁ డిట్టిమధురస్వరముతో నెచ్చట మన యిచ్ఛను బిలుచుచున్నాఁడో యచ్చట నతఁడు తనసమస్తశక్తులను శాంతపఱచెను. ఏప్రచండశక్తిచే నతఁడు సౌరజగత్తును సూర్యునితో నమోఘరూపముగ బంధించెనో యాశక్తి లేశమాత్రమైన నచ్చట లేదు. కరుణయు మాధుర్యమును గలస్వరములతోను నానావిచిత్రస్వరములతోను భగవానుఁడు తనవేణువును వాయించుచున్నాఁడు. భగవంతునియాహ్వానమున కిఁక నంతము లేదుగదా!

అతఁ డిట్లాహ్వానము చేయుచుండ మనమనస్సునందుఁ బ్రార్థనాభావ మంకురింపకుండునా ? ఆయాహ్వానమును విన్నమానవుఁడు విరహవేదనముచే నేడ్చుచు నేలపైఁ బడి దొర్లకుండునా? అసత్యాంధకారములనుండియు మృత్యువుయొక్క నిరానందనిర్వాసనములనుండియుఁ దొలఁగి యభిసారయాత్రను (నాయికానాయకుల మేలనక్షేత్రమునకుఁ బోవుట.) సలుపుసమయమున నీప్రార్థ

నాదూతికయే తనకంపితదీపశిఖతో మనకు మార్గమును జూపుచు నడిపించునది.

ఎంతకాలము మనకు హృదయ ముండునో, యెంతకాలము ప్రేమస్వరూపుఁ డగుభగవానుఁడు సౌందర్యద్వారమున నీజగత్తు నానందనికేతనముగా నలంకరించుచుండునో యంతకాలము భగవంతునితో మిళితము కానియెడల మానవునకు వేదన తొలఁగు టెట్లు ? పరమేశ్వరునితో మిళితము కానంతవఱకు సందేహాకఠోర జ్ఞానాభిమానము ప్రార్థనాభావమును ధిక్కరించి మనలను బరమేశ్వరునుండి మరలింపఁ జూచుచుండును.

వికసితారవిందము తనచుట్టు నుండు జలరాశియొక్క యావరణమును ద్రోసివేసి సూర్యుని కభిముఖముగాఁ దనముఖము నెత్తుచున్నది! మఱియు దానిసమస్తసౌగంధ్యమును శిశిరాశ్రుసిక్త సౌందర్యము నది యుద్ఘాటితము చేయుచున్నది. అట్లే సమస్త విశ్వమానవకోటియొక్క యంతరమునుండి ప్రార్థన యిట్లు వెడలుచున్నది—"అసతో మా సద్గమయ, తమసో మా జ్యోతిర్గమయ, మృత్యోర్మా మృతం గమయ." మానవహృదయమునందలి యీ పరిపూర్ణప్రార్థన యనుపూజోపహారమును మోహబలముచేఁ దిరస్కరింపఁగల మహానిదారుణశుష్కత్వ మెవ్వనియందున్నది

---

# గుహాహితము 16.

ఉపనిషత్తీశ్వరుని "గుహాహితం గహ్వరేష్టమ్" అనఁగా నాయన గుప్తమయినవాఁడు గభీరమయినవాఁడు నని నుడివియుండెను. ఆయనను గేవలము బాహ్యమునఁ గనుఁగొనఁజాలము; ఆయన దాఁగి యున్నాఁడు. బాహ్యమునఁ బ్రకాశితుఁడై యున్నయాయనను జూచుటకు మన కింద్రియము లున్నవి. అటులనే నిగూఢమయి గభీరమయి యున్నయాయన నుపలబ్ధి చేయుటకు మనకు గభీరతరమగు నంతరింద్రియ మున్నది. అది లేనియెడల నాదిక్కునకు మనదృష్టిని మరల్పలేకుండెడివారము. ఆగభీరుని బొందుటకు మనకు లేశమాత్రతృష్ణ యయిన నుండెడిదికాదు.

ఈయగోచరునితో యోగసాధనకుఁ దనకు విశేషాంతరింద్రియ ముండుటచేతనే మానవుఁ డీజగత్తునందు జన్మించి కేవలము బాహ్యవస్తువులయందే సంతుష్టిఁ జెందియుండలేదు. అందుచే నాతఁడు నలువైపుల నెమకుచున్నాఁడు; దేశవిదేశములలోఁ దిరుగాడుచున్నాఁడు. ఆతని నెచ్చటను నిలువనిచ్చుటలేదు. ఆతఁ డెచ్చటనుండి యీవెదకుసాధనను సంగ్రహించి యీసంసారమునఁ బ్రవేశించినాఁడు ? మనము పొందుచున్నదానియందు సంపూర్ణుని బొందుటలేదు. దేనిని బొందుట లేదో దానియందే మనము యథార్థముగఁ బొందుసామగ్రి యున్నదను నీప్రత్యయము మానవుని యం దెట్లు జన్మించినది ?

పశువుల మనస్సులయం దీప్రేరేపణ లేదు. పై నున్నదాని

యందే వానిప్రయత్నములు తిరుగాడుచుండును. చూడఁజాలని వానిని వెదకవలె ననియును, బొందఁజాలనివానిని బొందవలె ననియు నవి యొక్కముహూర్తమయినను దలంపఁజాలవు. వాని యింద్రియములు బాహ్యప్రపంచమున కరుదెంచినంతనే యాఁగిపో యినవి. ఈబాహ్యము నతిక్రమింపఁజాలకపోవుటచేత వాని కెట్టి యావేదనయును లేదు. కాని మిక్కిలి యాశ్చర్యకరమగువిషయ మేమనఁగా, మానవుఁడు ప్రకాశ్యమునకంటె గోపనము నెక్కు వగఁ గోరుచుండును. తన సమస్తేంద్రియములును విరుద్ధముగ సాక్ష్య మిచ్చినను చూచుట లేదు, కాని చూడవలసిన దున్నది; వినుటలేదు, కాని వినవలసిన దున్నదని మానవుఁ డనుచున్నాఁడు.

జగత్తునం దనేకగుప్తసామగ్రు లున్నవి. వాని యాచ్ఛా దనమును దొలఁగించినంతనే యవి ప్రత్యక్షముగ గోచరమగును. కాని యది యట్టిది కాదు. ఇది యాచ్ఛన్నమయి యుండుటచే గుప్త మయినది కాదు; ఇది గభీరమయి యుండుటచేతనే గుప్తమయి యున్నది. కావున దీనిని మనము తెలిసికొనినపుడుకూడ గభీర మయియే యుండును.

మానవున కొకయాంతరతరమగు నింద్రియ మున్నది. దాని యాఁకలియు నాంతరతరమయినది; దాని యాహారముకూడ నాంతరతరమయినది; దానితృప్తియుఁగూడ నాంతరతర మయి నది. అందుచే మానవుఁడు చిరకాలమునుండి నేత్రదృష్టిని భేదిం చుకొనునుద్దేశముతో నేకాగ్రదృష్టితోఁ జూచుచున్నాఁడు. అం దుచే మానవుఁ డాకాశమందున్న నక్షత్రములం జూచియే క్రింది

వైపునకు దృష్టిని మరల్పలేదు. ఇందుచేతనే యే సుదూరాతీతకాల మందో కేల్దియరు మరుప్రాంతములందు మేషపాలకుఁడు మేషము లను మేపుచు మేపుచు నిశీథరాత్రియొక్క యాకాశపుటయందు జ్యోతిష్కరహస్యమును బఠించుట కెన్నియో రాత్రు లనిమేష నిద్రాహీననేత్రములతోఁ గడపి యుండెను. వారి మేయుచున్న మేఁకలలో నొక్కటయిన నాదిక్కునకుఁ జూచుప్రయోజన మయిన ననుభవింపలేదు.

కాని, మానవుఁడు చూచుదానియందు గుహాహితునిఁగూడఁ జూడఁగోరుచున్నాఁడు; లేనియెడల నాతఁ డెంతమాత్రమును స్థిరముగ నుండఁజాలఁడు.

ఈయగోచరరాజ్యము నన్వేషింపఁబోయి మానవుఁడు కేవలము సత్యమునే యుద్ఘాటనమొనర్చె నని చెప్పఁజాలను. ఎన్ని భ్రమప్రమాదములం దాతఁడు పడెనో వాని కంతము లేదు. గోచరరాజ్యమం దింద్రియములసాహాయ్యముతో నాతఁడు ప్రతిదినము నొకదానిని మఱియొకదానినిగఁ జూచును. ఎన్ని భ్రమల నాతఁ డతిక్రమింపవలసియుండునో వాని కంతము లేదు. కాని యట్లని ప్రత్యక్షక్షేత్రమును సంపూర్ణముగ మిథ్యగఁ బరిత్యజించు టనుచితము. మనము గోపనుని వెదకు నగోచరదేశమందును మన మనేకభ్రమలను సత్యములుగా స్వీకరించినా మనుట కెట్టి సందియమును లేదు. ఒకపుడు విశ్వవ్యాపారముల మూలమందు మన మెన్నిభూతప్రేతములను నద్భుతకాల్పనికమూర్తులను నిలువఁబెట్టితిమో వాని కంతము లేదు. అట్లని మానవుని యీమనోవృత్తి

లను బరిహసించుట కెట్టికారణమును గాన్పించుటలేదు. గభీరజల మందు జాలమును వైచినప్పుడు నత్తలును గవ్వలును బడినయెడల దానివలన జాలమును వైచు విషయమయి విచారణ జరుపఁజనదు. మానవుఁ డటులనే యగోచరముయొక్క యడుగుభాగమున వేయు జాలమునుండి యింతవఱకు ననేకములయిన నత్తలును గవ్వలును బడినవి కాని వాని నశ్రద్ధతోఁ జూడఁజాలము. అన్నిచూపులకంటె నెక్కువచూపువైపునకును, నన్నిలాభములకంటె నెక్కువలాభము వైపునకును మానవుని యీప్రయత్నము నెల్లపుడును బ్రేరణచేయుట యే మిక్కిలి యాశ్చర్యకరమయిన విషయము. ఆఫ్రికాదేశపు వనముయొక్క యసభ్యతయందీప్రయత్నమునుగుఱించిన పరిచయము ను బొందినపుడు వారియద్భుతవిశ్వాసమును వికృతదేవమూర్తిని జూచి మానవుని యీయంతర్నిహితశక్తియొక్క విశేషగౌరవము ననుభవింపకుండ నుండఁజాలము.

మానవుని యీశక్తి సత్యమయినది. ఈశక్తియే సత్యమును గోపనత్వమునుండి రక్షించుటకును మానవునిచిత్తమును గభీరత్వ ముయొక్క నికేతనమునకుఁ గొంపోపుటకునై యున్నది.

ఈశక్తిమానవున కెంతసత్యమయిన దనఁగా, దీనిని జయ యుక్తమొనర్చుటకు మానవుఁడు దుర్గమమయిన యే యాటంక ము నంగీకరింపలేదు. ఇచట సముద్రపర్వతముల నిషేధములు మానవునియొద్ద నిష్ఫలములయినవి. ఇచట భయ మాతని నాటంక పఱుపఁ జాలకపోయెను. నిష్ఫలత్వ మాతని గతిరోధమును గావిం పలేక పోయెను. ఈశక్తిప్రేరణచే మానవుఁడు తనసమస్తమును

ద్యజింపఁగలడు; అనాయాసముగఁ బ్రాణముల్నైన విసర్జింపఁ గలఁడు.

మానవుఁడు ద్విజుఁడు. ఆతనిజన్మక్షేత్రము రెండుస్థానములలోఁ గలదు. ఒకస్థానమునం దాతఁడు ప్రకాశ్యుఁడు; మఱియొకస్థానమునం దాతఁడు గుహాహితుఁడు, గభీరమయినవాఁడు. ఈబాహ్యమానవుఁడు బ్రదికియుండుటకై యెన్నియోప్రయత్నములొనర్చుచున్నాఁడు; నలువైపుల నెంతయో సంగ్రహించుచున్నాఁడు. ఎంతయోసంగ్రామము గావించుచున్నాఁడు. అటులనే యంతరమానవుఁడు గూడ బ్రదికియుండుటకయి యెంతయో సంగ్రామము సలుపుచున్నాఁడు. ఆతనికిఁ గావలసిన యన్నజలములు బాహ్యజీవితమును రక్షించుటకై మిక్కిలి యావశ్యకము లయినవికావు. కాని మానవుఁ డీయాహారమును సంగ్రహింపఁ బినబాహ్యజీవితమును విసర్జించినాఁడు. ఈయంతరమానవుని మానవుఁ డనాదరణ చేయలేదు. ఆతనినే యెక్కువగ నాదరించెను. అట్లుచేసినవారే సభ్యతౌన్నత్యశిఖరమున కధిరోహణము గావింపఁ గలిగిరి. మానవుఁడు బాహ్యజీవితమునే మిక్కిలిగొప్పదానిగఁ జేసినప్పుడు దానిస్వరమన్నిదిక్కులనుండియు సన్నగిల్లుచుండును. దుర్గమమువైపునకు గోపనమువైపునకు గభీరత్వమువైపునకు మానవునిప్రయత్నములాకర్షింపఁబడినప్పుడే మానవుఁడు గొప్పవాఁ డగుచుండును; భూమావైపున కగ్రసరుఁ డగును; అపుడే మానవుని చిత్తము సర్వతోభావముగ జాగరితమగుచుండును. ఏది సుగమమయినదో, యేది ప్రత్యక్షమయినదో దానివలన మానవుని సమస్తచైతన్యము మే

ల్కాన( జాలదు. అందుచేతనే కేవల మాౖవైపున మనమనుష్యత్వ ము సంపూర్ణతను బొందనేరదు.

అట్లయినయెడల మానవునియందు(గూడ నొకగుహాహిత మగుసత్తయున్నటుల( గాంచ(గలుగుచున్నాము. ఆగభీరసత్తయే విశ్వబ్రహ్మాండమందున్న గుహాహితునితో నాధానప్రధానసంబంధము కలది—అదియే యాతని కాకాశము, ఆతనికి వాయువు, ఆతని కాలోకము, అచ్చటనే యాతనిస్థితి, యాతనిగతి; ఆగుహాలోకమే యాతనిలోకము.

ఇచ్చటనుండి పొందుదానికిని, వైషయికసంపదకును సరిపోల్ప(జాలము. దానిని తూ(చి సరిపోల్చుట కెట్టిమార్గమును లేదు—ఏస్థూలదృష్టి గలవ్యక్తి యయినను దానిని దృణీకరించి నీవేమి పొందితివో దానిని జూచెదనని యాత( డనినపుడు మిక్కిలి సంకటమున( బడవలసివచ్చును. ప్రత్యక్షసత్య మనువునాదిపై( బ్రతిష్ఠింప(బడిన వైజ్ఞానికసత్యమునుగుఱించి ప్రత్యక్షతయొక్క ప్రమాణమును నిరూపింప(జాలము. బరువగువస్తువు చేతినుండి జాఱిపోవుటను మనము చూపింప(గలము. కాని మహాకర్షణను జూపింపలేము. మిక్కిలి మూఢమానవు(డు నేను సముద్రమును జూచితిననియు, హిమాలయపర్వతమును జూచితిననియు( జెప్పిన యెడల ముందుగా నీరెండునేత్రములను మిక్కిలి పెద్దవిగా( గావించుకొనుము; అట్లయిన నీకు( బర్వతసముద్రములను జూపింతు నని యాతనికి( జెప్పవలసిన పనిలేదు—కాని యామూఢు(డు భూవిద్యనుగుఱించి యడిగినపుడు కొంచె మా(గుమని యాతనితో( జెప్ప

వలసియుండును. ప్రథమము నుండియు నారంభింపవలయును. ముందుగ నీమనస్సును సంసారావరణములనుండి ముక్తము గావింపుము; అట్లయిన దీనియందు నీ కధికారము కలుగును. అనఁగా నేత్రములు తెఱచినంతనే పని జరుగ నేరదు; చెవు లొగ్గినంతనే కార్యము నెఱవేఱదు; నీవు గుహాభ్యంతరమునఁ బ్రవేశింపవలసియుండును. నేను సాధనచేయ నొల్ల ననియు, నాకొఱకు నీవంతయు నేత్రములతోఁ జూచునటులను గర్ణములతో వినునటులను సహజముగ నొనర్పు మని మూఢుఁ డనినయెడల మిథ్యచే నాతనిని మఱపించవలసియుండును. లేనియెడల నాతని కోరిక నాకర్ణించుటయు వృథాకాలహరణ మని గణింపవలయును.

అట్లయినచో నుపనిషత్తెవనిని "గుహాహితం గహ్వరేష్టమ్" అని నుడివెనో, యెవఁడు గభీరతముఁడో, యాతనిని మన నేత్రములయొక్కయుఁ గర్ణములయొక్కయు సామగ్రిగఁజేసి బాహ్యమునఁ బడవైచునట్టి యద్భుతకార్యము జరుగనేరదు. ఇట్టి కోర్కెను నెఱవేర్పఁగలుగునట్టి గురువును మన మనేకపర్యాయములు వెదకుచుందుము—కాని యాగభీరతముని సహజముగఁ జేసివైచెద నని యేగురువయిన నుడివినను, "నిహితం గుహాయామ్" అను వానిని మననేత్రసమక్షమునఁ దనయిష్టానుసారముగ నొకవిధముగ నిలువఁబెట్టినను నసత్యమువలన గోపనము నింకను గోపనముగఁ జేసి వైచె ననియే మనము చెప్పక తప్పదు. ఇట్టిస్థలమందు శిష్యునితో నిట్లు చెప్పు టుచితము—మానవుఁ డాగుహాహితుని నాగభీరమయినవానిఁ గోరునపు డాయనగభీరమయిన

వాఁ డగుటచేతనే కోరుచున్నాఁడు. ఆగభీరానంద మింక నెటులను దీరకపోవుటచేతనే కోరుచున్నాఁడు. — నేత్రములతోఁ జూచునట్టి వియుఁ గర్ణములతో వినునట్టివియు వస్తువులు జగత్తునం దనేక ములు కలవు. వానికొఱకు మనబాహ్యమానవుఁ డహోరాత్రములు తిరుగాడుచున్నాఁడు. కాని మనయంతరతర గుహాహితుఁ డగు తపస్వి యాసమస్తమును గోరకయుండుటచేతనే యేకాగ్రమనస్సు తో నాతని వైపునకు నడుచుచున్నాఁడు. నీ వాయనను గోరుదువేని గుహయందుఁ బ్రవేశించి యాయనను సాధనము చేయుము; మ ఱియు నాయనను బొందునపుడు "గుహాశయ" రూపముననే యా యనను బొందెదవు. అన్యరూపమున నాయనను గోరువాఁ డాయ నను గోరుటయే లేదు. ఆతఁడు కేవలము విషయమునే యన్య నామముతోఁ గోరుచున్నాఁడు. మానవుఁడు సకలలాభములకంటె దేని నెక్కువగఁ గోరుచున్నాఁడో యాతఁడు సహజమయినవాఁ డని కోరుటలేదు; ఆతఁడు భూమ యనియే యాతనిఁ గోరుచు న్నాఁడు. సాహిత్యమునందును, నితిహాసమునందును, శిల్పమునం దును,ధర్మమునందును, గర్మములయందును భూమయయి యున్న వాఁడే సర్వత్ర గుహాహితుఁ డయి యున్నాఁడు.

ఈయందఱికంటె గొప్పయయిన—యందఱికంటె గభీర మయిన వానిని పొందుటయందే యొకసార్థకత యున్నది. ఆభూమ నాకాంక్షించుటయే యాత్మయొక్క మాహాత్మ్యము—భూమైవ సు ఖం నాల్పే సుఖమస్తి—ఈమాట నేమానవుఁడు చెప్పఁగలిగెనో యాతనిదే మనుష్యత్వము; క్షుద్రమయినదానియం దాతనికి సుఖ

ము లేదు; సహజమయినదానియం దాతని కానందము లేదు; అందుచేతనే యాతఁడు గభీరమయినవానిని గోరుచున్నాఁడు. అయినను నీవు నాహస్తమునందు సహజమయినవానిని దెచ్చియుంచుమందువేని నీవు మఱియొకదానిని గోరినవాఁడ వగుదువు.

ఏది సహజ మయినదో, యనఁగా దేనిని మన మనాయాసముగఁ జూచుచున్నామో యనాయాసముగ వినుచున్నామో యనాయాసముగ గ్రహించుచున్నామో దానివంటి కఠినమగు నావరణ మఱొండు లేదు. ఎవఁడు గభీరమయినవాఁడో యాతఁ డీయతి ప్రత్యక్షగోచరమగు సహజ మగుదానివలననే తన నావృతముగఁ జేసికొని యుంచియున్నాఁడు. బహుకాలపుబహుచేష్టలచే నీసహజములగు దృశ్యశ్రవణముల యావరణమును భేదించియే మానవుఁడు విజ్ఞానసత్యమును దర్శనతత్త్వమును గాంచియున్నాఁడు; పొందఁ దగినదానిని బొందియున్నాఁడు.

కేవల మదియేగాక కర్మక్షేత్రములందును మానవుఁడు బహుసాధనలవలనఁ దనసహజప్రవృత్తులను భేదించుకొని కర్తవ్యనీతియందుఁ బ్రవేశించినాఁడు. మానవుఁడు తనసహజక్షుత్పిపాసలనే యనాలోచితముగ శిరసావహించి పశువువలె సహజజీవితమును స్వీకరింపలేదు. ఇందుచేతనే శిశుకాలమునుండి ప్రవృత్తులపై జయము నొందు విద్యను జేయుటఁతగఁ గైకొని దుస్సాధ సంగ్రామమును జేయవలసివచ్చుచున్నది. పలుమాఱు లాతఁడు పరాజయ మొందియుఁ బరాభవము నంగీకరింపలేకున్నాఁడు. కేవలము చరిత్రయందేగాక, కర్మములయందే గాక హృదయభావము

లందును మానవుఁడు సహజమయినదాని నతిక్రమించుమార్గమున నడచుచున్నాఁడు. మానవుఁడు ప్రేమను దననుండి కుటుంబము నకును, గుటుంబమునుండి దేశమునకును, దేశమునుండి మానవ సంఘమునకును బ్రసారితము గావింపఁ బ్రయత్నించుచున్నాఁడు. ఈదుస్సాధసాధనయం దాతఁ డెంత యకృతార్థుఁ డయినను దీనిపై నాతఁ డేవిధమునఁగూడ నశ్రద్ధఁ జూపఁజాలఁడు. స్వార్థము నా యొద్ద సుప్రత్యక్షమై సహజమైన దయి, పరార్థము గూఢనిహితమై దుస్సాధమయి యున్నను స్వార్థమునకన్న పరార్థమే సత్యతమ మయిన దనియు, నాదుస్సాధసాధనమువలననే మానవునిశక్తి సా ర్థక మగుననియు నుడువవలసియుండును. అందుచే నాతఁడు గభీ రతరానందమును బొందును; అనఁగా నీకఠినవ్రతమే మనగుహా హితమానవుని యథార్థజీవనము. ఏల యనఁగా నాతనికి—నాల్పే సుఖమస్తి—అల్పమందు సుఖము లేదు.

జ్ఞానమునందును, భావమునందును గర్మమునందును, మాన వుఁడు సర్వత్ర నీవిషయమునే ప్రయోగించినయెడలను జ్ఞానభావ కర్మములయందు సర్వత్ర మానవుఁ డీసహజమయినదాని నతిక్ర మించి గభీరమయినదానివైపునకే యాత్ర సలుపుచు సమస్తశ్రేయ మును బొందియున్నయెడలను గేవలము పరమాత్మవిషయమయి మానవుఁడు దీనభావముతో సహజమయినదానిని బ్రార్థించి తన మనుష్యత్వమును వ్యర్థపుచ్చుకొనునా? మానఁడు ధనమును గోరు నపు డామాటను జెప్పఁడు. రూపాయలను మట్టిబెడ్డలుగఁ జేయు ము, నాకది సహజ మగునని నుడువఁడు; రూపాయలు దుర్లభ

మయిన వగుటచేతనే ప్రార్థనీయమయినవి. రూపాయలు మట్టిబెడ్డలవలె సులభములే యయినయెడల మానవుఁడు వానిని గోరఁడు. అట్లయిన నీశ్వరునివిషయమయి యిట్టి విపరీతపుమాట యెందుకుఁ జెప్పవలెను? ఆయనను సహజమయిన వానినిగఁ జేసి, యనఁగాఁ జౌకగాఁజేసి పొందఁగోరుచున్నా నని యెందుకు నుడువవలెను?

అట్లెప్పుడును మనము కోరుటలేదు. ఆయన మనచిరజీవన సాధనధనము; ఆతఁడే మనయానందము; అంతు లేదు, అంతు లేదు; జీవిత మంతమొందుచున్నను దాని కంతము లేదు. శైశము నుండి యింతవఱకు నెన్నియో నవనవజ్ఞానములతో రసములతో బొందుచు వచ్చితిమి. గ్రహింపలేకపోయినను నాయన యాభాసమును బొందితిమి. గ్రహించి యాయన యాస్వాదమును బొందితిమి. ఈవిధముగ నాయనంతగోపనమునందు నూతనవినూతన విస్మయాఘాతములచే హృదయపద్మదళము లొక్కొక్కటిగఁ గొంచెము కొంచెముగ విరియుచుండెను.

ఓగుహాహితుఁడా! నాయం దేగోపనపురుషుఁడు నేనిభృత వాసియగు తపస్వి యున్నాఁడో నీవాతనిచిరకాలపు బంధుగుఁడవు. ప్రగాఢగభీరత్వమునందు మీ రిద్దఱు నొకరిప్రక్క నొకరు శరీరముల నంటించుకొని కూర్చుండియున్నారు. ఆఛాయాగంభీరనిబిడ నిస్తబ్ధతయందే మీరు "ద్వా సుపర్ణా సయుజా సఖాయా" అయి యున్నారు. మీయాచిరకాల పరమాశ్చర్యగభీరసత్యమును మాయేక్షుద్రత్వముచేతను క్షుద్రముగఁ జూడకుందుముగాక! మీయాపరమసఖ్యమును మానవుఁడు దినదిన ముపలబ్ధి చేసినకొలఁది నాతని

కావ్యములును, సంగీతములును, లలితకళలు ననిర్వచనీయరసాభాస ముచే రహస్యమయము లగుచున్నవి. ఆతనిజ్ఞానము సంసారము యొక్క దృఢబంధములను ఛిన్నము గావించుచున్నది. ఆతనికర్మ ములు స్వార్థముయొక్క దుర్లంఘసీమ నతిక్రమించుచున్నవి; ఆతని జీవితమం దన్నిక్షేత్రములందు ననంతుని భావోద్వేగము ప్రకాశిం చుచున్నది.

నీయాచిరంతన పరమగోపనాభిముఖ్యమున కానందముతో యాత్ర సలుపుదుముగాక ! నా సమస్తయాత్రాసంగీత మానిగూఢ తయొక్క నిబిడసౌందర్యమునే శాశ్వతముగ ఘోషించునుగాక ! మార్గమునం దెట్టి కృత్రిమమయినదానిని నెట్టి క్షుద్రమయినదానిని సహజమయినదానిని బొంది మఱచి పడి యుండకుండును గాక ; నాయానందావేగధార సముద్రమునం దెల్లపుడు ప్రవహించుసంక ల్పమును బరిత్యజించి మరువాలుకారాసుల క్షుద్రమార్గమధ్యమునఁ దమను బరిసమాప్తి నొందించుకొనకుండునుగాక

---

## ప్రభాతము 17.

మనము ప్రభాతముయొక్క యీప్రశాంత ముహూర్తమున మనయాత్మలను బరమాత్మలో నొక్కపర్యాయము సమస్తవ్యవ ధానములను దొలఁగిపోవునటుల సంపూర్ణముగ సమావృతముచేసి చూచెదము. అప్పుడు పరమేశ్వరుఁడు దృఢముగా మనయాత్మ

లను బట్టుకొని యున్నాఁ డనెడుననుభవమునందే మనము నిమ గ్నుల మయ్యెదము; ఆయనుభవమునందే మనము ప్రవిష్టులమై పరిపూర్ణులమై యుండెదము గాక !

అట్లు గానిచో మనస్థితి మనకుఁ దెలియనేరదు. అనంత పరమాత్మలో మనయాత్మలను సంయోగము గావింపకున్న, మన ము క్షుద్రుల మనియు, దుర్బలుల మనియు మనకు మిథ్యాభిప్రాయ మొక్కటి కలుగవచ్చును. మే మెంతమాత్రము నల్పులము గా మనియు, నశక్తులము గా మనియు మానవసంఘమునందలి మహా పురుషు లెల్లరు తమ్ముఁగూర్చి తాము ప్రమాణముల నిచ్చియుం డిరి. వారి కేది సిద్ధించెనో మన కెల్లరకు నది సిద్ధింపఁగలదు, మనయాత్మలయందు దాఁగియుండిన శక్తి యామహాపురుషులతోఁ బ్రత్యక్షముగ నుండెను. క్రొవ్వువత్తియొక్క పైభాగమున వెలుం గు జ్యోతి యాక్రొవ్వువత్తి యంతయు నై యున్నది, ఆవత్తికి మిక్కిలి క్రిందిభాగమునఁగూడ నావెలుఁగు నిచ్చుశక్తి యున్నయది. సమ యము వచ్చినప్పు డదియు వెలుంగఁగఁలదు. అంతవఱకు నది పైన వెలుఁగుచున్న దీపమును ధరించి యుండును. అట్లే మన యాత్మలలోఁ దాఁగియున్న శక్తియు క్రమక్రమముగా మనజీవన ములందుఁ బ్రకాశించుచుండును. ప్రతిదినము ప్రభాతోపాసన యందు మానవాత్మయొక్క యామహాశక్తిని మనము సంపూర్ణము గను నిరాతంకముగను జూడఁగలుగుచున్నారము. మనము దీనుల మనియు, హీనుల మనియు మనయం దెట్టిభ్రమము కలదో యా భ్రమమును ఆసమయమున దూరము చేయఁగలుగుచున్నారము.

మనము గృహములలో నొకమూల నెక్కడనో జన్మించినార మ నెడు తలంపును మఱచి మనశరీరములు భూలోకభువర్లోకసువ ర్లోకములలో జనించిన వనియు నందువలన బహులక్షల యోజన ములదూరమునఁనుండి జ్యోతిష్కకుటుంబగణము మనస్థితిగతుల నారయుటకొఱకు నాలోక మనెడుదూతను బంపుచున్న దనియు విస్పష్టముగ గ్రహింపవలయును. ఇఁక మనయహంభావములోప లనే మనయాత్మలకు నివాసస్థలము గాదు. ఏయధ్యాత్మలోకమున మనయాత్మలు నివసించుచున్నవో యదియే బ్రహ్మలోకము. ఏ మహాజగత్తునకు మనము వచ్చియున్నారమో యాజగత్తునఁ బ్రభు త్వము సలుపుటకు మన కధికారము కలదు. అచ్చట మనము రాజ్య మేలుటకే గాని దాస్యము సలుపుటకై వచ్చినవారము కాము. అనంతపరమాత్మ మనలలాటమునఁ బ్రభుచిహ్నములను ధరింపఁ జేసి మనల నీలోకరాజ్యమునకుఁ బంపియున్నాఁడు. కావున మన ము హీనజాతీయుల మని తల లొగ్గి సంకుచితమనస్సులతో సంచ రింపవలసినయావశ్యకత రవ్వంతేనియు లేదు. మన మనంతపర మాత్మవంశసంభూతల మనెడుగౌరవముఁ గలిగి మనయున్నత స్థానమును మన మాక్రమించుకొనెదము గాక !

ఆకాశమునంపలియంధకార మెట్లు కేవలకాల్పనికపదా ర్థమువలెఁ జూచుచుండఁగనే చెల్లాచెదరై పోవుచున్నదో యట్లే మనయంతరప్రకృతియొక్క నలుప్రక్కలనుండియు సమస్తమిథ్యా సంస్కారములును క్షణకాలములో మాయికములై పోవునుగాక ! మనయాత్మ లుదయోన్ముఖసూర్యునిమాడ్కిఁ జిత్తగగనమునఁ

బరమేశ్వరుని నిరాతంకమగుజ్యోతిర్మయస్వరూపముచేఁ బ్రకాశితము లగునుగాక! వానియుజ్జ్వలచైతన్యముచేతను వాని నిర్మల జ్యోతిచేతను మనసంసారక్షేత్రములు సర్వత్ర సంపూర్ణముగఁ బ్రకాశితము లగును గాక!

---

## పగలు 18.

ప్రతిదినము నాలోకాంధకారములయందును నిద్రాజాగరణములయందును సంకోచప్రసారణములయందును మనజీవనము నడచుచున్నది. మనజీవనమున కొకసారి పోటు మఱియొకసారి పాటు. రాత్రులలో నిద్రాసమయములందు ఘనసమస్తేంద్రియ మనశ్శక్తులును మనలోనికి ముడుచుకొనివచ్చును; ప్రాతఃకాలమునఁ దిరిగి సమస్తప్రపంచమువైపునకుఁ బరుగెత్తిపోవును.

మనశ్శక్తి మనలోనికి ముడుచుకొనినపుడుమాత్రమే మనలను మనము చక్కగా గ్రహించి ప్రాతఃకాలమున నితరదిక్కులకు నానామార్గముల మనశ్శక్తి వ్యాపించునప్పుడు మనలను మనము కోల్పోయెదమా?

అది విపరీతము. మనలోనికి మనము ముడుచుకొనినప్పుడు మన మచేతనులమును సమస్తదిక్కులఁ బ్రవేశించునప్పుడు మనము జాగరూకులమును నగుచున్నారము. అప్పుడే మనలను మన మెఱుఁగఁ గలుగుదుము. మన మేకాకిత్వమును బొందినప్పుడు "మనము" అనెడు జ్ఞానమే మన కుండనేరదు.

'మనము' అనెడు యథార్థజ్ఞానము మనలోపల లేదు. అది సమస్తప్రపంచములోపలను వ్యాప్తమై యున్నది. అందుచే మనము బుద్ధిద్వారమునను హృదయద్వారమునను కర్మములద్వారమునను సమస్తము నన్వేషించుచున్నారము; సమస్తముతోడను మిళితము గాఁగోరుచున్నారము. అట్లు గానియెడల మనలను మనము గ్రహింపఁజాలకపోదుము. ఆత్మయొక్క ప్రధానకాంక్ష తాను సర్వత్ర ప్రవేశింపవలయు ననియె.

రేఁగుపండుయొక్క పతనమునకుఁ గారణమైనశక్తిని మహాజ్ఞాని యగు న్యూటన్ విశ్వమునందలి సమస్తవస్తువులతోను దర్శించినప్పుడు అతనిబుద్ధి యత్యంతపరితృప్త మయ్యెను. కారణ మేమి ? సత్యమును సర్వత్ర చూచినంతనే సత్యమూర్తి ప్రకాశించును. ఆమూర్తియే మన కానందము నిచ్చుచున్నది.

అట్లే మనలను మనము సర్వత్ర వ్యాప్తమై యుండఁగాఁ జూచెదము. అదియే మనలను మనము యథార్థరూపముగాఁ జూచుట, మన మిట్టియథార్థరూపమున మనలను మనము గ్రహించిన కాలఁదిని మన కానంద మధిక మగుచుండును. ఎవ్వఁడు తన లోపలనుండి మనలను బయటికిఁ గొనివచ్చి మనసమీపమునఁ దనసత్యస్వరూపమును బ్రకాశింపజేయుచున్నాఁడో యతనినే మన మాత్మమయుఁ డనుచున్నారము. అతఁడే మన కానందము నిచ్చువాఁడు.

ఈకారణముచే మానవాత్మ బహుప్రాచీనయుగములనుండియు గృహమును గాని సంఘమును గాని రాజ్యమును గాని

మఱిదేనిని నిర్మించిన నందలిమూలతాత్పర్య మిదియ—మానవుఁ డేకాకిత్వమును బరిత్యజించి బహుత్వములోపలను విచిత్రములోపలను దన నానాశక్తులను నానాసంబంధములను విస్తృతముచేసి తన్నుఁ దా విశాలక్షేత్రమున దర్శింపవలయు ననియే. అదియే మానవునకు యథార్థసుఖము. అందువలన "భూమైవ సుఖం నాల్పే సుఖ మస్తి" అనఁగా ననంతమునందే సుఖము గాని యల్పము నందు సుఖము లేదని యుపనిషత్కారులు నుడివియున్నారు. దానికిఁ గారణ మేమి ? అల్పమునం దాత్మయు నల్పమై పోవును.

ఏసమాజసభ్యు లాసామాజికు లందఱితోడను సంతోషభావముతో నాత్మసంబంధయుతు లగుటవలననే యాసమాజమునకు గౌరవము. అట్లు కానిచో నుపకరణబాహుళ్యమువలనను, నుసమయ సమావేశమువలనను సార్థక మేమియు నుండదు.

నాగరకతఁ జెందిన యేసమాజమునందు జ్ఞానము, ప్రేమ, సేవయొక్క ప్రయత్నములు విశాలక్షేత్రమున సర్వదా యుద్యుక్తములై యుండునో యాసమాజమునందు వసియించుమనుజుఁ డల్పుఁడై యుండనేరఁడు. ఆవ్యక్తియొక్కశక్తి యల్పమైనను సహజముగఁ దనను దా సార్థకము చేసికొను నవకాశమును బొందును. అందుచే నెల్లర సంబంధమునను నీశ్వరసంబంధమునను నాగరకతఁ జెందిన సమాజసభ్యుఁ డగుప్రతిమానవుఁడు సాధ్యానుసారముగ బలిష్ఠుఁ డగుచున్నాఁడు.

ఏసమాజ మనాగరకస్థితియం దుండునో యాసమాజము

నందు స్వభావసిద్ధముగా బలముఁ గలవారునయితము దుర్బలు లగు చుందురు. కారణ మేమనఁగా నాసామాజికులు తమ్ముఁ దాఁ జక్కఁగా గ్రహింపఁజాలకుందురు. ఆసంఘమునం దెట్టిప్రతిష్ఠాపనము లున్నవో యవి యన్నియు గృహోపయోగములును గ్రామోపయోగములును మాత్రమే. ఈశ్వరునితో నాసమస్తసంకీర్ణ ప్రతిష్ఠాపనములకు నెట్టిసంబంధము నుండనేరదు. ఆసంఘమునం దున్న సభ్యులచిత్తసముద్రములం దుత్తేజతరంగము లుద్భవింప నేరవు. అందువలన నాసమాజసభ్యులు తమసత్యములను దమగౌరవములను మాత్రమే వెదకుకొనుచుందురు. వారిదారిద్ర్యమున కంత ముండనేరదు.

ఇందుచేతనే సభ్యతాసాధనము చేయవలయును. ఈసభ్యతాసాధనము రైల్వేటెలిగ్రాఫులకొఱకుఁ గాదు. కారణ మేమనఁగా రైల్వేటెలిగ్రాఫునకుఁగూడ నంత్యగమ్యస్థానము మానవుఁ డయియున్నాఁడు—ఏస్థానీయమయిన స్టేషనువిశేషమును గాదు.

ఈసభ్యతాసాధనమునకు మూలము ధర్మబుద్ధి. మనజీవన ప్రసార మల్పమైనకొలఁది ధర్మబుద్ధి యల్పమైనను జరిగిపోవుచుండును. స్వగృహమునందును, సంకీర్ణస్థలములయందును గార్యములఁ జేయునప్పుడు మనధర్మబుద్ధి సంకీర్ణమైనను విశేషనష్ట ముండదు. కాని బహుజనులను బహుబంధనలను బంధింపవలసిన యవసరమున మనధర్మబుద్ధి ప్రబలము కావలయును. అచ్చట ధైర్యవీర్యములు నధ్యవసాయమును ద్యాగమును సేవాపరాయణ

తయు లోకహితైషణము మొదలగుసద్గుణపుంజములెల్ల విశేషము లై యుండవలయును. అట్లుండకున్న నొకనిమేషమైనను జరుగ నేరదు. ఏపదార్థమునైనఁ బట్టుకొని యుంచుట కుపయుక్తమగు ధర్మము గొప్పది కాదేని యాపదార్థ మెవ్విధమునను గొప్పది కా నేరదు—ధర్మము దుర్బలమైనయెడల నాసంఘము విశ్లిష్టమై విచ్ఛిన్నమై చెల్లాచెదరై పోవును. సంఘమునకు మూలధర్మబుద్ధి. అది విహీనమైనయెడల సంఘమును బంధింప నేరితరము ?

కావున బహువ్యాపారవిశిష్టమును, బహుదూరవ్యాప్తమును బహుశక్తిశాలినియు నగు నొకనాగరకతఁ జెందిన సమాజమును గాంచినప్పుడు ప్రప్రథమమున దానిలో నొకప్రబలతర మగుధర్మబుద్ధి యున్నదో లేదో పరిశీలింపవలయును. ఆధర్మబుద్ధియే లోపించియున్నయెడల నాసమాజమునందుఁ బరస్పరవిశ్వాసమును బరస్పరసంబంధమును నొక్కనిమేషమైన నిలువనేరవు.

మనదేశమునందలి సంఘములెల్ల సమస్తక్షుద్రతను విచ్ఛిన్నతను దూరముచేసి జ్ఞానమునందును ప్రేమయందును కర్మములయందును నీశ్వరునిఁ బ్రతిష్ఠింపఁ జాలకుండినచో, మానవాత్మ లెన్నటికిని బలిష్ఠములును నానందయుతములును గాఁజాలవు. సాధారణజనులతో నానాప్రకారములగు నాచారవ్యవహారములందుఁ బ్రతివిషయములోను మనకు సంబంధ మెంత తొలఁగుచుండునో యంత మనలో నిరానందమును నసామర్థ్యమును దారిద్ర్యమును మాత్రమే యభివృద్ధి యగుచుండును. మనము మనదేశమునందు

బహుత్వముతో నైక్యమగుటకు ననేకావకాశములఁ గలుగఁజేయ కున్న మనశక్తి వృద్ధిఁ జెందించుటకును జరుగనేరదు.

ఆయవకాశములఁ గలుగఁజేసికొనుటకు మనము నానాదిక్కులఁ బ్రయత్నింపవలయును. కాని పిన్నలను పెద్దలను మనమేయేబంధనముల బంధింపఁ గోరుచున్నారమో యాబంధనములందు విశ్లేషము ప్రకాశించుచున్నది. విశ్లేషము ప్రవేశించుటకు నిశ్చయముగా నాబంధనములకు మూలమగు ధర్మబుద్ధి దుర్బలముగ నున్నదని గ్రహింపవలయును; మఱియు నచ్చట సత్యముండదు; త్యాగము నిరసింపఁబడును; ఇచ్ఛ జడత్వమును దాల్చును. అచ్చట శ్రద్ధాబలము లేదు; అచ్చట స్వాభిమానము తనకొఱకు గొప్పభాగమును దొంగిలింపఁ బ్రయత్నించుచున్నది; నిశ్చయముగా నొకరిపై నొకరి కీర్ష్య యున్నది; క్షమ లేదు; మంగళమునే మంగళముయొక్క చరమఫలరూపముగా నెంచకున్న, మన యధ్యవసాయ మల్పాటంకములకే పాఱిపోఁజూచును.

కావున మనము సతర్కులమై యుండవలయును. కృతకార్యత్వమున కాటంకము కలిగినచోట నిశ్చష్టోపకరణములపై దోషము నారోపించి నిశ్చింతముగా నుండకుందుము గాక! పాప ముండుటచే బంధింపలేకున్నారము, ధర్మము లోపించుటచే నేదియుఁ బట్టుకొనలేకున్నారము. అందుచేతనే మనము విచ్ఛిన్నుల మయి, క్షుద్రుల మయి సర్వవిషయములలో నిష్ఫలుల మయి తిరుగాడుచున్నాము, అందుచేతనే మనజ్ఞానముతో జ్ఞానమును, ప్రాణముతో

పాణిమును, యత్నముతో యత్నమును సమ్మిళితమయి మాన వాత్మ కుపయుక్తమయి విహారక్షేత్రమును నిర్మించుటలేదు—మన యాత్మ యేవిధమునను నావిశ్వకర్మయగు విరాట్పురుషునితో యుక్తమగుటకుఁ దనవిరాడ్రూపమును ధరింపలేకున్నది.

---

## విధానము 19.

ఇచ్ఛ, ప్రేమ, ఆనందముననువానిగుఱించి తలంచినంతనే వానికి విరుద్ధమగు నొకయభిప్రాయ ముదయించి మనము నన్నుఁ దట్టుట కారంభించును. ఆవ్యతిరేకాభిప్రాయ మిట్లు చెప్పఁ దొడంగును—"మనము దేనిని గోరుదుమో దానిని బొందఁజాలకున్నారము? దేనిని గోరమో యది మీఁదికి వచ్చి బరువుగాఁ బడుచున్నది. ఇది చూడఁగాఁ బ్రపంచమునం దిన్ని శాసనబంధనములున్నవన్నమాటయే కాని వాని ననుసరించి ప్రపంచము నడుచుట లేదుకదా యని తోఁచున్నది."

ఇచ్చట మానవుఁడు తర్కద్వారమునఁ గాక కేవలవిశ్వాస ద్వారమున దీని కుత్తర మిచ్చుటకుఁ బ్రయత్నించి యున్నాఁడు. ఎట్లనఁగా—"స ఏవ బంధు ర్జనితా విధాతా."

అనఁగా నెవ్వఁడు నన్నుఁ బ్రకాశింపఁజేయునో 'స ఏవ బంధుః' అతఁడే నాకు బంధువు, నాయందు వానియానందమే లేనియెడల నే నుండకయే పోవుదును. మఱియు 'స విధాతా' విధాత యింకొక్కఁడు లేఁడు. ఎవ్వఁడు నన్ను జన్మింపఁజేసెనో

యతఁడే బంధువు, అతఁడే విధానకర్త. కావున విధాన మేదియై నను దానిమూలమున నెట్టిభయమును లేదు.

కాని విధాన మనునది యాటపాటలవంటిది కాదు. నేఁ డొకవిధముగాను, రేపు మఱియొకవిధముగాను, నాయెడల వే ఱొకవిధముగాను, నన్యులయెడల నింకొకవిధముగాను, ఎప్పుడెప్పు డెట్టులెట్టులో మాఱుచు స్థిరత లేనట్టిదిగాను, ఉండునది విధాన మనిపించుకొనదు. విధాన మనఁగా విశ్వవిధానము.

ఈవిధానముయొక్క యవిచ్ఛిన్నసూత్రమునఁ బృథివియం దలి ధూళిమొదలు నక్షత్రలోకపర్యంతము నొక్కటిగ గ్రుచ్చఁబడి యున్నవి. "ఓ పరమేశ్వరా ! నాసుఖసంపదలకొఱకు నీవిధానసూ త్రము నొకచోటఁ ద్రెంపు మనియు, నొకస్థలమున నితరులందఱి తోపాటు గాక నాకు వేఱునియమములను గల్పింపు మనియు నెవ్వ రేని ప్రార్థన చేసినయెడల రవ్వంత ముఱికిని బోఁగొట్టుటకై వ స్త్రమునంతయుఁ జించినట్టుగా నాయొక్కనినిమిత్తము సమస్త బ్రహ్మాండములను మణిహారమువలె ధరించియున్న యైక్యసూత్ర మును ద్రుంచి సూర్యతారకాగణముల నేలం బడవేయు మని ప్రా ర్థన చేసినట్లుండును.

ఈవిధాన మొక్కమనుష్యునకే కాదు. ఒక్కకాలమునకే కాదు. ఒక్కదేశమునకే కాదు. ఈవిశ్వవిధానమునందు సమిష్టిగా మన మెల్లరమును నొకరితో మఱియొకరము కలిసిమెలసి యున్నా రము. ఏకకాలమునందు గాని మనయీసంబంధమునకు విచ్ఛేద ముండఁ బోదు. ఉపనిషత్తు లిట్లు చెప్పియున్నవి. ఎవ్వఁడు విశ్వ

మనకుఁ బ్రభువో, ఆతఁడు "యాథాతథ్య తోర్థాన్ వ్యదధాత్ శాశ్వతీభ్యః సమాభ్యః" అనఁగా నతఁడు నిత్యకాలమునుండి నిత్యకాలముకొఱకు సమస్తమును యథార్థరూపముగా విధానము చేసియున్నాఁడు. ఈవిధానమునకు మూలమున శాశ్వతకాల మున్నది. ఈవిధాన మనాది అనంతకాలముల విధానము. ఈవిధానము 'యాథాతథ్యతః' అనఁగా నాద్యంతము లొక్కటిగ నుండునట్టిది. దీనియం దెచ్చటను భేదముగాని, అసంగతముగాని లేదు. ఆధునిక విజ్ఞాన శాస్త్రములు విశ్వవిధానమును గుఱించి యింతకంటె నధికముగఁ గాని, పరిష్కారముగఁగాని యెంతమాత్రమును జెప్పఁజాలకున్నవి.

కాని, యంతేయైనయెడల, సమోఘనియమముల లోహాసింహాసనముపై నతఁడు విధాతరూపమున మాత్రమే యధిష్ఠించి యుండినయెడల నావిధాతతోఁ బోల్చి చూచినప్పుడు మనము పృథివియందలి ధూళితోడను, ఇసుకరేణువులతోడను సమానుల మగుదుము. శృంఖలములతో బంధింపఁబడిన బందీల మగుదుము.

కాని, యతఁడు విధాతమాత్రమే కాఁడు. "స ఏవ బంధుః" అతఁడు బంధువుకూడ నై యున్నాఁడు.

విధాతయొక్క ప్రకాశమును విశ్వమునందలి సకల చరాచరములయందును మనము చూచుచున్నారము. బంధువుయొక్క ప్రకాశము నెచ్చటఁ గాంచఁగలుగుచున్నారము? బంధువుయొక్క ప్రకాశమును నియమక్షేత్రమునందుఁ గాక మనయంతరమునందలి ప్రేమక్షేత్రమునందుఁ జూడవలయును. అచ్చటఁ గాక మఱెచ్చట నాబంధువుయొక్క ప్రకాశమును మనము చూడఁగల్గుదుము?

విధాతయొక్క కర్మక్షేత్ర మీవిశ్వప్రకృతియం దున్నది. బంధువుయొక్క యానందనికేతనము జీవాత్మయం దున్నది.

మానవుఁ డొకవైపునఁ బ్రకృతిగాను, మఱియొకవైపున నాత్మగాను, ఒకవైపున సత్యముయొక్క సాహాయ్యముతో శుభ మును బొందును. మఱియొకవైపున శుభములద్వారమున సుం దరుఁ డగుచును నుండును.

ఈశ్వరేచ్ఛ యేదిక్కున నియమరూపముగఁ బ్రకాశించునో యావైపునఁ బ్రకృతియు, నేదిక్కున నానందరూపము ప్రకాశిం చునో యావైపున నాత్మయు నుండును. సత్యము ననుసరించి ప్రకృ తియు, నానందము ననుసరించి యాత్మయు నుండును. సత్యము నందు బంధమును, ఆనందమునందు ముక్తియును గలవు. కావున బ్రకృతిధర్మము బంధము, ఆత్మధర్మము ముక్తి, ఈసత్యానందము ను, బంధవిముక్తియుఁ, బరమేశ్వరునకు వామదక్షిణబాహువులై యున్నవి. ఈబాహుద్వయముతోఁ బరమేశ్వరుఁడు మనుష్యునిఁ బట్టుకొని యున్నాఁడు.

ఏవైపున నేను ఇటుకలతోను, కొయ్యలతోను, చెట్లతోను, రాళ్లతోను సమానుఁడనో ఆసాధారణదిక్కునం దీశ్వరుని సర్వ వ్యాప్తమగు నియమ మెవ్విధమునను నన్ను సాధారణమైనవాని నుండి లేశమాత్రమైనను వేఱుచేయుట లేదు. ఏదిక్కున నేను విశేషభావముతో నున్నాఁడనో ఆస్వాతంత్ర్యపుదిక్కునం దీశ్వరుని విశేషానంద మెవ్విధమునను న న్నన్నిటితోఁ గలిపివేయుట లేదు. విధాత న న్నన్నిటితోఁ మిశ్రితము చేసెను. బంధువు న న్నందఱి

వానినిఁగఁ జేసెను. విధాత సత్యస్వరూపుఁడుగాన నన్నుఁ బ్రకృతి తోఁ గలిపివేసెను. బంధు వానందస్వరూపుఁడు గానఁ బ్రకృతి నుండి నన్ను వేఱుచేసెను. ఆపదార్థము లన్నియు నాప్రకృతి. నా జీవాత్మ యాతనిసొత్తు.

---

## మూఁడు 20.

ప్రకృతివైపున నియమమును, మనయాత్మలవైపున నానందమును, ఉన్నవి. నియమముద్వారమున నియమముతోను, ఆనందముద్వారమున నానందముతోను, మనకు సంబంధము గలుగఁ గలదు.

అందుచేత నేదిక్కున నేను సర్వసాధారణుఁడనో, యేదిక్కున నేను మానవప్రకృతిని గలిగియున్నవాఁడనో, యాదిక్కున నన్ను నేను నియమముల కనుగతునిగాఁ జేయకున్నఁ గేవలము వ్యర్థుఁడ నగుదును. అశాంతిని సృష్టించినవాఁడ నగుదును. ఒక ధూళికణము నైనను విడిచి నే నేకార్యమును గూడ నెఱవేర్పఁజాలను; దానినియమమును నేను మన్నించినఁగాని నానియమము నది మన్నింప నేరదు.

అందుచేత మనప్రథమశిక్ష యే దనఁగాఁ బ్రకృతినియమముల నేర్చుట. మనలను మనము నియమముల కనుగతులనుగాఁ జేయ నేర్చుట. ఈశిక్షవలననే మనము సత్యముయొక్క పరిచయమును బొందఁగలుగుదుము.

ఈశిక్షయొక్క పరిణామమే 'శాంతము. నియమములకు భ్రష్టత్వము కలిగినచోట, నియమములతో నియమమునకు సంబంధ ముండనిచోట నశాంతి యుండును. పరిపూర్ణయోగ మున్నచోటనే మనము శాంతస్వరూపమును గ్రహింపఁగలుగుదుము.

ప్రకృతియం దీశ్వరునియొక్క యేస్వరూపమును మనము చూడఁగలుగుచుము ? వానిశాంతస్వరూపమును, ప్రకృతి నల్పదృష్టితోఁ చూచువారు దానియందలి కష్టములను మాత్రమే చూచెదరు; మహాదృష్టితోఁ జూచువారు శాంతిని చూచెదరు. ప్రకృతి నియమము భిన్నమగుచున్నను, ఆనియమము శాశ్వతమై యథాక్రమముగ నుండకున్నను, ముహూర్తములోపల నీవిపుల విశ్వశాంతి ధ్వస్తమై యొకయర్థహీనమును, పరిణామహీనము నగుప్రళయముయొక్క ప్రచండనృత్య మారంభమగును; మఱియు విశ్వసంచారమందు విరోధమే జయమొంది యది తననఖదంతములతో సమస్తమును భిన్నభిన్నములుగఁ జేసివేయఁగలదు. కావునఁ జక్కఁగాఁ జూడుము. సూర్యనక్షత్రలోకములయొక్క. ప్రబలోత్తేజములమధ్యమున స్థిరనియమాసనముపై మహాశాంతి విరాజిల్లుచున్నది. సత్యముయొక్క స్వరూపమే 'శాంతము.'

సత్యము శాంతము కనుకనే శివముకూడ నై యున్నది. శాంతము కనుకనే యన్నిటిని ధరించుచున్నది; అన్నిటిని రక్షించుచున్నది; సమస్తమును దానియందు ధ్రువాశ్రయమును బొందుచున్నవి. మనముకూడ నెచ్చట సంయుతులము గాకుందుమో అ

నఁగా నెచ్చట సత్యము నెఱుంగ కుందుమో, సత్యము ననుసరించి ప్రవర్తింపకుందుమో యచ్చట మనయంతరముునను బాహ్యమునను గూడ నశాంతి యుత్పన్న మగును. ఆయశాంతియే యమంగళము. నియమముతో నియమముయొక్క విచ్ఛేదమే యమంగళము.

శివములోపలనే యద్వైతము ప్రకాశించును, సత్యస్వరూపుఁడు శివస్వరూపుఁ డైనచోట నానందమయుఁడును, ప్రేమమయుఁడును అగుచున్నాఁడు. అచ్చటనే భగవంతునితో సకలమునకును మేలన మేర్పడుచున్నది. మంగళమే మేలనస్థానము, ఆ మంగళము విరోధములయొక్కయు విచ్ఛేదములయొక్కయు నపదేవత.

ఒకవైపున సత్యమును, మఱియొకవైపున నానందమును మధ్యప్రదేశమున మంగళమును నున్నవి. అందుచేత మంగళము ద్వారమున మన మానందలోకమునకుఁ బోవలయును.

మనదేశమున బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము అనుమూఁడాశ్రమములు గలవు. అవి యీశ్వరునియొక్క శాంతస్వరూపము మంగళస్వరూపము నద్వైతస్వరూపము నను నీ మూఁడుస్వరూపములపైఁ బ్రతిష్ఠితములు.

బ్రహ్మచర్యముద్వారమున జీవనమునందు శాంతస్వరూపుని బొందినయెడల గృహధర్మమునందు శివస్వరూపుని బొందుట సం

భవ మగును. లేనియెడల గార్హస్థ్య మకల్యాణమున కాకర మగును. సంసారమునందు మంగళస్వరూపమును బ్రతిష్ఠింపఁ గలిగిన యెడల స్వార్థవృత్తు లన్నియు సంపూర్ణముగఁ బరాజితము లగును. యథార్థమేమన, ధర్మ మెట్టినిర్మలమైనస్వార్థత్యాగముపై స్థాపితమగునో దానిని మన మెఱుంగఁగలుగుదుము. దానిని మనము సంపూర్ణముగఁ దెలిసికొన్నప్పుడే అద్వైతమును, ఐక్యస్వరూపమును నగుపరమాత్మతో మనకు సర్వవిధముల నిరాటంకమైన ప్రేమమేలన మేర్పడఁగలదు. ఆరంభమున సత్యముయొక్క పరిచయమును, మధ్యమున మంగళముయొక్క పరిచయమును, పరిణామమున నానందముయొక్క పరిచయమును మనకుఁ గలుగఁ గలదు. ప్రథమమున జ్ఞానము, తరువాతఁ గర్మము, నటుపిమ్మటఁ బ్రేమము.

అందుచేత నెట్లు మనధ్యానమంత్రము 'శాంతం శివం అద్వైత'మో యట్లే మనప్రార్థనామంత్రము కూడ "అసతో మా సద్గమయ, తమసోమా జ్యోతి ర్గమయ, మృత్యో ర్మా మృతం గమయ" అసత్యమునుండి సత్యమునకును, పాపమునుండి పుణ్యమునకును, ఆసక్తినుండి ప్రేమకును నన్నుఁ దీసికొని పొమ్ము. ఓస్వప్రకాశుఁడా ! అప్పుడే నీవు నాసమీపమునఁ బ్రకాశింపఁ గలుగుదువు. ఓరుద్ర ! అప్పుడే నీవు నాజీవనమునందుఁ బ్రసన్నుఁడవుగాఁ గాన్పించెదవు.

సత్యమునం దంత్యము లేదు. అద్వైతమునందే యంత్యము గలదు. జగత్ప్రకృతియం దంత్యము లేదు. సమాజప్రకృతియం

దంత్యము లేదు, పరమాత్మయందే యంత్యము కలదు. ఇదియే మనభారతవర్షముయొక్క వాణి. ఈవాణిని మనజీవనమునందు సార్థకము చేయఁగలుగుదుము గాక! ఇదియే మనప్రార్థన మగును గాక!

---

# పూర్ణత్వము 21.

ఒకమహాపురుషుఁడు తనతండ్రియొక్క (భగవంతుని యొక్క) మహిమను బ్రచారము చేయుటకై ప్రపంచములోనికి వచ్చి యిట్లు బోధించెను—"నీతండ్రి యెట్లు సంపూర్ణుఁడో నీవును అట్లే సంపూర్ణుఁడవు కమ్ము."

ఈవాక్యము స్వల్పవాక్యము కాదు. మానవాత్మయొక్క సంపూర్ణత నతఁడు పరమాత్మలోపల స్థాపించి యాదిక్కుననే మనలక్ష్యమును స్థిరము చేయవలసిన దని నుడివెను. ఆసంపూర్ణత్వమునందే మనయొక్క బ్రహ్మవిహారము. ఏచిన్నహద్దునందో కాదు. తండ్రి యెటుల సంపూర్ణుఁడో, పుత్రుఁ డటులనే సంపూర్ణుఁడగుటకు సదా ప్రయత్నింపవలయును. అట్లు కాకున్నఁ బితృపుత్రులకు యథార్థసంబంధ మెట్లొనఁగూడును?

ఆసంపూర్ణత్వమున కొకలక్షణమును జూపెను. అదియును గొప్పది గాని సామాన్య మైనది కాదు. అది యెట్లనఁగా— "నీ యిరుగుపొరుగువారి నెల్ల నీవలెనే ప్రేమింపుము." అతఁడు నీయి రు

గుపోరుగువారి నెల్లఁ బ్రేమింపు మని చెప్పక, నీయిరుగుపొరుగు వారి నెల్ల నీవలెఁ బ్రేమింపు మని చెప్పెను. బ్రహ్మవిహారమును గోరెడివా రెల్ల నిట్టిప్రేమమార్గమునఁ బ్రవేశింపవలయును; ఈ మార్గముననే నడువవలయును.

"శత్రువునుగూడఁ బ్రేమింపుము" అని ఏసుక్రీస్తు చెప్పి యుండెను. శత్రువును క్షమింపు మని భయముగాఁ జెప్పి మధ్య పథమున నతఁ డాఁగిపోలేదు. శత్రువును బ్రేమింపు మని యతఁడు బ్రహ్మవిహారమువఱకు లక్ష్యమును లాగి తీసికొనిపోయెను. నీశరీరముపై నున్నచొక్కాను లాగి తీసుకొనువానికి నీయుత్తరీయ మును గూడ దానముచేయు మని బోధించెను.

సాంసారికజనులకు నీవాక్యములు పూర్తిగా నత్యుక్తులుగాఁ గాన్పించును, దానికిఁ గారణ మే మనఁగా సంసారముకంటె గొప్పలక్ష్యమును వారు విశ్వసింపరు. సంసారి తనసాంసారికకార్యము నెఱవేఱినట్లయిన నతఁడు తనచొక్కానుగాక యుత్తరీయమును గూడ నిచ్చివేయఁగలఁడు. కాని యతఁడు బ్రహ్మవిహారమును దనసాంసారికప్రయోజనములకంటెఁ దక్కువగఁ దలంచినపుడు చొక్కా నిచ్చుటకుఁగూడఁ గష్టపడును.

కాని యన్నిటికంటె నధికుఁ డగు నాభగవంతునిఁ గూర్చి, మానవులకు వెల్లడిచేయుటకు వచ్చిన మహాపురుషులెల్లరు సంసారులయొక్క దుర్బలమైన కోరికల ననుసరించి బ్రహ్మము నతి స్వల్పపదార్థముగఁ జేసి చూపుటకుఁ దలంచియుండలేదు. వా రన్ని

టికంటె గొప్పవిషయములనే యసంకోచముగఁ, బూర్తిగఁ, జివరవఱకును జెప్పియుండిరి.

ఈవిషయముల నింతగొప్పగాఁ జెప్పుటచే వారు మన కొక మహాదర్శము నాధారముగ నిచ్చినవారైరి. మానవుల గమ్యస్థాన మెంతదూరమువఱకుఁ బోవునో, మానవులప్రేమ యెంతగొప్ప ప్రేమయో, మానవులత్యాగ మెంతగొప్పత్యాగమో వారు స్పష్ట ముగఁ జూపియుండిరి.

కావున నీగొప్పలక్ష్యము జీవనమార్గమున మనలను నిరాశఁ జెందింపక మనకు సాహసము నిచ్చును; మనయాంతరతరమాహా త్మ్యముపై మనకు శ్రద్ధను బెంపొందించును; మనసమస్తప్రయ త్నములను బూర్ణముగ నుద్బోధితములు గావించును.

లక్ష్యము నసత్యముద్వారా ఛేదించి స్వల్పముగఁ జేసినను ఉపాయమును దుర్బలత్వముద్వారా ఆచ్ఛాదనముచేసి సంకీర్ణము చేసినను దానివలన మనయాశ్రయము తగ్గిపోవును; దేనిని మనము పొందవలయునో దానిని బొందఁజాలము; దేనిని మనము చేయ వలయునో దానిని జేయఁజాలము.

కాని మహాపురుషులు మనయొద్ద మహాలక్ష్యమును స్థాపించి నప్పుడు వారు మనయెడల శ్రద్ధను జూపియుండిరి. బుద్ధుఁడు "మానసంభావయె అపరిమాణం" అని చెప్పినపుడు మనల నెవ్వరిని అశ్రద్ధతోఁ జూడలేదు. ఏసుక్రీస్తు మనలో మిక్కిలి దీనుఁడైన వానియెడలఁగూడ నశ్రద్ధను జూపలేదు. అతఁ డెల్లప్పుడును "స్వీతంత్రి

యెట్లు సంపూర్ణుఁడో నీవును అట్లే సంపూర్ణుఁడవు కమ్ము." అని నుడివియుండెను.

వారు చూపిన శ్రద్ధచే మనము మనయెడల శ్రద్ధగలవార మగుచుంటిమి. అప్పుడు మనము మహాధికుం డగుపరమేశ్వరుని బొందెడి యాదురూహమార్గము నసాధ్యమార్గ మని చెప్పుటలేదు. అప్పుడు మనము వారియొక్క కంఠస్వరములను లక్ష్యముగ నుంచుకొని, వారిమహావాణి ననుసరించి ఈయంతులేని మహాయాత్ర యం దానందముతో యాత్ర చేయుదుము. ఏసుక్రీస్తుయొక్క వాక్కు లత్యుక్తులు కావు. శ్రేయమును గోరుదు వేని యీసంపూర్ణసత్యముయొక్క సంపూర్ణత్వమును శ్రద్ధతోఁ గ్రహింపుము.

ఒక్కసారి లోపలవైపునఁ జక్కగాఁ జూడుము. ఒకమనుష్యునితో మిళితము కావలయు నన్న నెన్నియో యాటంకములు కలుగుచున్నవి. వానితో మేలనము సంపూర్ణముగాఁ గాకున్నది. వాని నహంకారముతోఁ దాఁకుచుంటిని; స్వార్థముతోఁ దాఁకుచుంటిని; క్రోధముతోఁ దాఁకుచుంటిని; లోభములోఁ దాఁకుచుంటిని; అవివేకముద్వారా కొట్టుచుంటిని; గర్వితుఁడనై కొట్టఁబడుచుంటిని. దేనిద్వారా ఆత్మసమర్పణ మత్యంతసహజమును, మధురమును నగునో, నట్టి నమ్రతను ఎవ్విధమునఁగూడ మనస్సులోనికిఁ దీసికొని రాఁజాలకుంటిని. నాప్రకృతియందు మానవునితో మిళిత మగుటకు నిట్టియాటంకములు స్పష్టముగ నగపడునప్పుడు బ్రహ్మతో మేళన మగుట కాటంకము లసంఖ్యేయములుగా నున్న వనుటకు సందేహ ముండునా? దేనిచే నే నొకమనుష్యునితోనైన సంఘా

ర్ణముగ మేళనము కాఁజాలకుంటినో దానివలననే భగవంతునితోఁ గూడ మేళన మగుట కర్డును బొందుచుంటిని. దేనివలన నాకుఁ బ్రతిమనుజుఁడు నితరుఁ డగుచున్నాఁడో దానివలననే భగవంతుఁడుకూడ నితరుఁ డగుచున్నాఁడు. ఎందుచేత శత్రువును హింసించుచుంటినో యందువలననే భగవంతునిగూడ హింసించుచుంటిని. అందుచే బ్రహ్మావిహారమును గూర్చి చెప్పునపుడు సంసార సంబంధమైన యేవిషయమును గాని కొంచెమైనను జెప్పుట కవకాశము లేదు. మహాపురుషు లెల్లరును బ్రహ్మావిహారమును గూర్చి వచించునపుడు సంసారసంబంధమైన విషయమునుగూర్చి యెంత మాత్రమును ముచ్చటించి యుండలేదు. సంసారమును జేతిలో నిడుకొని వారు మాటాటలేదు. పూర్తిగా, నిశ్శేషముగఁ, జచ్చి పొమ్ము. అందుచే బ్రతుకఁగల వని వారు చెప్పియుండిరి. వారి యొక్క మార్గము నవలంబించి ప్రతిదినము నహంకారముదిక్కున, స్వార్థముదిక్కున, మనము నిశ్శేషముగఁ జచ్చిపోవలయును. మైత్రిదిక్కునఁ, బ్రేమదిక్కునఁ, బరమాత్మదిక్కున ననంతముగ బ్రతుకవలయును. ఎవ్వ రీమహాపథమున యాత్ర సలుపుటకొఱకు మానవున కాధారము నిచ్చియుండిరో వారికి నేను మిక్కిలి భక్తితోడఁ బ్రణమిల్లి వారిశరణాపన్నుఁడ నగుచున్నాఁడను.

---

# నియమము—ముక్తి. 22

'సుఖము' కేవలము నాకే సంబంధించినది. 'కల్యాణము' సమస్తజగత్తునకుఁ జెందినదై యున్నది. తండ్రిని సమీపించి మన మిట్లు ప్రార్థన చేయుదము—"యద్భద్రం తన్న ఆసువ" ఏది శుభమో దానినే మాకిమ్ము. అనఁగా సమస్తజగత్తునకును శుభమైనదానిని మాయందుఁ బ్రేరణ చేయుము. ఏల యనఁగా, నట్టి శుభమే నాకును యథార్థశుభము, నిత్యశుభము. కారణ మేమన, నెవ్వఁడు విశ్వమునకుఁ బితయో యతఁడే నాకును బితయై యున్నాఁడు.

ఎక్కడఁ గల్యాణమును గుఱించి— అనఁగా లోకకల్యాణమునుగుఱించి విచారింతుమో యక్కడ నత్యంతకఠిననియమములు గలవు. అచ్చట నిప్పుడున్న సుఖములు కొంచమైన నుండవు. అచ్చట వ్యక్తివిశేషమైన యవిరామమునకుఁ గాని, విరామమునకుఁ గాని స్థానము లేదు. అచ్చట దుఃఖముకూడ శ్రేయము. మృత్యువుకూడ వరణీయమే.

మనము లోకకల్యాణమును గుఱించి విచారించునప్పుడు సమస్తనియమములను బూర్తిగాఁ జివరవఱకు నంగీకరింపవలయును. అప్పు డేబంధములను గాని, యేబాధ్యతలను గాని, నిరాకరింపఁజాలము.

మనతండ్రి యిచ్చటనే "మహద్భయం వజ్రముద్యతం." ఇచ్చటనే యతఁడు పుత్రునకుఁ గొంచమైనను బ్రశ్రయ మీయఁడు. విశ్వమునుండి యొకకణమునైనను హరింపఁజేసి యతఁ డెట్టి

ప్రియపుత్రునకు నీయఁడు. ఇచ్చట నెట్టిస్తవములు గాని, యనునయము గాని, వినయముగాని పనికిరావు.

అటులైన ముక్తి యని దేని నందురు ? ఈనియమము లను బరిపూర్ణభావములతోఁ దనవిగాఁ జేసికొనుటయే ముక్తి. నియమ మెప్పుడు నాకు బయట నుండుపదార్థమువలెఁ గాక, సంపూర్ణముగ నాలోపలిపదార్థముగ నుండునో యాస్థితినే ముక్తి యందుము.

ఇంతవఱకును నియమమునకును నాకును సంపూర్ణసామంజస్యము కలుగలేదు. ఇప్పటికి నందు సంపూర్ణస్వాధీనత కుదరలేదు. అన్నిటికి నేది శుభమో యది నాకు శుభ మని గ్రహింపఁజాలకున్నాను. అందఱియొక్క శుభమునకు విరుద్ధముగ నుండు ప్రయోజనము నా కనేకస్థానములయందుఁ గలదు.

ఇందుచేతఁ దండ్రితో నాకు సంపూర్ణమేలన మేర్పడకున్నది. తండ్రి నాయెడల రుద్రుఁడై యున్నాఁడు. ఆతఁడు శాసకుఁడని మాత్రమే నేను సదా గ్రహించుచున్నాను గాని యాతనిప్రసన్నతను గ్రహింపఁజాలకున్నాను. తండ్రిలోపలఁ బుత్రునకు సంపూర్ణముక్తి కలుగుటలేదు.

అనఁగా మంగళ మింతవఱకును నాయెడల ధర్మమై యుండలేదు. దేనిధర్మ మేదో దాని కది బంధనము కాదు. అదియే దాని కానందము. నేత్రములయొక్క ధర్మము చూచుట, అందుచేఁ జూచుటయందే నేత్రముల కానందము. చూచుట కడ్డు కలిగినయెడల వానికిఁ గష్టము. మనస్సుయొక్క ధర్మము మననము చేయుట,

మననమునందే దాని కానందము కలదు. మననమున కాటంకము గలిగినయెడల దానికి దుఃఖము కలుగును.

విశ్వముయొక్క శుభము నాకు ధర్మమై కాన్పించినప్పుడే దానియందు నా కానందము. దాని కాటంకము గలిగినప్పుడు నాకుఁ గష్టము కలుగఁగలదు.

తల్లియొక్కధర్మ మెట్లు పుత్రస్నేహమో, యట్లే యీశ్వరునిధర్మము మంగళము. సమస్తచరాచరప్రపంచమునకెల్ల మేలొనఁగూర్చుటయే వాని స్వభావము. దానియందే వాని కానందము.

మనస్వభావమునందును ఆమంగళ మున్నది. సమగ్రహితమే తనకు హిత మని తలంచుట మానవునిధర్మము. ఈధర్మము స్వార్థబంధనములను ఖండించి పూర్ణపరిణతిఁ గాంచుటకొఱకు సదా మానవసంఘములు ప్రయాసపడుచున్నవి. మనయొక్క యీధర్మమపరిణతియు, బాధాగ్రస్తమును నగుటవలననేఁ మనము దుఃఖము ననుభవించుచున్నాము. పూర్ణమంగళస్వరూపముతో మేళన మగుటవలనఁ గలిగెడు నానందము కానరాకున్నది.

ఎంతకాల మంతరమున నీపరిణతి లభింపకుండునో, యీయడ్డు ఖండితమై మనస్వభావము తన్నుఁ దా గ్రహింపకుండునో, యంతకాలము బాహ్యబంధనములను మన మంగీకరింపవలసియే యుండును. శిశువును గొన్నినాళ్లవఱకు దాది చేయి పట్టుకొని నడిపించును. ఆశిశువునకు నడచుశక్తి వచ్చుటయే ముక్తి.

కావున నియమశాసనమునం దుండి, నియమమును మనదిగాఁ జేసికొని మనము ముక్తిని బొందవలయును. మనదేశమున నొక శ్లోకము ప్రచలితమై యున్నది. "ప్రాప్తే తు షోడశే వర్షే

పుత్రం మిత్రవ దాచరేత్'' అనఁగాఁ బదునాఱువత్సరముల వయస్సు వచ్చినపుత్త్రునియెడల మిత్త్రునివలె వ్యవహరింపుము.

దానికిఁ గారణ మేమి? ఎంతవఱకుఁ బుత్రుఁడు శిక్షాపరిణతి గాంచలేదో యనఁగా సమస్తశిక్షయు వానిస్వభావగతమై యుండదో, యంతవఱకు వానియెడల నొకబాహ్యశాసన ముంచు టావశ్యకము. బాహ్యశాసన ముంచువఱకుఁ బుత్రునితోఁ దండ్రి కాంతరికసంబంధ మెన్నఁటికిని సంపూర్ణము కాఁజాలదు. ఎప్పు డాబాహ్యశాసనముల ప్రయోజనము తొలఁగిపోవునో యప్పుడే పితృపుత్రులమధ్య నానందసంబంధము పూర్తిగా నవ్యాహతమై యొప్పును. అప్పుడే సమస్తాసత్యములును సత్యమునందు విలీనము లగును. అంధకారము జ్యోతిచేత నుద్భాసిత మగును. మృత్యు వమృతముచే నిశ్శేషితమై పోవును. అప్పుడే తండ్రియొక్క ప్రకాశము పుత్రుని యొద్ద సంపూర్ణ మగును. అప్పుడే రుద్రరూపుఁడై యాఘాతము చేయుచున్న ట్లుండువాఁడు ప్రసన్నతవలన రక్షించుచున్నటులఁ గాన్పించును; అప్పుడు భయ మానందముగను, శాసనము ముక్తిగను బరిణమించును. అప్పుడు సత్యము ప్రియాప్రియములయొక్క ద్వంద్వవర్జితసౌందర్యముతోఁ బ్రకాశించును; మంగళ మిచ్ఛానిచ్ఛలయొక్క ద్విధావర్జితప్రేమలోనికి వచ్చి ప్రవేశించును. అప్పుడే మనముక్తి. ఆముక్తిలో నెట్టిలోపము నుండదు. సమస్తము సంపూర్ణ మగును. బంధనములు నశింపక యబంధనములై వెలయును. కర్మ తొలఁగిపోనేరదు కాని, కర్మమే యాసక్తిశూన్యశాంతస్వరూపమును ధరించును.

---

# నిత్యధామము 23.

ఉపనిషత్తు లిట్లు చెప్పుచున్నవి—"ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కదాచన" బ్రహ్మానందమును దెలిసికొన్నవాఁడు భయపడనేరఁడు. ఆబ్రహ్మానందము నెక్కడఁ దెలిసికొనఁగలము? అంతరాత్మలోపల.

ఆత్మ నొక్కపర్యాయ మంతరనికేతనమునందు దానిశాశ్వతిగృహమునందుఁ జూడుము. బాహ్యహర్షశోకముల కతీతమును, సంసారమునందలి సమస్తచాంచల్యముల కతీతమును నైన యాంతరతమగుహాంతరమునఁ బ్రవేశించి యక్కడ నాత్మను జూడుము. అక్కడ నాత్మలోపల బ్రహ్మానందము రాత్రింబగళ్లు నొక్కముహూర్తమైనను విరామము లేక యావిర్భూతమై యున్నది. పరమాత్మ జీవాత్మయం దానందరూపుఁడై నివసించుచున్నాఁడు. జీవాత్మ పరమాత్మలయొక్క ప్రేమ నిరంతరము మేళన మయ్యెడు చోటఁ బ్రవేశించి చూడుము. అప్పుడు బ్రహ్మానంద మెట్టిదో స్వీయాంతరమధ్యముననే గ్రహింపఁగలుగుదువు. అప్పు డేదినమునం దైనను, ఎవ్విధమున నైనను నీకు భయము కలుగనేరదు.

నీకు భయ మెక్కడ? మనోవ్యథలందు, జరామృత్యువులందు, విచ్ఛేదమేలనములందు, రాకపోకలయందు, సుఖదుఃఖములయందు. ఆత్మను గేవలబాహ్యసంసారమునందే చూచెద వేని, కేవలకార్యకార్యాంతరములయందే విషయవిషయాంతరములయందే చూచెద వేని, విచిత్రములతోఁ జంచలములతోఁ బూర్తిగా

మిశ్రితముచేసి యొక్కటిగఁ జేసి చూచెద వేని, అప్పు డాత్మను మిక్కిలి దీనముగను, మలినముగను మృత్యువుచేతఁ బరివేష్టితమై యున్నదిగను జూచి శోకించెదవు. సత్యము కానిదానిని, స్థిరము కానిదాని నాత్మతో నైక్యము చేసి సత్య మనియు, స్థిర మని యు భ్రమించెద వేని, అంత్యకాలమున సమస్తము ప్రపంచనియ యానుసారముగా నాశనముఁ జెందునప్పు డాత్మయు నాశమగునని నీకుఁ దోఁపవచ్చును. ఈవిధమున నీవు తేపతేపకును శోకము చేతను నిరాశచేతను దగ్ధము కావలసివచ్చుచుండును. సంసారము నకు నీవు బుద్ధిపూర్వకముగా గొప్పపదవి నిచ్చుటవలన సంసారము నీచే నొసంగఁబడిన యాయధికారమును గైకొని నీయాత్మను మాటిమాటికిని భయపెట్టుచు వశపఱచుకొనుచుండును. కాని యాత్మను, అంతరధామమున నిత్యునిలోపల, బ్రహ్మములోపలఁ జూచెద వేని హర్షశోకములయొక్క శక్తి తగ్గిపోఁగలదు. అప్పుడు నీకు నష్టమునందును, నిందయందును, బీడయందును, మృత్యువు నందును భయ మన్నమాటయే యుండనేరదు; నీవు జయమును గాంతువు. ఆత్మజయమును బొందుదువు. ఆత్మ క్షణికసంసారము యొక్క దాసానుదాసియై యుండునది గాదు; అనంతమగు నమర త్వమునందుఁ బ్రతిష్ఠితమై యుండునది. ఆత్మయందు బ్రహ్మానంద మావిర్భూతమై యున్నది. అందుచే నాత్మను యథార్థరూపమునఁ దెలిసికొనువారు, బ్రహ్మానందమును దెలిసికొన్నవారు "న బిభేతి కదాచన" ఒకప్పుడును భయపడనేరరు. "పరమే బ్రహ్మణి యోజిత చిత్తః, నందతి నందతి నందత్యేవ" పరబ్రహ్మములోపలఁ దమ్ము

ముక్తులనుగఁ జేసి చూచుకొనువా రానందమును బొందెదరు; తప్పక యానందమును బొందెదరు. సంసారమునందుఁ దమ్మ నైక్యము చేయువారు దుఃఖించెదరు; దుఃఖించెదరు, తప్పక దుఃఖించెదరు.

---

## సూక్తి 24.

ఇదిగో ప్రాతఃకాలము. ఇది ప్రతిదినము మనసమీపమునఁ బ్రకాశించుచున్నది. దీనియందు మనకానంద మల్పము. ఈప్రాతఃకాల మభ్యాసమువలనఁ బ్రాఁతఁగిల్లినది.

అభ్యాసము మనమనోనిచ్ఛత్వమువలన సకలమహావస్తువులను నీచముగఁ జేసివేయును. అంతియే గాక యది స్వయముగా బంధింపఁబడి యుండుటచే సకలపదార్థములను బంధించివేయును.

మనము విదేశమున సంచరించుటకుఁ బోయినప్పు డేదో నూతనపృథివిని జూడఁబోవుట లేదు. ఈమంటినే, ఈజలమునే, ఈ యాకాశమునే మనయభ్యాసమునుండి విముక్తముచేసి చూడఁబోవుదుము. ఆవరణమును దీసివేసి యీపృథ్విపై మనదృష్టిని బ్రసారించినంతనే యీశాశ్వతమైన పృథివియందే యెన్నటికినిఁ బురాతనుఁడు కానట్టి యాయభావనీయునిఁ (అమృతుని) జూడఁగలుగుదుము. అప్పుడే మన మానందమును బొందఁగలుగుదుము.

మనకుఁ బ్రియుఁ డైనవాని కష్టుగా నభ్యాసము సులభముగ నిలువఁజాలదు. అందుచేఁ బ్రియజనులం దెల్లప్పు డమ్మ

తుని ననంతునిఁ జూచుచుందుము. దానిని మనము చూడఁగలము. చూచుటలోఁ జూచుట పూర్తి కానేరదు. మనము చూచుదానికిని వినుదానికిని గ్రహించుదానికిని నతఁ డతీతుఁడై యుండును. అందువలననే యతనియందు మన కానందము.

అందుచే నుపనిషత్తులు "అనంతరూప మమృతం" ఈశ్వరునియొక్క యానందరూపము నమృత మని చెప్పుచున్నవి. మన సమీపమున నేది మృతినొందునో యేది యంత్యమై పోవునో దాని యందు మనకానందము లేదు. ఎచ్చట మనమంతమునందే యనంతమును జూచెదమో, యమృతమును జూచెదమో యచ్చటనే మన కానందము.

ఈయనంతమే సత్యము. దానిని జూచుటయే సత్యమును జూచుట. దాని నెచ్చటఁ జూడకుందువో యచ్చటనే యిట్లు గ్రహింపవలయును—"మనజడత్వము, మూఢత్వము మొదలైన యభ్యాసములవలనను నాచారములవలనను సత్యమును నడ్డగించినవారము. అందుచేత దానియందు మన మానందము పొందుటలేదు."

వైజ్ఞానికులుగాని, దార్శనికులుగాని, కవీశ్వరులుగాని చేయు కార్యము లెవ్వి యనఁగా నీసమస్తమూఢతాభ్యాసముల యొక్క యావరణమును ద్రోసివేసి మానవులకు నీజగత్తులో సత్యముయొక్క యనంతరూపమును జూపుట; మనము చూచెడి దానినెల్ల సత్యముగఁ జూపుట. అంతియేకాని వారు నూతనముగాఁ దయారు చేయునట్టిది గాని కల్పించునట్టిది గాని యెద్దియు లేదు.

ఈసత్యమును ముక్తము చేసి చూపుటయే మానవుల కానంద మును లభించెడియధికారమును బెంపొందించును.

గృహమును విడిచి యెక్కడికేని పోవుటవలన నంధకారము విముక్తమయిన దని యెట్లు చెప్పఁజాలరో, గృహద్వారమును దెర చుట యంధకారమోచన మని యెట్లు చెప్పుమరో యట్లే యీప్రపం చ సంసారములను బరిత్యజించుటయే ముక్తి కాదు, పాపమును, స్వార్థమును, జడత్వమును, మూఢాచారములయొక్క బంధనము లను ఖండించి, చూచెడువానినెల్ల సత్యముగఁ జూచుటయుఁ,జేసెడు దానినెల్ల సత్యముగఁ జేయుటయు, దేనిమధ్యమున నున్నారమో దానిమధ్యమున సత్యముగ నుండుటయే ముక్తి.

బ్రహ్మ కేవలము తనయవ్యక్తస్వరూపమునందే యానంది తుఁడై యుండు నను వాక్యము సత్యమైనయెడల వానియొక్క యీయవ్యక్తస్వరూపములో విలీనము కానియెడల నిరానందము యొక్క హస్తమునుండి మనకెవ్విధమునను ముక్తి కలుగనేరదు. కాని యది సరి కాదు. భగవంతునకుఁ బ్రకాశమునందే యానం దము కలదు. కానిచో నతఁడే జగత్తును బ్రకాశింపఁజేయుటేల? బయటనుండి యేదో ప్రకాండమైనపీడ ప్రోత్సాహపెట్టి యతనిని బ్రకాశింపఁజేయుచున్నదా? మాయ యను నొకపదార్థము బ్రహ్మను బూర్తిగా వశము చేసికొని తాను ప్రకాశించుచున్నదా?

అట్లు కానేరదు. అందుచే నుపనిషత్తు లిట్లు చెప్పుచున్నవి. "ఆనందరూప మమృతం య ద్విభాతి" ఈప్రకాశమాన మగు జగత్తు మఱి యేమియుఁ గాదు. భగవంతునియొక్క మృత్యుహీన

మైనయానందమే రూపమును ధరించి ప్రకాశించుచున్నది. ఆనందమే యతనిప్రకాశము. ప్రకాశమే యతనియానందము.

యతఁడు ప్రకాశమునందే యానందితుఁడై యున్నయెడల నే నానందముకొఱకు నాప్రకాశము నన్వేషింతునా? ప్రకాశమే యతనియిచ్ఛ యైనపుడు నాక్షుద్ర మైనయిచ్ఛద్వారా నే నతనిప్రకాశహస్తము నెట్లు మరలింపఁగలను?

అతనియొక్క యానందములో నే నైక్యము పొందక కొంచ మైన నానందము పొందఁజాలను. భగవంతునితో నాకు సంపూర్ణయోగ మైనచోటనే నాకు ముక్తి. అక్కడనే నా కానందము. విశ్వములోపల వానిప్రకాశమును నిరాటంకముగ గ్రహించి నేను ముక్తుఁడ నగుదును. నాలోపల వానిప్రకాశమును నిరాటంకముగఁ బ్రకాశింపఁజేసి నేను ముక్తుఁడ నగుదును. భవబంధనముల ననఁగా జగన్నియమములను ఛేదించుట ముక్తి కాదు. ప్రపంచ నియమములను బంధనస్వరూపములుగాఁ జేసికొనక ముక్తిస్వరూపములుగాఁ జేయుటయే ముక్తి. కర్మమును బరిత్యజించుటయే ముక్తి కాదు. కర్మము నానందోద్భవకర్మముగాఁ జేయుటయే ముక్తి. అతఁ డెట్లానందమును బ్రకాశింపఁజేయుచున్నాఁడో యట్లే యానందముతోఁ బ్రకాశమును వరించుటయు, నతఁ డెట్లానందముతోఁ గర్మములఁ జేయుచున్నాఁడో యట్లే యానందముతోఁ గర్మముల నాచరించుటయు ముక్తి. దేనినిఁగూడ వర్జింపక సమస్తమును సత్యభావముతో స్వీకరించుటయే ముక్తి.

ప్రతిదినము నభ్యస్త మయిన యీపృథ్వి నాకు జీర్ణమై కా

న్పించుచున్నది; అభ్యస్థ మయినప్రభాతము మ్లానమై కాన్పించు చున్నది. ఇవి యెల్లప్పుడు నాకు నవీనములై యుజ్జ్వలములై కా న్పింపఁగలవు. ప్రేమద్వారా నాయొక్క చేతనము నవశక్తితో మే ల్కొన్నప్పు డెవనిని బ్రేమింతునో నేఁడు వానిసంస్పర్శనము కలుగు నని స్మరణకు వచ్చినంతనే నిన్న శోభాహీన మైన దెల్ల నేఁడు సుందరమై యొప్పును. ప్రేమద్వారా నాచైతన్య మెట్టిపూర్ణత్వము పొందునో యాపూర్ణత్వమువలన ననంతమునం దనంతునిసకలరూ పములలో రూపహీనునిఁ జూడఁగలుగుదుము. నూతనముగా మఱి యెచ్చటికిని బోవ నావశ్యకత లేదు. ఇట్టిపూర్ణత్వము లభింపనపుడే యాయనంతుఁడు నశ్వరుఁడుగఁ గన్పట్టును.

విశ్వ మానందునిప్రకాశము. కాని మనము ప్రకాశమును మాత్రమే చూచుచున్నాము. ఆప్రకాశమునందలియానందునిఁ జూ చుట లేదు. అందుచే రూప మడుగడుగునకు మనల నాఘాతము చేయుచున్నది. ఆనందము నెప్పుడు జూతుమో యప్పుడు మనల నెద్దియు బాధింపఁజాలదు. అదియే ముక్తి.

ఈముక్తి విరాగమువలన వచ్చుముక్తి కాదు. ఈముక్తి ప్రేమానుభవమువలనఁ గలుగు ముక్తి. త్యాగముక్తి కాదు; యోగముక్తి. విషయములనుండి విడుటవలన దొరకుముక్తి కాదు; విషయానుభవములందు భగవత్ప్రకాశమును జూచుటవలనఁ బ్రా ప్తించుముక్తి.

---

# ముక్తిమార్గము 25.

ఏభాషను నే నెఱుంగనో యాభాషయందలికావ్యములను వినినప్పుడు శబ్దములు నాచెవులను బొడుచున ట్లుండును. ఆభాష నన్ను బాధపెట్టును.

భాషలోఁ బరిచయ మైనపుడు శబ్దములు నా కడ్డుగా నుండవు. అప్పుడు భాషలోనిభావములను గ్రహించినంతనే శబ్దములానందకరములై యొప్పును, అప్పుడు దానిని కావ్య మని గ్రహింపఁగలుగుదును. అనుభవింపఁగలుగుదును.

బాలకుఁడు తా నెఱుఁగనిభాషలోని కావ్యములను విను నట్టిపీడనుండి ముక్తిని గోరునప్పుడు, అనఁగాఁ దప్పింప వేఁడి నప్పుడు కావ్యమును బఠింపించుట మానివేసి వానికి ముక్తి నిచ్చినయెడల నాముక్తియొక్క మూల్య మతితుచ్ఛము. కాని యాపాఠము నాబాలునకు సత్యముగఁ బూర్ణముగఁ దెలియఁబఱచి వానిని మూఢత్వమునుండి తప్పించుటయే యథార్థముక్తి, శాశ్వతముక్తి.

పృథివిపై జన్మించినంతమాత్రముననే మనము దుఃఖములఁ బొందిన ట్లయిన వానిని బాపబాధ లందుము. జగత్తు మన కానందమీయనప్పుడు విశ్వకవియొక్క యీవిరాట్కావ్యము నర్థహీనమైన యమూలకపదార్థ మందుము. దానినుండి ముక్తి పొందుటయే కృతార్థత యందుము.

కాని యాకావ్యమును మనము మనయిచ్చవచ్చినటులు

చించి కాల్చి పూర్తిగా దానిచిహ్నమైనఁ గాన్పింపకుండునటులఁ జేయవలయు నని తలంచుట వెఱ్ఱితనము.

సముద్రమును విలుప్తముగఁ జేసి దానిని దాఁటుటకుఁ బ్రయత్నించుటకంటె సముద్రముమీఁద నోడను వేసి దానిద్వారా దాఁటుట మిక్కిలి సులభము. ఇంతవఱకు నేదేశస్థులైనను సముద్రమును వట్టిపోవునటులు జేయఁ బ్రయత్నింపలేదు. వారు సాధ్యమైనన్ని నౌకల నేర్పఱచిరి.

విశ్వకావ్యమునకు నిరర్థకాపవాదములఁ బెట్టి దానిని గాల్చి నష్టము చేయునట్టితపస్సునకుఁ బూనక విశ్వకావ్యమును జక్కఁగా విని సార్థకము చేయుటయే యథార్థముక్తి.

ఈవిశ్వప్రకాశముయొక్క రూపములోపలఁ గేవలరూపమునే చూడక రూపములోపల నున్నయానందమును జూచునప్పుడు రూపము మన కేఁక బాధపెట్టదు. రూపము కేవలము మార్గమును జూపుటయే గాక యానందము నిచ్చును. భావము బోధపడినంతనే భాష బాధపెట్టకపోవుటయె గాక తనసౌందర్యము నుద్ఘాటనముచేసి యానందమయముగఁ గాన్పించును. భావములకును భాషకును నంతర్బాహ్యముల మేళన మేర్పడినప్పుడు భాష మనలను విమోహితులను గావించును. అప్పు డాభాషపై నెవ్వరేని చేయి వైచిరేని యది మనము సహింపఁ జాలకుందుము. కాని యీలోపలియానందమును బయటనుండి గ్రహింప వీలులేదు; దానిని మనలోపలినుండియే గ్రహింపవలయును. నేనెఱుంగనిభాషలోనిపుస్తకముపైఁ గేవలము కన్నులు పెట్టి యెంతచూచినను దాని నెంతకాలమ్మున

ౖకెన గ్రహింపఁజాలను. కన్నులును, కర్ణములును, ఆపుస్తకము నుండి ప్రతిహత మగుచుండును. నాలోపలి జ్ఞానశక్తి వలననే దానిని నేను గ్రహింపవలయును. అంతరమున నొకసారి గ్రహించినపుడు బయట నిఁక నెట్టి బాధయు నుండదు. అప్పుడు బయట కూడ నానందము ప్రకాశించును.

నాలోపల నున్న యానంద మావిర్భావ మైనపుడు బయటి యానందరూపము తనంతట నాసమీపమున నమృతపూర్ణమై కాన్పించును. పొందుటయే పొందవలసినదానిని లాగి తీసికొనివచ్చును. మరుభూమియొక్క రసహీనతప్తవాయువులపైనుండి యెన్నియో మేఘములు పరుగులెత్తుచున్నవి. శుష్కవాయువులు మేఘములనుండి వర్షమును సంపాదింపనేరవు. వాయువునందే యెచ్చట జల ముండునో యచ్చట సజలమేఘములతో దానికి సంబంధము కలిగి వర్షము కురియఁగలదు.

నాలోపల నానందము లేనప్పుడు విశ్వముయొక్క శాశ్వతానందప్రవాహము నాపైనుండి నిరర్థకమై వెళ్లిపోవుచున్నది; నేను దానినుండి రసమును సంపాదింపఁజాలకుందును.

నాయందు జ్ఞానవికాస మైనప్పు డాజ్ఞానదృష్టివలననే విశ్వమునం దెచ్చటను జ్ఞానమునకు వ్యత్యాసము లేనటుల గ్రహింపఁగలుగుదును; దానినే మనము జ్ఞాన మందుము. ఎవ్వఁడు మూఢుఁడో, యెవ్వనిజ్ఞానదృష్టి తెఱవఁబడలేదో యతఁడు విశ్వమునందు సర్వత్ర మూఢత్వమును జూచును. విశ్వము వానికి భూతప్రేతదైత్యదానవులచే భయంకర మై యున్నటులఁ గాన్పించును.

ఇట్లే సకలవిషయములును నాలోపలఁ, బ్రేమ మేల్కొనన
నప్పు డానందము లేనప్పుడు విశ్వము నాకుఁ గారాగారముగ నుం
డును. ఆకారాగారమునుండి తప్పించుకొనుటకై ప్రయత్నించుట
వృథ. ప్రేమను మేలుకొల్పుటయే ముక్తి. ఎట్టియింద్రజాలముద్వార
మునఁగాని, యెట్టికౌశలముద్వారమునఁగాని ముక్తిలేదు.

విజ్ఞానసాధనము మనప్రాకృతికజ్ఞానబంధములను విమోచ
నము చేయుచున్నట్లే మంగళసాధనము మనప్రేమయొక్క మన
యానందముయొక్క బంధనములను విమోచనము చేయును. ఆ
మంగళసాధనమే మన సంకీర్ణప్రేమను బ్రశస్తముగను, జంచల
ప్రేమను జ్ఞానసమ్మతముగను జేసివేయును.

విజ్ఞానముచేఁ బ్రకృతిలోపల మనజ్ఞానము యోగయుక్త
మగును; అది విచ్ఛిన్నజ్ఞానము కాదు. అది భూతభవిష్యద్వర్త
మానములయందును దూరమునను, సమీపమునను, సర్వత్ర, యనం
తునితో నైక్యమై ప్రయుక్తమగును. మంగళము వలనఁగూడ నట్లే
ప్రేమ సర్వత్ర యోగయుక్త మగును. సమస్తదేశకాలవిశేష
ముల నతిక్రమించి యది యనంతమున మిళిత మగును. మంగళము
నకు దూరము, సమీపము, పరిచితము, నపరిచితము, ననుభేదము
లేదు. అప్పుడే ప్రేమయొక్క బంధనములు విమోచనము లగును.
దీనినే ముక్తియందురు.

బుద్ధుఁడు శూన్యమును గౌరవించినాఁడో, లేక పూర్ణమును
గౌరవించినాఁడో నేనాతర్కములోఁ బ్రవేశింపఁగోరుటలేదు. కాని
యతఁడు మంగళసాధనద్వారమునఁ బ్రేమను విశ్వచరాచరము

నందు ముక్తము చేయుట కుపదేశించియుండెను. అతనిముక్తిసా ధన మీరీతిగా నుండెను—"స్వార్థత్యాగము, అహంకారత్యాగము క్రోధత్యాగముయొక్క క్షమయొక్క దయయొక్క ప్రేమముయొక్కసాధన. ప్రేమ మహంకారముయొక్క శాసనముల నతిక్రమించి విశ్వములోపల ననంతములోపల ముక్త మైనపు డాప్రేమ దేనిని బొందునో, దాని కేమి నామ మిడినను ఆపేరు కేవలము భాషా వైచిత్ర్యమే కాని యదియే ముక్తి. ఈప్రేమ యెచ్చట నేది యున్నదో దాని నచ్చటనే యుంచును. దేనిని గాని త్యజింపదు. సమస్తమును సత్యమయముగను, బూర్ణతమముగను జేసి గ్రహించును; తనను బూర్ణునిలోపల సమర్పణము చేయుట కెట్టియాటంకము నది మన్నింపదు.

ఆత్మలోపలఁ బరమాత్మయొక్క యనంతప్రేమను ననంతానందమును నిరాటంకముగ గ్రహించుట కుపాయ మెద్ది యన— "పాపపరిశూన్యమంగళసాధనము." ఆయుపలబ్ధి యెంతబంధనహీనమును యథార్థమును నగుచుండునో యంతవిశ్వసంసారమునందు సమస్తేంద్రియాగ్రాహ్యములయందును జింతనలయందును భావములయందును గర్మములయందును మనయానంద మవ్యాహతమగుచుండును. మన మప్పుడు పరమాత్మవైపునుండియే జగత్తును జూతుము; మనవైపునుండి కాదు. అప్పుడే జగత్తునందలి సత్యము మనసమీపమున నానందముతోఁ బూర్ణము కాఁగలదు; మహాకవియొక్క యనంతసృష్టికావ్యము మనయెడల సార్థకము కాఁగలదు.

---

# ఆత్మదృష్టి 26.

బాల్యకాలమునందు నాదృష్టిశక్తి బహుస్వల్పమై యుండెను. కాని దానిని నే నెఱుఁగఁజాలనైతిని. చూచుట యన నింతేయనియు నందఱు నీపరిమాణమే చూచెద రనియు నేను భావించుచుంటిని. ఒకనాఁడు హఠాత్తుగా నవ్వులాటకు నాచెలికాని సులోచనముఁ దీసికొని నాకన్నులకు ధరించి చూచినంతనే సమస్తవస్తువులును సుస్పష్టములై కాన్పింపఁ జొచ్చెను. నేను హఠాత్తుగా సకలవస్తువులకును మిక్కిలి సమీపమున నున్నట్లు చూడఁగలిగితి ననియు, సులోచనముద్వారా యాకస్మికముగ విశ్వభువనమును ద్విగుణముగఁ జూడఁగలిగితి ననియు, సమస్తవస్తువులను సుస్పష్టముగఁ జూచుటవలనను వారిసామీప్యమును గ్రహించుటవలన నధికానంద మనుభవించుచుంటి ననియు, నిన్నిదినములనుండియు నింత యంధత్వముతోఁ దిరుగుచు దానిని గ్రహింపఁజాలకుంటి ననియు నామనమునఁ దలపోయ నారంభించితిని.

ఇది చక్షుస్సులద్వారా సమీపమునకు వచ్చుట. అట్లే యాత్మద్వారా సమీపమునకు వచ్చుటయును గలదు. ఆవిధముగా నే నెవ్వనియొద్దకు వచ్చెదనో వాఁడు నాహస్తమును బట్టుకొని 'నీవు వచ్చితివా?' యని యనఁగలఁడు. ఈజలవాయువులు చంద్రసూర్యులు మనకుఁ బరమబంధువులు. ఇవి మనకు నానాకార్యములఁ జేయుచున్నవి; కాని మనహస్తమును బట్టుకొనుట లేదు. ఆనందముతో "నీవు వచ్చితివా?" యని యనుట లేదు. ఆవిధముగా మనము

వానిని సమీపింపఁగలిగినయెడల నొక్కక్షణకాలములోపల నవి చేసెడుసమస్తోపకారములకంటె నాస్పర్శమే యాసంభాషణమే యెంతయును గొప్ప యని గ్రహింపఁగలుగుదుము. మానవుల మధ్యమున నేను జీవితకాల మంతయు వసియించుచున్నను వారు నన్ను స్పృశించి 'నీవు వచ్చితివా' యని యనుట లేదు. నే నొక యావరణములోపల నావృతుఁడనై పృథివియందు సంచరించు చున్నాఁడను; గ్రుడ్డులోని పక్షిశాబక మెట్లు పృథివియందు జన్మించి యు జన్మింపనట్లె యుండునో నేనును అట్లె యున్నాఁడను.

ఈయస్ఫుటచేతన మనెడుగుడ్డులోపలనుండి జన్మించు టయే యాధ్యాత్మికజన్మము. ఆజన్మద్వారముననే మనము ద్విజుల మగుదుము. ఆజన్మమే జగత్తునందు యథార్థజన్మము. ఆజన్మమే జీవచైతన్యమునందలిజన్మము; విశ్వచైతన్యమునందలిజన్మము. అప్పుడే పక్షిశిశువు తనమాతయొక్క పక్షపుటములసంపూర్ణసంస్పర్శ మును బొందును. అప్పుడే మానవుఁడు సర్వవ్యాపి యగు నాసర్వే శ్వరునిఁ బొందును. ఆపొందుట యెట్టియాశ్చర్యకరసార్థకతయో యెట్టియనిర్వచనీయానందమో దానిని మన మెఱుఁగఁజాలకున్నా రము. జీవనమునందు క్షణకాలమైనను దానికాంతిని మనము పొం దఁజాలకున్నారము.

ఆధ్యాత్మికత్వముచే మనయుదాసీనతయు మనబలహీనతయుఁ దొలఁగిపోఁగలవు. అనఁగా నప్పుడే మనము చేతనముద్వారా చేతన మును నాత్మద్వారా యాత్మను బొందఁగలుగుదుము. ఆవిధముగాఁ బొందినప్పుడు మన మిఁకఁ గ్రహింపవలసిన దెద్దియు నుండదు.

సమస్తమును బరమాత్మయొక్క యానందరూపమై కాన్పించు చుండును.

తృణము మొదలు మానవునిపర్యంతము గలజగత్తునందు మనచిత్త మెచ్చట సంకీర్ణత్వము నొందునో యచ్చటనే మనయాధ్యాత్మికత్వము సీమాబద్ధమై యున్న దని తెలిసికొనవలయును. మనచేతనము మనయాత్మ సర్వత్ర ప్రసారిత మైనప్పుడు జగత్తునందలి సమస్తసత్తను మనసత్తాద్వారా గ్రహింపఁగలుగుదుము. ఈగ్రహింపఁగలుగుట యింద్రియములద్వారా కాదు; బుద్ధిద్వారా కాదు; వైజ్ఞానికయుక్తిద్వారా కాదు. అపరిపూర్ణ మైనయనుభూతి యొక యాశ్చర్యకరవ్యాపారము. సమ్ముఖమున నున్నవృక్షమును అట్టి సత్తతో గభీరముగ గ్రహింపఁగలిగినయెడల మనసమస్తసత్తయు నానందముతోఁ బరిపూర్ణము కాఁగలదు. అట్లు చూడకపోవుట వలననే వృక్షమును గన్నులారఁ జూచియు దానివలన మన కెట్టి ప్రయోజనమును లే దని దానిసమ్ముఖముననుండి తొలఁగిపోవుచున్నారము. ఈవృక్షము మనలను మేల్కొల్పునే గాని మనల నానందాధికారులనుగాఁ జేయుట లేదు. మనుష్యులను గూడ మన మాత్మద్వారా చూచుట లేదు. ఇంద్రియములద్వారా యుక్తిద్వారా స్వార్థముద్వారా సంసారముద్వారా సంస్కారముద్వారా చూచుచున్నారము. మనము మానవునిఁబరివారమునకుఁ జెందినమనుష్యునిగఁ గాని లేక ప్రయోజనముల నొసంగుమనుష్యునిగఁ గాని లేక యపరిచితమనుష్యునిగఁ గాని లేక యేదో యొకశ్రేణీభుక్తమనుష్యునిగఁ గాని చూచుచున్నారము. కావున నాహద్దులలోపలనే మన

పరిచయ మాఁగిపోవుచున్నది. అచ్చటనే ద్వారము బంధింపఁబడు చున్నది. దానిలోపలి కిఁకఁ బ్రవేశింపఁజాలకున్నారము. ఎదుట నున్నమానవుని యాత్మ యని తలంచి మనయాత్మ వానితో సంభాషింపఁజాలకున్నది. సంభాషింపఁగలిగినయెడల నొకరినొకరు హస్తమును బట్టుకొని 'నీవు వచ్చితివా' యని యనుకొనఁగలరు.

ఆధ్యాత్మికసాధనముయొక్క చరమలక్ష్యమును గుఱించి యుపనిషత్తులయం దిట్లు వ్రాయఁబడియున్నది. "తే సర్వగం సర్వతః ప్రాప్య ధీరా యుక్తాత్మానం సర్వ మే వావిశంతి" అనఁగా ధీరులు సర్వవ్యాపిని సకలదిక్కులనుండియుఁ బొంది యుక్తాత్ములై సర్వత్ర ప్రవేశించెదరు. ఇట్లు సర్వత్ర ప్రవేశింపఁ గలుగుటయే యుక్తాత్ము లగుట. సమస్తపాపములయొక్కయు సమస్తాభ్యాసములయొక్కయు సంస్కారములయొక్కయు నావరణమునుండి ముక్తము లైనమనయాత్మలు సర్వత్ర పరమాత్మతో యుక్తము లైనప్పుడే సర్వత్ర ప్రవేశింపఁగలవు. ఆయాత్మలోఁ బ్రవేశింపని యెడల ద్వారమునొద్ద ఆఁగిపోవును. మృత్యువుచే బంధింపఁబడును. అన్నిటియందును నమృతరూపుఁడై ప్రకాశించు పరమాత్మలోపలఁ బ్రవేశింపఁజాలవు. మనయాత్మలు సమస్తమును జూడఁగలవు. కాని యానందరూపమును అమృతరూపమును మాత్రము జూడఁ జాలకపోవును.

ఇట్లాత్మద్వారా సర్వత్ర వ్యాప్తమై యున్నవిశ్వాత్మలోపలఁ బ్రవేశించుటయే మనసాధనముయొక్క లక్ష్యము. ప్రతిదినమును మన మీమార్గముననే పోవుచున్నారము. ఈమార్గముననే మనము

గ్రహింపవలయును. అంధభావముతో జడభావముతో నీమార్గమున మనము నడువఁజాలము. చేతనభావముతోనే చేతనము విస్తారము కాఁగలదు. ప్రతిదినమున మెల్లమెల్లఁగా మనము ప్రవేశించుమార్గము తెలియఁబడుచున్న దనియు మనయధికారము వ్యాప్త మగుచున్నదనియు మనము గ్రహింపవలయును. అందఱితోడ నధికముగ మేళనము కాఁగలుగుచున్నారము. కొంచెముకొంచెముగా సమస్తవిరోధములును ఖండింపఁబడుచున్నవి. మనుజులతోడిమేళనమునందును సంసారకర్మలయందును బరమాత్మయొక్క ప్రకాశము ప్రతిదినము నవ్యాహతమై ప్రకాశించుచున్నది. 'అహం' అనెడు నేనుదుర్భేద్యావరణము నన్నందఱితోడ విభక్తముచేసి యుంచెనో యది మెల్లమెల్లఁగా క్షీణించిపోవుచున్నది. అది క్రమక్రమముగా స్వచ్ఛమై దానిలోపలనుండి నిఖిలేశునివెలుఁగు క్రమక్రమముగా స్ఫుటతరమై కాన్పింపఁదొడఁగుచున్నది. నేను నాద్వారా దేనినైనను నాచ్ఛన్నముగఁ గాని వికృతముగఁ గాని చేయనేరను. నావలన నితరులకును నితరులవలన నాకును నాటంకములు ప్రత్యహమును దొలఁగిపోవుచున్నయవి.

---

# ఒకమంత్రము 27.

మానవున కన్నిటికంటె భయంకరమైనది యసంఖ్యము. ఈయసంఖ్యముతో మానవుఁ డొంటరిగాఁ బోరాడలేకున్నాఁడు. ఆతఁ డెన్నియో స్థలములందుఁ గృతాంజలిబద్ధుఁడై నిలచియు

న్నాఁడు. ఆతఁడు బలి కెన్నియో పూజార్ఘ్యములను పశువులను సంగ్రహించుచున్నాఁడు. అందుచే మానవుఁ డసంఖ్యముయొక్క భయముచే వ్యాకులపడి యెందఱినో మాంత్రికులను బిలచుచు న్నాఁడు.

ముక్కలుముక్కలై కాన్పించుచున్నవాని నన్నిటిని వశ మొనర్చికొనియు సమస్తమును దాఁటియు నున్నది సత్య మని సాధకుఁ డొకదినమున గ్రహించెను. అనఁగా మనము చూచు చున్నదానిని సంభవముగాఁ జేసియున్న దొక యదృశ్యపదార్థము.

ఏమి ? దాని నెందుకు చూచుట లేదు ? ఏలయనఁగా నది దేనితోడను స్వతంత్ర మై కాన్పించునది కాదు. సమస్తస్వతంత్ర మును దనయందు ధరించి యది యొక్కటి యై యున్నది. అది యనేకమునం దొకటి యైనయెడల దానిని నానావస్తువులప్రాంత మం దెచ్చటనో యొకచోటఁ జూచువారము. కాని అది యొకటే యగుటచే దాని ననేకమునకు నంశముగాఁ జేసి విశేషముగాఁ జూచుటకు వీలు లే కున్నది.

ఇంత గొప్పయావిష్కారమును మానవుఁ డెన్నఁడును జేసి యుండలేదు. ఇది యొకవిశేషసామగ్రికిఁ జెందిన యావిష్కా రము గాదు. ఇది మంత్రమునకుఁ జెందినయావిష్కారము. మం త్రముయొక్క యావిష్కార మెట్టిది ? విజ్ఞానమునం దభివ్యక్తివా దమువంటిది. జగత్తునం దేవస్తువును నొక్కసారిగా సంపూర్ణ మై యారంభము కా లే దనియు, సమస్తమును గ్రమముగా విక సించిన దనియు, దానియందుఁ జెప్పఁబడి యున్నది. ఈ వైజ్ఞానిక

మంత్రమును మానవుఁడు సాధన జేసినకొలఁది మననము జేసిన కొలఁది సత్యముయొక్క విశ్వాసోపలబ్ధి నానాదిక్కులనుండి యభి వృద్ధి చెందుచుండును.

మానవుఁడు తెలిసికొనినంతనే దానిప్రయోజన మంతయుం దువిషయము లనేకములు గలవు. అనంతర మావిషయము లాతని మనస్సున కెట్టియాహారమును సమకూర్పఁజాలవు. రాత్రి గతిం చిన నుదయ మేతెంచు ననువిషయము పలుమా ర్లాలోచించుటచే నెట్టిలాభమును లేదు. కాని మానవునియొక్క యమృతవాణి యెద్దియో యదియే యాతనికి మంత్రము. వాని నుపయోగించిన కొ లఁది వానిప్రయోజన మింకను బెరుఁగుచుండును. మానవునకొఱ కట్టియొక యమృతమంత్రము నొకశుభసమయమున నుచ్చరింపఁ బడి యుండెను. అది "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ."

కాని మానవు లీసత్యము నెచ్చట ననుభవింపఁగలిగిరి? ఎచ్చట నేదియు స్థిరముగా నుండుట లేదు. చూచుచుండఁగనే యొకటి యింకొక టై పోవుచున్నది. నేఁ డున్నబీజము రేఁపం కుర మగును. అంకురమునుండి వృక్షము వృక్షమునుండి యర ణ్యము నగుచున్నది. మరల సమస్తారణ్యము పిల్లవానిచేఁ బల కపై వ్రాయఁబడిన పిచ్చిగీతలవలె భూమిపైనుండి తుడిచివేయఁ బడుచున్నవి. పర్వతములను మనము ధ్రువమైన వని చెప్పుచుం దుము. కాని యవియు నాట్యశాలయందుఁ దెరవంటివి. ఒక్కొ క్కయంకము జరిగినవెనుక దానిని దెరచాటున నున్నయేమాన వుఁడో యెచ్చటికిఁ ద్రిప్పివేయుచుండునో గాన్పింపవు. చంద్ర

సూర్యతారకలు కూడ నాలోకబుద్బుదములవలె నంధకారసముద్ర ముపైఁ బొంగి పొంగి మరల విలీనమై పోవును. అందుచేతనే సమస్తమును సంసార మనియు, సంసారము స్వప్న మనియు, మాయ యనియు నందుము. అట్లైన సత్య మిం కెచ్చటఁ గలదు?

సత్యముయొక్క ప్రకాశ మిటులనే యీచిరచంచలతయందుఁ గలదు. నృత్యముయొక్క యేభంగిమమును స్థిరముగా నుండక నానావిధములుగా విభజింపఁబడుచుండును. అయినను జూచుచున్నవాఁ డానందించుచు నేను నృత్యమును జూచుచున్నా నని నుడువును. నృత్యముయొక్క సమస్తభంగిమములు లయతాళములతో బంధింపఁబడి యొకనిరవచ్ఛిన్నసత్యమును బ్రకటించుచున్నవి. మనము నృత్యముయొక్క నానాభంగిమములనే ముఖ్యముగాఁ జూచుట లేదు. మనము దానిసత్యమును జూచినతోడనే యానందముఁ బొందుచున్నాము. విరిగిపోయినబండి మార్గముప్రక్క నచలముగాఁ బడియుండుట తనజడత్వగుణమువలననే యయియున్నది. కాని నడచుచున్నబండియొక్క సారథి, వాహనము, దానియంగప్రత్యంగములును, అది నడచుమార్గము మొదలగు నన్నిటియందును ఒక నియతప్రవృత్త మగుసామంజస్య ముండవలయును. అపుడే యది నడచును. అనఁగా దాని దేశకాలగతసమస్తాంశప్రత్యంశముల నాక్రమించుకొని వానిని యుక్తముచేసి వాని నతిక్రమించి సత్య ముండనియెడల నాబండి నడువఁజాలదు.

ఏవ్యక్తి విశ్వసంసారమునం దీకేవలము మార్పు చెందుచున్నవైపునకే తనదృష్టి నుంచునో యామానవుఁడు సమస్తము

స్వప్న మనియో లేక సమస్తము వినాశముయొక్క యతిభీషణ మగుప్రతిరూప మనియో నుడువుచుండును. అతఁడు విశ్వమును ద్యజించుటకు నాతురతఁ జెందుచుండును. లేక భయంకర మగు విశ్వదేవతను దారుణోపచారములచే సంతసింపఁజేయుట కేర్పాటులు చేయించుచుండును.

కాని యేమానవుఁడు సమస్తతరంగములయం దున్నధారను సమస్తభంగిమములయం దున్ననృత్యమును సకలస్వరముల యం దున్నసంగీతమును జూచుచు వినుచు నుండునో యాతఁడే యానందముతో "సత్యం" అని యనఁగలుగుచున్నాఁడు. గొప్ప వర్తకము జరుగునప్పు డది సత్య మని యాతఁడు గ్రహించును. మిథ్య యైనపుడే యాతఁడు దరిద్రుఁ డయి యచలుఁ డగు నని యాతఁ డెఱుఁగును. మహాజనులమూలధనమునుగుఱించి సత్యపరిచయము పొందవలె నన్న నది వినియోగపడుచున్నప్పుడే యది సాధ్య మగును. సంసారమునం దంతయుఁ జరుగుచున్నది గనుకనే యంతయు మిథ్య యనునీవిషయము సంపూర్ణముగ విరుద్ధమైనది. నిజమునకు సత్య మగుటచేతనే సమస్తమును జరుగుచున్నది. అందుచే సత్త తనను స్థిరముగా నుంచఁజాలకున్నదనియు నది తనకూలముల నుల్లంఘించి యనంతవికాసమార్గమున నగ్రసర మగుచున్నటుల మనము నలువైపులఁ గాంచుచున్నారము. సమస్తమును స్వీకరించి సమస్తము నుల్లంఘించి యీసత్యపదార్థమును మానవుఁ డెటుల గ్రహింపఁగలిగెనో యిది తర్కము వలన గ్రహింప నగునది గాదు. దీనిని మనప్రాణములయందే

మనము సంపూర్ణముగా నిస్సంశయముగాఁ జూచితిమి. సత్యము యొక్క రహస్య మన్నిటికంటె స్పష్టముగాఁ దరులతలయందును బశుపక్షులయందును ధ్రుతమై యున్నది. సత్యము ప్రాణస్వరూప మనువిషయము నీజగత్తునందు రోమాంచరూపము దాల్చినగడ్డి పోఁచయొక్క ప్రతిపత్రమునందును లిఖింపఁబడి ప్రకాశిత మయి నది. నిఖిలమునం దొకవిరాట మగుప్రాణ ముండనియెడల నీజగ త్తునం దంతటను జరుగుచున్న దాఁగుడుమూతాటయం దది యొక్కతృణమునం దైనను ధృతమై యుండునది గాదు.

ఈతృణమునందు మన మేమి చూచుచున్నారము ? గాన మునం దెట్టితాళమును జూచితిమో యట్లు జూచుచున్నాము. బృహ దాంగముయొక్క ధృపదగానము జరుగుచున్నది. నాల్గవతాళము విళంబిత మగుటచే దానికి ధీరమందగతి యేర్పడును. ఏగాయకుని మనస్సునందు సమస్తగానముయొక్క రూపము విరాజిల్లుచున్నదో యపుడపు డాతఁడు లీలాచ్ఛలమున నొక్కొక్క చిన్నచిన్నతాళ ములయందు నాసమగ్రరూపమును క్షణములోఁ జూపించును. భూమిక్రింద నీటిధార రహస్యముగా దాఁగియుండును. రంధ్రము గాన్పించునపు డాప్రవాహము పొంగి పొరలి తనను బ్రకటించు కొనును. అట్లే యుద్భిదములయందును బశుపక్షులయందు నున్న ప్రాణముయొక్క చంచలలీలలు ప్రవాహమువలెఁ బ్రవహించుచు నల్పపరిసరమునందు నిఖిలసత్యముయొక్క ప్రాణమయరూపమును బ్రకటితము చేయును.

ఈప్రాణతత్త్వ మెట్టి దని యెవరేని మనల నడిగినచో నేసంజ్ఞవలనను దానిని మనము నిరూపించి స్పష్టముగాఁ దెలియఁ జేయుశక్తి మనకు లేదు. లోకమునందు మన మన్నిటికంటె దేనిని సహజముగా గ్రహించుచున్నామో దానిని దెలియఁజేయుటయే మిక్కిలి కఠిన మైనది. ప్రాణమును గ్రహించుటకు మనకు బుద్ధి యుండవలసినపని లేదు. అందుచే దానిని దెలియఁజేయుటకు మిక్కిలి యాపదలోఁ బడవలసివచ్చును. మనప్రాణమునందు మనము రెండు విరోధముల ననాయాసముగా నేకము చేసి చూడఁ గలము. ఒకవైపున మనప్రాణ మెల్లపుడు చంచలమై యున్న టులఁ గాంతుము. మఱియొకవైపున సమస్తచాంచల్యమును నుల్లం ఘించి యతీతము నతిక్రమించి వర్తమానమును వెనుకఁ బడవేసి ప్రాణము విస్తీర్ణమై నిలచి యున్నది. నిజముగ నానిలచియుండు వైపునకే దృష్టి నుంచి మనము బ్రతికి యున్నా మని చెప్పుచుం దుము. ఒక్కకాలమునందే యుండుట యుండకపోవుట నిత్యచాం చల్యము నిత్యస్థిరత్వమునందు న్యాయశాస్త్రమున కెట్టివిరోధ ము న్నను అది న్యాయశాస్త్రమునందే యున్నది; మనప్రాణమునందు లేదు.

మనము బ్రతికి యుండఁ గోరినప్పుడు దీనినే గోరుదుము. మనము మనస్థితికిఁ జాంచల్యమునందు ముక్తి నిచ్చి ముందునకు నడువఁ గోరుదుము. మనలను నహల్యవలె రాయిగా స్థిరముగాఁ జేసి యుండినయెడల నది మనకు శాప మని తలంతుము. మన ప్రాణముహూర్తములను జకిముకిరాయి స్ఫులింగములవలె నెవ

రేని వర్ణించుచున్నపుడు మన మాప్రాణము సమగ్రముగా బొందక పోవుదుమేని దానిని మనము పొందనే లేము.

ఈవిధముగాఁ బ్రాణమయసత్యముయొక్క యనిర్వచనీయమును సునిశ్చితమును నగుపరిచయమును మనయందనాయాసముగాఁ బొందితిమి. అది తనను దాను దాఁటిపోవుచుండును. అది అసీముని సీమాయుం దాకారబద్ధునిఁ జేయుచు సీమకు నసీముని యందు ముక్తి నిచ్చుచుఁ బ్రవహించుచుండును. దీనివలననే నిఖిలసత్యమును నిఖిలమునకుఁ బ్రాణరూపముగా మనము గ్రహించుచున్నాము. ఈసత్య మందఱియం దుండి యందఱి నతిక్రమించి యుండుటచేత విశ్వసంసారము నడచుట సత్యమై యున్న దని మనము గ్రహింపఁ గల్గుచున్నాము. అందుచేతనే జగత్తునందు స్థిరత్వమే వినాశ మగుచున్నది. ఏల యనఁగా స్థిరత్వము సీమయందు ఆటంకము కలదిగాఁ జేయఁబడుచున్నది. అందుచేతనే "యదిదం కించ జగత్ సర్వం ప్రాణ ఏజతి నిఃసృతం" ఇది యంతయుఁ బ్రాణమునుండియే నిస్సృతమై ప్రాణమునందే కంపించుచున్న దని చెప్పఁబడినది.

అట్లైన నంతయుఁ బ్రాణమేనా? అప్రాణ మెచ్చటను లేదా? అప్రాణ మున్నది. ఏల యనఁగా ద్వంద్వములేకున్న సృష్టి కానేరదు. కాని యాయప్రాణమువలన సృష్టిపరిచయమును బొంద లేము. ప్రాణమే ముఖ్యమైనది; అప్రాణమే గౌణమైనది.

మనము నడచుసమయములో నడుగులు వేయునప్పుడు ప్రతియడుగునకు నాటంకము గల్గుచుండును కాని నడకపరిచయ

మాయాటంకముపలనఁ గాక, యాయాటంకమును దాఁటిపోవుట యందే యున్నది. నిఖిలసత్యమునకును నొకవైపున నాటంకము ను, మఱొకవైపున నాటంకవిమోచనమును గలవు. ఆయాటంక విమోచనమునందే దానిపరిచయము. దానియందే యాప్రాణస్వరూ పము. దానియందే యది యన్నిటి నేకము చేయుచున్నది; నడు పుచున్నది.

మన మీవిషయము సరిగ గ్రహించినదినము మనకు భయ దినము కాదు. భిక్షాదినము కాదు. ఆదిన మేదో యొక నియమహీన దేవతనద్భుతోపాయములచే వశముచేసికొనుదినము కాదు.ఆదినము విశ్వసత్యమును నాసత్య మని యానందించు దినము.

ఆదినము పూజాదినము. కాని సత్యముయొక్కపూజ, మాటలపూజ కాదు. మాటలచే మఱపించి సత్యము నొద్ద వరము లను బొంది వీలులేదు. సత్యము ప్రాణమయ మైనది. అందుచేఁ బ్రాణమునందే సత్యముయొక్క పూజ యున్నది. మానవుఁడు సత్యముయొక్క వరము పొందుచున్నటులను ఆతని దైన్యము దూర మగుచున్నటులను మనము ప్రత్యక్షముగాఁ జూచితిమి. ఎచ్చటఁ జూచితిమి? మానవునిచిత్త మెచ్చట నచలము కాదో యాతనినవనవోద్యోగము లెచటఁ గలవో, ఎచట సమక్షమునకే మానవునిగతియో, అతీతమునం దెచ్చట నాతఁడు తనను నఖశిఖప ర్యంతము బధించుకొని స్థిరముగాఁ గూర్చుండి యుండలేదో, ఎచట తా నగ్రసరుఁ డగుమార్గమును నలువైపుల నున్ముముక్తముగా నుం చుటకు నెల్లప్పుడును సచేతనుఁడో, అచటఁ గాంచితిమి. వంట

చెలఱకు పూర్ణ తేజముతో వెలుఁగునప్పు డది పొగవలననో బూడిద వలననో కప్పఁబడును. అటులనే యేజాతి తనప్రాణమును నడువ నీయక కేవలము బంధింపఁగోరెనో దానిసత్యము సకలదిక్కుల నుండి మ్లాన మై దానిని నిర్జీవముగఁ జేయునటులఁ గాంచనగును. ఏల యనఁగా సత్యముయొక్క ధర్మము జడధర్మము కాదు. ప్రాణ ధర్మము; చలనమువలననే దానిప్రకాశము.

మానవుఁడు తనయంతర్గతవేగవంత మగుప్రాణానంద ముచే నక్లాంతసంధానమార్గమును సత్యముయొక్క పూజను గావిం చునపుడు విశ్వసృష్టితో నాతనిసృష్టిగూడ నలువైపుల విచిత్రరూ పము దాల్చును. అపు డాతనిరథము పర్వతములను దాఁటిపోవును. ఆతనితరణి సముద్రము నతిక్రమించి పోవును. ఆతని కపు డెచ్చ టను నిషేధ ముండదు. అపు డాతఁడు నూతనసంకటములలోఁ బడి యాఘాతములను బొందుచుండును. కాని రాళ్లదెబ్బలు తిను టచే ఝురికలగాన మెటుల నెక్కువ యగుచుండునో యటులనే యాఘాతములచే వేగవంత మగుప్రాణమునందు నూతనభాష సృజింపఁబడుచుండును. స్థిరముగ నుండుటయే సత్యమును సేవిం చుట యనియు, చలనమే సనాతనసత్యమునకు విరుద్ధమగునప రాధ మనియుఁ దలంచువారల నచలత్వముక్రింద వ్యాధిదారిద్ర్యవ ఘూనావ్యవస్థలు కేవలము రాశీకృత మగుచుండును. తమసమాజము, వారికి నిషేధముల కంటకవనముగను, దూరలోకాలయము, వారికి దుర్గమ మయినదిగ నుండును. తమయుర్గతికై వార లితరుల నప రాధులనుగాఁ జేయఁ జూతురు, ఏత్రాళ్లచేఁ దాము సత్యమును బం

ధించి యుంచఁగోరుదురో యాత్రాళ్ళచేఁ దమనే బంధించుకొని నిర్జీవు లయి పడియుందురు.

మానవునిబుద్ధిశక్తి యెట్టిదో తెలిసికొనఁ గోరుదునేని దాని నెచ్చట వెదుకవలెను ? మానవుని గణనాశక్తి చిరకాల మయిదు సంఖ్యను దాఁటిపోనట్టిస్థానమునందా ? మానవునిధర్మ మెద్దియో తెలిసికొనఁ గోరుదునేని దానిని పొందుట కెచటకిఁ బోవలయును? ఆతఁ డెచట భూతప్రేతములఁ బూజ చేయునో, కాష్ఠలోష్టములకు బలి యిచ్చునో యచటికా పోవలసినది ? కాదు, అచటికిఁ గాదు. ఏలయనఁగా మానవుఁ డచట బంధింపఁబడి యున్నాఁడు. అచట నాతనివిశ్వాసమునందును నాయాచరణమునందును సమ్ముఖీనగతి లేదు. చలనమువలననే మానవుఁడు తనను దెలిసికొనును. ఏల యనఁగాఁ జలనమే సత్యముయొక్క ధర్మము. మానవుఁ డెచట చలనాభిముఖుఁ డయి యుండునో యచటనే యాతనిని మనము స్పష్టముగాఁ జూడఁగలము. ఏలయనఁగా మానవుఁ డచట తనను గొప్పవానినిగాఁ జూపించును. ఆతఁడు నేఁటికిని చేరనిస్థానమును గూడ తనగతివేగమువలన నిర్దేశించును. ఆతనియంతర్గత మగు సత్యం ఆతనికిఁ జలనమువలననే యది యన్నిటికంటె నెక్కువ గొప్ప దని తెలియఁజేయుచున్నది.

సత్యముతోకూడ నీజ్ఞాన మంటియుండుటచేతనే. మంత్రము నందు సత్యం జ్ఞానం అని యున్నది. అనఁగా సత్యము దేని బాహ్యవికాసమో జ్ఞానము దాని అంతరప్రకాశము. మనకుఁ గలుగుచున్న వికాసము అగుటయొక్క వికాసము గాక తెలిసికొనువికా

సమై యున్నది. అయి యుండుటవలనను జలనమువలనను మన లను మనము తెలిసికొనఁగలము.

ఏసత్యము కేవలము తయారగుచున్నదో ఆతయారగుట తనను తెలిసికొనుటయు లేదు; ఇతరుల కెవ్వరికిఁ దెలుపుటయు లేదు.

అది యున్న దనియే చెప్పుటకు వీలు లేదు. నాయందు జ్ఞానాలోక మెట్లు చలించునో యటులనే సమస్తమును నాయందు సార్థక మగుచున్నది. ఈసార్థకతను బృహత్తరముగా విశ్వము నందు లే దనియు ఖండభావముతో నాయం దున్నదనియు మానవుఁడు తలఁపకపోవుటచేతనే సత్యం జ్ఞానం—సత్యము సర్వత్ర జ్ఞానము సర్వత్ర యున్న దని నుడువుచున్నాఁడు. సత్యము కేవలము జ్ఞానమునకు ఫల మొసఁగుచున్నది. జ్ఞానము కేవలము సత్యమును సార్థకము చేయుచున్నది. దీని కింక నంతము లేదు. ఇది యిటుల జరుగకున్నయెడల నంధసృష్టి కెట్టియర్థమును లేదు.

ఉపనిషత్తులలో బ్రహ్మనుగుఱించి "స్వాభావికీ జ్ఞానబల క్రియా చ" అనఁగా నాయన జ్ఞాన బల క్రియలు సహజము లైనవి. ఆయనబలము క్రియ ఇదియే సమస్తము. ఇదే జగత్తు. నలువైపుల మనము బలము పని చేయుచున్నటులఁ గాంచుచున్నాము. ఈపని సహజ మైనది. అనఁగాఁ దనబలమువలననే తనయీపని నెఱవేఱుచున్నది. ఈస్వాభావికబలక్రియ లెట్టివస్తువులో వానిని మనము మనప్రాణమునందు స్పష్టముగా గ్రహింపఁగలము. ఈబలము క్రియ బాహ్యసత్యములు, దానితోకూడ నొకయంతరప్ర

కాశ మున్నది. అది జ్ఞానము. మనము బుద్ధివలన గ్రహించుప్ర యత్నమునందు రెంటిని స్వతంత్రము చేసి చూచుచున్నాము. కాని విరాట్స్వరూపునియం దిది సంపూర్ణముగా నేకమై యున్నది. సర్వత్ర జ్ఞానచలనమువలననే జ్ఞానముక్రియ జరుగుచున్నది. బల క్రియలప్రకాశమువలననే జ్ఞానము తన నుపలబ్ధి జేసికొనుచు న్నది. "స్వాభావికీ జ్ఞానబలక్రియా చ"—మానవుఁడు తనయందు స్వాభావికజ్ఞాన ప్రాణము లనియెడు నుభయులయోగమును నధిక ముగా ననుభవింపనియెడల నాతఁ డిట్టిమాటయే చెప్పఁజాలఁడు.

ప్రదీపమునకుఁ జివర నున్నశిఖ యెట్లు విశ్వవ్యాప్త మగునుత్తాపముయొక్క యంగమో యటులనే నాప్రాణము విశ్వ ప్రాణముయొక్క అంగము. నేను దెలిసికొనునదియు విచ్ఛిన్న మగువిషయము గాదు.

మానవుఁడు విశ్వమునం దొకమూలఁ గూర్చుండి యుక్తియ నెడుత్రాసుచే సూర్యునిఁ దూచుచున్నాఁడు. అజ్ఞానబలమువలననే విశ్వరహస్యము ప్రకాశించుచున్న దని నుడువుచున్నాఁడు. కాని యీజ్ఞాన మాతనిజ్ఞానమే యయినయెడల నిది జ్ఞానమే కాదు. విరాట్స్వరూపునిజ్ఞానయోగమువలననే యాతఁ డంతయుఁ దెలిసి కొనఁగలుగుచున్నాఁడు. మానవుఁ డహంకారముతో నాశక్తివలననే నేను యంత్రనిర్మిత మగుబండిని నడిపి దూరత్వమును దొలఁగిం చుచున్నా నని నుడువును. కాని యాతనియీశక్తి విశ్వశక్తితో నేకము గానియెడల నాతఁ డొకయడుగైనను నడువఁజాలఁడు.

అందుచే మానవుఁ డేదినమున సత్యం అని నుడువఁ గలి

గెనో యాదినమందే యొక్క ప్రాణమయశక్తినే తనయందును దనబాహ్యమునం దంతటను జూడఁగలిగెను. ఏదినమున జ్ఞానం యని నుడువెనో యాదినమున నాతఁడు గ్రహించుచున్న దంత యు ముందు గ్రహించున దంతయు నొకబృహత్తర మగుజ్ఞాన మునందు జాగ్రతమై యున్నయటుల నాతఁడు గ్రహించెను. అందుచేతనే యాతనిశక్తియొక్కయు జ్ఞానముయొక్కయు క్షేత్ర ములు విశాల మైన వనియు, నవి యెచ్చటను నిలిచిపోవ వనియు నాతనికి విపుల మగునాశ జనించినది. అపు డాతఁడు తనయందే యసీమునిమార్గమును బొందినాఁడు. ఇపు డాతఁడు యాగయజ్ఞ ముల మంత్రములపౌరోహిత్యమునకు శరణు జొరవలసిన పని లేదు.

మానవుఁడు తనసత్యానుభవమువలన సత్యమును సర్వత్ర చూచినాఁడు. తనజ్ఞానాలోకములో జ్ఞానమును సర్వత్ర గ్రహించు చున్నాఁడు. అటులనే తనయానందమునందు మానవుఁ డేయనం తునిపరిచయమును బొందెనో దానివలననే అనంతం బ్రహ్మ యని నుడువఁగలిగెను.

ఆపరిచయ మెచ్చటఁ గలదు ? ఏదేని యొకబృహత్తర మగుప్రేమయు బృహత్తర మగుభావానందము మనయందు మే ల్కొనునపుడు మనకృపణత్వ మంతరించిపోవును.

అపుడు మనము వ్యక్తుల మై పూర్ణుల మై పోవుదుము. మృత్యు ద్వారమున నమృతస్వాదమును బొందుదుము. అందుచే మానవుని ప్రధానైశ్వర్యపరిచయము వైరాగ్యమునందును నాసక్తి

యందును కాదు. మనసమస్త నిత్యకీర్తి వైరాగ్యముల పునాదిపై స్థాపింపఁబడి యున్నది. అందులకే మానవుఁడు భూమైవ సుఖం భూమాయే నాసుఖ మని నుడివెను. భూమాత్వేవ విజిజ్ఞాసితవ్యః, భూమాను నేను దెలిసికొనవలయును. నాల్పే సుఖ మస్తి అల్ప మునందు నాకు సుఖము లేదు.

ఈభూమాను దల్లి తనసంతానమునందు గాంచినపుడు తన కిఁక నాత్మసుఖలాలసత్వముండదు. ఈభూమాను మానవుఁడు స్వదేశమునందుఁ జూచునపుడు తన కిఁక నాత్మప్రాణమమత్వ ముండదు. ఏసమాజనీతియందు మానవుని నవజ్ఞపరుచుట ధర్మ మని నేర్పుదురో యాసమాజమునం దుండి మానవుఁడు తనయనంతునిఁ బొందఁడు. అందుచేతనే యాసమాజమునందుఁ గేవలము శాసనముల పీడనమే గాని త్యాగముయొక్క యానందను లేదు. మానవుని మనము క్షుద్రునిగాఁ జేసి గ్రహించినపుడు మానవుఁ డనియే తలంపము. మానవునిగుఱించి మనజ్ఞానము కృత్రిమసంస్కారముల ధూళిజాలముచే నావృతమై యున్నచోటనే మానవునియం దున్న భూమాస్వరూపుఁడు మనయొద్ద నాచ్ఛన్నుఁడై యుండును. అచటఁ గృపణుఁ డగుమానవుఁడు తనను క్షుద్రుఁడ ననియు నసమృద్ధుఁడ ననియుఁ జెప్పుకొనుటకు సిగ్గుపడఁడు. సత్యము నొప్పుకొనును గాని కార్యమునఁ బరిణమింపఁ జేయఁజాలఁడు. అచ్చట మంగళానుష్ఠానములుకూడ బాహ్యాచారగతములై పోవును. కాని మానవునియందు భూమా యుండుటచేతనే భూమాత్వేవ విజిజ్ఞాసితవ్యః భూమా నెఱుఁగనిది సత్యమును గ్రహింపఁజాలము.

ఎపుడు సమాజమునందాగ్రహణశక్తి నలువైపులనుండి మేల్కొనునో యపుడు మానవుఁడు, ఆనందరూప మమృతం; తన యానందరూపమును నమృతరూపమును సర్వత్ర సృష్టించుకొనుచుండును. ప్రదీపముయొక్క శిఖవలె నాత్మదానమువలననే మానవునియాత్మోపలబ్ధి కలదు. ఈవిషయమును దనయందు నానారూపములకుఁ బ్రత్యక్షముగాఁ జూచి మానవుఁడు, ఆనంతస్వరూపుని "ఆత్మదా" ఆయన తనను దానముచేసెను అని చెప్పెను.

ఆదానమునందే యాతనిపరిచయము. ఈసారి మనము సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ యనుమంత్రము నంతయు నొకసారి చూచెదము. అనంతబ్రహ్మయొక్క సీమారూపమే సత్యము. విశ్వబ్రహ్మాండమందు సత్యనియమముయొక్క సీమాద్వారముననే యనంతుఁడు తనను ఉత్సర్గముచేసికొనుచున్నాఁడు. సత్యము సీమానుబద్ధమై యున్నపుఁ డాయసీముని నెట్లు ప్రకాశింపఁజేయఁగలదు? దానికి జవాబిది—మనము దేనిని సీమా యనుచున్నామో యది యెచ్చటను లేదు. అది యొంటరిగా నెచ్చటను లేదు. అందుచే సీమ కేవల మసీమయందు మిళిత మగుచున్నది. మనము దేని నసీమ యనుచున్నామో యాయసీమయు నొంటరిగా నెచ్చటను లేదు. అందుచే సీమయు నసీమునే ప్రకాశింపఁజేయుచున్నది.

సీమాయందు సత్యము నిశ్చలముగా లేదు. బ్రహ్మ, సీమా సీమాహీనత నీరెంటికి నతీతుఁడు. ఆయనయందు రూపము నరూపమునను యను నీరెండును మిళితమై యున్నవి.

ఆయనను 'బలదా' యని చెప్పఁబడెను. ఆయనబలము

ఆయనశక్తి విశ్వసత్యములుగాఁ బ్రకాశించుచున్నవి—మరల ఆత్మదా—ఆసత్యముతో నాశక్తితోఁ దనకు విచ్ఛేదము కలుగ లేదు. ఆశక్తియోగముననే యాయన తనను దానము చేసికొను చున్నాఁడు. ఈవిధముగా ససీమాసీముల యరూపసరూపములకు సపరూపమిళనము ఘటిల్లినది. సత్యం అనంతం అనిర్వచనీయ రూపమున నొందుటలతో నేకకాలమునఁ బ్రకాశించుచున్నవి. అం దుచే ససీమునియానందము ససీమునియభిముఖమునందును ససీ మునియానంద మసీమునియభిముఖమున నున్నవి. అందుచే భక్తుని భగవానుని యానందమిళనమునందు మనము ససీమా సీముల యీవిశ్వవ్యాప్త మగు ప్రేమలీలల చిర రహస్యమును క్షుద్రమునందుఁ గాంచుచున్నాము. ఈరహస్యము రవిచంద్రతారల తెరచాటున నిత్యకాలము జరుగుచున్నది. ఈరహస్యమును వక్ష మునం దిడుకొని విశ్వచరాచరము రసవైచిత్ర్యములతో విచిత్రమై యున్నయది. సత్యముతో ననంతుని యీనిత్యయోగము లోకస్థితి యొక్క శాంతియందును సమాజస్థితియొక్క మంగళమునందును జీవాత్మపరమాత్మల యేకాత్మమేళనమునందును శాంతం శివ మద్వైత మనురూపములఁ బ్రకాశమానమై యున్నది. ఈశాంతి జడ త్వముయొక్క నిశ్చలశాంతి కాదు. సమస్తచాంచల్యముయొక్క మర్మనిహితశాంతి. ఈమంగళము ద్వంద్వవిహీన మగునిర్జీవమంగ ళము కాదు. సమస్తద్వంద్వమంథనముల సంక్షోభజాత మగుమంగ ళము. ఈయద్వైతమేకాకారత్వముయొక్క అద్వైతముగాక, సమ స్తవిరోధవిచ్ఛేదముల సమాధానకారి యగునద్వైతము. ఏల య

నఁగా నాయన "బలదా ఆత్మదా" సత్యక్షేత్రమున శక్తిద్వారముననే యాయన కేవలము తనను దానము చేసికొనుచున్నాఁడు.

సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ—ఈమంత్రము కేవలము ధ్యానవిషయము కాదు. దీనినిఁ బ్రతిదినసాధనయందు జీవితమున స్వీకరింపవలయును.

ఆసాధన యెట్టిది ? మనజీవితమునందు సత్యమునకును అనంతునకును సంఘటిల్లిన యంతరాయమును మనజ్ఞానమునకు వికారము గలిగించుచున్న యంతరాయమును దూరము చేయునట్టిది.

ఈయంతరాయమును గలిగించినది మనఅహం. ఈఅహం తనరాగద్వేషముల కశ్మలములతో,కొఱడాలతో మనజీవితమును దన సుఖదుఃఖముల సంకీర్ణమార్గమునందు నడుపఁగోరును. అపుడు మనకర్మములో శాంతుని బొందము. మనసంబంధమునందు శివుని యభావము గలుగును, మఱియు నాత్మయం దద్వైతానంద ముండదు. ఏల యనఁగా, సత్యం జ్ఞాన మనన్తం; అనంతునితో యోగమువలననే సత్యము జ్ఞానమయ మగును. అపుడే మనజ్ఞానబలక్రియలు స్వాభావికము లగును. ఎవరిజీవితములు వేగమున నడచుచుఁ గేవలము తమనే కేంద్రముఁ గావించి ప్రదక్షిణముఁ గావించుచుండునో వారలయాచలనము నాబలక్రియ గానుగయెద్దుల యొక్క చలనము వంటిది, అది స్వాభావిక మయినది గాదు, జ్ఞానమయ మయినది గాదు.

మఱల నెవరిజీవితములు సత్యమునుండి విచ్ఛిన్న మయి యనంతునికర్మహీనసన్న్యాసమునం దుపలబ్ధిఁ జేయుటకును, భావ

రసోన్మత్తతయం దనుభవించుటకును గోరుదురో, వారలయీాధ్యాన యుక్త లేక రసయుక్త సాధనలు వంధ్యములు, వారలప్రియత్నము లు శూన్యత్వమును దోహదమొనర్చుటయో లేక తమకల్పనలను సఫలముగావించుటయో జరుగుచుండును. ఎవరిజీవితములు సత్యముయొక్క చిరవికాసమార్గమున నడచుట లేదో కేవలము శూన్యత్వమును లేక రసభోగవిహ్వాల మగుతనమనస్సును పలుమార్లు ప్రదక్షిణము కావించుచుండునో అట్టివారల యీాయంధసాధన జడత్వమో లేక ప్రమత్తతయో యై యుండును.

సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ యనుమంత్రమును స్వీకరింతుమేని మనమస్సును బ్రవృత్తులచాంచల్యమునుండియు నహంకారోద్ధత్యమునుండియు నిర్ముక్తము చేయుట కెక్కువ బ్రయత్నముఁ జేయవలయును—అట్లుగానిచో మనకర్మముల కలుషత్వము, జ్ఞాన వికారము తగ్గ నేరవు. మన నేయహం నేఁడు తల యెత్తి మన సత్యమునకు ననంతునకు నంతరాయమును గలిగించి యజ్ఞానము యొక్క ఛాయను పఱచి యున్నదో యది బ్రేమయందు వినమ్రమయి తనశిరమును నతము చేయఁగలిగినపుడు మనజీవితములందాయహమే ససీమాసీముల మిళనమునకు సేతు వగును—అపుడు మనజీవితములలో సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ తననమ్రతపైఁ బ్రతిష్ఠిత మయి యుండును. సుఖదుఃఖములచాంచల్యము మనల నభిభూతులనుగాఁ జేయునపుడు సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ యను సీశాంతిమంత్రమునే స్మరించుకొనవలెను. మానావమానముల తరంగడోలికలు మనలను క్షుబ్ధులను గావించునపుడు సత్యం జ్ఞాన మన

స్తం బ్రహ్మ యను మంగళమంత్రమునే స్మరించుకొనవలయును. కల్యాణాహ్వానమున దుర్గమమార్గమునందుఁ బ్రవృత్తుల మగునపుడు సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ యను నీయభయమంత్రమునే స్మరించుకొనవలయును. అంతరాయములు ప్రబలమై మార్గము నాటంక పఱచునపుడు సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ యనునీశక్తిమంత్రమునే స్మరించుకొనవలయును. మృత్యువు వచ్చి ప్రియుల విచ్ఛేద ఛాయచే మనజీవనయాత్రామార్గము నంధకారమయము గావించు నపుడు సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ యను నీయమృతమంత్రమునే స్మరించుకొనవలయును. మనజీవనగతసత్యముతో నానందమయ బ్రహ్మయోగము పూర్ణ మగుచుండినయెడల మనజ్ఞానము నిర్మల మయి మనలను సమస్తక్షోభలనుండియు, మత్తతనుండియు నవ సాదమునుండియు రక్షించును. నది ప్రవహించుచున్నపుడు తన చలనముతో నొక కలకలసంగీతము మెలఁగుచున్నటులనే మనజీవితము ప్రతిక్షణమునందును ముక్తిమార్గమున సత్యమయి నడచుచున్నపుడు దానిచలనముతో సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ యను నీయమృతవాణి సంగీతమువలె మెలఁగుచుండును గాక! ఎవరు విశ్వరూపమునఁ దనను దానము చేయుచున్నారో యాయనకుఁ బ్రతిదానరూపముగా నాత్మనివేదనము చేయుటకు నిత్యము మాలల కూర్చుకొనుమంత్రము సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ యగుఁగాక! మనజీవితముయొక్క ప్రార్థన—అసతో మా సద్గమయ, తమసో మా జ్యోతిర్గమయ, మృత్యోర్మామృతం గమయ—యగుఁగాక, జడత్వమునుండి మమ్ములను సత్యములోనికిఁ గొనిపొమ్ము, మూఢత్వ

మునుండి మమ్ము జ్ఞానములోనికి గొనిపొమ్ము, మృత్యువుయొక్క ఖండత్వమునుండి మమ్ముల నమృతత్వములోనికిఁ గొనిపొమ్ము. నీయీ కొనిపోవుట యవిరామముగ జరుగుచుండును గాక, అది యేమనఁ, జిరజీవనగతి. ఏల యనఁగా నీవు ఆవిః,ప్రకాశమే నీస్వభావము; వినాశమునందు నీయానందము తనను విలుప్తము గావించుకొనదు, వికాసమువలన నీయానందము తనను విస్తరింపఁజేసికొనును. నీయీ పరమానందవికాసము మాజీవితములందును, జ్ఞానమునందును, ప్రేమమునందును, గర్మములయందును మాగృహములయందును సమాజమునందును దేశమునందును బాధాముక్తమయి ప్రసారిత మగుఁగాక, నీకు జయ మగుఁగాక.

(సాధారణసమాజమునం దొసఁగఁబడిన ఉపదేశము.)

---

# పార్థక్యము 28.

ఈశ్వరుఁడు మనుష్యునికిమాత్రము పార్థక్య మొసంగి ప్రకృతితోఁ గలిసి యొక్కటిగా నున్నాఁ డని చెప్పిన నెట్లు సరిపోవును ? ప్రకృతినుండికూడ నాతనికి స్వాతంత్ర్యము కలదు. లేని యెడలఁ బ్రకృతితో నతని కేమిపనియు నుండదు.

భేద మిది. తాను స్వతంత్రుఁడ నని మనుష్యుఁ డెఱుఁగును. అంతియ కాదు. ఆస్వాతంత్ర్యము తనకు నగౌరవము గాక గౌరవమె యనియు వాఁ డెఱుఁగును. తండ్రి ప్రాయముఁ బడసిన

పుత్రునికిఁ దనసొత్తునుండి కొంతసొమ్మును బ్రత్యేకముగాఁ దీసి యిచ్చునప్పు డాపార్థక్యమునందే యతనివిశేషవాత్సల్యము పరికా శించును;— ఆపార్థక్యమహాగౌరవము మనుష్యుఁ డేవిధమునను బోఁగొట్టుకొనఁ జాలఁడు. మనుష్యుఁడు తనయాస్వాతంత్ర్యగౌరవ సంయుత మగునధికారముతో స్వయముగా వ్యవహరించును. ప్రకృతియం దాయహంకారము లేదు. తా నేమి బడసినదియు నాప్రకృతికిఁ దెలియదు.

ఈశ్వరుఁడు ప్రకృతిని దేనిద్వారమున వేఱుపఱచెను? నియమముద్వారమున.

నియమముద్వారమున వేఱుపఱచని యెడలఁ బ్రకృతితో నాతనియిచ్ఛకు సంయోగ ముండదు. ఏకాకారమై యుండినచో, నిచ్ఛయొక్క సంబంధమునకు మార్గమె యుండదు. చదరంగపు టాటయందుఁ దనయిచ్ఛను బంధించుకొనును. ఎట్లు? నియమముల నేర్పఱచుకొని. ఒక్కొక్కకాయ నాతఁడు నియమమునకు బద్ధము గావించును. ఆనియమము కాయలయందు లేదు. ఆట నాడువానియిచ్ఛయందె గలదు. ఇచ్ఛ తాను నియమముల స్థాపించుకొని యానియమములపైఁ దనసు బ్రయోగించుకొనుట వలననె యాట సంభవమగును.

విశ్వజగత్తునం దీశ్వరుఁడు జలనియమము, స్థలనియమము, వాయునియమము, నగ్నినియమము, మనోనియమము మున్నగు ననేకనియమములను విస్తరింపఁజేసి యున్నాఁడు. ఆనియమములనే మనము సీమ లని చెప్పుదుము. ఆసీమాప్రకృతి నెక్క

డనుండియొ తెచ్చి నెత్తిపైఁ బెట్టుకొనుట కాదు. ఆతనియిచ్ఛయే తనయం దానియమములను, ఆసీమలను స్థాపించుకొనెను. అట్లు గానిచో నిచ్ఛ నిష్క్రియమైనయెడలనే కార్యము జఱుగదు. అందు వలన సీమ లేనియాతఁడు సీమలకు నాకారమై నిలుచును.—ఇచ్ఛా మూలమున మాత్రిమె, ఆనందమూలమున మాత్రమె. ఆకారణ మున "ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే" అని యుప నిషత్తు చెప్పును. అందువలన, "ఆనందరూప మమృతం యద్వి భాతి" ఎవ్వఁడు ప్రకాశముఁ బడయుచున్నాఁడో, యతనియొక్క రూప మానందరూపము—అనఁగా మూర్తిమంత మగు నిచ్ఛ— అని చెప్పఁబడును. ఇచ్ఛ తనను సీమయందు బంధించుకొనును; రూపమునందు బంధించుకొనును.

ప్రకృతియం దీశ్వరుఁడు నియమనులద్వారమున, సీమల ద్వారమున నేపార్థక్యమును సృజించెనో యది కేవలపార్థక్యమె యయినయెడల జగత్తు సమష్టిరూపము ధరింపదు.

కాన దానిమధ్యమునఁ, జిరంతనపార్థక్యమును జిరకాలము నతిక్రమించునట్టి యింకొకవస్తువు గలదు. అది యేది? అది శక్తి. ఈశ్వరుని శక్తి. ఆసమస్తపార్థక్యముపైఁ బని చేసి దాని నొక యభిప్రాయమునందు బధించుచున్నది. స్వాతంత్ర్యము గల్గి నియ మబద్ధములయిన చదరంగపుకాయ లన్నిటియందు నొక్కయాటా డువాని శక్తి యేకతాత్పర్యవిశిష్ట మగునాట నభివ్యక్తపఱచును.

కాఁబట్టి యతనిని 'కవిః' అని ఋషులు పిలిచిరి. కవి యే విధముగా భాషాస్వాతంత్ర్యమును దనయిచ్ఛాధీనమునఁ దనశక్తికి

ననుగతపఱచి సుందరచ్ఛందోవిన్యాసద్వారమున నొకయాశ్చర్య కర మగు నర్థమును గల్పించునో యటులనె యాతఁడును 'బహుధా శక్తియోగాత్ వర్ణాననేకాన్నిహితార్థో దధాతి' అనఁగా శక్తి ననేకమునడుమఁ బ్రసరింపఁజేసి యనేకముతో సంయుక్తపఱచి యనేకవర్ణనముల ద్వారమున నొకనిహితార్థమును బ్రస్ఫుటింపఁ జేయుచున్నాఁడు. అట్లు గానియెడల, సమస్తమును నర్థహీన మగును.

'శక్తియోగాత్' శక్తియోగముద్వారమున కలుగును, శక్తియొక యోగము. ఆయోగముద్వారమున నీశ్వరుఁడు, సీమలవలన భిన్నముచేయఁబడిన ప్రకృతితోఁ బ్రయుక్తుఁ డగును—నియమములనెడు సీమలరూపముఁ దాల్చిన పార్థక్యమునడుమ నిలిచి యాతనిశక్తి దేశముతో దేశాంతరమునకును, రూపముతో రూపాంతరమునకుఁ, గాలముతోఁ గాలాంతరమునకును బహువిచిత్రసంయోగము సాధించి యొక యపూర్వవిశ్వకావ్యమును సృష్టించుచున్నది.

అవ్విధముగా, నసీముఁడగు నాతఁడు సీమలద్వారమునఁ దనను వ్యక్తపఱచుకొనుచున్నాఁడు; మహాకాలస్వరూపుఁ డగు నతఁడు ఖండకాలద్వారమునఁ దనను బ్రకాశింపఁ జేసికొనుచున్నాఁడు. ఆపరమాశ్చర్యరహస్యము విజ్ఞానశాస్త్రమునందుఁ బరిణామవాద మని చెప్పఁబడును. తనయందుఁ దాను పర్యాప్తుఁ డగు నాతఁడు క్రమమువలనఁ దనయిచ్ఛను విచిత్రరూపమున మూర్తివంతము జేయుచున్నాఁడు— జగత్తును నిర్మించుచున్నాఁడు; మానవసమాజేతిహాసమును రచియించుచున్నాఁడు.

ప్రకృతినడుమ నియమములసీమయే పార్థక్యము. ఆత్మ నడుమ నహంకారసీమయె పార్థక్యము. ఆసీమల నాతఁడు స్థాపించనియెడల నాతనిప్రేమచేల యెవ్విధమునను సంభవము గాదు. జీవాత్మయొక్క స్వాతంత్ర్యముద్వారమున నాతనిప్రేమ పనిచేయుచున్నది. ఆతనిశక్తియొక్క క్షేత్రము నియమబద్ధప్రకృతి; ఆతని ప్రేమయొక్కక్షేత్ర మహంకారబద్ధ మగుజీవాత్మ. ఆయహంకారమును జీవాత్మయొక్కసీమ యని తిరస్కరింపఁ జనదు. జీవాత్మయొక్క యాయహంకారమునందుఁ బరమాత్మ తనయానందమున సీమను స్థాపించెను. లేనియెడల, నాతని యానందముయొక్క యెట్టికార్యము నుండదు.

ఆయహంకారమునందుఁ గేవలపార్థక్యమె సర్వప్రధానముగ నుండినచో నాత్మకు, నాత్మకు భేద ముండులాగుననే స్నేహమేర్పడుట సాధ్యము కాదు—ఆత్మతో నాత్మ కేవైపునుండి యెట్టి సంస్పర్శమును గలుగనేరదు. కాన యతనిప్రేమ సమస్తాత్మలను నాత్మీయములు (తనవి) గాఁ గావించుకొను మార్గమున వర్తించును; విభిన్నముల నేకముచేసి ప్రత్యేకస్వాతంత్ర్యముల నిహితార్థమును జాగరిల్లఁజేయును. అట్లు గానిచో, జీవాత్మయొక్క స్వాతంత్ర్యము భయంకరము, నిరర్థకము నగును.

ఇందె యద్భుతరహస్యము గలదు. పరిపూర్ణానంద మపూర్ణద్వారమునఁ దనయానందలీలను వికసింపఁజేయుచున్నది. బహుతరసుఖదుఃఖవిచ్ఛేదముల మేళనద్వారమున ఛాయాలోకవిచిత్ర మగు నాప్రేమాభివ్యక్తిమాత్రమె యగ్రసరమగుచున్నది. స్వార్థా

భిమానములయొక్క యాఘాతప్రతిఘాతములం దెంతయు వంక రమార్గమునుండి, యెంతయు విశాలప్రదేశమునుండి చిన్నవియుఁ బెద్దవియు నగుయాసక్త్యనురక్తులను భేదించుకొని జీవాత్మయొక్క ప్రేమనది ప్రేమసముద్రముపైపునకుఁ బోయి మేళన మగుచున్నది. ప్రేమయొక్కశతదళపద్మ మహంకారవృంతము నాశ్రయించుకొని యాత్మనుండి గృహమునందు, గృహమునండి సమాజమునందు, సమాజమునుండి దేశమునందు, దేశమునుండి మానవకోటియందు, మానవకోటినుండి విశ్వాత్మయందు, విశ్వాత్మనుండి పరమాత్మయందు నొక్కటొక్కటిగా దళముల విప్పి వికాసలీలను సమకూర్చుచున్నది.



## నిష్ఠ 29.

ఎప్పుడు సిద్ధియొక్క యాకారమునకుఁ గొంతపరిమాణము కాన్పించునో యప్పు డానందముతో మనలను మనమే లాగుకొని పోవుదుము. అప్పుడు మనల నాపుట కేరికి సాధ్యము? అప్పుడు మన కలసట యుండదు; దుర్బలత్వ ముండదు.

కాని సాధనారంభమునందె యాసిద్ధియొక్క యాకారము దూరముగ నైనను బ్రకాశింపదు. మఱియు మార్గముకూడ సుగమముగ నుండదు. అప్పుడు మన మేశక్తివలన నడువఁగలము?

ఆసమయమున మనలను నడుపునది, భారము వహించు

నది నిష్ఠయే. భక్తి మేల్కొనినప్పుడు, హృదయము పూర్ణ మైనప్పుడు, మార్గ మింక మార్గ మనియే మనకుఁ దోఁపదు. అప్పుడు పూర్తిగ నన్నిటికిఁ బైన నడతుము. కాని భక్తి దూరముగ నున్నపుడు, హృదయము శూన్యముగ నున్నపు డట్టియత్యంతదుఃఖసమయమున మనకు సహాయు లెవ్వరు ?

అప్పుడు నిష్ఠ యొక్కటే మనకు సహాయము. శుష్కచిత్తముయొక్కమృతభారము నది వహింపఁగలదు.

ఇసుకయెడారులయందు నడచువారి కుష్ట్రమే వాహనము. అదియే మిక్కిలి బలవంతమైనదియు దృఢమైనదియు నగువాహనము. దానికిఁ గొంచమైనను సుఖేచ్ఛ లేదు. ఆహారము దొరకకున్నను అది నడచును. పానీయములు లభింపకున్నను అది నడచును. ఇసుక తప్తమై పై కెగురుచున్నను అది నడచును. నిశ్శబ్దముగా నడచును. ఆమరుభూమి కంతము లేదని తోఁచునప్పుడును, మృత్యువుతప్ప వేఱుగతి లేదని తోఁచునప్పుడును గూడ దానినడక యాగిపోదు.

అట్లే శుష్కమును, రిక్తమును కఠోరమును నగు మార్గమునందు భుజించుటకు కొంచమైన నాహారమును గలిగియుండని మనలను నడిపించునది నిష్ఠయే. దాని కెట్టిదృఢమైన ప్రాణ మున్నదనఁగా నిందాపవాదములయందును, నన్నిబాధలయందు నది తన ఖాద్యద్రవ్యములను సంపాదింపఁగలదు. మరుభూమియందలి మృత్యుమయమైన ఝంఝూమారుతము లున్మత్తునివలె నలుగడలఁ జుట్టి వచ్చునప్పు డది ధూళిని శిరమునఁ దాల్చి, తలను సంపూర్ణ

ముగ వంచుకొని, తుపానును నెత్తిపై నిడుకొని పోవుచుండును. నిష్ఠవలె ధీరత్వమును, సహిష్ణుతను, నధ్యవసాయమును గలిగినది మఱేది కలదు ?

సాధనమార్గమున మధ్యమధ్య కేవలము కల్పనావీచికలు మార్గమునుండి తొలఁగించుటకు నన్ను సమీపించుచుండును. సార్థకతయొక్క విచిత్రరూపము క్షణక్షణమునకుఁ గాన్పింపకుండును. నిన్న నెక్కడ నుంటినో నేఁడును అక్కడనే యుంటి నని మనమున తోఁచుచుండును. మనస్సుతో నాలోచించుటకు మనస్సు చలించిపోవుచుండును. హృదయమునం దెచ్చట వెదకినను సార్థకతయొక్కచిహ్నము కానరాదు. వ్యర్థమైన యుపాసనలఁజేయుచు క్షీణించి పోవుచుంటి నని మనమునఁ దోఁచుచుండును. కాని యట్టి వ్యర్థోపాసనలయొక్క భయానకభారమును వహించి నిష్ఠ ప్రతిదినమును నడువఁగలదు. దినముతరువాత దినము, దినముతరువాత దినము గడువఁగలదు.

మన మగ్రేసరుల మగుచున్నాము. ముందునకు నడచుచున్నాము. ప్రతిదినము గమ్యస్థానమునకుఁ గొంచెముకొంచెముగా సమీపమునకు వచ్చుచున్నాము. దానిలో సందేహ మెంతమాత్రమును లేదు. అదిగో చూడుఁడు, హఠాత్తుగా నొక్కనాఁ డెక్కడనుండియో భక్తియొక్కవాణి వినఁబడును. సుదూరప్రసారితదగ్ధక్షేత్రమధ్యమున మధుఫలగుచ్ఛములతో నిండిన ఖర్జూరకుంజములయొక్క సుస్నిగ్ధవాయువులు వీచుచుండును. ఆ నిభృతచ్ఛాయాతలమున శీతలజలప్రవాహములు ప్రవహించుచుండును. ఆజల

మును పానము చేసి, దానియందు స్నానముచేసి, యానీడయందు విశ్రమించి, మఱల మార్గమున నడువ నారంభింతుము. కాని భక్తియొక్క యామధురత్వము, నాశీతలత్వమును దుదవఱకును తోడు రావు. అప్పుడు మఱల నాకఠినమైనదియు, శుష్కమైనదియు నక్రాంతమైనదియు నగు నిష్ఠయే కాన్పించుచుండును. నిష్ఠకొకగుణ మున్నది. అది యే సుయోగమున నైన నొక్కనాఁడు భక్తిజలమును పానము చేయఁగలిగినయెడల ననేకదినములవఱకు దానిని లోపల రహస్యముగా దాఁచి యుంచును. ఘోరతరమైన నీరసత్వము కలిగినదినమందు దాఁచియుంచిన యాభక్తిజలమునే యది పానీయముగ నుపయోగించుకొనును.

సాధనచేత దేనిని బొందవలయునో దానియెడలఁ జూపెడు భక్తినే మనము భక్తి యందుము. సాధనయందుఁ జూపునట్టి భక్తినే మనము నిష్ఠ యందుము. అట్టి కఠినశుష్కసాధనమే నిష్ఠయొక్క ప్రాణధనము. సాధనయందు నిష్ఠ కొకగభీరతరానంద మున్నది. అది యొకయహేతుకమయిన పవిత్రానందము. అట్టి వజ్రసారమైన యానందముచే నిష్ఠ నిరాశను బాఱఁద్రోలును. అది మృత్యువునకును భయపడదు. ఇట్టిమన శుష్కమార్గమున మనకుఁ దోడై యుండునట్టిది నిష్ఠ యొక్కటియే. మనము మార్గముయొక్క యంతమునకు వచ్చినప్పుడది భక్తియొక్కహస్తమున మనలను సంపూర్ణముగ సమర్పణముచేసి తాను తనదాసీశాలయందు దాఁగుకొనును; అహంకారముఁ జెందదు; అధికారము

సలుపదు. సార్థకతఁ బొందినపుడు తన నంతరాళమునఁ బ్రచ్ఛన్న ముగ నుంచుటయే దానికి సంతోషము.

---

## ప్ర కృ తి 30.

ప్రకృతి యీశ్వరశక్తియొక్క క్షేత్రము. జీవాత్మ పరమాత్మలయొక్క ప్రేమక్షేత్రము. ప్రకృతియందు శక్తిద్వారా పరమేశ్వరుఁడు తనను బ్రకటించుకొనుచున్నాఁడు. జీవాత్మయందుఁ బ్రేమద్వారా భగవంతుఁడు తనను దానముచేసికొనుచున్నాఁడు.

అనేకమానవు లీయుభయదిక్కులయందును త్రాసును సమానముగ నుంచి ప్రవర్తింపఁజాలకున్నారు. కొందఱు ప్రాకృతిక దిక్కుననే సాధనము చేయుదురు. మఱికొంద రాధ్యాత్మికదిక్కుననే శ్రమచేయుదురు. భిన్నభిన్నజాతులలో నీవిషయమై భిన్నత్వము కాన్పించుచున్నది.

ప్రకృతిక్షేత్రమున సాధనము చేయువారు శక్తినిఁ బొందుదురు; ఐశ్వర్యశాలు రగుదురు; రాజ్యసామ్రాజ్యములను విస్తారము చేయఁగలుగుదురు: అన్నపూర్ణయొక్క వరమును సంపాదించెదరు; పరిపుష్టు లగుదురు.

ప్రకృతిసాధకులు సర్వవిషయములందును గొప్పవార లగుటకొఱకు నొకరి నొకరు త్రోసివేయుచు నొకమహత్పదార్థమును బొందుదురు. అనఁగా వారిలో నెవ్వరు శ్రేష్ఠులో వారిశ్రేష్ఠత్వ మంతయు ధర్మనీతివలనఁ గలుగునదియే.

కారణ మేమి? గొప్పవా రగుటకును శక్తిశాలు రగుటకును అనేకులతో మిళితము కావలయును. ఈమేళనసాధనముపై శక్తియొక్క సార్థకత నిర్భరపడియుండును. కాని, మహారూపముగను, స్థాయిరూపముగను, నన్నిటికంటె సార్థకరూపముగను మిళితము కావలయు నన్న నొకనియమమును స్వీకరింపవలయును. అదే దనఁగా—మంగళనియమము. అదే విశ్వనియమము—అదే శ్రేయోనీతి. ఈవిశ్వనియమమును స్వీకరించినయెడల సమస్తవిశ్వ మనుకూలముగ నుండును. ఆనియమమును స్వీకరింపని చోట సమస్తవిశ్వమును దెబ్బలు కొట్టుచుండును. విశ్వము కొట్టుటవలన మన కెక్క డేమి నష్టము సంప్రాప్తించునో కంటికిఁ గనఁబడదు. తుదకు బహుదినములనుండి వచ్చుచున్నకీర్తి చూచుచుండఁగనే నేలపా లగును.

ఎవ్వరు శక్తియొక్క క్షేత్రమున విశేషభావముతోఁ గార్యములు చేయుదురో వారిలో గొప్పగొప్పసాధకు లీనియమమును విశేషముగఁ బ్రకటించెదరు. విశ్వనియమమే శక్తియొక్క ప్రతిష్ఠాస్థల మనియు, నాది యీశ్వరసంబంధమున నెట్లో మానవునిసంబంధమున నట్లే యనియు వా రెఱుఁగుదురు. నియమము నుల్లంఘించినచోట శక్తి నిరాశ్రయ మగుచున్నది. ఎవ్వనికి నాఫీసులో నియమము లేదో యతఁ డశక్తకర్మి. ఎవ్వనికి గృహమందు నియమము లేదో యతఁ డశక్తగృహి. ఏరాష్ట్రవ్యాపారములందు నియమ ముల్లంఘింపఁబడునో యచ్చ టశక్తశాసనతంత్రము లని తలంపవలయును. ఎవనిబుద్ధి విశ్వవ్యాపారములయందు నియమ

ములఁ జూడఁ జాలదో యట్టివాఁడు తన జీవనముయొక్క సర్వ విషయములందు నశక్తుఁడు; అకృతార్థుఁడు, పరాభూతుఁడు.

అందుచే యథార్థశక్తిసాధకులు నియమమును బుద్ధియందు స్వీకరించెదరు; విశ్వమునందు స్వీకరించెదరు; స్వీయకర్మముల యందు స్వీకరించెదరు. వారు యోజింపఁగలరు; రచింపఁగలరు; పొందఁగలరు. ఈవిధముగా వా రేపరిమాణమున సత్యశాలు రగుదురో యాపరిమాణమున నైశ్వర్యశాలు రగుచుందురు.

కాని దాని కొకకష్ట మున్నది. అనేకసమయములందు వారు ఈశ్రేయోనీతినే మానవులయంత్యాధార మని తలంచెదరు. దేనిసాహాయ్యముతోఁ గేవలము కర్మములఁ జేయవలయునో, శక్తిని ఉన్నతిని బొందవలయునో దానినే వారు చరమాశ్రయము గఁ దలంచెదరు. అందుచే వైజ్ఞానికసత్యమునే వారు చరమసత్య మని తలంచెదరు. సకలకర్మముల కాశ్రయభూత మైనశ్రేయోనీ తినే వారు పరమపదార్థ మని విశ్వసించెదరు.

ఎవ్వరు శక్తిక్షేత్రమునందే తమసమస్తప్రాపును సీమాబద్ధము చేసి యుంచెదరో వా రైశ్వర్యమును బొందుదురు. కాని యీశ్వరునిఁ బొందఁజాలరు. ఏల యనఁగా నీశ్వరుఁ డచ్చటఁ దనను బ్రచ్ఛన్నముగ నుంచి తనయైశ్వర్యము నుద్ఘాటనము చేసి వైచెను.

ఇట్టియనంతైశ్వర్యసముద్రమును దాఁటి యీశ్వరునిలోఁ బ్రవేశించుట కేరికి సాధ్యము? ఐశ్వర్యమున కంతము లేదు; శక్తికిని అంతము లేదు. అందుచేత నామార్గమునఁ గ్రమముగ

నంతహీన మగు నొకదిక్కునుండి మఱియొకదిక్కునకుఁ బోవు చుందురు. అందుచే మానవు లీమార్గమున నడచుచు నిక్క డీశ్వ రుఁడు లేఁ డనియు నిక్క నైశ్వర్యమున్న దనియు శక్తి యున్న దనియు నంతము మించిన చేదియుఁ గాన్పించుట లే దనియుఁ జెప్పుచుందురు.

ఈశ్వరునితో సమానులము కాకున్న మనము వానిని బొం దు టెట్లు ? మన మెన్ని రైలుబండ్లను నడపినను ఎన్ని టెలిగ్రాపు తీఁగెలు నిర్మించినను శక్తిక్షేత్రమున నీశ్వరునకు మన మనంతదూర మున నుందెదము. స్పర్ధ వహించి పరమేశ్వరునితోఁ బోటీచేయఁ బ్రయత్నింతుమేని మనప్రయత్నములు తమ యధికారము నుల్లం ఘించి వ్యాసరాశివలె నధిక ప్తమయి విశ్వామిత్రుఁడు సృష్టించిన జగత్తువలె వినాశముఁ బొందును.

అందువలన జగత్తునందలి సమస్తధర్మసాధకులు, నైశ్వ ర్యపథమునందలి పథికుల కీశ్వరదర్శన మత్యంతదుస్సాధ మని పదేపదే చెప్పియుండిరి. అంతహీన మగుప్రయత్నము చరమహీ నపథమున వారినిఁ గేవలము మఱపించుచుఁ దీసికొనిపోవును.

కావున నీశ్వరునిబాహ్యమునం దనఁగా వానిశక్తియొక్క క్షేత్రమున నెట్టిప్రదేశమునందును మనము పొందఁజాలము. ప్రతి యిసుకరేణువుయొక్కయు నంతరాళమునందు భగవంతుఁ డుండు టచే నేవిజ్ఞాని యైన నేయాత్రికుని యైన నీయిసుకరేణువు నతిక్ర మింప సాధ్య మగునా ? కాఁబట్టి శక్తిక్షేత్రమున నెవ్వఁడు పర మేశ్వరునితోఁ బోరాడఁదలంచునో వాఁడు మాయవేషమును ధరిం

చినమహాదేవుని బాణముతోఁ జంపఁబూనిన యర్జునునివలెఁ గాఁ గలఁడు. ఆబాణములు వానిని దాఁకవు. మనబాణములు పరమే శ్వరునియొద్దకుఁ బోనేరవు.

ఈశక్తిక్షేత్రమున మన మీశ్వరుని రెండుమూర్తులను జూ డఁగలుగుదుము. అందులో నొక్కటి యన్నపూర్ణమూర్తి. ఈ మూర్తి యైశ్వర్యముద్వారా మనశక్తిని బరిపుష్టము చేయును. మఱి యొకమూర్తి కరాళీకాళీమూర్తి. ఈమూర్తి మనసీమాబద్ధ మయిన శక్తిని సంహరించి వేయును; మనల నేదిక్కునఁ గూడ శక్తి యొక్క తుదకుఁ బోనీయదు. ధనమందుఁగాని ఖ్యాతియందుఁగాని మఱి యేకోరికయందుఁ గాని యామూర్తి మన కంతమును జూప దు. గొప్పగొప్పరాజ్యసామ్రాజ్యములు దుమ్ములోఁ గలసిపోవు చున్నవి. గొప్పగొప్పయైశ్వర్యభాండాగారములు పాఱవేసెడిటెం కాయచిప్పలవలె నగుచున్నవి. ఇచ్చటఁ బొందింపఁజేయుమూర్తి మిక్కిలి సుందరముగను సుజ్జ్వలముగను మహిమాన్వితముగను నుండును. పోయెడిమూర్తి విషాదముతోఁ బరిపూర్ణముగఁ గాని భయంకరముగఁ గాని యుండును. అది శూన్యత్వముకంటె శూ న్యత్వ మై యున్నది. కారణ మేమి? అది పూర్ణత్వముయొక్క యంతర్ధానము.

కాని యెట్లయిన నిచ్చటఁ బొందుటకును తుద లేదు; పోవు టకును తుద లేదు. ఇచ్చటఁ బొందుట పోవుట యనుమార్పులు మాత్రము జరుగుచున్నవి. కావున నీశక్తిక్షేత్రము మానవులకు

స్థితిక్షేత్రము కాదు. ఈశక్తిక్షేత్రమునం దేచ్చటను గూడ మాన వుఁడు చిరకాల ముండు నని తలంపఁ దగదు.

---

# అనంతుని యిచ్ఛ 31.

నాశరీరములోపలఁ గొన్నియిచ్ఛలు గలవు. అవి నాశరీర మునకు గోచరములు. ఎట్లనఁగా, నాకు భుజించుట కిచ్ఛ కలుగును. స్నానముచేయుట కిచ్ఛ కలుగును. చలికాలమున నొడలు వెచ్చ చేసికొనుట కిచ్ఛ కలుగును.

కాని సమస్తశరీరములోపల నొకయిచ్ఛ కలదు. అది నా కగోచరమై యున్నది. అదియే యారోగ్యమైన యిచ్ఛ. అది నాకుఁ దెలియకుండఁగనె రోగమునందును, అరోగమునందును, సదా పనిచేయుచున్నది. అది వ్యాధిసమయమున నెన్నియో విధ ములఁ బ్రతీకారమునకు నాశ్చర్యమైనవ్యవస్థలు కలిగించుచున్నది. వానిని మనము తెలిసికొనఁజాలము. అరోగసమయమున సమస్త శరీరములోపలను విచిత్రక్రియలయొక్క సామంజస్యమును స్థా పించుటకొఱకు దానికౌశలమున కంతము లేదు. ఆవిషయమును గూడ నది మనకుఁ దెలుపుట లేదు. ఈయారోగ్యసంబంధమైన యిచ్ఛయే శరీరమునకు మూలమున మనచేతనమున కగోచరముగా రాత్రింబవళ్లు నిద్రయందును, జాగరణమునందును నవిశ్రామముగ విరాజిల్లుచున్నది.

శరీరతత్త్వవేత్త దీనిని దెలిసికొనఁగలఁడు. మనలోపల నొకయారోగ్యతత్త్వ మున్న దని యతఁ డెఱుఁగును. శరీరము నందలి మూలమైనట్టియు నవ్యక్తమైనట్టియు నీయిచ్ఛ నెవ్వఁ డెఱుంగునో యతఁడు శరీరగతమైన సమస్తవ్యక్తేచ్ఛలను ననిచ్ఛ కనుగతముగఁ జేసివేయును. వ్యక్తమైనయిచ్ఛ యెప్పుడు భుజింతునా యని యాతురపడునప్పుడు దాని నతఁ డీయవ్యక్తమైన యారోగ్యేచ్ఛాశాసనములచే నియమింపఁ బ్రియత్నించును.ఇదియే శరీరసంబంధమైన సాధన.

పదుగురితోఁ గలసి మన మొకసంఘమును నిర్మించుచుందుము. దానియందును వ్యక్తావ్యక్తములగునిచ్ఛలు కలవు. సంఘమునందలి ప్రతివాఁడును దనస్వార్థసుఖముకొఱకును, స్వాధీనత కొఱకును గలిగియుండెడు నిచ్ఛయే వ్యక్తమైన యిచ్ఛ. అందఱును గొప్పతనమును బొందఁగోరుచున్నారు;అందఱును జయింపఁ గోరుచున్నారు. తక్కువధనముతో గొప్పయాదాయము నార్జింపవలె ననియే యందఱియొక్క యిచ్ఛ. ఈయిచ్ఛాసంఘాతములచే నెంతయో మోసము, నెన్నియో యుద్ధములు, నెన్నియో పోరాటములును, నంతము లేక జఱుగుచున్నవి.

కాని సంఘములోపల నొకయవ్యక్తమైన యిచ్ఛ ధ్రువమై యున్నది. దానిని ప్రత్యక్షముగఁ జూచుట లేదు. కాని యది యున్నది; అది లేనియెడల యెవ్విధముగను సంఘము రక్షింపఁబడదు. అదియే మంగళేచ్ఛ. అనఁగా సమస్తసంఘములును సుఖ మొందును గాక! బాగుపడును గాక! యనెడు నిచ్ఛయే ప్రతివానియం

దును నిగూఢభావముగ నున్నది. ఏదో తాత్కాలికానుకూలము పైనఁగాక యీయిచ్ఛపైనే సంఘము బంధింపఁబడి యున్నది.

సాంఘికతత్త్వవేత్తలు దీని నెఱుంగుదురు. వారు సమస్త సుఖములయొక్కయు, స్వాధీనతయొక్కయు, వ్యక్తమైన యిచ్ఛను ఈఁగభీరావ్యక్తమంగళేచ్ఛ కనుగతము చేయుటకుఁ బ్రయత్నించెదరు. వా రీనిగూఢనిత్యేచ్ఛాసమీపమున సమస్తానిత్య మైన యిచ్ఛలను త్యాగము చేయఁగలుగుదురు.

మనయాత్మలోపలఁ గూడ వ్యక్తమైన యిచ్ఛలు గలవు. ఆత్మ తనను నానాదిక్కుల గొప్పగా గ్రహింపఁగోరును. అది ధనమునందును, విద్యయందును, ఖ్యాతియందును దనను గొప్పగాఁ దెలిసికొనఁగోరును. అందుచేఁ బెనగులాటలకును, దెబ్బలాటలకును అంతము లేకున్నది.

కాని యాత్మయం దెల్లపుడు నొకయవ్యక్త మైనయిచ్ఛ యున్నది. ఎవ్వఁ డన్నిటికంటె గొప్పవాఁడో, యనంతుఁడో,యద్వితీయుఁడో యట్టిబ్రహ్మములోపల మేళనమునందే తనను గ్రహింపవలయు ననెడు నిచ్ఛ యాత్మలోపల నిగూఢరూపముగను, ధ్రువరూపముగను ఉన్నది. ఈవ్యక్త మైనయిచ్ఛయే యన్నిటికంటెను గొప్ప యిచ్ఛ.

ఆవిషయమును దెలిసికొన్నవాఁడే యాత్మవేత్త, ఆతఁ డాత్మయొక్కసమస్తవ్యక్త మైనయిచ్ఛలను ఆనిగూఢమైన, యేకమైన, యిచ్ఛ కధీనము గావించును.

శరీరమునందలి నానాయిచ్ఛలు నొక్కదానియం దైక్య

ము జెందినవి, అదియే యారోగ్య మైనయిచ్ఛ. ఆగభీరమయిన యిచ్ఛ శరీరమునందలి వర్తమానేచ్ఛలనెల్ల నతిక్రమించి యనాగతములోనికి వెడలిపోవుచున్నది. శరీరమున కేది భవిష్యత్తో యిప్పు డేది లేదో, యట్టిభవిష్యత్తుపైఁగూడ నాయిచ్ఛ యధికారము చేయుచున్నది.

సంఘశరీరమునందలి నానాయిచ్ఛలును నొకయంతరతమమైన, రహస్యమైన యిచ్ఛయం దైక్యము చెందినవి. అదియే మంగళేచ్ఛ. ఆయిచ్ఛకూడ వర్ధమానసుఖదుఃఖములహద్దు నతిక్రమించి భవిష్యత్తున కభిముఖముగా వెడలిపోవుచున్నది.

ఆత్మయొక్క యంతరతమేచ్ఛ దేశకాలములయం దెక్కడను బంధింపఁబడి యుండదు. దానియొక్క యేయిచ్ఛలు పృథివి యందు సార్థకము లగునో యాయిచ్ఛలయందే దానికి సమాప్తి లేదు. అనంతునితోడ మిళితము కావలయు ననెడు యాకాంక్షయే దానియొక్క జ్ఞానమును, ప్రేమను కర్మములను ఆకర్షించుచున్నది. అది యెక్కడికి పోయి చేరుచున్నదో యక్కడనే యాగుట లేదు. తనవెంటఁ గొనిపోవలయు ననెడు నిచ్ఛయే దానియొక్క యిచ్ఛలన్నిటిలో నిరంతరము మేల్కొని యున్నది.

శరీరమునందలి యారోగ్యమైన శాంతియును, సంఘమునందలి మంగళమును, నాత్మయందలి యద్వితీయుని ప్రేమయును నిచ్ఛారూపముగ విరాజిల్లుచున్నవి. ఈయిచ్ఛ యనంతుని యిచ్ఛ. బ్రహ్మయొక్క యిచ్ఛ. వానియొక్క యిచ్ఛతో మనస్సు చేతనమైనయిచ్ఛను జేర్చుటయే మనకు ముక్తి. ఆయిచ్ఛతోడి యసా

మంజస్యమె మనకు బంధనము; మనకు దుఃఖము. బ్రహ్మయొక్క యేయిచ్ఛ మనయందు కలదో, యది మనలను దేశకాలములవెలు పలకుఁ దీసికొనిపోయెడి యిచ్ఛ. అది వర్తమానసుఖమునందుఁ గాని, స్వార్థమునందుఁ గాని, మనలను బంధింపఁజేయునట్టి యిచ్ఛ కాదు. అయిచ్ఛ యెద్ది యన నీశ్వరప్రేమము. అందుచే నది మన లను దన వైపునకు లాగుచున్నది. మనలోపల నున్నయీయనంత ప్రేమతో మనప్రేమను గలిపివేసి మనయానందమును బాధాము క్తము గావించుటయే మన సాధన. శరీరమునందుఁ గాని, సంఘ మునందుఁ గాని, ఆత్మయందుఁ గాని సర్వత్ర మన మీద్వివిధేచ్ఛ లయొక్కధారలను జూచుచున్నాము. ఒకటి మనకు గోచరమును జిరపరివర్తనశీలమును; మఱియొకటి మన కగోచరమును శాశ్వత మును. ఒకటి కేవలవర్తమానము వైపున కాకర్షింపఁబడునదియు మఱియొకటి యనాగతము వైపున కాకర్షింపఁబడునదియు; ఒకటి కేవలవ్యక్తివిశేషమునందే బంధింపఁబడి యుండును. మఱియొకటి సమస్తముతోడను యోగయుక్తమై యుండును. ఈరెండు యిచ్ఛ లయొక్కగమనమును దర్శింపుము. వానితాత్పర్యమును గ్రహింపు ము. ఈరెంటికినిమధ్య మిళితము కాఁగల యొకతత్త్వ మున్నది. దానిని నిరోధించుటవలననే మనము వేఱగుచున్నాము. ఆసంగతిని గ్రహించి మిళిత మగుటకొఱకే నీవు సమస్తజీవనమును బ్రతిది నము సిద్ధము చేయుము.

---

# తపోవనము 32.

ఆధునికసభ్యతాలక్ష్మి కూర్చున్నపద్మ మిటుకలతో కఱ్ఱలతో నిర్మింపఁబడినది. అది పట్టణము. ఔన్నత్యప్రధానుఁడు మధ్యగగనమున కరుదెంచినకొలఁది దానిరేకు లన్నియు నొక్కొక్కటిగా విడువడి క్రమముగా నలువైపుల వెదజల్లఁబడును. ఇటుక సున్నముల జయధ్వజమును వసుంధర యెచ్చటను నిలిపి యుంచలేకున్నది.

ఈపట్టణమందే మనుజుఁడు విద్య నార్జించుచున్నాఁడు, విద్య నుపయోగించుచున్నాఁడు, ధనమును గూడఁబెట్టుచున్నాఁడు, ధనమును వ్యయ మొనర్చుచున్నాఁడు, నలుమైపులనుండి తనను శక్తిసంపదలతో నింపుకొనుచున్నాఁడు. ఈసభ్యతయం దన్నిటికంటె శ్రేష్ఠమయిన పదార్థము నగరమునకుఁ జెందిన సామగ్రియై యున్నది.

ఇంతకంటె వేఱుగా గ్రహించుట మిక్కిలి కష్టతరమయినది. అనేకమానవు లేకమయినచోట బుద్ధికిఁ దగులు దెబ్బలచేత చిత్తము మేల్కొనును. నలుమైపులనుండి వచ్చిపడుచున్న దెబ్బలవలనఁ బ్రతివ్యక్తియొక్క శక్తియును గతిని పొందుచుండును. ఈ విధముగాఁ జిత్తసముద్రము చిల్కఁబడుచుండినకొలఁది మానవుని అంతర్నిహితసారపదార్థము తనంతట తానే ఉప్పొంగుచుండును.

మానవునిశక్తి మేల్కొనినపొలఁది దానిని ప్రయోగింపఁ జేసి ఫలింపఁజేయు క్షేత్రమును వెదకుచుండును. ఆక్షేత్ర మెచ్చటఁ గలదు ? అనేకమానవుల యనేకవిధములయిన యుద్యమముల నానావిధములయిన సృష్టికార్యములందు సర్వదా సజాగ్రతమై యున్నస్థానమే ఆక్షేత్రము; ఆక్షేత్రమే పట్టణము.

ప్రథమమున మానవుఁడు మిక్కిలి దగ్గఱదగ్గఱగా నిండ్లు కట్టి పట్టణము సృష్టించును. అది సభ్యతయొక్క ఆకర్షణవలనఁ గాదు. అనేకచోట్ల శత్రుపక్షముయొక్క ఆక్రమణమునుండి ఆత్మ రక్షణార్థమయి యేదియో యొకసురక్షితస్థానమున మానవు లేకమై యుండుట కావశ్యకతను గ్రహింతురు. కాని యేకారణమువలన నైననేమి ఒక్కచోఁ గూడుట కవకాశము దొరకినంతనే నానా లోకులయావశ్యకత యుండును. బుద్ధి ఒకవిధ మగుకళేబరాకా రమును దాల్చును. అచ్చటనే సభ్యతయొక్క అభివ్యక్తి తనంతట నదియే వ్యక్తమగుచుండును.

కాని భారతదేశమునం దొక ఆశ్చర్యకర మగువిషయము కాన్పించును. ఇచ్చట సభ్యతకు మూలప్రస్రవణము పట్టణమందుఁ గాదు, వనమునందు. భారతదేశమందుఁ బ్రథమమున నాశ్చర్యకర మగువికాసము గలిగినచోట మానవు లొకరొకరు కలిసికొని పోయి పిండమువలెఁ దయారు కాలేదు. అచ్చట చెట్లు చేమలు నదులు సరోవరములు మానవునితో నేకమయి యుండుట కెక్కువయవకాశము కలిగియుండెను. అచ్చట మానవు లుండిరి. అచ్చట వైశాల్యముకూడ నుండెను. ఒకరి కొకరికి ఎట్టిసంఘర్షణ మునుండలేదు. అయిన నీవైశాల్యమువలన భారతవర్షపుచిత్తమును

జడప్రాయముగ నౌనర్పక దానిచైతన్యము నింక నుజ్జ్వలముగఁ గావింపఁబడెను. లోకమునం దెచ్చటనయిన నిట్టిఘటనలు ఘటించినట్లు గాన్పింపవు.

స్థితిగతులనుబట్టి వనములలో నాబద్ధమయిన మానవులు వనస్వభావముఁ బొందినటుల మనము గాంచియున్నారము. వారలు పులులవలె భయంకరముగనో, హరిణములవలె నమాయకులుగనో యుందురు.

అరణ్యముయొక్క నిర్జనత మానవబుద్ధి నభిభూతము చేయక దాని కొకమహాశక్తిని ప్రసాదించినటులను, ఆయరణ్యావాసముచేఁ గలిగిన సభ్యతవలన సమస్తభారతదేశమును నభిషిక్తము చేసినటులను, నేఁటివఱకు దానిప్రవాహ మాగిపోనటులను మనము ప్రాచీనభారతవర్షమునందుఁ గాంతుము.

ఈవిధమున నారణ్యకుల సాధననుండి భారతవర్షమునకు లభించినశక్తి (Energy) బాహ్యాసంఘాతములవలనఁ గాదు. నానావిధములయిన ప్రయోజనముల ప్రతిద్వంద్వము వలనను గాదు. అందుచేఁ బ్రధానముగా నది బహిరభిముఖిగా నుండలేకపోయెను. అది ధ్యానమువలన విశ్వముయొక్క గభీరత్వమునందుఁ బ్రవేశించెను. నిఖిలముతో నాత్మయోగము స్థాపించుకొనెను. అందుచే నైశ్వర్యోపకరణములవలననే భారతవర్షము తనసత్యపరిచయమును బ్రకటింపలేదు. ఈసభ్యతకు ప్రథమపథప్రదర్శకులు నిర్జనవాసులు; స్వార్థత్యాగు లగుతపస్సంపన్నులు.

సముద్రతీర మేజాతిని పాలించెనో వారి కది వాణిజ్యసంపద

నొసఁగినది; మరుప్రదేశ మల్పసస్యదానముచే క్షుధార్తులనుగాఁ జేసియుంచఁబడినవారు దిగ్విజయ మందిరి. ఇట్లొక్కొక్కవిశేష యవకాశమువలన మానవునిశక్తి ఒక్కొక్కవిశేషమార్గమును బొందఁగలిగెను.

సమతలముగా నున్న ఆర్యావర్తారణ్యభూమియు భారతదేశ మున కొకవిశేష సుయోగము నొసఁగియుండెను. భారతదేశము తనబుద్ధిని జగత్తునం దంతరతమరహస్యలోకమును గనుఁగొనఁ బంపియుండెను.ఆమహాసముద్రతీరమందుఁగల నానావిధములయిన సుదూరద్వీపద్వీపాంతరములనుండి యది సంగ్రహించి తెచ్చిన సమస్తసంపదవలన మానవుని కెల్లపుడును బ్రయోజన ముండు నని యంగీకరింపవలసినదే. ఏయోషధివనస్పతులలోఁ బ్రకృతి యొక్క ప్రాణక్రియలు రాత్రింబవళ్ళను సకలఋతువులయందును బ్రత్యక్షగోచరమగుచుండునో ప్రాణలీలలు నానాయపరూపభంగు లచే, ధ్వనులచే, రూపవైచిత్ర్యములచే నిరంతరము నూతననూతన భావములతోఁ బ్రకాశించుచుండునో దానియందు ధ్యానపరాయణ చిత్తముతో నున్నవారు తమనలువైపుల నొకయానందమయరహ స్యమును సుస్పష్టముగా నుపలబ్ధిఁ జేసికొనఁగలిగిరి. అందుచే వా రింతసహజముగా నుడువఁగలిగిరి——"యదిదం కించ జగత్సర్వం ప్రాణ ఏజతి నిఃసృతం" ఈసమస్తము పరమప్రాణమునుండి నిఃసృతమయి యాప్రాణమునందే కంపించుచున్నది. వారు స్వర చితములగు ఇటుకలు, కఱ్ఱలు, ఇనుముతో నిర్మితమయిన పంజర మునం దుండలేదు——వారు వసించు స్థానమందు విశ్వవ్యాప్తమగు

విరాట్ జీవితమునకును తమజీవితమునకును నవారితయోగ ముండెను. ఈవనము వారలకు నీడనిచ్చినది, ఫలపుష్పముల నొసంగినది. కుశసమితుల నందించినది. వారి దైనికసకలకర్మములకును అవకాశములకును, ప్రయోజనములకును, యావనమునందు జరుగు ఆదానప్రదానములకును జీవనమయమయిన సంబంధ ముండెను. ఈయుపాయము నవలంబించియే తమజీవితములను తమనలువైపుల నున్న గొప్పజీవితముతో నేకముచేసి గ్రహింపఁగలిగిరి. నాల్గువైపులను వారు శూన్యముగను నిర్జీవముగను, భిన్నముగను గ్రహింపలేదు. విశ్వప్రకృతిద్వారమున వెలుతురు, గాలి, అన్నము, నీరు మొదలయిన సకలదానములను వారు స్వీకరించిరి. ఆదానములు భూమికిఁ జెందినవి కావు, చెట్లకుఁ జెందినవి గావు. శూన్యాకాశమునకుఁ జెందినవియుఁ గావు. ఒకచేతనామయమగునదనంతానందమునందే వానిమూలప్రస్రవణ మున్నటుల వారు సహజమగు ననుభవముద్వారా గ్రహింపఁగలిగిరి—అందుచేతనే వారు నిశ్వాసమును, అన్నమును, వెలుతురును, నీటిని మొదలగువానినన్నిటిని శ్రద్ధాభక్తులతో స్వీకరింపఁగలిగిరి. అందుచేతనే నిఖిలచరాచరమును ప్రాణములతో, చైతన్యముతో, హృదయముతో, జ్ఞానముతో, తనయాత్మకు నాత్మీయునిగా నేకము చేసి పొందుటయే భారతవర్షమునుండి యథార్థమైనలాభమును పొందుట.

దీనివలననే వనము భారతదేశచిత్తమును తననిర్జనచ్ఛాయయందును నిగూఢప్రాణమునందును యెట్లు పాలించినదియు తెలియనగును. భారతదేశమందు వైదిక యుగ మనియు బౌద్ధ యుగ

మనియు రెండు గొప్పప్రాచీనయుగములు గతించినవి. ఆయుగములరెంటిని వనము రాత్రిరూపమున ధరించియుండెను. కేవలము వైదికఋషులే గాక, భగవానుఁడగు బుద్ధుఁడుగూడ నెన్నియో యామ్రవనములందును, వేణువనములందును దనయుపదేశామృతమును వర్షింపఁజేసియుండెను. రాజప్రాసాదమునం దాయనకు స్థానము చాలలేదు—వనమే ఆయనను వక్షమం దిడుకొనెను.

క్రమముగా భారతవర్షమునందు రాజ్యసామ్రాజ్యములు, గ్రామనగరములు స్థాపితము లయినవి. దేశవిదేశములతో పణ్యద్రవ్యముల ఆదానప్రదానములు జరిగినవి—అన్నలోలుపములగు కృషిక్షేత్రములు స్వల్పముగా ఛాయానిభృతారణ్యములను దూరదూరమునకుఁ ద్రోచివేసెను—కాని ప్రతాపశాలినియై, యైశ్వర్యపూర్ణయై, యౌవనదృప్తమైయున్న భారతవర్షము వనమునొద్ద తాను ఋణగ్రస్తమై యున్నవిషయము నంగీకరింప నెప్పుడును వెనుదీయ లేదు. అన్నిప్రయాసలకంటెఁ దపస్సునకే యది యెక్కువ గౌరవ మొసఁగినది. వనవాసులగు పురాతనతాపసులనే తమ ఆదిపురుషులనుగా గ్రహించి భారతదేశపు రాజులును మహారాజులు నంద ఱును గౌరవము ననుభవించిరి. భారతదేశపు పురాణవాక్యములందు మహత్తరమయినది ఆశ్చర్యకరమయినది పవిత్రమయినది శ్రేష్ఠమయినది పూజ్యమయినదియు నగు నేదియున్నను అది యంతయు నాప్రాచీనతపోవనములో మిశితమయి యున్నదే. గొప్పగొప్ప రాజులరాజత్వమును గుఱించి యది జ్ఞాపక ముంచుకొన ప్రయత్నింపలేదు. కాని నానావిధములయిన విప్లవములమధ్యఁగూడ వన

ముయొక్క సామగ్రినే తనప్రాణసామగ్రిగా నెంచి నేఁటివఱకు నవలంబించి యున్నది. మానవేతిహాసమునందు యిదియే భారత వర్షపువిశేషత్వము.

భారతవర్షమున విక్రమాదిత్యుఁడు రాజై ఉజ్జయినిమహానగరమై కాళిదాసు మహాకవియై యున్నకాలము తపోవనయుగముగాఁ బరిగణింపఁబడెను. అపుడు మనము మానవమహాతీర్థస్థానమునకు వచ్చి నిలిచితిమి. అపుడు చీన, హూణ, శక, పారసీక, గ్రీక్, రోమన్ జాతులవా రందఱు మన నలువైపుల మూఁగియుండిరి. అపుడు జనకునివంటి రా జొకవైపున స్వహస్తమున నాఁగలిఁ బూని భూమిని దున్నెను. మ ఱొకవైపున దేశదేశాంతరములనుండి యేతెంచిన జ్ఞానపిపాసువులకు బ్రహ్మజ్ఞానమును బోధించెను. కాని అప్పటి యైశ్వర్యమదగర్వితయుగమందును ఆకాలపు కవిశ్రేష్ఠుఁడు తపోవనమువిషయమై యెట్లు నుడివియుండెనో యావిషయముఁ జూచినంతనే, తపోవనము మనదృష్టి కగోచరయియున్నపుడు గూడ మనహృదయముల నెంతయాక్రమించుకొని యున్నదో గ్రహింపనగును.

కాళిదాసు విశేషముగా భారతదేశపుకవి యని గ్రహించుట కాతని తపోవనచిత్రమునుండియే ప్రమాణము పొందనగును. ఇట్టి పరిపూర్ణానందముతోఁ దపోవనధ్యానమును మఱెవరు మూర్తీభవింపఁజేయఁగలిగిరి.

రఘువంశకావ్యముయొక్క యవనిక యుద్ఘాటిత మైనంతనే

ప్రథమముననే తపోవనముయొక్క శాంతసుందరపవిత్రదృశ్యము మననేత్రములసమక్షమునఁ బ్రకాశితమగును.

వనవనాంతరములనుండి కుశసమిత్తులును, ఫలమూలము లను సంగ్రహించి తాపసు లావనమున కేతెంచుచున్నారు. ఒక అదృశ్యాగ్ని వారల ననుసరించుచున్నట్లుండెను. అచ్చట హరిణ ములు ఋషిపత్నులకు సంతానమువలె నుండెను. అవి నీవారధాన్య మును బొందుచుండెను. నిస్సంకోచముగాఁ గుటీరద్వారములకడఁ బడియుండును. మునికన్యలు చెట్లకు నీరు పోయుచుందురు. ఆల వాలములు జలముతో నిండినవెంటనే వారు తొలఁగిపోవుచుం దురు. పక్షులు నిర్భయముగా నాలవాలముల నీటిని ద్రావుటకు వచ్చు ననియే వారియుద్దేశము. ఎండవేడిమి తగ్గినవెంటనే నీవార ధాన్యములు కుటీరప్రాంగణమున రాశీకృతము చేయఁబడును; అచ్చటికి హరిణము లేతెంచి నెమరు వేయుచుండును. ఆహుతుల సుగంధధూమము గాలికి ప్రవహించి వచ్చి ఆశ్రమోన్ముఖులగు నతిథుల సర్వశరీరములను పవిత్రము గావించును.

తరులతలు పశుపక్షులు మొదలగువాని యన్నిటితోను మాన వుని మేళనమునకుఁ బూర్ణత్వము చేకూరుచున్న దను విషయమే దీని యంతర్నిహితభావము.

సమస్త అభిజ్ఞానశాకుంతలనాటకమునందు భోగలాలసా సమన్వితరాజప్రాసాదమును ధిక్కరించి విరాజిల్లుచున్న తపోవన ముయొక్క మూలస్వరముకూడ నదియే. చేతనాచేతన వస్తువు

లన్నిటితోను మానవుఁ డాత్మీయసంబంధముఁ గలిగియుండుట మి క్కిలి పవిత్రమైనది; మాధుర్యమైనది.

కాదంబరియందుఁ దపోవనవర్ణనలోఁ గవి యిటుల వ్రాసి యుండెను—అచ్చట గాలికి లతలన్నియు శిరములను నతమొన ర్చుకొని ప్రణమిల్లుచున్నవి. వృక్షములు పుష్పములను వెదజల్లి పూజ లొనర్చుచున్నవి. కుటీరాంగణమందు ధాన్యము లెండఁబో యఁబడినవి; అచ్చట ఆమలకలవలీలవంగకదళీబదరీ మొదలగు ఫలములు సంగ్రహింపఁబడినవి—బ్రహ్మచారుల యధ్యయనధ్వ నులచే వనభూమి ముఖరిత మగుచున్నది. వాచాలశుకము లనవ రతశ్రవణముచే నభ్యాసపఱుచుకొన్న నాహుతిమంత్రముల నుచ్చ రించుచుండును; అరణ్యకుక్కుటములు వైశ్యదేవున కర్పించిన బలిపిండముల నారగించుచున్నవి; సమీపజలాశయమునుండి కల హంసశాబకము లేతెంచి నీవారములను దినుచున్నవి; హరిణములు జిహ్వాపల్లవములతో మునిబాలకులను నాకుచున్నవి.

దీనియం దంతర్గతమైయున్న విషయముకూడ నదియే. తరు లతలతోను, జీవజంతువులతోను మానవునికిఁ గలవిచ్ఛేదమును తొలఁగించి తపోవనము ప్రకాశించుచున్నది: ఈప్రాచీనవిషయమే మనదేశమం దెల్లపుడును బ్రచలితమయి యున్నది.

కేవలము తపోవనచిత్రమునందే యీభావము ప్రకటిత మయి యుండలేదు. మానవునికిని విశ్వప్రకృతికినిగల సమ్మేళన మును గుఱించియే మనదేశపు సమస్తప్రసిద్ధకావ్యములందును పరి స్ఫుటమై యున్నయవి. మానవచరిత్ర నాశ్రయించి వ్యక్తమగు ఘట

నలు ప్రధానముగా నాటకముయొక్క యుపాదానములు; అందుచే నన్యదేశీయుల సాహిత్యమునందు విశ్వప్రకృతి నాటకమునందు సూచింపఁబడునే గాని దానియందుఁ బ్రకృతికి నెక్కువప్రాము ఖ్యస్థాన మొసఁగఁబడియుండినటులఁ గాంచము. మనదేశమందు నేఁటి వఱకు ఖ్యాతిని బొందుచున్న ప్రాచీననాటకములందుఁ బ్రకృతి కూడఁ బనభాగమునుండి పంచితము గానటులఁ గాంతుము.

మానవుని నలుపైపులఁ జుట్టియున్న జగత్ప్రకృతి యత్యంత మాంతరంగికముగా మానవుని సకల చింతనములతోను, సకల కర్మములతోను కలసిమెలసి యున్నది. మానవుని లోకాలయము కేవలము మానవ మయమయి యుండి దాని సందుసందులలోఁ బ్రకృతికిఁ బ్రవేశాధికారము లేకుండినయెడల మనచింతనములు, కర్మలు క్రమముగఁ గలుషితములయి, వ్యాధిగ్రస్తములయి తమ లోఁతగు పెరటి గోతులయందు నాత్మహత్య గావించుకొనును. ప్రకృతి మనకొఱ కహోరాత్రములు పనిచేయుచుఁ దా నేమియు నెఱుఁగనటుల నిశ్శబ్దముగా నున్నది; మనమే సమస్తమును నిర్వహించుచున్నటులను, పాప మది యేమియు నెఱుఁగని మూఢురాలనియు మనము తలంచుచుందుము; కాని ఇట్టి ప్రకృతిని మనదేశపు కవీశ్వరులు చక్కఁగా గ్రహించిరి. ఈప్రకృతి మానవుని సమస్త సుఖదుఃఖములయందును ననంతుని స్వరమును మేళవించి యున్నది; ఆస్వరమునే మనదేశమందుఁ బ్రాచీనకవీశ్వరు లెల్లపుడు తమకావ్యములలో బ్రయోగించి యుంచినారు.

ఋతుసంహారము కాళిదాసుని చిన్ననాఁటి కావ్య మనుటకు

సందేహములేదు. దీనియందున్న యువతీయువకుల మేళనసంగీతపుస్వరములు చాల సత్యముయొక్క నిమ్నసప్తకమునుండియే యారంభమయినవి. శకుంతలాకుమారసంభవములవలెఁ దపస్సుయొక్క యుచ్చతమసప్తకమునకుఁ బోలేదు.

కాని కవి నవయౌవనముయొక్క యీలాలసత్వమును ప్రకృతియొక్క విచిత్రవిరాట్‌స్వరములతో మేళవించి ముక్తాకాశమధ్యమున మాఱుమ్రోయించెను. నిదాఘదినాంతమం దావిర్భవించు చంద్రకిరణము లాలాసత్త్వమందు తమ స్వరములను మేళవించినవి. వర్షాకాలపు నవజలాభిషేకముచే శీతలమయ మగు వనములలో నచలితకదంబవృక్షశాఖలు దీనిఛందస్సువలననే నాందోళితమగుచున్నవి; ఆపక్వశాలియగు శారదలక్ష్మి తనహంసరవనూపురధ్వనులను దీనితాళతాళములందును సరిగా మంద్రితము గావించినది; వసంతకాలపు దక్షిణవాయుసంచలనములును కుసుమితామ్రశాఖల కలకలశబ్దములును దీనిలయవలననే వ్యాప్తము లగుచున్నవి.

విరాడ్‌రూపము దాల్చిన ప్రకృతియందు దేనికెచ్చట సహజస్థానముగలదో దాని నచ్చటనే యుంచినయెడల దాని కత్యుగ్రత యుండదు. ఆస్థానమునుండి దానిని విచ్ఛిన్నము చేసి కేవలము మానవుఁ డేర్పఱచిన ప్రాకారమునందు సంకుచితపఱచి చూచినయెడల వ్యాధివలె నది మిగుల వేఁడిగను, రక్తవర్ణముగను గాన్పించును. షేక్‌స్పియర్‌యొక్క ఒకటి రెండు ఖండకావ్యములలో నరనారీమణుల యాసక్తి నిగుఱించి వర్ణింపఁ బడినది—కాని యా

కావ్యములలో నాసక్తియే యేకాంతమయినది. దానికి నలువైపుల నింక దేనికిని స్థానము లేదు. ఆకాశము లేదు, గాలి లేదు, ప్రకృతియొక్క గీతగంధవర్ణవిచిత్రముల విశాలావరణములచే విశ్వలజ్జ రక్షింపఁబడిన దనుదానితో నెట్టిసంపర్కమును లేదు. అందుచే నాసకలకావ్యములలోఁ బ్రవృత్తుల యున్మత్తతయే యత్యంత దుస్సహముగాఁ బ్రకాశించుచున్నది.

కుమారసంభవమునందుఁ దృతీయసర్గమందు మదనుని యాకస్మికావిర్భావముచే యౌవనచాంచల్యముయొక్క యుద్దీపనము వర్ణింపఁబడినది. అచ్చట కాళిదాసు నున్మత్తత నొకక్షుద్రమగురీతిని వర్ణింపఁ బ్రయత్నింపలేదు. సూర్యకాంతమణియొక్క సంబంధమువలన సూర్యకిరణము లన్నియు సంహితములై పడినచోట నగ్ని జ్వలించును. కాని ఆసూర్యకిరణము లన్నియు నాకాశమునం దంతటను వ్యాప్తమగునపుడు వేఁడి నిచ్చును గాని దగ్ధము చేయలేవు. కాళిదాసు వసంతప్రకృతియొక్క సర్వవ్యాపకములగు యౌవనలీలలయందు హరపార్వతుల మేళనచాంచల్యమును నివిష్టముచేసి దానిగౌరవమును గాపాడఁగలిగెను.

కాళిదాసు పుష్పధనుస్సుల నిర్ఘోషమును విశ్వసంగీతస్వరములనుండి విచ్ఛిన్నముచేసి గాని యపస్వరములతో యుక్తముచేసిగాని ప్రయోగింపలేదు. ఏయవనికపై నాయన తన బొమ్మలను జిత్రించెనో అది తరులతాపశుపక్ష్యాదులతో నేకముచేయఁబడి సమస్తాకాశమునందు నతివిచిత్రవర్ణనలతో విస్తారితమై యుండెను.

కేవలము తృతీయసర్గమే కాక కుమారసంభవమహాకావ్య

మంతయు నొకవిశ్వవ్యాప్తమగు యవనికమీఁదఁ జిత్రింపఁబడి నది. ఈకావ్యమునం దంతర్గతమగు విషయము మిక్కిలి గభీరమును జిరంతనమును నై యున్నది. ఏపాపదానవశక్తి ప్రబలాకారముఁ దాల్చి యువ్వెత్తుగ స్వర్గమును ధ్వస్తముచేయఁ బూనునో దానిని నశింపఁజేయుఁటకుఁ దగిన వీరత్వము నేదియో విధమున సంభవింపఁ జేయవలయును.

ఈసమస్య చిరకాలమునుండియు మానవులయందు కానిపించుచున్నది. ప్రతిమానవజీవితముయొక్క సమస్యయు నిదియే. ఈసమస్యయే సకలజాతులయందును నూతనాకారములతోఁ దనను బ్రకటించుకొనుచున్నది.

కాళిదాసునికాలమందుఁ గూడ నీసమస్య భారతవర్షమం దత్యంతోగ్రరూపముఁ దాల్చి కాన్పించెను. అది యీకవీశ్వరుని కావ్యములు చదివినంతనే స్పష్టముగ నందఱకును గోచరించును. ప్రాచీనకాలహిందూసంఘజీవనయాత్రయందు నొకవిధమగు సరళత్వమును నిగ్రహమును నుండెను. అవి క్రమముగ శైథిల్యము పొందుచుండెను. రాజు లపుడు రాజధర్మమును మఱచి యాత్మసుఖపరాయణులును విలాసపరాయణులును నయి యుండిరి. అపుడు శకరాజుల యాక్రమణమువలన భారతవర్షము మిక్కిలి దుర్గతికిఁ బాల్పడి యుండెను.

అపుడు బాహ్యమునుండి చూచిన భోగవిలాసాయోజనముల యందును కావ్యసంగీతశిల్పకళల యాలోచనములందును భారతవర్షము సభ్యతయం దౌన్నత్యమును బొంది యుండెను. కాళిదాసుని

కావ్యకళలయందును నుపకరణ బహుళ సంభోగముల స్వరము ప్రయోగియుండెను. సత్యముగ నాతని కావ్యముల బాహ్యాంశము లాకాలపుచిత్రములతో నిండి యుండెను. ఈవిధముగ నాకాల ముతో నప్పటికవీశ్వరులకు యోగ ముండినటులు మనము గాంచు చున్నాము.

కాని యీప్రమోదభవనస్వర్ణఖచితాంతఃపురమునఁ గూ ర్చుండి వైరాగ్యవికలచిత్తముతోఁ గావ్యలక్ష్మి దేనిని ధ్యానించు చుండెను? దానిహృదయ మిచ్చుట లేదు. ఆకావ్యలక్ష్మి యీయై శ్వర్యకరమగు చిత్రవిచిత్రమాణిక్యకారాగారమునుండి ముక్తిని బొందఁగోరుచుండెను.

కాళిదాసుని కావ్యములయందు బాహ్యముతో నంతరము నకును నవస్థలతో నాకాంక్షలకును నొకద్వంద్వము కలదు. భారత వర్షమునందుఁ దపోయుగ మతీతము కాఁగానే యైశ్వర్యశాలియగు రాజసింహాసనముప్రక్కన కవి యానిర్మలసుదూరకాలమువైపునకు వేదనాతురదృష్టితోఁ జూచుచుండెను.

రఘువంశకావ్యమునందుఁ గాళిదాసు భారతవర్షీయ పురాతన కాలికసూర్యవంశ్యరాజులచరిత్రము గానముచేయుటయందుఁ బ్రవృ త్తుఁ డయ్యెను. దానియందు నాయావేదన నిగూఢముగా నుం డెను. దానికిఁ బ్రమాణముఁ జూడుఁడు.

మనదేశము కావ్యములలోఁ బరిణామము నశుభముగాఁ జూపించుట యాచారము గాదు. సత్యముగా రామచంద్రుని జీవి తమునందు రఘువంశకావ్య ముచ్చతరశిఖరమునకు నధిరోహణ

ము( గావించినతోడనే యాకావ్యము ముగింప(బడినయెడల కవి యొక్క భూమికలోని వాక్యములు సార్థకములై యుండును.

ఆత(డు భూమికయం దిట్లు చెప్పెను:—జన్మకాలమునుండి పరిశుద్ధులును, ఫలోదయమగువఱకు కర్మముల( జేయువారును, సముద్రాంతమువఱకు భూమి నేలువారును, స్వర్గములోనికిని రథ మార్గముగలవారును, యథావిధిగా నగ్నియం దాహుతులు వ్రేల్చు వారును, యాచకులకోర్కెలు తీరునట్లు దానములు సేయువారును, తప్పునకు నుచితమగు శిక్షలనే విధించువారును, ఉచితకాలమునందే మేల్కాంచువారును, త్యాగమునకే ధన మార్జించువారును, సత్యముకొఱకు మితముగ మాటలాడువారును, కీర్తికొఱకు జయించు వారును, సంతానముకొఱకు గార్హస్థ్యము నాశ్రయించువారును, బా ల్యమునందు విద్య నభ్యసించువారును, యౌవనమున విషయముల నుపభోగించువారును, వార్ధక్యమున మునివృత్తుల నవలంబించు వారును, మరణకాలమున యోగముచేత శరీరము విడుచువారును నగు రఘువంశరాజులచరిత్రము నన్ను వారిని కీర్తింపుమని ప్రేరిం చుటచేత వాక్సంపదయందు దరిద్రుడ నైన నే నీకావ్యరచనకు సాహసించితిని.

కాని ఈకావ్యము వారిగుణకీర్తనమునందే యంతము నొం దలేదు. కవి నెయ్యది కావ్యరచనాచంచలునిగా( జేసెనో యయ్యది యీకావ్యపరిణామమును జూచినంతనే గ్రహింపనగును.

రఘువంశ మెవ్వని నామమున విలసిల్లెనో నాతనిచరిత్ర మెట్టిది ? దాని యారంభ మెక్కడ ?

తపోవనమునందు దిలీపదంపతుల తపస్సువలననే యిట్టి రాజు జన్మించెను.

కఠినతపస్సువలనఁ గాక యిట్టి మహాఫలలాభమునకు నవకాశము లేదని కాళిదాసు తన మహారాజులయొద్ద నానావిధకావ్యకౌశలమువలనఁ జెప్పి యుండెను. ఏరఘురాజు చతుస్సముద్రమధ్యమం దుండు సమస్తరాజులను దనవీర్యతేజములఁ బరాభవించి పృథివియం దంతట నేకచ్ఛత్రాధిపత్యమును విస్తరింపఁ జేసెనో యాతఁడు తన తలిదండ్రులకుఁ దపస్సాధనధనము. ఏభరతుఁడు వీర్యముచేత చక్రవర్తియయి భారతవర్షమును దననామధేయముచేత ధన్యము చేసెనో యాతనిజన్మఘటనమునందు నవారితములగు ప్రవృత్తులకళంకమును కవి తపోగ్నివలన దగ్ధము చేయకయు దుఃఖాశ్రువులచే సంపూర్ణముగ ధౌతము చేయకయు విడువలేదు.

రఘువంశ మారంభమగుట రాజోచితైశ్వర్యగౌరవముల వర్ణనలయందుఁ గాదు. సుదక్షిణాదేవిని వామభాగమునం దిడికొని దిలీపుఁడు తపోవనమందుఁ బ్రవేశించెను. చతుస్సముద్రపరిఖావృత పృథివికి నేకచ్ఛత్రాధిపత్యము వహించిన సమ్రాట్టు కఠోరనిగ్రహముతోడను నవిచలితనిష్ఠతోడను దపోవనధేనువుయొక్క సేవయందు నియుక్తుఁ డయ్యెను.

నిగ్రహమందును దపస్సునందును దపోవనమందును, రఘువంశ మారంభమై భోగవిలాసములందును, విషయలోలత్వమునందును, బ్రమోదభవనమునందు నుపసంహార మొనరింపఁబడెను.

ఈయంత్యసర్గమందుఁ జిత్రింపఁబడిన వర్ణనలయం దత్యంతోజ్జ్వ లన ముండెను. కాని, లోకాలయమును దగ్ధముచేసి సర్వనాశ మొన ర్చు నగ్నియుఁ దక్షువ యుజ్జ్వలమైనది కాదు. ఒకపత్నితో దిలీపుని తపోవనవాసము శాంతమైనట్టియు ననాడంబర మైనట్టియు వర్ణన లతో నంకితమైయుండెను. మఱియు బహునాయికలతో నగ్నివర్ణ ముయొక్క యాత్మఘాతసాధన యనావశ్యకబాహుళ్యములతోను నుజ్జ్వలచిత్రములతోను వర్ణింపఁబడినట్లుండెను.

ప్రభాత మెట్లు ప్రశాంత మైనదో, పింగళజటాధారులగు ఋషిబాలకులవలెఁ బవిత్రమైనదో, యుషస్స్నేటుల ముక్తపాండుర సౌమ్యాలోకముతో శిశిరస్నిగ్ధపృథివిపై మందగమనమున నవ తరించునో, మఱియు నవజీవనాభ్యుదయవార్తతో జగత్తు నుద్బో ధితము గావించునో, కవియొక్కకావ్యమును దపస్సుద్వారమున సుసమాహితరాజమాహాత్మ్యము నట్లే స్నిగ్ధతేజముతో, నిగ్రహ వాక్కులతో మహోదయశాలియగు రఘువంశమునుగూర్చి సూచిం పఁబడెను. మఱియు నానావర్ణవిచిత్ర మేఘజాలములం దావిష్ట మగు నపరాహ్ణము తనయద్భుతకిరణావళులతోఁ బశ్చిమాకాశము నెటుల క్షణకాలము ప్రగల్భపఱచి చూచుచుండఁగనే క్షీణమై దాని సమస్తమహిమ నపహరించునో, తుద కనతికాలమందే వాక్యకర్మ హీనాచేతనాంధకారమం దంతయు విలుప్తమై పోవునో, యటులనే కవి తనకావ్యమునం దంత్యసర్గమున విచిత్రభోగాయోజనముల విభీ షణవైభవములందు రఘువంశజ్యోతియొక్క నిర్వాణమునుగూర్చి వర్ణించెను.

కావ్యముయొక్క యీయారంభాంత్యములందుఁ గవీశ్వరుని యాంతరంగికవిషయ మొకటి ప్రచ్ఛన్నమై యున్నది. ఆయన దీర్ఘనిశ్వాసముతో నెటు లుండెను ! ఎటు లాయెను ! ఆకాలమున నెదుట నభ్యుదయము గాన్పించుచున్నపుడు తపస్సే యన్నిటి కన్నఁ బ్రధానైశ్వర్యమై యుండెను. మఱి యిక్కాలమున సమ్ముఖమున వినాశము పొడకట్టుచున్నపుడు విలాసోపకరణరాసుల కంతము లేదు. భోగముల నతృప్తాగ్ని సహస్రశిఖలతో జ్వలించి నలువైపుల మిఱుమిట్లు గొలుపుచున్నది.

కాళిదాసుని యధికకావ్యములలో నీద్వంద్వభావములు సుస్పష్టముగఁ గాన్పించును. ఈ ద్వంద్వములకు సమాధానము కుమారసంభవమునందుఁ జూపింపఁ బడినది. కవి యీకావ్యమునందుఁ ద్యాగముతో నైశ్వర్యమునకును, దపస్సుతోఁ బ్రేమకును సమ్మేళనము కలుగుటవలననే శౌర్య ముద్భవించుననియు, నా శౌర్యమువలననే మానవుఁడు సకలపరాభవములనుండి యుద్ధరింపఁ బడు ననియు నుడివి యుండెను.

అనఁగా, త్యాగభోగముల సామంజస్యము వలననే పూర్ణశక్తి కలుగును. త్యాగియగు శివుఁ డేకాకిగా సమాధినిమగ్నుఁడై యున్నపుడు స్వర్గరాజ్య మసహాయమై యుండెను. మరల సతి తన పితృభవనముయొక్క యైశ్వర్యమునం దేకాకినిగా నాబద్ధయై యున్నపుడు దైత్యోపద్రవము ప్రబలమై యుండెను.

ప్రవృత్తులు ప్రబలము లైనపుడే త్యాగభోగముల సామంజస్యము చెడిపోవును. మన మేదో యొకక్షుద్రస్థానమందు మన య

హంకారమునో, వాసనలనో ఘనీభూత మొనర్చినపుడు మనము సమగ్రమునకు నష్టము కలిగించి యంశమునే పెద్దదిగా నొనర్పఁ జూతుము. దీనివలననే యమంగళ ముత్పన్నమగును. అంశము పై నాసక్తి కతన సమగ్రమునకు విరుద్ధముగా విద్రోహము సలుపుటయే పాపము.

ఇందువలననే త్యాగ మవసరము. ఈత్యాగము తనను రిక్తము చేయుటకుఁగాక తనను బూర్ణము గావించుటకే యై యున్నది. త్యాగమనఁగా, నంశమును ద్యజించుట సమగ్రముకొఱకు, క్షణికమును వీడుట నిత్యముకొఱకు, అహంకారమును పోఁద్రోలుట ప్రేమకొఱకు, సుఖమును దూరముచేయుట ఆనందముకొఱకు. అందువలననే యుపనిషత్తునం దిటుల నుడువఁబడెను—"త్యక్తేన భుంజీథాః"—త్యాగమువలననే యనుభవింపుమి, యాసక్తివలనఁ గాదు.

ప్రథమమునఁ బార్వతి మదనుని సాహాయ్యమున శివునిఁ బొందఁ గోరెను. ఆప్రయత్నము వ్యర్థమయ్యెను. తుదకుఁ ద్యాగ సాహాయ్యమునను దపస్సువలన నాయనను బొందెను.

కామము కేవలమంశముపై నాసక్తమైయుండి సమగ్రముపై నంధమై యుండును. కాని శివము సకలదేశములకు సకల కాలములకుఁ జెందినవాఁడు. కోర్కెలు విడువనిదే యాయనతో సమ్మేళనమే కలుగనేరదు.

"తేన త్యక్తేన భుంజీథాః"— త్యాగమువలననే యనుభవింపుము. అనునదే యుపనిషత్తుల యనుశాసనము. ఇదియే కు

మారసంభవకావ్యముయొక్క నిగూఢార్థము. మఱియు నిదియే మన తపోవనముయొక్క సాధన, పొందుటకొఱకే త్యాగము చేయ వలెను.

Sacrifice and resignation ఆత్మత్యాగము, దుఃఖస్వీకారము, యను నీరెండుపదార్థములమాహాత్మ్యము మనము కొన్ని కొన్ని ధర్మశాస్త్రములలో విశేషముగ వర్ణింపఁబడినటులఁ గాంచితిమి. జగత్సృష్టికార్యమునం దెటుల నుపత్తాప మొక ప్రధానవస్తువో, మానవ జీవననిర్మాణమందు దుఃఖముకూడ నటులొక గొప్ప రాసాయనికశక్తి. దీనివలనఁ జిత్తముయొక్క దుర్భేదమగు కాఠిన్యము కరఁగిపోవును. అసాధ్యహృదయగ్రంథులు ఛేదిత మగును. కావున సంసారమం దెవరు దుఃఖమును దుఃఖరూపముతో నమ్రభావముతో స్వీకరింపఁగలరో, ఆయనయే యథార్థమైన తపస్వి.

కాని యెవ్వరు నీదుఃఖస్వీకారమునే యుపనిషత్తుల లక్ష్యమని తలంపకుందురుగాక ! త్యాగమును దుఃఖరూపమున నంగీకరించి స్వీకరించుట కాదు. త్యాగమును భోగరూపమున వరించి కైకొనుటయే యుపనిషత్తుల యనుశాసనము. ఉపనిషత్తులే త్యాగమును గుఱించి నుడివినవో, యాత్యాగమే పూర్ణతరమగు త్యాగము, ఆత్యాగమే గభీరతరమగు నానందము, ఆత్యాగమే నిఖిలముతో యోగము, భూమాతో మిళనము. కావున భారతవర్షమునం దే యాదర్శతపోవనము గలదో, యది శరీరమునకు విరుద్ధముగా నాత్మకును, సంసారమునకు విరుద్ధముగా సన్యాసమునకు నొక

నిరంతరద్వంద్వయుద్ధ మొనర్చు మల్లక్షేత్రము కాదు. "యత్కించ జగత్యాం జగత్"— అనఁగా జగత్తునందున్న సమస్తముతోను ద్యాగమువలనఁ గలుగు బాధాహీనమిళనమే తపోవనసాధన. ఇందువలననే తరులతలతో, పశుపక్షులతో భారతదేశపు ఆత్మీయసంబంధయోగము మిక్కిలి ఘనిష్ఠమైనది. అది యన్యదేశీయుల కద్భుతముగఁ దోఁపవచ్చును. ఇందువలననే మనదేశపుఁ గావ్యములలోఁ బ్రకృతిప్రేమపరిచయముఁ గాంచ నగును. అన్యదేశీయుల కావ్యములం దట్టి వైశిష్ట్యము కాన్పించదు. మన కిది ప్రకృతిపైఁ బ్రభుత్వము చేయుట కాదు. ప్రకృతిని భోగించుటయుఁ గాదు. ఇది ప్రకృతితో సమ్మేళనము.

ఈ సమ్మేళన మరణ్యవాసుల కసభ్యత కాదు. తపోవనమాఫ్రికావనమైనయెడలఁ బ్రకృతితో నేకమైయుండుట తామసికతయే యని చెప్పువాఁడను. కాని మానవుని చిత్త మెచట సాధనవలన మేల్కాంచెనో, అచ్చటి మిళనము కేవల మభ్యాసజడత్వజనితమైనది కాఁజాలదు. సంస్కారబాధలు క్షయమైపోయినపు డేమిళనము స్వాభావిక మగునో, యట్టిమిళనము తపోవనమునకుఁ జెందినది.

తపోవనము శాంతరసాస్పదమైన దని మన కవీశ్వరు లందఱు నుడివి యుండిరి. తపోవనమం దున్న యొకవిశేషరసము శాంతరసము. శాంతరస మనఁగాఁ బరిపూర్ణత్వముయొక్కరసము. సప్తవర్ణకిరణములు కలిసినపుడు తెలుపు రం గైనటుల చిత్తప్రవాహము నానాభాగములుగా విభక్తము కాక యవిచ్ఛిన్నభావముతో

నిఖిలముతోఁ దనసామంజస్యమును సంపూర్ణముగఁ గొనవఱకు నింపుకొన్నపుడు శాంతరస ముద్భవించును.

తపోవనమం దాశాంతరస మున్నది. ఇచ్చట సూర్యాగ్ని వాయు జల స్థలా కాశ తరు లతా మృగ పక్షు లన్నిటితోఁ జేతనాయుక్తమగు పరిపూర్ణయోగము కలదు. ఇచ్చట నాల్గుదిక్కుల నున్న సమస్తమునకును మానవునకు నెట్టివిచ్ఛేదముగాని, విరోధముగాని లేదు.

భారతవర్షతపోవనమం దొక శాంతరస సంగీతము శ్రుతి గూర్పఁబడినది. ఈ సంగీతాదర్శమువలననే మనదేశమం దనేక మిశ్రరాగములు సృజింపఁ బడినవి. ఇందువలననే మనకావ్యములలో మానవవ్యాపారములందుఁ బ్రకృతి కింత గొప్పస్థాన మీయఁ బడినది. ఇది కేవలము సంపూర్ణత్వముకొఱకు మనయం దున్న యొక స్వాభావికాకాంక్షను బూర్ణము చేయు నుద్దేశముతో నై యున్నది.

అభిజ్ఞానశకుంతలనాటకమందుఁ జెప్పఁబడియున్న రెండు తపోవనములును శకుంతలయొక్క సుఖదుఃఖముల నొక విశాలత్వమునందు సంపూర్ణతపఱచినవి. దానియందుఁ గల యొక తపోవనము పృథ్వియందును మఱియొకటి స్వర్గలోకసీమాంతమందు నున్నవి. ఒకతపోవనమంద సహానుభూతితో నవమల్లికల మిళనత్వమందు నవయౌవనముగల ఋషికన్యకలు పులకాంకిత లగుచున్నారు. మాతృహీనమృగశిశువులకు వారు నీవారము లొసఁగి పాలించుచున్నారు. కుశకంటకములు వానిభుజములకు గ్రుచ్చుకొనినచో

నింగుదీతైలమును బూసి శుశ్రూష సలుపుచున్నారు. ఈ తపోవనము శకుంతలాదుష్యంతులయొక్క ప్రేమకు సారళ్యము, సౌందర్యము, స్వాభావికత్వము నొసఁగి దానిని విశ్వస్వరముతో నేకము గావించినది.

ఇఁక రెండది, సంధ్యామేఘాకారముఁ దాల్చిన కింపురుష పర్వత మగుహేమకూటము. అచ్చట సురాసురుల గురువగు మరీచి భార్యాసహితుఁడై తపస్సుఁ గావించుకొనుచున్నాఁడు. లతాజాలావృతహేమకూటము పక్షినీడములతో నిబిడీకృతమై యరణ్యజటామండలమయమై యోగాసనమున నచలశివునివోలె సూర్యునివైపునకు దృష్టి నిగిడ్చి ధ్యాననిమగ్నమై యుండెను. అం దున్న సింహశాబకముల కేసరములఁబట్టి తల్లుల త్రొమ్ములనుండి విడిపించి దురంతతాపసబాలకులు వానితో నాడుకొనునపుడు పశువునకుఁ గల్గు నాదుఃఖము ఋషిపత్ని కసహనీయమై యుండును. ఆతపోవనము శకుంతలయొక్క యవమానితవిచ్ఛేదితదుఃఖమునకు మిక్కిలి బృహత్తరశాంతియుఁ బవిత్రతయుఁ బ్రసాదించెను.

ప్రథమతపోవనము మర్త్యలోకమునకుఁ జెందిన దనియు, రెండవది యమృతలోకమునకుఁ జెందిన దనియు, మనమంగీకరింపవలయును, "మొదటిది యెట్లుండవలయునో యనునది". "రెండవది యెట్లుండుట మంచిదో యనునది," ఈ "యెట్లుండవలయునో" యనునది, యీ "యెట్లుండుట మంచిదో" యనుదానివైపునకు నడచుచున్నది. దీనివైపునకుఁ జూచి, యది తనను శోధనఁ జేసికొనుచుఁ బూర్ణము గావించుకొనుచున్నది. "ఎట్లుండ

వలయునో'' యనునది సతి, యనఁగా సత్యము. ఇఁక "నెట్లుం డుట మంచిదో'' యనునది శివ, యనఁగా మంగళము. కోర్కె లను క్షయ మొనర్చుకొని తపస్సువలన నీసతీశివులకు మిళితము కల్గును. శకుంతలజీవితమునందును "ఎట్లయియుండ వలయునో'' యను తపస్సుద్వారమున "ఎట్లయియుండుట మంచిదో'' యను దానిలోఁ బ్రవేశించి తనను సఫలీకృత మొనర్చుకొనును. దుఃఖ ద్వారమునఁ బ్రవేశించి మర్త్యలోకము తుదకు స్వర్గలోకప్రాంత మునకు వచ్చి చేరెను.

మానసలోకమునకుఁ జెందిన యీ రెండవ తపోవనమునం దును బ్రకృతిని విడనాడి మానవుఁడు స్వతంత్రుఁడు గాలేదు. స్వ ర్గమున కరుగునపుడు యుధిష్ఠిరుఁడు తన కుక్కను దోడ్కొనిపో యెను. ప్రాచీనభారతీయకావ్యములలో మానవుఁడు స్వర్గము నకుఁ జేరునపుడు ప్రకృతిని వెంట నిడుకొని పోవును. విచ్ఛిన్నుఁ డై తాను బెద్దవాఁడు కాఁజాలఁడు. మరీచియొక్క తపోవనమందు మానవుఁ డెటులఁ దాపసుఁడో హేమకూటము గూడ నటులే తప స్విని. సింహము లచట హింసాభావమును త్యజించును. వృక్షము లచట నిచ్ఛాపూర్వకముగఁ బ్రార్థితుల యభావములను దీర్చును. మానవుఁ డేకాకి కాదు. నిఖిలముతో నాతఁడు సంపూర్ణుఁడు, కావు నఁ గల్యాణ మావిర్భూత మైనపు డందఱితో యోగమందే యాతని యావిర్భావము.

రామాయణమందు రాముని వనవాస ముండెను. కేవలము రాక్షసుల యుపద్రవములు కాక, యీ వనవాసమువలన వారి కింకెట్టి

వంతయును లేదు, వారు వనములతర్వాత వనములు, నదులతర్వాత నదులు, పర్వతముల తరువాత పర్వతములుఁ దాఁటిరి. పర్ణకుటీరములందు వసించిరి. భూమిపై శయనించి రాత్రులు గడపిరి. కాని వా రెట్టిక్లేశము ననుభవింపలేదు. ఈసకలనదీపర్వతారణ్యములతో వారిహృదయములకు మేళన మేర్పడెను. వా రిచ్చట ప్రవాసులై యుండలేదు.

అన్యదేశపుఁ గవీశ్వరులు రామలక్ష్మణసీతామాహాత్మ్యము నుజ్జ్వలపఱచి వనవాస దుఃఖము నత్యంత కఠోరముఁ గావించి చిత్రించిరి. కాని వాల్మీకి య ట్లొన్నఁడును గావింపలేదు. ఆతని వనానందమునే మరల మరలఁ బునరుక్తులతోఁ గీర్తించి యుండిరి.

రాజైశ్వర్య మెవరి యంతఃకరణము నభిభూతముఁ గావించి యున్నదో, విశ్వప్రకృతితో మేళనము వారల కెపుడును స్వాభావిక మైనదై యుండదు. సమాజగతసంస్కారముఁ, జిరకాలపుఁ గృత్రిమాభ్యాసములు మాటిమాటికిని వారల నాటంకపఱుపక యుండఁజాలవు. ఆసకలబాధలవలనఁ బ్రకృతి ప్రతికూల మైనదిగా వారలు తలఁచుచుందురు. మనరాజపుత్త్రుఁ డైశ్వర్యముతోఁ బాలింపఁబడినను, ఐశ్వర్యాసక్తి తనయంతఃకరణము నభిభూతము చేయలేదు. ధర్మముకొఱకు వనవాసము స్వీకరించుటయే యాయన ప్రథమప్రమాణము. ఆయన చిత్తము స్వాధీనమైయుండెను. శాంతమైయుండెను. అందుచే నాయన యరణ్యమందుఁ బ్రవాసక్లేశ మనుభవింపలేదు. అందుచేతనే పశుపక్షులు తరులతలు నాయన హృదయమున కానంద మొనఁగూర్చినవి. ఈయానంద

ము ప్రథుర్వానందము కాదు, భోగానందము కాదు, సమ్మిశ్రానానందము. ఈయానందమూలకందమునం దప స్సున్నది; ఆత్మసంయమ మున్నది. దీనియందే యుపనిషత్తుల, "తేన త్యక్తేన భుంజీథాః" అను వాణి కలదు.

కౌసల్యయొక్క రాజగృహ వధు వగు సీత వనమునకు వెడలు చున్నది.—

ఏకైకం పాదపం గుల్మం లతాం వా పుష్పశాలినీమ్‌।
అదృష్టరూపాం పశ్యంతీ రామం పప్రచ్ఛ సాబలా॥
రమణీయాన్ బహువిధాన్ పాదపాన్ కుసుమోత్కరాన్।
సీతావచనసంరబ్ధ ఆనయామాస లక్ష్మణః॥
విచిత్రవాలుకాజాలాం హంససారస నాదితామ్।
రేమే జనకరాజస్య సుతా ప్రేక్ష్య తదా నదీమ్।

ఏసకల తరు గుల్మములను లేక పుష్పశాలినులగు లతలను సీత మున్నెన్నఁడును జూచి యుండలేదో, వానివిషయమై యామె రాము నడుగఁ జొచ్చెను. లక్ష్మణుఁ డామె కోర్కెప్రకారము పుష్పమంజరులతో నిండియున్న నానావిధ లతాగుల్మములను దెచ్చి యిచ్చుచుండెను. అచ్చోట విచిత్రవాలుకాజలపూర్ణ మగు హంససారస ముఖరిత మగునదిని గాంచి జానకి హృదయమునం దానంద మనుభవించెను.

ప్రథమమున వనమున కేఁగి రాముఁడు చిత్రకూట పర్వతమం దాశ్రయమును స్వీకరించెను—

సురమ్య మాసాద్య తు చిత్రకూటం,
నదీం చ తాం మాల్యవతీం సుతీర్థాం,
ననంద హృష్టో మృగపక్షిజుష్టాం
జహౌ చ దుఃఖం పురవిప్రవాసాత్॥

ఆ సురమ్య మగుచిత్రకూటము, సుతీర్థ మగుమాల్యవతీనది, యామృగపక్షి సేవితమగు వనభూమిని బొంది, పుర విప్రవాసపు దుఃఖమును ద్యజించి సంతుష్టాంతరంగుఁడై రాముఁ డానందము ననుభవింపఁ జొచ్చెను.

దీర్ఘకాలోషిత స్తస్మిన్ గిరౌ గిరివనప్రియః—

గిరి వనప్రియుఁడగు రాముఁడు దీర్ఘకాల మా గిరియందు వసియించి సీత కొకదివసమునఁ జిత్రకూటపర్వతమును జూపించి యిట్లు నుడివి యుండెను

న రాజ్యభ్రంశనం భద్రే న సుహృద్భి ర్వినా భవః
మనో మే బాధతే దృష్ట్వా రమణీయ మిమం గిరిమ్॥

రమణీయ మగు నాగిరిని బొడఁగాంచి రాజ్యభ్రష్టత్వము కూడ నాకు దుఃఖము నొసఁగుటలేదు. సుహృదులనుండి దూరముగా వసించుటయు నాకు పీడాదాయకముగ లేదు.

అచ్చటనుండి రాముఁడు దండకారణ్యమున కేఁగినపు డచ్చట గగనమందు సూర్యమండలముఁ బోలు దుర్దర్శప్రదీప్త మగు తాపసాశ్రమ మండలమును జూడఁగలిగెను. ఈయాశ్రమము "శరణ్యాం సర్వభూతానామ్." (సర్వభూతములకు శరణ్యము.) ఇది బ్రాహ్మీయలక్ష్మిచే సమావృత మైనది. కుటీరములు సుమార్జి

ములైనవి. నలువైపుల నెన్నియో మృగములు, నెన్నియో పక్షులుఁ గలవు.

రాముని వనవాస మిట్లే గడచియుండెను. ఒకచోట రమణీయమగు వనమందును, మఱియొకచోటఁ బవిత్రమగు తపోవనమందును.

రామునియెడల సీతకును, సీతయెడల రామునకును గల ప్రేమ వారి యొండొరులనుండి ప్రతిఫలించి నలువైపులనుండు మృగపక్షుల సాచ్ఛన్నము చేసివైచెను. వారలు ప్రేమయోగమున గాఢానురాగము కలిగి యుండుటయే విశ్వమానవులతో యోగయుక్తులైరి. అందుచే సీతాహరణానంతరము రాముఁడు సమస్తారణ్యమును దన విచ్ఛేదవేదనకు సహచరునిగాఁ బొందెను. సీతయొక్క యభావము కేవలము రామునికే కాక, సమస్తారణ్యమును సీతను బోఁగొట్టుకొనెను. ఏల యనఁగా, సీతారాముల వనవాసకాలమం దరణ్య మొక నూతన సంపదను బొంది యుండెను. అది మానవప్రేమ. ఆ ప్రేమవలనఁ దన పల్లవఘనశ్యామలతలను దన ఛాయాగంభీరనిగూఢరహస్యము నొక చైతన్య సంచారముతో రోమాంచితము చేసివైచెను.

షేక్స్పియరుయొక్క "As you like it" యనునాటక మొక వనవాసచరిత్ర—"టెంపెస్టు"కూడ నట్టిదే; midsummer nights dream కూడ నారణ్యకకావ్యము. కాని, యీ సకలకావ్యములలో మానవప్రభుత్వము, ప్రవృత్తుల లీలలే మిక్కిలిగాఁ గాన్పించును. అరణ్యముతోఁ గల సౌహార్దము గనుపడదు. అరణ్యవాస

ముతో మానవచిత్తమునకు సామంజస్యసాధన సంఘటిల్లలేదు—"దానిని జయించుటకో, లేక త్యజించుటకో చేసిన ప్రయత్నము లెల్లెడలఁ గన్పట్టును—విరోధమో, విరాగమో లేక యౌదాసీన్యమో. మానవప్రకృతి విశ్వప్రకృతిని సెట్టివైచి స్వతంత్రమై తన గౌరవమును బ్రకటించెను.

మిల్టన్ యొక్క "పేరడైజ్ లాస్టు" అను కావ్యమం దాది మానవదంపతుల స్వర్గారణ్యవాస విషయమే యతిసహజముగ నాకావ్యమునందు మానవునితోఁ బ్రకృతిమేళనము సరళప్రేమసంబంధమయి విరాట్స్వరూపముఁ దాల్చి,మధురమై ప్రకాశింపవలసిన విషయము. కవి, ప్రకృతిసౌందర్యమును వర్ణించెను. జీవజంతువు లచ్చట హింసను ద్యజించి, యేకముగ వసించిన విషయమును జెప్పెను. కాని, మానవునితో వాని కెట్టిసాత్వికసంబధమును లేదు. అవి మానవభోగములకొఱకే విశేషముగ సృష్టింపఁబడినవి. మానవుఁడు వానికిఁ బ్రభువు. ఈయాదిదంపతులు ప్రేమానంద ప్రాచుర్యములతోఁ దరులతల, పశుపక్షుల సేవఁ జేసినటులగాని, భావనలను గల్పనలను నదీభూధరారణ్యముల నానాలీలలతో సమ్మిశ్రితమొనర్చినటు లెచ్చటను గనుపింపదు. ఈస్వర్గారణ్యముల నిభృత నికుంజములయందు మానవప్రథమ పితామహుఁడు విశ్రమించువాఁడు. అచ్చట"Beast, bird, insect or worm durst enter none, such was their awe of man"— అనఁగాఁ బశుపక్షికీటకపతంగము లేవియుఁ బ్రవేశించుటకు సాహసించెడివి కావు.

మానవునిపై వాని కొకవిధ మగు భయయుక్త మగు గౌరవ ముండెను.

నిఖిలముతో మానవుని విచ్ఛేదమూలకందమున గభీరమగు నొకవిచ్ఛేదనభావ మున్నది. దీనియందు "ఈశావాశ్య మిదం సర్వం యత్ కించ జగత్యాం జగత్" (జగత్తునం దున్నంతయు నీశ్వరునిచే సమావృత మొనర్చి తెలిసికొనుము)అను నీవాణి లోపించియున్నది. ఈపాశ్చాత్య కావ్యములం దీశ్వరునిసృష్టి యీశ్వరుని యశఃకీర్తనము చేయుటకే, ఈశ్వరుఁడు స్వయముగా దూరమందుండి యాయన యీవిశ్వరచననుండి వందనములఁ గైకొనుచున్నాఁడు.

మానవునకు నంశరూపమునఁ బ్రకృతితోఁ గలసంబంధము ప్రకాశించినది. అనఁగాఁ బ్రకృతి మానవుని శ్రేష్ఠతను బ్రకటించుటకే యైయున్నది. భారతవర్షముకూడ మానవుని శ్రేష్ఠత్వమును దిరస్కరించునది కాదు. కాని ప్రభుత్వము చేయుటనే భోగము ననుభవించుటనే శ్రేష్ఠత్వముయొక్క ప్రధానలక్షణము అని యొప్పుకొనదు. మానవుఁ డన్నిటితో నేకము కాఁగలఁ డనునదియే మానవ శ్రేష్ఠత్వముయొక్క ప్రధానపరిచయము. ఆమేళనత్వము మూఢత్వముతోఁ గూడిన మేళనము కాదు. ఆమేళనము చిత్తముయొక్క మిళనము కనుక యానందమిళనము. ఈయానందమును గూర్చియే మనకావ్యములలోఁ గీర్తింపఁబడి యున్నది.

ఉత్తరరామ చరిత్రమందు సీతారాములకుఁ గలప్రేమ యానందప్రాచుర్యముచే నలుదిక్కుల నున్న జలస్థలాకాశములందుఁ

ప్రవేశించెను. అందుచే రాముఁడు రెండవసారి గోదావరీగిరితట మును గాంచి యిట్లు నుడివి యుండెను—“యత్ర ద్రుమా అపి మృగా అపి బంధవో మే” సీతావియోగకాలమున నాయన తమ పూర్వనివాసభూమిని గాంచి, మైథిలి తనకరకమలవికీర్ణ జలమును నీవారమును దృణము నొసఁగి పాలించిన వృక్షములను బక్షులను హరిణముల నవలోకించుటచే నాహృదయము పాషాణము ద్రవీభూతమైనటులఁ గరఁగిపోవుచున్న దని మిక్కిలి ఖిన్నుఁడయ్యెను.

మేఘదూతమందు యక్షుని విరహము తనదుఃఖప్రభావమున స్వతంత్రమై యేకాంతముగ గృహాంతరమునఁ గూర్చుండి విలపించుట లేదు. విరహదుఃఖమే యాతని చిత్తమున నవవర్షముతో నుత్ఫుల్లమై యున్న సకల నదీనదములందును, నగరారణ్యములందును బరివ్యాప్తముఁ గావించెను. మానవునిహృదయావేదనను గవి సంకీర్ణముగఁ జూడలేదు. దానిని విరాట్స్వరూపమందు విస్తీర్ణము గావించెను. అందుచేతనే ప్రభుశాపగ్రస్త మగునొకయక్షుని దుఃఖవార్త శాశ్వతకాలము వర్షార్తుమర్మస్థానమును వశీభూతము గావించుకొని, ప్రణయినిహృదయముయొక్క హృదయస్పందనమును విశ్వసంగీతముయొక్క ధ్రుపదతాళముతో నేకము గావించెను.

భారతవర్షముయొక్క విశేషత్వ మిదియే. తపఃక్షేత్రమందును దనహృదయవృత్తులలీలలు ప్రదర్శింపఁబడుచోటఁ గూడ నిట్టిదానినే కాంతుము.

మానవుఁడు రెండువిధములఁ దన మహత్త్వము నుపలబ్ధి

చేసికొనును. ఒకటి స్వాతంత్ర్యమునందును మఱొకటి మిళనము నందును, ఒకటి భోగమువలనను నింకొకటి యోగమువలనను. భారతవర్షము సహజముగ నీయంత్య మార్గమునే యవలంబించెను. అందుచేతనే ప్రకృతియం దెచ్చట నేని యొక విశేష సౌందర్యము గాని, మహిమగాని యావిర్భవించిన యెడల నది భారతవర్షము యొక్క తీర్థస్థానముగ నేర్పడుచున్నటులఁ గాంతుము.మానవచిత్త మునకును విశ్వప్రకృతికిని సహజమగు మేళన మేర్పడుచున్న స్థానమునే భారతవర్షము పవిత్రమగు తీర్థముగా నెంచి గ్రహించినది. ఈస్థానములలో మానవప్రయోజమునకు వలయు నుపకరణములు లేవు. ఇచ్చటఁ గృషికార్యము జరుగదు. వసతులు లేవు, క్రయవిక్రయముల కెట్టి యేర్పాట్లును లేవు. ఇచ్చట రాజుగారి రాజధాని లేదు. అవి యన్నియు నిచ్చోట ముఖ్యమైనవి కావు. ఇట నిఖిల ప్రకృతితో మానవుఁడు తనయోగము నుపలబ్ధిచేసికొని, యాత్మను సర్వగతముగను బృహత్తరముగను గ్రహించును. ఇచ్చటఁ బ్రకృతిని తనప్రయోజనసాధనక్షేత్ర మని మానవుఁడు తలంచుటలేదు. దాని నాత్మోపలబ్ధికై సాధనక్షేత్రముగ మానవుఁ డనుభవించుటచే తనే యది పుణ్యక్షేత్ర మగుచున్నది.

భారతదేశపు హిమాలయములు వింధ్యాచలములు పవిత్రము లయినవి. భారతదేశపునదులు లోకాలయము లన్నిటికి నక్షయ ధారలతో స్తన్యదాన మొసఁగుచున్నవి. గాన నవియన్నియుఁ బుణ్యసలిలములు. హరిద్వారము పవిత్రమైనది. హృషీకేశము పవిత్రమైనది.కేదారనాథ బదరికాశ్రమములు పవిత్రములైనవి. కైలాసము

పవిత్రమయినది. మానససరోవరము పవిత్రమయినది. పుష్కరము పవిత్రమయినది. గంగాయమునల మిళనము పవిత్రమయినది. సముద్రమునందు గంగావసానము పవిత్రమయినది. ఏవిరాడ్రూపముఁ దాల్చిన ప్రకృతివలన మానవుఁడు పరివేష్టితుఁడై యున్నాఁడో, ఎవనియాలోక మాతని నేత్రములను సార్థకపఱచుచున్నదో, యెవని యుత్తాప మాతని సర్వాంగములలోఁ బ్రాణమును స్పదింపఁజేయుచున్నదో,యెవనిజలమువలన నాతని కభిషేకము జరుగుచున్నదో, యెవనియన్నమువలన నాతని జీవిత మభివృద్ధి చెందుచున్నదో, యెవనియభ్రభేది యగురహస్యనికేతనము యొక్క నానాద్వారములనుండి యనేకదూతలు బయల్వెడలి శబ్దిగంధవర్ణముల తో మానవునిచైతన్యమును నిత్యము మేల్కొల్పి యుంచినవో, భారతవర్ష మట్టిప్రత్పృతియందుఁ దనభక్తివృత్తుల నెల్లెడల నోతప్రోతముగఁ బ్రసవింపఁజేసినది. జగత్తును భారతవర్షము పూజచేయ స్వీకరించినది. దానిని గేవల ముపభోగములచే క్షుద్రము చేయలేదు. దాని నౌదాసీన్యముచేఁ దనకర్మక్షేత్రమునకు బయటికిఁ ద్రోసిపుచ్చియుంచలేదు. ఈవిశ్వప్రకృతితోఁ బవిత్రయోగమువలననే భారతవర్షము తనను బృహత్తరముగాను సత్యముగాను గ్రహించినది. భారతవర్షపు తీర్థస్థానము లీవిషయమునే ఘోషించినవి.

విద్య నార్జించుట కేవలము విద్యాలయముపై నాధారపడి యుండదు. ప్రధానముగ విద్యార్థిపైననే యాధారపడి యుండును. అనేకవిద్యార్థులు విద్యాలయమునకు వెడలుదురు. పట్టభద్రు లగు

దురు. కాని విద్యను బొందరు. అట్లే తీర్థక్షేత్రమున కనేకు లేఁగుదురు. కాని తీర్థక్షేత్రముయొక్క యథార్థఫలము నందఱును బొందఁజాలరు. ఎవరు చూడవలసిన వస్తువును జూడరో, పొందవలసిన వస్తువును బొందరో,తుదివఱకు వారివిద్య గ్రంథగతముగను, ధర్మము బాహ్యాచారాబద్ధముగను నుండును. వారలు తీర్థక్షేత్రమున కరుగుదురు, కాని వెళ్లుటనే వారు పుణ్యముగ భావింతురు; పొందుటను గాదు. వారు విశేషజలమునకు, విశేషభూమికి నొక వస్తుగుణమున్న దని కల్పించుకొందురు. ఇందువలన మానవుని లక్ష్యము భ్రష్టమగును. చిత్తసామగ్రిని వస్తుగతముచేయుటచే నష్టమగుచున్నది. మనదేశమున సాధనసమ్మార్జిత మగు చిత్తశక్తి మలినమైనకొలఁది నీనిరర్థకబాహ్యాచారములు మెండయిన వనుమాట నొప్పుకొనితీరవలెను. కాని నేనీ దుర్గతియొక్క జడత్వమునే భారతవర్షము యొక్క చిరంతనాభిప్రాయ మని యెప్పుడు నొప్పుకొనను.

ఏదో యొకవిశేషనదీజలమున స్నానముఁ గావించినఁ దనకుఁగాని, మూఁడుకోట్ల పూర్వపురుషులకుఁగాని, పారలౌకికసద్గతి సంఘటిల్లు ననెడి విశ్వాసమును నే నెంతమాత్ర మొప్పుకొనఁజాలను. ఈ విశ్వాసము గొప్ప దనికూడ నేను శ్రద్ధచూపను. కాని, యవగాహన సమయమున నదీజలము నేవ్యక్తి యథార్థమగుభక్తితోను సర్వాంగములతోను సర్వాంతఃకరణముతోను స్వీకరించునో నే నాతనిని భక్తిపాత్రునిగాఁ దలంతును, కారణ మే మనఁగా, నదీజలము సామాన్యతరళపదార్థ మని సాధారణమానవుల

కొకస్థూలసంస్కారము, నొకతామసికయవజ్ఞత యున్నవి. సాత్వి కత్వమువలన,ననఁగాఁ చైతన్యమయత్వమువలన నాజడసంస్కార ము నాతఁడు దాఁటఁగలిగెను. అందుచేతనే నదీజలముతోఁ గేవల ము తన శారీరకప్రయోగమునకు బాహ్యసంబంధ మేర్పడక దాని తోఁ దనకుఁ జిత్తసంబంధమగు యోగసాధన మేర్పడినది. ఈనదు లద్వారమునఁ బరమచైతన్యము తనచేతనత్వము నొకవిధమున స్ప ర్శించినది. ఆస్పర్శవలన స్నానజలము తనదేహముయొక్క మాలి న్యమునే గాక, తనచిత్తముయొక్క మోహప్రలేపమును గూడ ధౌ త మొనర్చినది.

అగ్ని, జలము, భూమి, యన్నము మున్నగు సామగ్రుల యనంతరహస్య మభ్యాసములవలన మనకడ మలినయిపోవు నేమో యని ప్రత్యహము నానాకర్మలవలన, ననుష్ఠానములవలన వానిపవి త్రతను మనము స్మరించుకొనువిధమై యున్నది—ఏమానవుఁడు చైతన్యభావముతో నట్లు స్మరించుకొనఁగలుగునో, వానియోగము నఁ బరమేశ్వరునితో మనకు యోగమున్నదను జ్ఞానశక్తి నంగీ కరింపఁగల మానవుఁ డొకగొప్పసిద్ధిని బొందినాఁ డని యొప్పుకొ నవలెను. స్నానజలమును, నన్నమును శ్రద్ధతోఁ జూచు విద్య మౌ ఢ్యముతోఁ గూడుకొనిన విద్యకాదు. దానియందు జడత్వమున కెట్టి యాశ్రయమును లేదు, కారణ మే మనఁగా, నీసమస్తాభ్యస్తసా మగ్రిని దుచ్ఛముగ నొనర్చుటయే జడత్వము. దానియందుఁ గూడఁ జిత్తోద్బోధన కేవలము చైతన్యముయొక్క విశేషవికాసము వలననే సాధ్యమగును. సత్యమును స్వీకరించుటకు మూఢమానవు

ని నెవని ప్రకృతియందు స్థూలాటంకము లుండును. అతఁడు సమస్త సాధనను వికృతపఱచును. లక్ష్యము నాతఁడు భ్రాంతస్థానములందు స్థాపించుచుండును.

బహుకోట్లమానవులు నంద ఱొక్కజాతిగా నుండి మత్స్యమాంసముల యాహారమును సంపూర్ణముగ విసర్జించినవారు లోకమునం దెచ్చటను గాన్పించరు. మానవజాతియందు మాంసాహారములు భుజింపనిజాతివారు కనుపడరు.

భారతవర్ష మీ మాంసాహారమును త్యజించుట కఠోరవ్రతమును సాధనచేయుటకుఁ గాదు. తనశారీరకపీడనవలన శాస్త్రోపదిష్టమగు నెట్టిపుణ్యము నార్జించుటకుఁ గాదు. జీవునియెడఁ దన హింసాభావమును త్యజించుటయే ముఖ్యోద్దేశము.

ఈ హింసాభావమును త్యజింపనియెడల జీవునితో జీవునకుఁ గల యోగసాధన నష్టమగును. ప్రాణమును మనము తినువస్తువుగాను, బొట్ట నింపుకొను వస్తువుగాను జూతు మేని దాని నెప్పుడును జూడఁజాలము. ప్రాణ మనువస్తువు నింత తుచ్ఛముగాఁ గాంచుట కభ్యస్తపడినయెడలఁ గేవల మాహారమునకే కాక, ప్రాణిహత్యయే మనజీవితమం దొక యంగముగాఁ బరిణమించును. మఱియు దారుణాహేతుకహింసను జలస్థలాకాశములందును, గుహాగహ్వరాంతములందును, దేశవిదేశములందును, మానవుఁడు వ్యాప్తి చేయఁగలఁడు.

ఈయోగభ్రష్టత్వము నీబోధశక్తియొక్కయు నిర్జీవత్వము నుండిభారతవర్షము మానవుని రక్షించుటకుఁ బ్రయత్నించినది.

మానవుని జ్ఞానము మూఢత్వమునుండి బహుదూర మగ్రేసర మయినది. దానికిఁ బ్రధానలక్షణ మేది? మానవుఁడు విజ్ఞాన సాహాయ్యమున జగత్తునం దంతటను నియమమును జూచుటయే. అతఁ డిది గాంచనంతవఱకు నాతనిజ్ఞానమునకు సంపూర్ణత లేదు. అంతవఱ కాతఁడు విశ్వచరాచరములందు విచ్ఛిన్నుఁడై వసించుచుండును. జ్ఞాననియమము కేవల మాతనియందే యున్నదనియు, నీవిరాటమగు విశ్వవ్యాపారములయందు లేదనియు నాతఁడంతవఱకుఁ జూచుచుండును. ఇందుచేత నాతనికి జ్ఞాన ముండుటఁబట్టియే యాతఁడు జగత్తునందు స్వతంత్రుఁడై యుండఁగలిగెను. కాని నేఁడాతని జ్ఞాన మణువునకంటె నణుతమమయినదానితోను, బృహత్తమునకంటె బృహత్తమమయినదానితోను దనయోగమును స్థాపించుకొన నుద్యుక్త మయినది, ఇదియే విజ్ఞానసాధన.

భారతవర్షము స్వీకరించిన సాధన విశ్వబ్రహ్మాండముతోఁ జిత్తయోగము, నాత్మయోగము, అనఁగా సంపూర్ణయోగము కలిగినట్టిది. కేవలము జ్ఞానయోగముగాక బోధయోగమై యున్నది. భగవద్గీతయం దిట్లున్నది—

ఇంద్రియాణి పరా ణ్యాహు రింద్రియేభ్యః పరం మనః
మనస స్తు పరా బుద్ధి ర్యో బుద్ధేః పరత స్తు సః॥

ఇంద్రియములు శ్రేష్ఠపదార్థములుగా నుడువఁబడియున్నవి. కాని ఇంద్రియములకన్న మనస్సు శ్రేష్ఠ మయినది. మనస్సుకన్న బుద్ధి శ్రేష్ఠమయినది. బుద్ధికన్న శ్రేష్ఠమైన దతఁడే.

ఇంద్రియము లేల శ్రేష్ఠమైన వనఁగా, నింద్రియములవలన విశ్వముతో మనకు యోగసాధన మేర్పడుచున్నది. కానియాయోగ మాంశిక మయినది. ఇంద్రియములకన్న మనస్సు శ్రేష్ఠమైన దెందువలన ననఁగా, మనస్సుద్వారా గలుగు జ్ఞానమయయోగము వ్యాపకతర మైనది. కాని జ్ఞానయోగమందును సంపూర్ణ విచ్ఛేదభావము దూర మగుటలేదు. మనస్సునకంటె బుద్ధి శ్రేష్ఠమయిన దెందుకనఁగా, బోధమువలనఁ గలుగు చైతన్యమయయోగము పరిపూర్ణ మయినది. ఆయోగమువలననే మనము జగత్తునందున్న యన్నిటికంటె శ్రేష్ఠమయిన యాయసనే యుపలబ్ధి చేసికొనఁ గలము.

వీని యన్నిటికన్న శ్రేష్ఠ మయినదానిని సకలమునందును బోధమువలననే యనుభవించుట భారతవర్షపు సాధన.

కావున మనము భారతవర్షముయొక్క యీసాధనయందే దీక్షితులనుగాఁ జేయుట భారతీయుల విద్యకుఁ బ్రధాన లక్ష్య మగుట మంచి దని తలంతుమేని, యింద్రియముల విద్యగాక, కేవలము జ్ఞానవిద్యయుఁ గాక బోధవిద్యకు మన విద్యాలయములందుఁ బ్రధానస్థానము లొసఁగవలసి యుండు నని మనము స్థిరముగా గ్రహింపవలసియున్నది. అనఁగాఁ గేవలము యంత్రశాలలయందె నిపుణవిద్యకాక, స్కూలుకాలేజీల పరీక్షలయం దుత్తీర్ణు లగుటయే గాక, మన యథార్థమగు విద్య తపోవనమం దయి యున్నది. ప్రకృతితో మిళిత మయి, తపస్సుతోఁ బవిత్ర మయి విద్యను బొందవలసి యున్నది.

మన స్కూలుకాలేజీలయందుఁ దప స్సున్నదీ కానీ, యది మానసికతపస్సు, జ్ఞానతపస్సు; బోధతపస్సు కాదు.

జ్ఞానతపస్సువలన మనస్సును బంధవిమోచనము చేయవల యును. మన మనస్సుల నంటియున్న పూర్వసంస్కారభావముల నన్నిటిని గ్రమక్రమముగాఁ బరిష్కృతముఁ గావింపవలెను. ఏది సమీపమునం దుండుటచేఁ బెద్దదో, దూరమం దుండుటచేఁ జిన్న దో, బాహ్యమందుండుటచేఁ బ్రత్యక్ష మయినదో, యంతరమం దుం డుటచేఁ బ్రచ్ఛన్న మైనదో విచ్ఛిన్నము కావించి చూచిన నిరర్థక మయినదో, సంయుక్త మొనర్చి చూచిన సార్థకమయినదో, యది దాని యాథార్థ్యమును రక్షించుకొను విద్యను నేర్పవలెను.

బోధతపస్సునకుఁ గలుగు బాధ రిపుబాధ, ప్రవృత్తులు ని గ్రహబద్ధము గాకున్నయెడలఁ జిత్తసామ్యముండనేరదు. అందుచే బోధము వికృతమై పోవును. కామితవస్తువులను మనము శ్రేయ మయినవిగాఁ జూచుట యావస్తువులు నిజముగా శ్రేయమయిన వని గాదు. మనకుఁ గామిత ముండుటవలననే యట్లు చూచుచు న్నాము. లోభవస్తువును మనము గొప్పదిగాఁ జూచుట, యావ స్తును నిజముగ గొప్ప దని కాదు. మనకు లోభ ముండుటవలననే యట్లు గాంచు చున్నాము.

అందుచే బ్రహ్మచర్య నిగ్రహమువలన బోధశక్తిని బంధ విముక్తిఁజేయు విద్యను నేర్పు టావశ్యకము. భోగవిలాసాకర్షణ ములనుండి యభ్యాసములకు ముక్తి నీయవలెను. ఏ సకలక్షణి కోత్తేజనములవలన మానవచిత్తమును క్షుద్రముగను, విచార

బుద్ధిని సామంజస్యభ్రష్టముగను నొనర్చివేయునో వాని యాఘాత ములనుండి బుద్ధిని సంరక్షించి సరళముగఁ బెరుఁగనీయవలెను.

ఎచ్చట సాధన యున్నదో, యెచ్చట జీవనయాత్ర సరళమై నిర్మలమైనదో, యెచట సామాజికసంస్కారసంకీర్ణత లేదో, యెచట వ్యక్తిగత జాతిగత విరోధ బుద్ధిని నిగ్రహించు ప్రయత్నమున్నదో, అచటనే భారతవర్షము విశేషవిద్య యని నుడివిన దానిని బొంద నగును.

ఇట్టి విషయము భావోద్రేక మనియు, జ్ఞానశూన్యమగు దురాశ యనియు ననేకు లందు రని నే నెఱుఁగుదును. కాని నే నది యెంతమాత్ర మంగీకరింపలేను. సత్య మసాధ్య మయినయెడల నది సత్యమే కాదు. అన్నిటికన్న శ్రేయమైనది, యన్నిటికన్న సహజమైనది కాకపోవుటవలననే దానికై సాధన కావలసియున్నది. మొదట కష్టసాధ్యమయినది సత్యముపై శ్రద్ధచూపుట, ధన మవసర మను విశ్వాసము మన మనములలో నుదయించినంతనే ధన మార్జించుట కష్టసాధ్యమైన విషయ మని మనము గ్రహింతుము. అట్లే భారతవర్షము విద్యపై యథార్థమగు శ్రద్ధను జూపినపు డా విద్యను బొందు సాధన యసాధ్య మయిన దని తృణీకరింపలేదు. అపుడు తపస్సు దానియంతట నదియే సత్యమై నిలువఁబడెను.

కావునఁ బ్రథమమున దేశముయొక్క యాసత్యముపై దేశీయులకు శ్రద్ధ కలిగెనేని దుర్గమబాధలవలనఁ గూడఁ దన మార్గమును దానే నిర్మించుకొనును.

వర్తమానకాలమునందు మనదేశమున నిట్టి తపోనిలయ

ములు, విద్యాలయములు ననేక ముదయించు నని నే నాశింపను. కాని మనము విశేషముగా జాతీయ విద్యాలయములను బ్రతిష్ఠింప సమకట్టినపుడు భారతవర్షముయొక్క విద్యాలయ మెటు లుండు టుచితమో యాలోచింపవలసిన విషయము. దేశముయొక్క నానాచాంచల్యములకును,నానావిరుద్ధభావాందోళనములకును నూర్ధ్వమున నుండు నాదర్శ మావశ్యక మయి యున్నది.

జాతీయవిద్య యనఁగా, నాంగ్లేయులు దేనిని గ్రహింతురో, మనముకూడ దానినే గ్రహించిన యెడల మిక్కిలి పొరపాటు చేసినవార మగుదుము. మనదేశపు విశేషసంస్కారములు,మన జాతియొక్క కొన్నిలోకాచారములద్వారా సీమాబద్ధము గావించి, మన స్వాతంత్ర్యాభిమానము నత్యుగ్రముగాఁ జేయు పద్ధతిని నే నెంతమాత్రము జాతీయవిద్యగాఁ బరిగణింపఁజాలను. జాతీయత్వమును మనము పరమపదార్థముగఁ బూజింపకుండుటయే మనజాతీయత్వము—"భూమైవ సుఖం నాల్పే సుఖమస్తి భూమాత్వేవ విజిజ్ఞాసితవ్యః" భూమాయందే సుఖము, అల్పమందు సుఖము లేదు. భూమాయే తెలిసికొనఁదగినది, ఇదియే మనజాతీయతామంత్రము.

ప్రాచీనభారతతపోవనమందు మహాసాధనవలన వనస్పతులొకప్పుడు శిరము లెత్తినవి. సర్వత్రి వానిశాఖోపశాఖలు విస్తరించి సంఘమును నలువైపులనుండి యాక్రమించెను. అదియే మనజాతీయ సాధనయై యుండెను. ఆసాధనయే యోగసాధన. యోగసాధన యేదోయొక యుత్కట శారీరక మానసికవ్యాయామ చర్చ కాదు. యోగసాధన మనఁగా, సమస్తజీవితము స్వాతం

యాత్మను సత్యమునం దుపలబ్ధి గావించుటయే సఫలత్వమని మన మంగీకరింతుము.

బహుప్రాచీనకాలమునం దొకదివసమున నరణ్యసంకుల భారతదేశమున మనయార్యపితామహులు ప్రవేశించిరి. ఆధునికేతిహాసమునం దాంగ్లేయు లటులనే నూతనావిష్కృతమహాద్వీపమహారణ్యమున మార్గ ముద్ఘాటిత మొనర్చిరి. వారలయందు సాహసముగలవా రగ్రగాములై యపరిచితభూఖండముల నన్నిటిని భావివంశములవారి కనుకూలముగ నొనర్చుచున్నారు. మనదేశమునందును అగస్త్యుఁడు మొదలగువా రగ్రగాములై యుండిరి. వారపరిచితదుర్గమమార్గముల నతిక్రమించి గహనారణ్యములను వాసయోగ్యముగఁ గావించిరి. ప్రాచీనాధివాసులతో యుద్ధము జరిగినటులే యిపుడును జరిగినది. కాని యీరెండు ఇతిహాసధార లొక్కస్థితియందే ప్రవహించినను ఒక్కసముద్రమున లీనము కాలేదు.

అమెరికా యరణ్యమునఁ గావింపఁబడిన తపఃప్రభావము వలన వనములనుండి గొప్పగొప్ప పట్టణము లింద్రజాలమువలె నుద్భవించెను. భారతవర్షమందుఁ గూడ నట్టి పట్టణములు సృష్టింపఁ బడుటయే కాక, దానితోపా టరణ్యములను గూడ స్వీకరించెను. అరణ్యము భారతవర్షమువలన విలుప్తము కాక సార్థక మయ్యెను. అడవిమనుష్యుల కావాసమైనస్థలము ఋషుల తపోవనముగ వెలసెను. అమెరికాయరణ్యమున శేషించినది యిప్పు డమెరికాకుఁ బ్రయోజనసామగ్రి యయ్యెను. ఒక్కొక్కచోట భోగవ

రికాకుఁ బ్రయోజనసామగ్రి యయ్యెను. ఒక్కొక్కచోట భోగవస్తువులుగఁ గూడఁ బరిణమించెను. కాని యోగాశ్రమములుగాఁ బరిణమింపలేదు. ఈశ్వరోపలబ్ధివలన నీ యరణ్యములు పుణ్యస్థానములుగ నొనర్పఁ బడలేదు. మానవుని శ్రేష్ఠతరాంతరమగు ప్రకృతికిని నీయరణ్యప్రకృతికిని పవిత్రమిళనము స్థాపింపఁబడలేదు. అరణ్యమునకు నవీన మగు నమెరికా తనగొప్పవస్తువును దేనిని నీయలేదు. అరణ్యముకూడ దానిని తనగొప్పపరిచయమునుండి వంచితము గావించెను. నూతనఅమెరికా తనపురాతనాధివాసుల నెటుల లుప్తము గావించి తనతో యుక్తము చేసికొనలేదో, యటులనే యరణ్యములను తననాగరికతకు వెలుపలఁ ద్రోసిపుచ్చి తనతో మిళితము చేసికొనలేదు. గొప్పగొప్పనగరములే యమెరికానాగరికతకుఁ బ్రబలనిదర్శనములు. ఈనగస్థాపనమువలన మానవుఁడు తనస్వాతంత్ర్యప్రతాపము నభ్రభేదిగాఁ బ్రచారము చేసెను. తపోవనమే భారతవర్షసభ్యతకుఁ బ్రబల నిదర్శనమై యుండెను. ఈవనమందు మానవుఁడు నిఖిలప్రకృతితో నాత్మసమ్మేళనమును శాంతసమాహితభావముతో నుపలబ్ధి చేసికొనెను.

భారతవర్షముయొక్క యీసాధననే యేకమాత్రసాధనగాఁ బ్రచారము చేయుచున్నారని యెవరును దలంపకుందురుగాత! మానవునియందుఁ గలవైచిత్ర్యములకు హద్దులేదని చెప్పుటకే నే నెక్కువ కోరుచున్నాను. ఆతఁడు తాళవృక్షములవలె నొక్క ఋజురేఖగా నాకాశమున కెగయక వటవృక్షమువలె నసంఖ్యశాఖోపశాఖలుగాఁ దనను నలువైపుల విస్తీర్ణము గావించుకొనును. దాని యేశాఖ యెటుల సహజముగఁ బోఁగలదో, దాని నాదిక్కునకే

సంపూర్ణముగఁ బోనిచ్చినయెడల సమస్తవృక్షమును బరిపూర్ణత చెందును. అందుచే సకలశాఖలకును మంగళము చేకూరును.

మానవేతిహాసము జీవధర్మి యైనది. అతఁడు నిగూఢప్రాణశక్తియందుఁ బ్రవర్ధిల్లుచుండును, ఆతఁ డినుము ఇత్తడివలెఁ గరఁగించి యంత్రములలోఁ బోయు వస్తువు కాఁడు. బజారునం దొక విశేషకాలమున నొకవిశేషసభ్యతయొక్క మూల్య మెక్కువ యగుటచే సమస్తమానవసంఘము నొక్క యంత్రమునందే పోతపోసి, ఫేషనులకు వశమగు మూఢుఁ డగుక్రేతను సంతోషపెట్టు దురాశ మిక్కిలి నిష్ఫలమైనది.

చిన్నపాదములు సౌందర్యమునకో లేక యాభిజాత్యమునకో లక్షణ మని తలంచి కృత్రిమోపాయములతో వానిని సంకుచిత మొనర్చు చీనాదేశపుస్త్రీల పాదములు చిన్నవికాక వికృతరూపముఁ దాల్చినవి. భారతవర్షముకూడ హఠాత్తుగ జబర్దస్తీవలనఁ దనను, ఐరోపీయ ఆదర్శముల ననుసరింపఁ గోరినయెడలఁ బ్రకృతపు యూరోపు కాకపోఁగా, వికృతభారతవర్ష మేర్పడును.

ఒకజాతితో నన్యజాత్యనుకరణ మనుసరణసంబంధము గాక, యాదానప్రదానసంబంధమై యుండవలె నని మనము దృఢముగా మనస్సునం దుంచుకొనవలెను. నా కేవస్తువు లోపించలేదో, నీకుఁగూడ నావస్తువే యున్నచో నీకును నాకును బదలాయింపు లుండవు. అట్లయినచో నీతో నాకిఁకఁ బ్రయోజనముండదు. భారతవర్షము నిజమగు భారతవర్షాకారముఁ దాల్చనియెడల నితరవీథులలోఁ గూలిచేయుటతప్ప లోకమున దానికెట్టి ప్రయోజనము నుం

డదు. అట్లయిన యెడలఁ దనపై నాత్మగౌరవబోధ ముండదు. తనయందుఁ దన కానందము నుండదు.

అందుచే నేఁడు ఏసత్యమువలన భారతవర్షము తనను యథార్థముగఁ బొందఁగలదో, మన మాసత్యమును గుఱించి యెక్కువశ్రద్ధాళువులమై విచారింపవలసియున్నది. ఆసత్యము వణిగ్వృత్తి కాదు, స్వారాజ్యము కాదు, స్వాదేశికత కాదు, ఆసత్యము విశ్వజాగరణ. ఆసత్యము భారతవర్షపుఁదపోవనమందు సాధితమైనది, ఉపనిషత్తులయం దుచ్చారితమైనది, గీతయందు వ్యాఖ్యాతమైనది. బుద్ధదేవుఁ డాసత్యమును లోకమునందు సర్వమానవులకు నిత్యవస్తువుగాఁజేయఁ దప స్సాచరించెను. కాలక్రమమున నానావిధ దుర్గతి వికృతులయందును, కబీరు, నానకు మొదలగు మహాపురుషు లాసత్యమునే భారతవర్షమందుఁ బ్రకటించిరి.జ్ఞానమునందద్వైతము భావమునందు విశ్వమైత్రి, కర్మలయందు యోగసాధనయే భారత దేశపు సత్యములై యున్నవి. భారతవర్షాంతరమం దేయుదార తపస్సు గభీరభావమున సంచితమై యున్నదో, నేఁ డాతపస్సు హిందువులను, మహమ్మదీయులను, బౌద్ధులను, ఆంగ్లేయులను దనయం దేకము చేసికొనుటకే ప్రతీక్షించుచున్నది—దాసభావమునఁ గాక, జడభావమునఁ గాక, సాత్త్వికభావముతో సాధకభావముతో. అది జరుగనంతకాలము మనము దుఃఖము ననుభవింపవలసినదే. అవమానమును సహింపవలసినదే. నానాదిక్కుల నుండి మనము మాటిమాటికి వ్యర్థులము కావలసినదే. బ్రహ్మచర్యము, బ్రహ్మజ్ఞానము, సర్వజీవదయ, సర్వభూతములయం దా

త్మోపలబ్ధి, యొకదినమునం దీభారతదేశమునఁ గావ్యరూపములు గను, మతవాదరూపములుగను నుండలేదు. ప్రతివాని జీవితము నందును దీనిని సత్యముగాఁ జేయుట కొకయనుశాసన ముండెను. నేఁ డాయనుశాసనమును మనము మఱవక, మనశిక్షాదీక్షల నాయ నుశాసనమున కనుగతముగఁ జేయుదుమేని మనయాత్మ లావిరా డ్రూపునియందు స్వాధీనత నొందును. ఎట్టిక్షణికబాహ్యవస్తులును మనయాస్వాధీనతను విలుప్తము చేయఁజాలవు.

ప్రబలత్వమునందు సంపూర్ణత్వముయొక్క యాదర్శము లేదు. సమగ్రముయొక్క సామంజస్యమును నష్టపఱచి, ప్రబలత్వము తనను స్వతంత్రముగఁ జూపించుటచేతనే మనము దానిని గొప్పదిగాఁ జూచుచున్నాము. కాని నిజమున కది క్షుద్రమయినది. భారతవర్ష మీప్రబలత్వమును గోరక, యాపరిపూర్ణత్వమునే కోరియుండెను. ఈపరిపూర్ణత నిఖిలముతో యోగమువలనఁ గలుగును. ఈయోగ మహంకారమును దూరము చేసి వినమ్రమగును, ఈవినమ్రత యొక యాధ్యాత్మికశక్తి. ఇది దుర్బలస్వభావమునకు గోచరమగునదికాదు. వాయుప్రవాహము నిత్యమయినది శాంతత్వమువలననే ఝంఝామారుతముకన్న శక్తిశాలిని యైనది. ఇందుచేతనే ఝంఝామారుత మెక్కువకాలము నిలువలేదు. ఇందుచే ఝంఝామారుతము కేవలసంకీర్ణస్థానమునే కొంతకాల మల్లకల్లోలముగఁ జేయును. శాంత వాయుప్రవాహములు సమస్త పృథివిని శాశ్వతముగా నంటుకొని యుండును. సాత్వికతేజమువలన నుజ్జ్వలమై, త్యాగసంయమముల కఠోరశక్తిచే దృఢప్రతిష్ఠిత

మైయున్న యథార్థమగు నమ్రతయే సమస్తముతో నిరాటంకముగ యుక్తమై సత్యభావముతో నిత్యభావముతో సమస్తమును బొందును. అది యెవరిని దూరము చేయదు. విచ్ఛిన్నముఁ గావింపదు. తనను త్యాగముచేసి, అందఱిని దనవారినిగాఁ జేసికొనును. అందువలననే వినమ్రుఁడు విశ్వమును జయించినవాఁడనియు, శ్రేష్ఠధనమున కధికార మతనికే యున్నదనియు భగవానుఁ డగుయేసు నుడివి యుండెను.